TALANKANANDINI PARINAYAMU
A Telugu classic by Asuri Maringanti Venkata Narasimhacharyulu (19th Century A D) Edited by Sri Srirangacharya, Lecturer, Sri Venkateswara Oriental College, Palem, Mahaboobnagar Dist, Andhra Pradesh

---

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి,
హైదరాబాద్-500 004

ప్రచురణ 30ర

ప్రథమ ముద్రణ 1980, ప్రతులు 2000

**వెల రూ॥ 12-00**

ప్రతులకు
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి,
కళాభవన్, సైఫాబాద్,
హైదరాబాద్-500 004

ముద్రణ
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్,
హైదర్‌గూడ, హైదరాబాద్-500 001

---

Paper used for the Printing of this book was made available by the Government of India at Concessional rate.

# తొలి పలుకు

ఒకప్పుడు లభ్యమై, ఇప్పుడు దొరకని కావ్యాలను ప్రచురించడమే కాకుండా, ఇంతవరకు అచ్చుకాని కావ్యాలను కూడా, వెలువరించాలనే ఉద్దేశం సాహిత్య అకాడమీకి ఉన్నది ఈ దృష్టితోనే 'తాలంకనందినీ పరిణయా'న్ని ఇప్పుడు ముద్రించింది

ఆసూరిమరింగంటి వేంకట నరసింహాచార్యుల ''తాలాంక నందినీ పరిణయము'' దాదాపు నూరేళ్ళ క్రితము రచింపబడినదే అయినా తొలిసారిగా ఇప్పుడు ముద్రణను అందుకున్నది మరింగంటి వంశంవారు సంస్కృత ఆంధ్ర భాషలలో అశేష పాండిత్యాన్ని సంపాదించి అనేక సాహితీ ప్రక్రియా రచనల్లో తమ ప్రతిభా పాండిత్యాలను ప్రదర్శించి సాహిత్యాన్ని, భక్తితత్వాన్నీ తెలుగులో ప్రచారము చేసినవారు

'తాలాంకనందినీ పరిణయము' రసవత్ప్రబంధం. అందమైన పదబంధాల తోనూ, చమత్కారజనకమైన శబ్ద, అర్థ అలంకారాలతోనూ, చిత్రబంధ కవిత్వాలతోనూ, చక్కని జాతీయాలతోనూ, మాండలిక ప్రయోగాలతోనూ, యీ కావ్యం ప్రౌఢ సాహిత్యానురక్తులందరికీ ఆమెతలిస్తుంది ఈ భూమిలో ఎందాకా రామాయణం ఉంటుందో, అందాకా ఈ కావ్యం ఉంటుందని గుండె నిబ్బరంతో ఈ కవి చెప్పుకున్నాడు

దొరికినన్ని ప్రతులను పరిశీలించి ఈ కావ్యాన్ని పరిష్కరించి, చక్కని పీఠిక సమకూర్చి అందించిన శ్రీ శ్రీరంగాచార్యులకు అకాడమీ పక్షాన కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను

హైదరాబాదు,
1–9–1980.

ఇరివెంటి కృష్ణమూర్తి
కార్యదర్శి

# తాళాంకనందినీపరిణయము

## విషయసూచిక


| | | |
|---|---|---|
| ౧ | ఆనూరి మరింగంటివారు | ౧ |
| ౨ | వంశవృక్షము | ౪ |
| ౩ | మరింగంటి కవులు | ౫ |
| ౪ | వేంకటనరసింహాచార్యులు (గ్రంథకర్త) | ౧౧ |
| | కాలము | ౧౪ |
| | కృతులు | ౧౮ |
| | ప్రతుల వివరము | ౧౮ |
| ౫ | కృతిసమాలోకనము | ౨౧ |
| | కథాభేదములు | ౨౨ |
| | కవితా విశేషములు | ౨౬ |
| | వర్ణనలు | ౩౧ |
| | అనువాదములు | ౪౨ |
| | చిత్రకవిత | ౪౩ |
| | అలంకారదర్శిని | ౪౬ |
| | సామెతలు-జాతీయములు | ౫౧ |
| | పదప్రయోగములు | ౫౨ |
| | అనుకరణలు-పోలికలు | ౫౫ |
| | సంశయములు | ౫౮ |
| | పరిష్కరణ | ౬౨ |
| ౬ | కృతజ్ఞతలు | ౬౪ |
| | **తాళపత్రాల ప్రతిబింబము** | ౬౫ |
| | ప్రథమాశ్వాసము | ౧ |
| | ద్వితీయాశ్వాసము | ౭౯ |
| | తృతీయాశ్వాసము | ౧౪౭ |
| | చతుర్థాశ్వాసము | ౧౯౯ |
| | పంచమాశ్వాసము | ౨౬౫ |
| | షష్ఠాశ్వాసము | ౩౩౧ |
| | గద్యపద్య సూచిక | ౧ నుండి ౩౨ |
| | సవరణలు | ౧ నుండి ౪ |


— ౦ —

శ్రీమతే రామానుజాయ నమః

# పీఠిక

సీ. ''శ్రీకామినీమణి నీకు మోహపుటాలు
వైకుంఠనగరి దేవరకు ప్రోలు
గాలిమేపరిదొరగారు నీపాదాలు
పైగప్పునది మంచిపైడి శాలు
గిరినెత్తి వ్రేల రక్షించె నీకొనవ్రేలు
దనుజులమీద నీదాడికోలు
నిగమాంతసంతతుల్ నీనిల్పుటంగిలు
పరులకుదీలు నీపక్కిడాలు
నీనిగారంపువలపు మన్నీనిబోలు
కోవిదస్తుతి నీకు తక్కోలుమేలు
కరుణదాసుని దైన్యంబు కడకుద్రోలు
కేశవస్వామి! భాస్వత్ఖగేశగామి''

*అసూరిమరింగంటివారు*—

తరతరాలుగా గీర్వాణాంధ్రభాషాకవిపుంగవులై అనేకవిధములైన తమ రచనలద్వారా సాహిత్యచరిత్రలో సుప్రతిష్ఠితులైన మరింగంటికవుల జన్మస్థానము నల్లగొండతాలూకాలోని కనగల్లు గ్రామము (పూర్వమీప్రాంతము 'దేవరకొండసీమ'గా వ్యవహృతము) మరింగంటికవుల కుటుంబాలు రానురాను అన్యప్రాంతాలకు వెళ్లి స్థిరపడినవి అట్టి గ్రామాలలో మొదటిది హుజూర్ నగర్[1] తాలూకాలోని 'యాతవాకిళ్ల', ఈ గ్రామాన్ని నాటి మహమ్మదీయ ప్రభువు ఇబ్రహీం కుతుబ్షా పిరికి అగ్రహారముగా నొసంగినట్లు గోదావధూటీ పరిణయము (ముద్రణ 1958) శల్వపిళ్ళరాయచరిత్ర[2] (అముద్రితం) కృత్యా

---

*1 నేటి హుజూర్‌నగర్‌కు మొదటిపేరు 'పోచమచెర్ల' 1935లో నిజాం నవాబు ఈ పేరు పెట్టి ఫర్మానా జారీచేసినాడు (చూ. నీలగిరిపత్రిక 4-12-1935) పై పత్రికలో 'ఫర్మానా' యథాతథంగా ముద్రించినారు.*

*2. దీని వ్రాతప్రతి డా॥ బి. రామరాజుగారివద్ద గలదు.*

శమదయాగుణరత్నసముపయాప్తిని
క్షీరాబ్ధియనఁ గీర్తిఁ జెందినారు
నయవిలక్షణసత్యవినయగరిమల
మహిమహిమ గాంచి రఖిలదిఙ్మహితకీర్తి
సర్వచార్వాకముఖమతదుర్విహోగ్ర
గర్వహరులు మఱింగంటిపూర్వగురులు (౧-౩౮)

అని తెల్పబడినది

ఇది ఈవంశమువారినిగూర్చిన సంక్షిప్తపరిచయము[1]

తాలాంకనందినీపరిణయకర్తయైన వెంకటనరసింహాచార్యులుగారు కృత్యాదిలో తమ 'వంశావతారవర్ణన' (౩౧-౫౭) చేసినారు దానిప్రకారము వంశవృక్షమిట్లు గలగు ఈవంశవృక్షము దశరథరాజనందనచరిత్ర. గోదావధూటీపరిణయము[2]లలో గల వంశవృక్షములు తేడాగా గలవు, సింగరాచార్యులవారిని ఈవంశీయులు గౌరవముగా పేర్కొని తలంతురు కొన్ని తరాలు గడుచుటవలన వంశవృక్షములు వేర్వేరయినవి సురతాణీపరిణయము[3] (వారణాసి అచ్యుత రామకవి రచన) నందు రచయిత తమగురువులుగా మరింగంటివారి వంశవృక్షము కొంత తెల్పినాడు వీనన్నిటినీ సమన్వయపరచి చూచుట అవసరము. నాకు లభించినంతవరకు మరింగంటివారి వంశవృక్షమును చేర్చినాను. భావిపరిశోధకుల కిది తోడ్పడవచ్చును.

*మరింగంటికవులు :-*

---

1. వివరములకు చూ. 'దశరథరాజనందనచరిత్ర' పీఠిక

2. ముద్రణ 1958 సం ఆసూరిమరింగంటి శ్రీరంగాచార్యులవారు రామగిరి (నల్లగొండ) మహిళాభక్తసమాజమువారు దీనిని ముద్రణ చేయించినారు.

3. ఈగ్రంథమును వేగుచుక్కగ్రంథమాలవారు 1932లో ప్రచురించిరి సంపాదకులు భాగవతుల నృసింహశర్మ, పరిష్కర్త వారణాసి అచ్యుతరామకవి. (రచయిత పౌత్రుడు)

ఇక తాలాంక...కర్త తనవంశావళిలో తెల్పిన వారిని గూర్చియు అనంత రము గలవారినిగూర్చియు తెలిసికొనుట అవసరము.

తన ప్రపితామహులైన భావనాచార్యులవారిని గూర్చి-

సీ తనదు వాక్ప్రౌఢసిద్ధాంతసూక్తులు జగ
ద్గురునకు వజ్రపంజరము లయ్యెఁ
దను రచించిన ప్రబంధకథాసుధానిధుల్
దాస్యకోటికి భాగ్యధనము లయ్యెఁ
దనుజేయు సంతతదానధారాఝురుల్
పండితాళికి మెట్టపంట లయ్యెఁ
దనయశశ్చంద్రికాధవళరుక్తతి ధరా
తరుణి కైశికపుష్పదామ మయ్యెఁ
దనదు జిహ్వాంచలంబు వాగ్వనిత కెపుడు
మంగళోత్తుంగమయనృత్తరంగ మయ్యె
ననఁగఁ జెలువొందు విమతసంహతివిదారి
జనమనోహారి భావనాచార్యసూరి (౧-౪౦)

ఈవిధముగా తెల్పెను

తన తండ్రియైన భావనాచార్యులవారు మిక్కిలి ప్రసిద్ధులు, వేదాంతశాస్త్ర నిష్ణాతులేగాక మహాప్రతిభావంతులని యీపద్యముద్వారా వ్యక్తమగుచున్నది-

సీ శాస్త్రనిషిద్ధాన్యజనకాలకూటంబు
కుటిలకుతర్కాళి గుండెదిగులు
విజ్ఞానశూన్యదుర్విమతాళికిని మిత్తి
వెక్కురుంకు నుక్కుముక్కు గొయ్య
వికటమాయావాదులకు రొమ్ము గాలమ్ము
బౌద్ధకాననబృహద్భానుమూర్తి
చార్వాకమతతమశ్చటభాస్కరద్యుతి
క్రూరజైనేభకంఠీరవంబు
సకలవేదాంతశాస్త్రప్రసంగసాళి
సంస్కృతాఖిలసౌశీల్యసద్గుణాళి

కుటిలదుర్మదశైలేంద్రకటకపటల
చటులదంబోళి భావనాచార్యమౌళి (౧-౪౭)

(దీనిలోని ౩ ౪ చరణాలు పంచధాటీశ్లోకాలలో ఒకటైన-
పాషండద్రుమషండదావదహన శ్చార్వాకశైలాశనిః
బౌద్ధధ్వాంతనిరాసవాసరపతిః జైనేభకంఠీరవః .'
అనుదానికి అనువాదప్రాయములుగా గలవు)

ఈ భావనాచార్యులవారి తండ్రికూడా మహాప్రతిభావంతుడు, దురితాఘదూరుడనే బిరుదము గలవాడు, వాదిమతవిభేదనుడు, సంస్కృతాంధ్రద్రావిడకవితా సమర్థుడు సదాచార్యసేవాసక్తి గలిగి-వచశ్శక్తిచే కుమతుల హృద్భేదియై-వీతరాగుడైన యీనరసింహాచార్యులవారు సాక్షాత్ నరసింహుడేనట (౪-౨ ౪౩)

ఇట్టివారి పౌత్రులు అనగా భావనాచార్యులవారి పుత్రులే వేంకటరాఘవాచార్యులు, వేంకటనరసింహాచార్యులు వీరిలో-వేంకట రాఘవాచార్యులు ప్రస్తుత ప్రబంధకర్తకు అగ్రజులు వీరిని కవి మిక్కిలిభక్తితో వర్ణించినాడు వీరి కృపాకటాక్షమువలననే తను అభివృద్ధిచెందినా ననియు, కంటికి రెప్పవలె నన్ను కాపాడినాడనియు తెల్పుటయే గాక (౧-౨౩, ౨౪)

శ్లేషలో-

గురునియామకము చేగొని ధర్మదీక్షచే
యారామపదమునం దధివసించె
దానవారిప్రభాతతిదిగ్బరణజేసి
శంకరధర్మశాసనత మించె
కడుజడధిక్రోధగర్వం బపనయించి
మిత్రజాతస్నేహపాత్రతఁ గొనె-
సద్గుణఫలరసాస్వాదనామోదియై
యంగదాదిబహుకృతిం గ్రహించె
వాదకోవిదదుష్ప్రతివాదపంక్తి
ముఖవికలంగముగశ్రీపాట సుదితుఁగసొం

చిత్రకావ్యుండు మౌద్గల్యగోత్రజుండు
రాఘవార్యుండు రెండవరాఘవుండు (౧-౩౬)

అని ప్రశంసించినాడు దీనివలన కవిగారిభక్తియేగాక అగ్రజునిగొప్ప తనముకూడా వ్యక్తమగుచున్నది ఈరాఘవాచార్యులవారు కొన్నిగ్రంథముల చెప్పినారట అవి యేవి లభింపలేదు కాని అంత్యప్రాసతో సీసపద్యములతో చెప్పిన కేశవస్వామిశతకము[1] లభించినది వీరి ప్రపౌత్రులైన వేంకటనరసింహాచార్యులవారు తమ 'మాలతీవసంతము'లో వీరినిగూర్చి—

'...సంస్కృతాంధ్రకవిత్వసాహిత్యచతురుఁడై
పరవాదిభీకరపటిమ గాంచి.

యంత్యనియమంబుతో భక్తి యవఘళింపఁ
గేశవస్వామిశతకంబు శ్రీకునెడలఁ
జెప్పె మఱికొన్నిగ్రంథముల్ చెన్నుమీఱ
సరసగుణహేళి రాఘవాచార్యమౌళి ' (1-10)

అని తెల్పినారు

ఈశతకమున ౧౦౮పద్యములు గలవు 'కేశవస్వామిభాస్వత్కగేశగామి' యనునది మకుటము శతకము చివరలో '—మనకే మనకేశవసేవ జేయుమా' అనుమకుటముతో 'క్షమావింశతి' పద్యాలు గలవు ధారాశుద్ధిగలిగి చక్కనిపద బంధములతో నున్న యీశతకమునందు ఉర్దూఫారసీపదాలు అంత్యప్రాసలలో చక్కగా ఇమిడినవి కవి తన భక్తిప్రపత్తులను వెల్లడించినట్లుగానే జీవితము నందలి బాధలను ఈపద్యములో వ్యక్తపరచినాడు

పాపిష్ఠినరుల వెంబడి బడి యాచించి
యాశచే నశనార్థినై చరించి

---

1. చూ-నావ్యాసము 'మరింగంటి వేంకటరాఘవాచార్యులు కేశవస్వామి శతకము' భారతి 1967 డిసెంబరు,

పుత్రకళత్రు లాప్తులుగదాని భ్రమించి
కాని కార్యములకై కళవళించి
యతిపామరుండనై యఘములే యార్జించి
పుణ్యమే మెఱుఁగని పుట్టు గాంచి
సల్పఁబూనినపని సాగక చింతించి
మంచిదోచక బుద్ధి మందగించి

దేవర నెఱుంగదగినట్టి తెలివి డించి
దిక్కుమాలిన నను కృపాదృష్టి గాంచి
నీవె రక్షించగావలె నేటినుంచి
కేశవస్వామి భాస్వత్ఖగేశగామి

ఈరచనలోగల విశేష మేమనగా-కవి తననుగూర్చి-తనశతకరచనా కాలమును గూర్చి వ్రాసినాడు శతకరచయితలలో ఇట్లు తెల్పినవారు అరుదు ఆపద్యము లివి

ఇది వృషాద్రిస్వామి పదభక్తినిరతుండ
తత్కృపాలబ్ధమేధానిధుండ,
గురుతరమౌద్గల్యగోత్రసంజాతుండ
శ్రీవాసగురుపాదశేఖరుండ
ఇంటిపేరిట మఱింగంటివా రనుమండ
భాస్వన్నృసింహార్యపౌత్రకుండ
మహిభావనార్యకుమారాగ్రగణ్యుండ
వేంకటరాఘవార్యాంకితుండ

నేడు నాతొలినోము లన్నియును బండ
పూని శతకం బనెడు మల్లెపూలదండ
కూర్చి యర్పించితిదె నీకు మెడనునిండ
కేశవస్వామి'భాస్వత్ఖగేశగామి

శతకరచనకాలమును గూర్చి—

శాకవాహనగతశకవర్షములు వసు
ఋషిగిరిశశిసంఖ్య రూఢి నడవ

ప్రభవాదిషష్టిసంవత్సరాంతసమ్సంస్థి
తానందనామాబ్ద మవని గడవ
తలపగాదగు దాకితలను పేర్నెలనిండు
పున్నమరోజున బ్రొద్దుబొడవ
కేశవపురచెన్న కేశవశతకంబు
నిండి నామది నాత డుండి నుడువ
తద్గుణస్తుతిమధురామృతంబు కడవ
గా భజించిన నరులఘౌఘముల గడవ
గలిగి కల్యాణకరణభోగములు గుడువ
కేశవస్వామి! భాస్వత్త్వగేశగామి

దీనిప్రకారముగా శతకరచన ఆనందసంవత్సర, మార్గశిర శుద్ధపౌర్ణమి శుక్రవారము 1778 శ. సం.కు సరియగు తేది 11-11-1856 అగుచున్నది పీఠిక ప్రారంభములో గల పద్య మిందలిదే!

చాలాకాలంక్రితము వరంగల్లునుండి వచ్చే 'మనోరమ' పత్రికలో ఈ శతకము కొంతముద్రణ మయినదట [1] అనంతరము రచయితప్రపౌత్రులు వేంకట రామానుజాచార్యులవారు 1961 సం. దీనిని ముద్రణచేయించినారు[2] (మంజు వాణిప్రెస్, ఏలూరు) ఎన్నో తప్పులు పడినవి (దీనిని చక్కగా సంస్కరించి నేను త్వరలో విపులపీఠికతో ప్రకటింపనున్నాను) ఇందుండి ఒక్క పద్య ముదా హరింతును-

సకలసురాసువుల్ వెకలించు నీవాబు
నిఖిలాగమము లెల్ల నీకితాబు
లలి జగత్త్రియములేలఁగ నెవ్వడు నవాబు
తుద నెవ్వడిచ్చు నీతో జవాబు

---

1 'మరింగంటికవులు'-30-9-1960 'ఆంధ్రభూమి' ప్రారంభ సంచికలో డా బిరుదురాజు రామరాజుగారి వ్యాసము.

2 ముద్రణకై వీరికీ శతకాన్ని మానాయనగారే వ్రాసియిచ్చినారు. అయినా ఈ ప్రతినిగూర్చి ముద్రణలో ఏమియు తెల్పలేదు.

నీమానసమున జనించె నీమహతాబు
వైనతేయుఁడె నీసవారి యాబు
కడముట్ట నిన్నెన్నగలదె నాకుహిబాబు
పుడమిలేడిక నన్నుబో ల్గరీబు
నీకు బ్రహ్మాండభాండంబు నిండుగాబు
యెల్లవేల్పులపొల్పు నీకే హిసాబు
నీకటాక్షేక్షణప్రాప్తి నాకు జేబు
కేశవస్వామి ఖాస్వత్థగేశగామి

భావనాచార్యులుగారు- పైశతకకర్తకు పుత్రులైన వీరు రచించిన గ్రంథములుగాని-వాని వివరములుగాని తెలియవు. వీరియొక్క పౌత్రులైన వేంకటనరసింహాచార్యులవారు తమ మాలతీవసంతములో-

హరికారుణ్యరసప్రసాదకవితాహ్లాదైకచాతుర్యసం
భరితాధారమహత్త్వభావరచనాపారీణసన్మానబం
ధురకీర్తివ్రతదీక్షితాద్భుతగుణస్తోమంబునన్ శ్రేష్ఠుఁడై
ధరవర్తించెను భావనాహ్వయుఁడు విద్వద్వైభవోపేతుఁడై (1-14)

అని మాత్రము తెల్పినారు ఇట్టి వీరిపుత్రులే

*వేంకటరాఘవాచార్యులు*-మాలతీవసంతకర్త వీరి కుమారుదే.తండ్రిగారిని గూర్చి

ధరనా వేంకటరాఘవాహ్వయుఁడు విద్యావైభవస్ఫూర్తి నె
ల్లఱకుం బ్రేమ ఘటిల్లఁజేయుచును బాల్యంబాదిశాస్త్రార్థధ
ర్మరహస్యప్రతిబోధితుం డనఁగ నైర్మల్యాత్ముడై శ్రీరమా
వరనామామృతసారసంకలితహృద్వ్యాప్తిన్ విరాజిల్లెడిన్. (1-16)

వ్రాసిరి. ఈరాఘవాచార్యులవారికి అయిదుగురు కుమారులు, ఇద్దరు బిడ్డలు-వారిలో పెద్దవారు-

*వేంకటరామానుజాచార్యులవారు* - కృష్ణాజిల్లా 'మొఖాసాకలువపూడి'లో నివాసముగానుండి 1972 సంవత్సరమున 'కుధరవల్లి'లో పరమపదించినారు. వీరు 'భల్లాతకక్షేత్రమాహాత్మ్యము'ను పద్యప్రబంధముగా వ్రాసినారు, చక్కని కవితతో సుమారు ౪౦౦ గద్యపద్యములుగల యీ రచన అముద్రితముగా

గలదు 1969లో కవిగారు దీనిని నాకు పంపించినారు, వీరే తమప్రపితామహుల కేశవస్వామిశతకమును ముద్రణ చేయించినారు, వీరిపుత్రుడు సీతారామస్వామి గారు ప్రస్తుతం నూజివీటిలో నున్నారు ఈ వెంకటరామానుజాచార్యులవారి సోదరులే-

*వేంకటనరసింహచార్యులుగారు* :- వీరుబహువిధగ్రంధకర్తలు సూర్యాపేటలో నివాసముగా నుండి 5-8-1961 న, పరమపదించినారు వీరికృతులలో ప్రబంధ-నాటక-యక్షగాన-స్తోత్ర-శతకములు కలవు కవిగారి శిష్యులు - అభిమానులు కొన్నిగ్రంధములను వారుండగానే ప్రకటించినారు మరికొన్ని నేటికీ అముద్రితములుగా గలవు వీరికృతుల నెంత సంక్షిప్తముగా సమీక్షించినను విషయవిస్తృతి యగునని-వానిజాబితా నొసంగుచున్నాను

*ముద్రితములు*

*శతకములు-*

౧ రాఘవశతకము

౨ గోపాలచూడామణిశతకము

౩ కళ్ళచెఱువుసీతారామశతకము

౪. శ్రీమత్తిరుమలాపురభోగసుందర సీతారామ -చంద్రఅంత్యప్రాసశతకము

౫ మానసప్రబోధశతకము

*స్తోత్రములు*

౧. గోదాదేవీస్తవము.

౨ శ్రీసత్యనారాయణ స్తోత్రతారావళి

౩ శ్రీఉర్లుగొండలక్ష్మీనృసింహ స్తవనక్షత్రమాలిక

౪. శ్రీకళ్లచెఱువుసీతారామచంద్ర నక్షత్రమాలిక

*పద్యప్రబంధములు -*

౧. మాలతీవసంతము.

౨ సత్యనారాయణచరిత్ర.

౩. ఆచార్యస్మృతి

నాటకములు:-

౧ పద్మవ్యూహము, ౨ అనిరుద్ధవిలాసము, ౩ కూర్మనారాయణ చరిత్ర, ౪ సుమాలినీ పరిణయము, ౫ సుచిత్రాభ్యుదయము, ౬ ప్రద్యుమ్న విజయము (వీధినాటకము) సుందరీవిలాసము (ప్రహసనము)

హరికథ :- ౧ సత్యనారాయణచరిత్ర, ౨ రామానుజవైభవము

అముద్రితాలు:-

౧ తిరుమలవేంకటేశ్వర/అంత్యప్రాసశతకము,

౨ నీలాసుందరీపరిణయము (ప్రబంధము)

౩ శశికళాసుదర్శనీయము,

౪ లలిత (సాంఘికనాటకము)

ఇవి వీరి ముద్రితాముద్రితకృతులు, కవిత్వము పూర్వకవుల ఫక్కీలో నున్నను సులభగ్రాహ్యముగా నుండును వీరిపుత్రులు పురుషోత్తమాచార్యులు గారు (14-7-1938) సూర్యాపేటలోని డిగ్రీ కళాశాలలో ఆంధ్రోపన్యాస కులుగా నున్న వీరు అనూచానముగా వచ్చుచున్న కవితావ్యవసాయమును సాగించుచున్నారు వీరి కృతులలో 'యాదగిరిలక్ష్మీనారసింహప్రభు' శత కము ముద్రణమయినది 'వేంకటేశ్వరశతకము, ఒక ఖండకావ్యము అముద్రిత ములుగా గలవు శ్రీమాన్ ఆచార్యులవారు సంస్కృతాంధ్రములలోనేగాక హిందీ, ఆంగ్లభాషలయందును మంచి ప్రవేశముకలిగి కవిత చెప్పుదురు. వీరి చిన్నాయనగారు (వేంకటనరసింహాచార్యులవారి సోదరులు) వెంకటాచార్యుల వారు వీరికి పురుషసంతతి లేదు నల్గురు కుమార్తెలు గలరు. దక్షిణ భారత హిందీ ప్రచారసభ మహావిద్యాలయమునందు ప్రిన్సిపాలుగా పనిచేసి ప్రస్తుతము విశ్రాంతినంది విశాఖలో నున్నారు వీరి రచనల వివరము తెలియదు చెన్నకృష్ణమాచార్యులవారు:-వీరి కృతులగూర్చిన సమాచార మేమియు తెలి యదు ఇరువురు కుమారులు ఇరువురు కుమార్తెలు వీరి సంతానము. పెద్ద కుమారుడు వెంకటరాఘవాచార్యులుగారు (జననము 1944) రెండవవారు (సత్య నారాయణాచార్యులవారు (వీరిజననము 1959) ఈ చెన్నకృష్ణమాచార్యుల వారి సోదరులే

లక్ష్మణాచార్యులుగారు (16-12-1920):- వీరు తమయన్నగారి రెండవ పుత్రుడైన సత్యనారాయణాచార్యులవారిని దత్తునందినారు 1933లో భీముని పట్నంచేరిన శ్రీమాన్ లక్ష్మణాచార్యులవారు కలముబట్టి ప్రౌఢకవిత చెప్పుటయం దెంత ప్రతిభగలవారో కాలికి గజ్జెగట్టి హరికథలను హృదయంగమముగా జనాకర్షణగా చెప్పు నైపుణ్యముగలవారు వీరి భీమపురలక్ష్మీనరసింహప్రభు శతకము (1959 ముద్రణ) 'శబరీసపర్య (1968 ముద్రణ) యనుకృతులు చక్కనికవితతో గలవు అముద్రిత రచనలలో 1250 గద్యపద్యములుగల శ్రీసత్యసాయిచరిత్ర గలదు ఇది రెండు భాగములు, ప్రథమభాగములో ఆవిర్భావము, లీలావిహారి, బాలబాబా, మొదలగు శీర్షికలు ద్వితీయభాగమునందు అవతారవైభవము, ధర్మోద్ధరణ అనే శీర్షిక లున్నవి విద్యున్మాల మయూరవృత్తమువంటి విశేషచ్ఛందస్సులు గలవు ఇందుండి రెండుపద్యముల నుద్ధరింతును

శ్రీకరమై సుధీజనవశీకరమై కవిపండితప్రజా
నీక మహర్నిశల్ గొలువ నిత్యకళాన్వితమై చెలంగు ర
త్నాకరవంశ మొక్కటి ఘనంబగు పెంపు గడించె కీర్తిల
క్ష్మీకమనీయకంఠమణికీలితహాటకహారమో యనన్.

మొలసెన్ బ్రాహ్మణవేదమంత్రములు దీప్తుల్ చెందె దిగ్వీథులన్,
విరిసెన్ మంజుల నీరజాతములు మాధ్వీకంబు మందారముల్
గురుసెన్ శారదచంద్రికాధవళపంక్తుల్ బర్వె నభ్రస్థలిన్
దురితౌఘంబు లణంప సాయిభగవంతుం డాంధ్రిపై నిల్వగా

ఇది-ఈ కవిసోదరుల వంశములోనివారి పరిచయము[1] దీనిలో ప్రస్తుత

---

1. *మరింగంటి నరసింహాచార్యు లను కవి-సంస్కృతములో శరవైరి వైభవదివాకరము' అను అలంకారశాస్త్రగ్రంథమును వ్రాసినాడు దీని ప్రతులు, మైసూరు, మద్రాసు-ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారములందు గలవు ఈ గ్రంథమునుగూర్చి-మద్రాసు విశ్వవిద్యాలయ సంస్కృతశాఖలో శ్రీ సి యస్ రాధాకృష్ణన్ పరిశోధనచేసి సిద్ధాంతవ్యాసమును వ్రాయుచున్నారు పర్యవేక్షకులు –ఈ శాఖాధిపతి శ్రీమాన్ డా॥ ఎమ్ నరసింహాచార్యులుగారు (చూ వీరి వ్యాసము,* geneology of the Marimganti Family Annals of Oriental Research of the University of Madras Volume XXVIII Part-1, 1978

గ్రంథకర్త శాఖవారిని గూర్చిగాని, వారి రచనలగూర్చిగాని తెలియరాలేదు. ఈ కవి అన్నగారిసుతునిగూడా పుత్రనిర్విశేషముగా భావించినాడు కావున ఈ వివరాలన్నీ ఈయబడినవి

ఇక - తాలాంకనందినీపరిణయకర్తయైన -

వేంకటనరసింహాచార్యుల వారినిగూర్చి తెలుపుదును

ఈకవిగారు చరమదశవరకు కనగల్లులోనే నివసించినారు అన్నగారి పుత్రుని పుత్రనిర్విశేషముగా భావించినను జీవితములో ముఖ్యముగా అంత్యదశలో మిక్కిలిబాధ ననుభవించినట్టున్నారు ఈవిషయము లభించిన వీరిరెండు చాటు పద్యాలలో నొకదానిద్వారా వ్యక్తమగుచున్నది ఆపద్య మిది-

శా. పెద్దల్లుం డొక నల్లద్రాఁచు ప్రియమౌ పెండ్లాము నాపాలికే
జిద్దూఖో రయె, కన్నత ల్లెపుడు నాచేదే నిరీక్షించు, జే
హద్దౌ కాపుర, మగ్రశిష్యజన మర్థాంధుల్ దయాహీను లే
ప్రొద్దుం తుచ్ఛులగూడియున్న సుతుఁ డప్పుఁ న్నప్పు చింతంప ద

స్మద్దోషంబుల నెన్నుచున్ వదినె నామాటంటె రౌద్రాకృతిన్
హుద్దాహుద్ది బెనంగు, నన్నసుతుఁ డేయుక్తం బెరుంగండు, నే
నెద్దిం దోచక ప్రొద్దుబోక పొదుగిల్లే సొచ్చినన్ రంకులే
సిద్ధంబై పెనురద్ది భాసిలెను, ఛీ! ఛీ! యిట్టి పాపం బిలన్
గద్దా! శ్రీ కనగంటివాసనను శీఘ్రంబే మృతుం జయవే!

అని వగచినారు దీనిలోని 'అన్నసుతుడు' యుక్తాయుక్తవిచారణలేనివాడుగా తెల్పబడెను లోగా తెల్పిన మాలతీవసంతపద్యము ఇతనిని గొప్పవాడుగా నిరూపించుచున్నది మొత్తముపై కవిగారిబాధను తెల్పుటకీ పద్యము గలదు అందుకే వీరిదే మరియొక చాటువు దీని సందర్భమిది.

కవిగారు శిష్యసంచారమునకు వెళ్ళి తిరిగి వచ్చుచుండగా మార్గమధ్యమున వీరిని తస్కరు లడ్డగించి సంపాదించుకున్నవస్తువు లన్నింటిని దోచుకొనిపోయినారు అప్పుడు చెప్పిన దీ పద్యము (దీనిలో పేర్కొనిన ఇందుర్తిసీమ చామలపల్లి నల్లగొండతాలూకాలో గలవు నలచరిత్రము వ్రాసిన సిరిప్రెగ్గడధర్మన ఈ ఇందుర్తివాసియే )

సీ॥ శ్రీనీలగిరిసీమలో నొప్పు కనగంటి
    పురము లోపలను కాపురమునందు
ఘన మణింగంటి భావనగురూత్తమ పు
    త్రకుఁడ నృసింహాభిధానకవిని
యేను సంచారార్థ మేగి ద్రవ్యోపార్జ
    నం బొనర్చియు మహానందలీల
మగిడి మాగృహముకై మార్గంబుగొని రాగ
    నిందు త్రిసీమలోనం దనర్చు
పెద్దాపురము జాము ప్రొద్దుండగా వచ్చి
    యచట నిల్వక నేగుసంతలోన
తద్గ్రామకరణ మాతతతస్కరోద్యోగి
    ఖలుఁడు చకిలము తిమ్మిగాఁడు గలఁడు
నతఁడు నల్గురు దొంగ లంపఁగా వారలు
    చామలపలిగుట్ట చాలు గాంచి
వెన్నాడి గనిపట్టి తిన్నగా మముబట్టి
    కన్నులు బిగగట్టి కడకు నెట్టి
శుభ్రంబు లరువది శొంరి సవ్వాశేరు
    ఖండముల్ మూటలోగల వెన్నముప్పది
కుచ్చాలు నొకపెద్ద పచ్చడంబు
    మైసూరుశాలు రుమాలు పట్టంచుధో
వతులు మేల్కోటధోవతులు రెండు
    షకలాదు నొకటి కష్పాదేవతార్చన
పెట్టెగట్టిన ధసల్ పట్టుధోతి
    కాళ్ళచెప్పులజోడు కావిమప్పటిజోడు
మంచి చొక్కముపైడి మూసమెత్తు
ఆసలేకుండ చంద్రలాటీసమేతు
దోఁచుకొనిపోయిన కిరాతు ధూళిఁజేతు
పచ్చు బెగజూతు వానిల్లు చిచ్చుఁజేతు
మిత్తి నెగదోతు పైన బండెత్తివేతు

అని-చోరు లపహరించిన వస్తువులను తెల్పి- శపించినాడు[1] కవిగారు-తాలాంకనందినీపరిణయమును వ్రాసి తాటాకుల నొక స్థలమునం దుంచగా వారింటి పాడిబఱ్ఱె వచ్చి కొంత భక్షించినదట దానికి వగచి మహిషిని శపించు చొక పద్యమును చెప్పిరట ఆ పద్యము లభింపలేదు గాని-నేటికీ మరింగంటి వారికి మాత్రము బఱ్ఱెలు అచ్చిరాటు లేవు (బ్రతకవు)

ఇవి ఈ గ్రంథకర్త చాటువులు ఇక-

కాలము తాలాంకనందినీపరిణయము తాళపత్రగ్రంథాలు రెండు లభించినవి [2]-వీని చివరలో ఈ క్రింది పద్యము గలదు-

కలియుగశాలివాహనశకంబులు వేదరసాచలేందు సం
ఖ్యలు జన నందు నాంగిరసహాయనభాద్రపదాఽసితాష్టమిం
గలితమృదూక్తి నీసరసకావ్యము పూర్ణముగా రచించె న
త్యలఘుఁడు శేషశైలశిఖరాగ్రవిహారి లసత్కృపామతిన్.

దీనిప్రకారము(వేదుల౪ రస౯ అచల౭ ఇందు౧)౧౭౯౪ శాలివాహనవత్సరము-సరియగుక్రీ శ 1872అగును (ఆంగీరస భాద్రపద బహుళఅష్టమి మంగళవారం 24-9-1872)రస అనినప్పుడు౬వేసినచో ౧౭౬౪ క్రీ శ. 1842ప్లవసం అగును

ఆంధ్రప్రదేశ ప్రభుత్వప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునందు గల తాటాకుపుస్తకము 3 ఆశ్వాసము చివర

'ఈశ్వరనామసంవత్సర నిజజ్యేష్ఠబహుళపాడ్యమీభౌమవాసరం సాయం కాలం వరకు తాలాంకనందినీపరిణయం తృతీయాశ్వాసము శ్రీరామాసేవేకలప్రా, శ్రీహయగ్రీవాయ నమః శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ శ్రీంజేయును' అని గలదు దీని ప్రకారము 26-6-1877 తేదీ అగును ఆంగీరసలో గ్రంథము రచింపబడగా 5 సంవత్సరాలతర్వాత (ఈశ్వరలో) ప్రత్యంతరము వ్రాయబడినట్లు తెలియు

1. వివరములకు-చూ. చాటుపద్యరత్నావళి 60 పుట 1979 ప్రచురణ ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి, సంపాదకుడు-శ్రీరంగాచార్య

2 ఈ ప్రతుల వివరములు ముందు చూపింపబడును.

చున్నది. మావద్దగల ప్రతిలో ఈవిధమైన వ్రాత లేవీ లేవు) లోగా తెల్పిన 'కేశవస్వామిశతకము' శ సం ౧౭౭౮ క్రీ శ 11-11-1856 (ఆనంద సంవత్సర మార్గశిర పౌర్ణమి)న రచన ముగిసినట్లు తెలియుచున్నది అనగా అన్నగారి శతకనిర్మాణము తరువాత 16 సంవత్సరాలకు ఈ ప్రబంధము రచింపబడినది వీనన్నిటిని అనుసరించి చూచినచో-

శతకరచన-క్రీ శ 1856

ఈప్రబంధరచన-క్రీ శ 1872

తాలాంక-ప్రత్యంతరరచన క్రీ శ 1877

అగును ఇచ్చట ఒక సంశయము —'కలియుగ-శాలివాహన-' ఇత్యాది కృత్యంత పద్యము కవివ్రాసినదేనా? అని ఎందుకనగా కవిగారి వంశ వృక్షము ననుసరించి తరాలవారీగా తరానికి 30 సంవత్సరాల చొప్పున అయి దవతరమునుండి అనగా సనత్కుమారాచార్యుల వారినుండి (వీరికిప్పుడు 43 సంవత్సరాలు) లెక్కగట్టినచో 30 × 5 = 140 అగును 1967లో సనత్కు మారాచార్యులవారికి 30 సంవత్సరాలుండును కావున 1967లో నుండి 150 తీసివేసినచో 1817 క్రీ శ అగును కవి యీప్రబంధమును 45-50 సంవ త్సరాలమధ్య వ్రాసినాడని భావించినచో క్రీ శ 1867 గ్రంథరచనాకాల మగును తరువాత కొద్దికాలములోనే అనగా 1872లో ఎవరో ప్రత్యంతరము వ్రాసుకొన్న వారే 'కలియుగశాలివాహన' పద్యమును వ్రాసినారేమో! ఈ నిర్ణ యములబట్టి ప్రస్తుత ప్రబంధకర్త 1817-1880 మధ్యకాలమున సున్నవాడని నేను భావించుచున్నాను ఇంతకన్న మంచి ఆధారము లభించినపుడు మార్పును అంగీకరింపవచ్చును ఆదిరాజువారు కూడా ఈపద్యము ('కలియుగ...') కవిది గాదనియే అనుమానించిరి [1]

---

*1. చూ వీరివ్యాసము, 'తాలాంకనందినీపరిణయము—మరింగంటి వెంకటనరసింహాచార్యులు, 'తెలంగాణ' పత్రిక, సంపు. 4, సంచి కలు 44-45 వ్యయ సం. వైశాఖ బ ౧౦, ఆదివారం, జ్యేష్ఠ శు ౭ ఆదివారం గోలకొండ కవుల సంచిక'లో క్రీ శ 1842 ఈకవికాలముగ తెల్పిరి (౫౧౦ పుట).*

2)

ఈకవికృతులు:-తాలాంకనందినీపరిణయము ఆశ్వాసాంత పద్యములను బట్టి చూడగా ఈకవి మరికొన్ని రచనల చేసినట్టు వ్యక్తమగుచున్నది. వాని పేర్లుగాని వివరములుగాని లేవు ఈవంశమునకు చెందిన అనంతరకవులుకూడా ఈయనరచనలను ప్రస్తావించలేదు ఇప్పటి కీయన

కృతులుగా- ౧ ఇందిరాలభాగవతము (యక్షగానము)

౨ తాలాంకనందినీపరిణయము

అనునవి మాత్రమే గలవు [1]'గోలకొండకవులసంచిక' సమాచారము చూచిన ఈరెండు గ్రంధములు లక్ష్మణరాయపరిశోధకమండలి లో గలవని తెలియుచున్నది.

ఆంధ్రప్రదేశప్రభుత్వప్రాచ్యలిఖితపుస్తకభాండాగారానికి లక్ష్మణరాయ పరిశోధకమండలివారిచ్చిన తాటాకుపుస్తకాలలో మరింగంటివారి రచనలు గలవు. కాని 'ఇందిరాలభాగవతము' మాత్రములేదు దీని లిఖితప్రతి యొకటి డా॥ రామరాజుగారివద్ద గలదని వారే అన్నారు ఈసమయములో నాకాపుస్తకము లభించనందున వివరా లీయలేకపోతున్నాను రెండవది-

*తాలాంకనందినీపరిణయము.* ఇచ్చట దీనిప్రతులనుగూర్చి తెల్పి తరువాత గ్రంథమునుగూర్చి వ్రాయగలను

*ప్రతులవివరము :—*

లక్ష్మణరాయపరిశోధకమండలినుండి ప్రభుత్వమునకుచేరి ప్రస్తుత హ గ్రంధాలయములో A P G O M L A C C 4643 Call NoT 3-194-ఈసంఖ్యతో నున్న ప్రతి శేషాద్రిరమణకవులు తెలంగాణప్రాంతములో పర్యటించి సంపాదించి ల రా ప మండలిలో చేర్చిన అనేకామూల్యతాళపత్ర గ్రంధాలలో ఒకటి ఇది వారికి కనగల్లులో శ్రీమాన్ ఆసూరిమరింగంటి శ్రీరంగాచార్యులవారిచ్చినది. దీనితోబాటు మరికొన్ని తాళపత్రగ్రంథాలుకూడా ఇచ్చట వారికి లభించినవి ఈపుస్తకాన్నిమాత్రము ప్రతివ్రాయించుకొని తిరిగి ఈయగలమని చెప్పి తెచ్చిరట కాని మరల ఈయలేదు ఈవిషయమై ఆచార్యులవారికి శేషాద్రిరమణకవులకు బహిరంగలేఖలు నడచినవి[2], ఈప్రతి ఆధారముగానే ఆది

---

1. *'తాలాంకనందినీపరిణయము - ఒక పరిశీలన' భారతి 1976 డిసెంబరు, శ్రీరంగాచార్య*
2. *'నీలగిరి'పత్రిక (4-12-1935 క్షయ భాద్రపద శు. ౨. గురువారం. పుట. 9) లేఖలు, 1927. ఫిబ్రవరి 17 తేదీ. పై పత్రికలో ఆచార్యులవారు-'తాలాంక ..' ముద్రణకై విరాళము 'విజ్ఞప్తి' చేసినారు.*

రాజువారు తెలంగాణపత్రికలో వ్యాసమును వ్రాసినారు 5-19-1969 సంవత్సర మున నేనీప్రతిని వీరభద్రరావుపంతులుగారు పరిశీలించుచుండగా వారింటిలో చూచినాను అప్పుడిది పూర్తిగా-చెక్కుచెదరకుండా గలదు ఇప్పుడు మొదటి యాకు లేదు అంటే కృతిప్రారంభపద్యాలు పోయినవి, రెండు మూడు ఆకులు-చినిగి చిల్లులతో గలవు దొరికినంతవరకు పద్యభాగాలను నేనీ పుస్తకములో చేర్చినాను (అవి ప్రత్యేక పద్ధతి అక్షరాలలో ముద్రణమయినవి) ఉన్నంతవరకీ తాళపత్రగ్రంథము ౧౨౬ ఆకులుగా రెండు వైపుల వ్రాయబడినది ప్రతిఆకు ౧౭ అంగుళాలపొడవు, ఒకటిన్నరఅంగుళాల వెడల్పు గిలదు సగటున ప్రతి యాకుభాగములో ఎనమిదివరుసల వ్రాతయున్నది (రెండువైపులకిలసి ౧౬ పంక్తులు) ఈప్రతిని సంప్రతించి నావద్దలేని భాగాలను వ్రాసుకున్నాను ఇది ల రా ప మండలినుండి ఆం ప్ర ప్ర ప్రా లి పుస్తకభాండాగారము చేరిన ప్రతి విషయము ఇక

మావద్దగల తాళపత్రలిఖితప్రతుల విషయము

1958 సంవత్సరములో ఆ మ శ్రీరంగాచార్యులువారు మానాయనగారి కిచ్చిన వీ రెండు ప్రతులు [1] (అప్పటికి కనగల్లులో మిగిలినవి ఈరెండు పుస్తకాలే తాటాకుపుస్తకము ప్రథమాశ్వాసములో '.. ఉద్దేశించిరంగదపాంగ' (౧-౧౦)

---

1 *శ్రీమాన్ శ్రీరంగాచార్యులవారివద్ద ఎన్నో తాళపత్రగ్రంథా లుండేవి వాటిలోఎక్కువభాగము మరింగంటివారివే వీటిజాబితాను గోదావ ధూటీపరిణయపీఠికలో ఆచార్యులవారు చేర్చినారు అతిశ్రమతో ఆనాడు గోదావధూటీ పరిణయమును మాత్రము ముద్రించినారు. ఎందరో వీరివద్ద తాటాకుపుస్తకాలు తీసుకవెళ్ళి తిరిగి ఈయలేదు. సరిగదా కనీసం ఇంత ఆర్థికసాయమైనను చేయలేదు దరిద్ర దామోదరులైన ఆచార్యులవారు వారిమెచ్చుటూ తిరిగినారు. ఫలితము చిక్కలేదు మరణించేవరకు ఈవిషయాన్ని వారు చెప్పుకున్నారు. మానాయనగారు ఉద్ధరించి వ్రాసిన 'తాలాంక...' ప్రతినిచూచి ముద్రణమయినంలగా ముద మందినారు. కాని ముద్రితప్రతిని చూచే భాగ్యం వారికి కలుగలేదు.*

వచనమునుండి ప్రారంభము, ౧ ౩ ౪ ౫ ౬ ఆశ్వాసాలలో అటనట కొన్ని భాగములు పోయినవి(విరిగినవి కొన్నిచిల్లులుపడినవి కొన్ని ఆకులు గలవు) - కృతి ప్రారంభము ఈ మూడు పుస్తకాలలోను లేకపోవుట విచారకరము మానాయన గారు దీనినంతా వేరే పుస్తకముపై 1961లో వ్రాసి పెట్టినారు దానిననుసరించి తాటాకుపుస్తకన్ను మళ్ళి చదివి నేనే ప్రతిని సిద్ధం చేసినాను ఎక్కడెక్కడ నా ప్రతిలో లేవో! ప్రభుత్వమువారి ప్రతిలోని పాఠాలు ఏవో తెల్పుట మిక్కిలి విస్తృతి యగును *ఈగ్రంథములో ప్రస్తుతముగల ప్రింటు కన్న తేడాగా వేసిన భాగాలన్నీ నాప్రతిలో లేవు ప్రా లి పు భాండాగార ప్రతినుండి చేర్చు* కున్నవే! అనాడు కసిగల్లుఆచార్యులవా రీయకున్నా మానాయనగారు తెచ్చి సంరక్షించకున్నా ఈప్రతికూడా మాయమయ్యేదేమో! ఇందుకు యశశ్శరీరులైన ఆచార్యులవారికీ, రక్షించి లిఖించిన మానాయనగారికీ నేను కృతజ్ఞుడను

ఈ తాళపత్రగ్రంథముకూడా ౧౮ అంగుళాలుపొడవు ౧ ౧/౨ అంగుళాల వెడల్పు పత్రాలు ౧౩౨కలిగియున్నది వ్రాతదోషరహితముగా స్పష్టముగా గలదు (భాండాగారప్రతిలో లేఖనదోషా లుండి స్పష్టత కొరవడినది)

ఒకలిఖితగ్రంథముకూడా దీనితోపాటు వచ్చినదని పైన తెల్పినను, అది వెనుకటిపల్చనైన కాగితాలపై $\frac{1}{4}$ సైజులో రెండు వైపులా నల్లసిరాతో ౯౬౩ పుటలుగా వ్రాయబడినది 12-1-1929సంవత్సరమున వీనిని వ్రాసినట్లు ప్రథమాశ్వాసము చివరలో ఉర్దూలో సంతకముచేసి(లేఖకుడు) తేదీ వేసినాడు. ఈప్రతి 'కాటంపు నిడుద శ్రీకారఘుల..'(౧-౧౫) అనేగుమకుసీసపద్యము సగము నుండి ప్రారంభమైనది తృతీయాశ్వాసమునందు 'వనితరో యీ వనితలంబున-' (౩-౫౬)అనే రగడ 'వ్రేటు కేటికొ' అనునంతవర కున్నది. ముదట చివరగల కాగితాలు పోయినవి రెండుతాటాకుపుస్తకాలలోను దొరకని ఒకటి రెండు పద్యపాదాలు దీనిలో లభించినవి. పూర్తిగా తాటాకుపుస్తకమును చూచి వ్రాసిన దీ ప్రతి.

ఇవి 'తాలాంకనందినీపరిణయ' ప్రతుల వివరములు[1], నాయీపరిష్కరణలో వీనికే సంకేతము లుంచినాను.

---

*1. డా॥ కోవూరు గోపాలకృష్ణరావుగారు B A చదువుచున్నప్పుడు (1948-49) నల్లగొండలో ఆ మ శ్రీరంగాచార్యులవారితో పరిచయమైనది గోపాలకృష్ణరావుగా రడుగగా వారు 'తాలాంక...' పుస్తకమును పూర్తిగా వ్రాసి యిచ్చిరట (కాని ఆ 'లిఖితప్రతి' నేటికి దొరుకుటలేదు) పైవిషయమును 13. 12 68న. గోపాలకృష్ణరావుగారే స్వయముగా నాకుచెప్పిరి.*

'ప్రా'— ఆంధ్రప్రదేశ ప్రభుత్వప్రాచ్యలిఖితపుస్తకభాండాగారప్రతి
(APGML,ACC 4643 call NOT 3-194)

'తా'— నావద్దగల తాటాకుపుస్తకము

'లి'— ఆద్యంతము లసమగ్రముగాగల లిఖితప్రతి (౧౬౩ పుటలు)

కృతిసమాలోకనము— తాలాంకనందినీపరిణయము ఆరాశ్వాసముల శృంగారసప్రధానప్రబంధము లభించినంతవరకు ఆశ్వాసాలవారీగా గద్య పద్యములసంఖ్య—

| | | |
|---|---|---|
| ప్రథమాశ్వాసము | — | ౩౨౧ |
| ద్వితీయాశ్వాసము | — | ౨౯౩ |
| తృతీయాశ్వాసము | — | ౧౭౮ |
| చతుర్థాశ్వాసము | — | ౩౫౮ |
| పంచమాశ్వాసము | — | ౩౩౩ |
| షష్ఠాశ్వాసము | — | ౨౮౧ |
| మొత్తము | | ౧౯౨౦ |

తాలాంకు డనగా బలరాముడు అతని సుత శశిరేఖ, ఈమె పరిణయ గాథను తెల్పునట్టి గ్రంథము కావున తాలాంకనందినీపరిణయ మనబడినది

ఆంధ్రులకత్యంతప్రీతిపాత్రమైన చుట్టరికము, మేనరికము శశిరేఖాభిమన్యులు మేనమామ మేనత్త పిల్లలు వీరిబాల్యముననే పౌరుల నోటిమాటగా వివాహము నిశ్చయమైనది మధ్యన కొంత అంతరాయము కలిగినను చివర ఉభయులకు వివాహము శుభాంతముగా జరుగును శశిరేఖాభిమన్యు లీ వివాహ కారణమున అచ్చముగా తెలుగువారైనారు

ఈకథను తెలుగులో అనేకులు అనేకప్రక్రియలలో వ్రాసినారు[1].

---

1 *ఉస్మానియా విశ్వవిద్యాలయ మరాఠీ శాఖాధిపతులు అఖావలోగల శశిరేఖాపరిణయముఅగూర్చి పరిశోధన చేయుచున్నారు వారి పరిశోధనఫలితమున విశేషములు వెల్లడి కావచ్చును*
*శశిరేఖాపరిణయాలగూర్చి ఆంధ్రవాఙ్మయసూచిక ౨౦౪-౭౮౮ పుటలు ఆంధ్రయక్షగాన వాఙ్మయ చరిత్ర-పుటలు 166, 191, 214, 224, 228, 395*
*డా॥ యస్ వి జోగారావుగారు*
*తెలుగు జానపదగేయసాహిత్యము ౧౩౭, ౧౩౯ పుట,*
*డా॥ బి రామరాజుగారు,*

('మాయాబజార్' చలనచిత్రము కూడా వచ్చినది) ఈకవికి దాదాపు సమకాలికుడైన రత్నాకరం అప్పప్పకవి శశిరేఖాపరిణయమును ౫ ఆశ్వాసాలలో ౯౯౭ గద్యపద్యములలో వ్రాసెను ఇరువురి రచనలయందు కొన్ని సన్నివేశములు సమానముగానున్నవి కాని కథానిర్వహణమున కవసరమగు మార్పులను అప్పప్పకవి మార్పులు సమంజసముగా లేవు అందుకే ఇద్దరి కథావిషయములను తెల్పుచున్నాను

ఈకథ భారతకథలలో నొకటనియే కవులు తెల్పుచున్నారు (తాలాంక ౧-౬౫-౭౪) కాని భారతమందేకాదు హరివంశాదులలోను శశిరేఖా విషయము లేదు, ఉత్తరాభిమన్యుల వివాహమే గ్రంథస్థమైనది కల్పితమై జనశ్రుతిలో ప్రచారమైన కథలయందు ఇది ఒకటి ఇట్టిదానిని మిశ్రప్రబంధముగా సిద్ధము చేసినారు

'తాలాంక... కర్త' తన సంప్రదాయమును చంపుకొనలేక గ్రంథాంతమున ఉత్తరాభిమన్యుల వివాహమును చేసినాడు (౬-౨౩౧) దీనివలననే పరీక్షిజ్జనమేజయులు కలరు గదా! ఈ గ్రంథమునకు శ్రోత జనమేజయుడు వక్త వైశంపాయనుడు అందుకే ఉత్తరాపరిణయ మవసరమయినదేమో!

ఇక ఇరువురి కథాభేదముల పేర్కొందును
అప్పప్పకవి - జనమేజయునకు వైశంపాయను డీకథను చెప్పెను,

రేవతీబలరాములు శశిరేఖను అభిమన్యున కీయవలెనని భావింతురు భర్త యనుమతితో సుభద్ర తనయన్నయైన బలరాముని చూచుటకు ఇంద్రప్రస్థమునుండి రథముపై వెళ్లి అచట శశిరేఖను తనకోడలుగా నిశ్చయించుకొని వచ్చెను. రాగానే ఇంద్రప్రస్థములో రాజసూయము, మాయాద్యూతము రాజ్య విసర్జన జరుగును పాండవులతోబాటు అభిమన్యుడు సుభద్రయు అడవికి వెళ్లుదురు. తర్వాత కృష్ణుడు సుభద్రాభిమన్యులను ద్వారకకు తీసుకవచ్చెను ఇచ్చట శశిరేఖాభిమన్యులక్రీడలు, అభిమన్యునిదగ్గరకు(ఉద్యానవనములో)చిలుక వచ్చెను. దానిని శశిరేఖ పెంపుడుశుకముగా తెలిసికొని అభిమన్యుడు పట్టుకొనును. ఇంతలో శశిరేఖ తనకీరముకొరకై ఉద్యానవనమునకు రాగా-అనంగబాధితుడైన

అభిమన్యుడు ఆమెను బలాత్కరింపపోవును ఎన్నడైనను నీదాననే ఇప్పు డీపని తగ దనిచెప్పి-శశిరేఖ వెళ్లిపోయినది

ఇంతలో దుర్యోధనునివద్దకు నారదుడు వచ్చి శశిరేఖావర్ణన (అంగాంగ వర్ణన) చేసి లక్ష్మణకుమారున కామె తగునని చెప్పును దుర్యోధనబలరాములు వియ్య మందుటకు సిద్ధపడుదురు ఈవిషయము తెలిసి కృష్ణుడు సుభద్రయు బలరామునివద్దకు వెళ్లి అభిమన్యునకే శశిరేఖ నీయవలసినదని ప్రార్థింపగా అతడు సుభద్రను నిందించును దాని కామె బాధపడి దుఃఖముతో తనయుని వెంటబెట్టుకొని ద్వైతవనమున కరుగును మార్గమధ్యమున ఘటోత్కచాభిమన్యులు యుద్ధముచేయగా వేదవ్యాసుడు వచ్చి మీరిద్దరు అన్నదమ్ములని తెలిపి విడి పించును అనంతరము తమ్ముడు తల్లి వచ్చిన సంగతులను తెలుసుకొని శశిరేఖను తేగలనని చెప్పి ఘటోత్కచుడు ద్వారకకు బయలుదేరును

ఇచట బలరాముడు వివాహప్రయత్నములు చేయుచుండును నారదుడు అంతఃపురములో నున్న శశిరేఖవద్దకు వెళ్లి అభిమన్యుడే నిన్ను పరిణయమాడ గల డని చెప్పును ఇంతలో చెలికత్తెలు వచ్చి శశిరేఖను వివాహమున కలం కరింతురు ఆమె మంచముపై నుండగా మాయచే నిద్రాపరవశురాలినిగా చేసి మరదలిని ముట్టగూడదని ఘటోత్కచు డామెను మంచముతో లేపుకువెళ్లి సుభద్ర కప్పగించి వచ్చి మాయాశశిరేఖగా అంతఃపురమునందు చేరును. వివాహసమయములో మాయావేషములు చూపి-భీభత్సముచేసి అందరిని భయా క్రాంతులుగా జేయును తరువాత బలుడు జరిగిన విషయమును తెలుసుకొని కృష్ణుని కలసి మన్నింపుమని వేడి, అడవికి వెళ్లి శశిరేఖాభిమన్యులను సుభద్రను తోడ్కొని వచ్చి-వైభవోపేతముగా వివాహము జరిపించును

ఈవృత్తాంత మంతయు ద్వైతవనమునం దున్న పాండవులకు తెల్పుటకై ఘటోత్కచుడు వెళ్లును ధర్మరాజాదు లీవిషయము తెలిసి ముద మందుచు ఇంద్రునివద్దనున్న అర్జునునిరాకకై ఎదురుచూచుచుందురు

ఇది రత్నాకరం అప్పప్పకవి చెప్పిన విషయము, 'తాలాంక..' 'కర్త- వీనియందు కొన్నిటిని మార్చి- మరికొన్ని క్రొత్త విషయముల ప్రవేశపెట్టెను ఆఖ ఋవి,

అర్జునుడు తీర్థయాత్రల నెపముతో బయలుదేరి- ఉలూపిని చిత్రాంగదను వివాహమాడను రైవతకోత్సవమునకు వెళ్లి సుభద్రను వరించును తర్వాత ధర్మజుని రాజసూయము మాయాద్యూతము రాజ్యవిసర్జన తెల్పబడినవి (ఈ సన్నివేశములలో విజయవిలాసము, మహాభారతసభాపర్వములను కవి ఆదర్శములుగా గ్రహించినాడు)

పాండవు లడవి కేగినప్పుడు సుభద్రాభిమన్యులు ద్వారకలోనే యున్నారు (అప్పుడు అభిమన్యుడు బాలుడు) వీరిచ్చట నుండగానే రేవతికి శశిరేఖ జన్మించును సౌభద్రునికే ఈ కన్యకనీయగలనని బలుడు చెప్పును మేనసంబంధము ముఖ్యమైనదని అందరు పల్కుదురు శశిరేఖాభిమన్యుల యౌవనము,శశిరేఖ యంతఃపురవాసము, ఇరువురి విరహము మొదలగునవి.విరహాగ్నికి తట్టుకొనలేక శశిరేఖ ఉద్యానవనమునకు వెళ్లుట,వనవిహారము, పుష్పాపచయము,(రగడలో) మన్మథార్చన-దూషణ-వర్ణనలు

ఒకనాడు నారదుడు ద్వారకకువచ్చి శశిరేఖనుజూచి అభిమన్యున కీమె తగునని చెప్పి అనంతరము దుర్యోధనుని వద్దకు వెళ్ళి లక్ష్మణకుమారునకు తగినవధువు శశిరేఖ యని అచ్చట చెప్పి- కలహబీజమును నాటును

బలరాముని వద్దనుండి లగ్ననిమిత్తమై విప్రులు రాగా బలుడు అందుకంగీకరించును ఈవిషయము తెలిసి సుభద్ర అన్నవద్దకు వచ్చి- చిన్ననాటి మాట జ్ఞప్తి చేసికొని అభిమన్యునకే శశిరేఖ నీయవలయునని బ్రతిమాలును. కఠినవాక్యములతో పాండవులను వారి సంపదలను తాలాంకుడు నిందించుటే గాక- చెల్లెలిని పరుషోక్తు లాడును ఆమె సహింపజాలక కుమారుని వెంటబెట్టుకొని పాండవులున్న యడవికి బయలుదేరి పోవును మధ్యేమార్గమున ఘటోత్కచాభిమన్యులకు భీషణయుద్ధము జరుగును నారదుడు ప్రత్యక్షమై వారి యుద్ధమును విరమింపజేసి పరస్పరాభిజాత్యమును తెల్పును ఘటోత్కచుడు సుభద్రద్వారా విషయములను తెలిసికొని- శశిరేఖను తెచ్చి యిత్తునని వారికి చెప్పును ఈ యుద్ధమునకు పూర్వమే- విశ్రమించుచున్న తల్లికి రక్షగానున్న అభిమన్యుని వద్దకు శశిరేఖ పంపిన పెంపుడుచిలుక వచ్చి, సందేశ మందించును అందుకు ప్రతిసందేశమును అభిమన్యు డొసంగి, తప్పక ఆమెనే వివాహమాడుదునని

చెప్పి పంపును (ఈ శుకరాయబారసన్నివేశము హృదయంగమముగా నుండి శ్రీనాధ-సూరనల దలపించును).

ఘటోత్కచుడు మాయామహిమచే బలుని అంతఃపురమును చేరి 'కంకటిపై జలదాంత చంద్రరేఖాసదృశాంగి' వలెనున్న శశిరేఖను చూచి- మరదలిని ముట్టకూడదను ధర్మమువలన మంచముతోనే తీసుకవచ్చి సుభద్ర కప్పగించి తిరిగి తాలాంకునిపురముచేరి వివాహసమయమున అంతఃపురములో శశిరేఖగా నుండి మాట్లాడించినవారిని 'గొంగడిలో రాళ్ళువైచి గ్రుద్దిన కరణి' జవా బిచ్చి- వివాహసమయమున ఒహుళరూపముల ధరించి- లక్ష్మణకుమారుని పరాభవించును. తరువాత బలరాముడు జరిగినదానికి చింతించి కృష్ణునితో సంప్రతించి-అడవిలో నున్న సుభద్రవద్దకు వెళ్ళి బ్రతిమాలి- వారినందరిని తీసుకవచ్చి మహావైభవముగా వివాహము జరిపించును అజ్ఞాతవాసములో నున్నందున పాండవులెవ్వరును వివాహమునకు రాలేదు అర్జును డింద్రలోకమునం దుండగా లేఖ ద్వారా ఈ విషయము తెల్పబడినది తర్వాత పాండవులు (అజ్ఞాతవాసానంతరం) అభిమన్యునివివాహము చూడలేదని- ఉత్తరతో వివాహము జరిపింతురు ఇది 'తాలాంక ——'లోని విషయము

దీనియందు నారదుడు నర్మసఖుడు, శుకము సన్నివేశనిర్వాహణమునకు ముఖ్యులైనారు ప్రారంభమున కలహమునకు బీజమును నాటిన దేవమునియే చివరకు శుభాంతముగా కథను సుగియచేసినాడు శశిరేఖ యంతఃపురమునందలి పెంపుడుచిలుక అడవిలోనున్న అభిమన్యునకు ప్రియురాలి సందేశ మొసంగి అభిమన్యుని అభిప్రాయమును తననాయకురాలి కందించి యామె కుపశమనము కలిగించినది,[1] ఇక సుభద్ర రోషవతిగా అభిమానవతిగా తనపంతము నెగ్గించుకొనినది [2] అన్నిటిని మించి ఘటోత్కచుడు శశిరేఖాభిమన్యుల వివాహము

---

1 శ్రీతాలాంకనందినీపరిణయము- శ్రీశేషం రామానుజాచార్యులవ్యాసము (భారతి 1967 నవంబరు) దీనియందు శుకరాయబారసన్నివేశము విశదీకరింపబడినది

2 బలరాముడు-సుభద్ర-వీరిసంభాషణ నాటకీయతగా సహజముగానుండి మేనరికప్రాశస్త్యమును చాటుచున్నది (౧-౨౫ నుండి ౯-౨ వరకు)

నిశ్చయించిన వేళకే జరుగునట్లు చేసి బలుని అలంకృతపట్టణము, అంతఃపురము లను చిందరవందర చేయుట లగ్నసమయమున నానావిధరూపముల ప్రదర్శించి అందరిని భయభ్రాంతుల చేయుట ఈసన్నివేశములు ప్రబంధములకు నిండుదన మును చేకూర్చినవి శ్రీకృష్ణదుర్యోధనబలరాములపాత్రలు ఔచితీస్ఫోరకములుగా చిత్రింపబడినవి

ఈ విధములుగా ముఖ్యములైన సన్నివేశములు కవి చక్కగా నిర్వహించి తనప్రబంధమునకు వన్నె చేకూర్చినాడు ఇది

''యత్స్యా దనుచితం వస్తు నాయకస్య రసస్య వా

విరుద్ధం తత్పరిత్యాజ్య మన్యథా వా ప్రకల్పయేత్'' అను నాలంకారికోక్తిని అనుసరించినట్టిది

అప్పప్పకవి ఈవిధమైన పద్ధతి ననుసరించలేదు అందుకే ఆరచనయందు ఔచిత్యము దూరమయినది

ఇవి ఉభయుల రచనలయందలి తారతమ్యములు 'తాలాంక .' పూర్తిగా పఠించినవారికి కవియొక్క ప్రతిభాదులు వ్యక్తమగును

కవితావిశేషములు :- 'కేవలకల్పనాకథలు కృత్రిమరత్నములు' అను కవివాక్కును కళాపూర్ణోదయరచనద్వారా సూరన దూరముచేసినాడు భారత-భాగవత-రామాయణములందు లేకున్నను వానితో సన్నిహితసంబంధమును గల్పించి అవి ఉత్పాద్యములైనను ప్రఖ్యాతితో మిశ్రకథవలెనే లనంతరకవుల రచనలు కొన్ని బయలుదేరినవి వానిలో ఈతాలాంకనందినీపరిణయ మొకటి దీనిపై భారత-భాగవతములు ప్రసిద్ధములైన ఆముక్తమాల్యద మనువసుచరిత్ర ములు కళాపూర్ణోదయమువంటి ప్రబంధముల ప్రభావము మిక్కుటముగా నుండు టయేగాక బిల్హణీయాదులగాలియు కొంత సోకినది ఇట్టి ప్రభావభావితుడైన కవిప్రబంధమున కుండవలసిన పని ఆలంకారికులు చెప్పిన సర్వనియమములను పాటించి శృంగారరసప్రధానముగా ఈ కృతిని దిద్ది తీర్చినాడు 'వర్ణనానిపుణః కవిః' అను దానిని సార్థకము చేసినా డనుటకు దీనియందు విపులముగాగల వర్ణ నతే ప్రత్యక్షసాక్ష్యము కవి దీనిని శృంగారరసప్రబంధ మనినాడు కావున విచ్చల విడిగా శృంగారవర్ణనలు గలవు, ఇది కవిదోషము గాదు నేడు మనకీపద్ధతి వెగటుగా దోచును కాని మనుచరిత్రనుండి కందుకూరివారి రసికజనమనోభి

రాముని వరకును ఈపద్ధతికి చెందిన రచనలే గలవుగదా! కవి పూర్వసంప్రదాయమున పుట్టి పెరిగినవాడు ఎంత నిగ్రహించుకొనినను అతని సంప్రదాయము చావలేదు పైగా రసరాట్టయిన శృంగారమును వదలలేక పోయినాడు ఈవిధము లైన వర్ణనలయందలి చమత్కారముల తెలిసికొనుట యనునది రసజ్ఞునిపద్ధతి అంతేగాని నిందించి ప్రయోజనము లేదు పైగా కథాభాగము తక్కువ. అందుకే వర్ణనలు తప్పనిసరి యైనవి ఇట్టిపద్ధతికి వసుచరిత్రము మనకు గలదు.

ఈకవి సంస్కృతాంధ్రభాషాపారంగతుడే గాక— ఆనాడు మిక్కిలిగా వాడుకలోనున్న ఉర్దూ-ఫారసీభాషలు బాగుగా తెలిసినవాడని, రచనలోని పద ప్రయోగములు సాక్ష్య మిచ్చుచున్నవి అనర్గళకవితాధారతో మహాప్రబంధ నిర్మాణము చేసిన ఈకవి-అసామాన్యు డనిపించక మానడు వీనితోబాటు దైవ,గురు,పితృభ్రాతృభక్తి గలవాడు తనయన్నయైన వేంకటరాఘవాచార్యుల వారిని 'రాఘవార్యుండు రెండవరాఘవుండు' '—మాయన్న' వంటివాడు-అని చక్కని వర్ణించి- తన అభివృద్ధికి ఆయనే కారణమని సవినయముగా తెల్పినాడు

ఆరు ఆశ్వాసములుగాగల ఈ కృతియందు కవి తన కవితాశక్తిని ప్రదర్శింపచేసినాడు అందుకే శబ్దాలంకారములు, అర్థాలంకారములు హెచ్చుగా గలవు శ్లేష యనినచో కవి కెంత యిష్టమో ఆయావర్ణనలబట్టి చూచిన తెలియ గలదు వీని యన్నింటికి తోడుగా-అష్టాదశవర్ణనలు, వసంతవర్షాశరద్ధేమంత ఋతువులు(మాత్రమే) చక్కగా వర్ణింపబడినవి క్రీడలు,సాంఘికములైన ఆచార వ్యవహారములు చూపబడి జాతీయములతో కూడిన పద్యములు కలిగి సంభాషణ లలో వినూత్నతను సంతరించుకొనినవి. ఆలంకారికులుచెప్పిన—పాకములు, రీతులు, వృత్తులు, శయ్యలు, ఇందు గలవు మరియొక విశేషమేమనగా ఆముక్త మాల్యదవలె ఆశ్వాసాంతములందు తనను గూర్చి పద్యమును వ్రాసినాడు. రాయలు గద్య వ్రాయలేదు ఈకవి వ్రాసినాడు గ్రంథములో బహువిధములైన ఛందస్సులను ప్రవేశపెట్టినాడు ఉదా గునుకసీసము, రగడ మొ॥ సీస,గీత, చంపకోత్పలములను మాలికలుగా వ్రాయవచ్చును కానిఈకవి ద్విపాదిమత్తేభము, విరోధాభాస (౧-౧౨౪) మఱియొక పంచపాది మత్తేభము (౨-౨౬౦) ల వ్రాయుటేగాక మరికొన్ని పంచపాదుల ప్రవేశపెట్టినాడు! అవి. ౧-౧౧౩,౧౯౦,౨-౯,౧౩౮,౨౬౦, ౩-౭౯౪, ౧౨౮,౫౯౧,౫-౧౯,౧౩౨, ౫౯౩ సంఖ్యలు గలవి, కవి-తనకావ్యకన్యకను-

ఉరుతరకంధవేణి లసదుత్పలలోచన, చంపకాంగి భా
సురతనుమధ్య రమ్యవళి సుందరవృత్తనితంబ గీతవి
స్తర బహుమత్తకోకిల రసస్వరభాస్వర యైన కావ్యసుం
దరిని వృషాచలేశున కుదారత గౌరత ధారవోసెదన్-(౧-)

ఈ విధములైన ఛందస్సులతో అలంకరించి మంచియల్లుడగు వృషాచలేశునకు ధారపోసెను (కవి చెప్పినా-గ్రంధములో మత్తకోకిల లేదు).

కృతిప్రారంభము విశిష్టాద్వైత పద్ధతిలో సాగినది శంఖచక్రగదలు వర్ణింపబడినవి విష్ణుమహత్త్వము ప్రశంసింపబడినది (ఈ పద్యములు తాటాకులలో అసమగ్రములు) ఈవిధమైన సంప్రదాయకీర్తనము తరువాత కవి-

సకలాలంకరణ పదప్రకరణ గూఢశ్లేషాశ్లేషశ్లాఘనీయ పురాణ రచనా ప్రవీణ చమత్క్రియా ధురంధర కవిపురందర వాఙ్మరందస్యంద దమంద ప్రధానమాధుర్యంబునకు విశ్వసించి-దుష్కరపదపుష్కల శుష్క కవితా పరిష్కారులగు దుష్కవుల నిరసించి కలుషలతా వితాన లవిత్రంబుగా పవిత్రజన స్తోత్రపాత్రం బగు చిత్రకథాచరితంబు రమాకళత్రాంకితంబుగా' రచింప నుద్దేశించినాడు స్వప్నమునందు శేషశైలేశుడు ప్రత్యక్షమై- 'లాలాంకతనూజాసదుద్వహకథా-' రచనను తన కంకిత మీయవలసినదని చెప్పి, పోతనకు శ్రీరామచంద్రుడు చెప్పినట్లుగానే 'తనయునిగతి నీకు సనాతనకవివాఙ్నిరుక్తి నాకృప నిత్తున్' అని అభయ మొసంగెను వీని యన్నిటివలన కవి ముదమందినవాడై తనకావ్యమును-

కవితాకల్పనకల్పభూరుహసమాఖ్యఖ్యాతిచే మద్గురు
ప్రవరానుగ్రహమే నిధానముగ గన్పట్టన్ రమాజాని స్వ
ప్నవశుండై కృతిఁగోరె తన్నియమనప్రౌఢిన్ బుధుల్ మెచ్చ నే
యవనిన్ నిమ్మకు నీర మెక్కుగతి కావ్యం బూర్జితం బయ్యెడిన్ (౧-

అని తెల్పినాడు.

ఈకవి గ్రంధరచనా విషయమున మిక్కిలి జాగరూకత వహించినాడు. సంప్రదాయమును వీడక ఆలంకారికనియమములను తిరస్కరించకపోవుట ఇందుకొక దృష్టాంతము. ఆ పద్ధతిలోనే సుకవిస్తుతి, కుకవినిందలు చేయబడినవి.

కవిస్తుతిలో ప్రత్యేకముగా ఎవ్వరి పేరును తెల్పకపోయినను-శ్లేష చమత్కారయుతముగా-

హరిపదసక్తులుం గువలయాప్తులు......(౧-౨౬) అనే పద్యమునందు కవివరులపై తనకుగల భక్తిప్రపత్తులను వెల్లడించి కుకవిదూషణమాత్రము రెండుపద్యములలో నిట్లు చేసెను

సురుచిరవృత్తనేమములు జూడక హీనకథాప్రసక్తిచే
గురులఘువర్ణ నిర్ణయము కొంచెము లేక పదార్థసంగ్రహ
స్థిరమతి సత్ప్రబంధరుచిదేరక శయ్యలు విశ్రమస్థలం
బరయక హీనజారులక్రియం దగు దుష్కవులం గణింతురే (౧-౨౬)

పెద్దనగారు కుకవులను 'కుటుంబరక్షణకునై ప్రాల్మాలి చింతన్ నిరంతర తాళీదళసంపుటప్రకరకాంతారంబులన్ తెగగొట్టి జీవించుచా' రనినాడు ఈకవి అందుకు మరికొంత ముందునకు వెళ్లి కుకవులు హీనజారులవంటివారని జారులకు వీరికి అభేదప్రతిపత్తిని శ్లేషలో నిమిడించినాడు తరువాత

తమకై తాము వికల్పనార్థగతశబ్దంబుల్ తగం గూర్చి ప
ద్యములుం గొన్ని సభన్ పఠించు నెడ విద్వత్కోశలుం బూర్వప
క్షము గావించిన నోరుమూతురు తమిం గన్నంబులో తేల్చిటు
క్కుమనన్ మీటక దొంగబం టగున గ్రుక్కున్ మిక్కుగా నుండదే (౧-౨౭)

అని తెల్పినాడు ఈపద్యములనుబట్టి చూచిన ఆకాలమునందు జరుగుచున్న అనేకములైన విద్వత్సభలలో పండితులు శాస్త్రార్థము గావించి ప్రతివాదముల సల్పగా అట్టివానిలో నీకవి పాల్గొని నాడేమో ' దాని కెవరో బాధపడి నీవు ఒకకావ్యమును వ్రాసిన నీపస తెలియగలదని యధిక్షేపింపవచ్చును అందుకే

'కోమలరీతిం బల్కి విరి కోకిలం గాకినిగా గణింతు రు
ద్దామసదర్థబోధకవితారచనం బ్రకటింపకున్న వి
ద్యామహిమాఢ్యు గౌరవగుణాఢ్యుని మౌఢ్యునిగా దలంపరే' (౧-౨౮)

అనుభావమును వ్యక్తపరచియున్నాడు ఈవిధముగా కవిస్తుతి నుకవినిందలను ప్రౌఢపద్ధతిలో చేసి తనదైన ప్రత్యేకమార్గమును భావనను పాఠకునకు కల్గించినాడు అంతేగాక విభిన్నసందర్భములలో ప్రసక్తి కల్పించి కావ్యము

కవిత్వము అనువానిని వివరించినాడు వీనన్నిటివలన కవికి కవిత్వముపై ఎంత శ్రద్ధాసక్తులుగలవో వ్యక్తమగుచున్నయేగాక- తన యభిరుచిని సందర్భాను సారముగా ప్రత్యేకపద్యములలో వివరించినాడు

ప్రథమాశ్వాసమున- పురవర్ణనసందర్భములో రథ-గజ-తురగ-పదాతి దళముల వర్ణించునప్పుడు-

ధారలఁ బగి సకలాలం
కారంబులు వడియు కందగతిలక్షణవి
స్ఫారంబగు హయములు- శృం
గారప్రియప్రోక్తమైన కావ్యముఁ బోలెన్. (౯౦)

అని హయములగూర్చి చెప్పెను పద్యధారాయుతమై- సకలాలంకార శోభితమై-వడి (యతి) గలిగిన కందపద్యగమనము, లక్షణములవలె- శృంగార రసప్రియుడైనకవి చెప్పినట్టి కావ్యమువలె- హయములున్నవి [1] ఈవిశేషణములు అశ్వమునకును చక్కగా సరిపడును మరియొక విశేష మేమన ఇది కంద పద్యము -పద్యములో'కంద' గలదు — ముద్రాలంకారము,ఈపద్యము చదువగానే -చరి గొండ ధర్మన- చిత్రభారతములోని (1-24)

పదముల చొప్పును వడియు
ప్పిదము సలంకారలక్ష్మి పేర్మియు దారా
స్పదభావము గల్గి యుభ
ప్రదమై హయమమరె సత్ప్రబంధమురీతిన్

అనుపద్యము స్మరణకువచ్చును కాని యింతు పద్యనామసార్థకత లేదు

'తాలాంక .'కర్తి ఇదే ప్రథమాశ్వాసమునందు చిత్రాంగదా వివాహ సందర్భమున—

---

1. కావ్యమును-కాంతలోనే గారా-గజ,అశ్వ-రాజ-యుద్ధవిశేషణములుగా వర్ణించినవారు గలరు-మా ప్రబంధమణిభూషణము (1971 ము.88-90 పుటలు)

మధురవృత్తులు రీతులు పృథుగుణములు
గలుగు కూతురునకు నలంకారము లిడి
పాండుసుతునకు మలయధ్వజుం డొసంగె
కవిరసజ్ఞుకు కృతి నిచ్చు కావ్య మనఁగ. (౨౧౮)

సందర్భమేగాక- పద్యమున పేర్కొనిన-వృత్తులు – రీతులు-గుణములు-అలంకారములు- ఈగ్రంథమున గలవు కన్యక అలంకార శోభిత ఈకావ్య కన్యకకూడా అనేకాలంకారశోభిత (ఈకవియొక్క అలంకారములు ప్రత్యేక జాబితాగా ఈయనైనవి) అట్లే-గుణాదులు సంపూర్ణము గలది, కావుననే రసజ్ఞుడైన వానికి కృతినొసంగు కావ్యము అని-చిత్రాంగదను విశేషించినాడు కన్యావిషయమున అర్జునుడు,కావ్యకన్యావిషయమున వృషాచలేశుడు రసజ్ఞునుడు, కావ్యకన్యావిషయమున వృషాచలేశుడు రసజ్ఞులు గదా!

ఇట్లు కవిత్వము- కావ్యమునుగూర్చిన విషయములు మరికొన్ని సందర్భములలో గలవు (ఆపద్యసంఖ్య లివి-౨-౫౩,౫౮,౧౦౯,౧౩౬ ౨౪౭ ౯-౫౮ ) ఈ కావ్యమున వర్ణనలు - మహాకావ్యలక్షణబద్ధములై (అష్టాదశవర్ణనలు) సందర్భోచితముగా చేయబడినవి విస్తరభీతికి వానిని వివరింపక రెండు మూడు వర్ణనలను మాత్రము పేర్కొందును

నిశాంతవర్ణన–

అంతటిలో కనుంగొనఁగనయ్యె రథాంగయుగీదురంతదుః
ఖాంతము సంతతాతనుసుఖానుభవశ్రమతాస్వకాంతబా
హాంతరసుప్తికాశ్రుతిపుటాంతరదుస్సహతామ్రచూడకా
త్యంతనినాదపూరితదిగంతమునైన నిశాంత మెంతయున్'

వనవర్ణన

ఏరమాకందచయప్రశోభితమునై శ్రీయుక్తమై చంపక
స్ఫురితంబై లలితోత్పలావృతమునై సువ్యక్తగీరానుసుం
దరమై యార్యవినోదమై గురుతరద్రాక్షారసామోదప్ర
త్తరవోదీరిత మత్తకోకిలమునై దాఁజూపె గావ్యాకృతిన్[1].

---

1 ఈ కావ్యమునకు పై పద్యము సరిపడును మత్తకోకిల వృత్తము నందే గలదుకాని కావ్యవనియందు మాత్రము లేదు.

దారిద్ర్యము

చ. పల్యాంకురమూ ర్తికారణము, భాషావ్యత్యయప్రాప్తిదు
ర్వ్యాపారాశ్రయ మాప్తదూషితము- దైన్యాలాపజన్యంబు హ్రీ
త్రాపోపస్మృతి బంధుసౌహృదవిఘాతంబైన దారిద్ర్య మి
ట్లాపాదించిన మిత్రులైన నెడబాయం జూచు టాశ్చర్యమే '

ఇవి మచ్చునకు మాత్రమే 'వర్ణనానిపుణః కవిః' అనునది ఈయనకు సార్థకమని ప్రబంధపఠన మొనర్చువారి కవగత మగు నప్పటలో నెట్టి సంశయమును లేదు వర్ణనలే కాక పద,అర్థ,భావ-చమత్కృతులుగల పద్యము లనేకములు గలవు ఎన్నిరీతులు గుణములు పాకములు వర్ణన లున్నను చమత్కారములేనిది శోభ లేనిది గదా!అందుకే చమత్కారజనకం కావ్యం' అనినారు ఈపద్ధతి ప్రస్తుత రచనలో బాగుగా గలదు వానిని కొన్నిటిని వివరింతును -

ద్వారకానగరవర్ణనసందర్భము ద్వారకానగరమందలి ఆవరణము ఎత్తులో అన్నిటినీ జయించి జయలక్ష్మిని వివాహమాడుటకు వెళ్ళగా మధ్యన అపశకునము జరిగి ఆగిపోయినదట ఆ అపశకునమును-

ఆపుటభేదనావరణ మభ్రతలోన్నతిగాగఁ దూఁగి యా
గోపురసాలముల్ గెలిచి గొబ్బున దజ్జయలక్ష్మి పెండ్లికై
ప్రాపుకు బోవ నొంటి ద్విజరాజశశంబును దుర్నిమిత్తము
ల్గా పొడగాంచి మువ్వలకు దాటక నిల్చినరీతి భాసిలెన్ (౧-౭౮)

అని చెప్పినాడు దీనిలో 'ఒంటిద్విజరాజశశము' గలదు. 'ద్విజ' అనగా బ్రాహ్మణుడు శుభకార్యములకు పోవునపుడు ఒంటిబ్రాహ్మణుడు ఎదురగుట అపశకునమని కొందరిభావన దానికి తోడు శశము = కుందేలు, మామూలు అర్థములో ద్విజరాజశశము = చంద్రునిలోగల (మచ్చ) కుందేలు, అని భావింతుము ఇట్టి అర్థచమత్కృతి దీనిలో గలదు

ద్వారకానగరమందలి ప్రాకారము ఆకాశమునకు భక్తితో మంగళహారతి నిచ్చుచున్నదట. మరి దీని సామగ్రియేది? వానిని చమత్కరించుచున్నాడు

బంగరుకోట పళ్ళెర ముపస్థితశాఖలు దీపముల్ తదు
త్తుంగబలాహక ప్రతతి ధూమము లట్లు వెలుంగి ద్వారకా
భంగురలక్ష్మి విష్ణుపదభక్తి నొసంగెడు మంగళార్తి నా
రంగు బొసంగె మంగళతరంగవిశాలము దీర్ఘసాలమున్ (౧-౮౧)

ద్వారకానగరలక్ష్మి 'విష్ణుపదభక్తి'తో 'మంగళహారతి' నిచ్చుచున్నదట. విష్ణుపదము అనగా ఆకాశము ('వియ ద్విష్ణుపదం-') విష్ణువుయొక్క పదము అనియును అర్థము మంగళహారతి యనుటకు మంగళార్తి యని అచ్చమైన వ్యావహారికపదమును ప్రయోగించినాడు

ద్వాదశరాశులలో 'మీనరాశి' గలదు. దాని కాపేరు వచ్చుటకు చక్కని కారణమును ఉత్ప్రేక్షించినాడు.

బలిసదనాపగాంతరుషపంక్తులు ఖేయజలంబుఁ జొచ్చి యు
జ్జ్వలమగు కోటకొమ్మల విశాలవిధూపలరాజి నిండు వె
న్నెలల గరంగు ధారలను నింగికి దా మెదురెక్క ఖఃస్థలిం
గలిగెను మీనరాశిపరిఖావరణంబుల నిమ్నతోన్నతిన్ (౩-౮౩)

రసాతలమందున్న చేపలు ఖేయజలముతో చేరినవి కోటగోడలపైగల చంద్రశిలలు కరిగి నీరు క్రిందికి జారగా ఆనీటికి ఎదురెక్కినవి కోటగోడలు ఆకాశమునకు తగులుచున్నవిగదా! ఈ చేపలుకూడా వానితో ఆకాశమున చేరినవి. (మీనములగుంపు = )మీనరాశి అచ్చట ఈ ప్రకారముగా ఏర్పడినదట. ఇది ప్రౌఢోక్తి.

భూమికి 'రత్నగర్భ'యని పేరు గలదు ('జగతీ రత్నగర్భా చ-'అమరం) మన మూహించిన పద్ధతిలో దీనిని రత్నగర్భగా కవి యూహించుటలేదు. ఇట్లు చమత్కరించి - నామసార్థక్యమును వెల్లడించుచున్నాడు.

పురపరసౌధవీధుల నవోఢలు వోమనగుంతలాడు న
త్తఱి చెయి జింది భూనిపతితంబగు రత్నములెల్ల పొరులే

3)

ర్వరపక ద్రొక్కఁగా ధరణి పాదుకొనన్ వసుధావధూటి ని
వ్వరుసను రత్నగర్భయని వాడిరి లోకములోన 'పండితుల్ '(౧-౧౦౬)

ఆపట్టణమందలి సవోధలు రత్నాలతో వోమనగుంటలాట ఆడగా వారి చేతినుండి జారిన రత్నాలు భూమిమీద పడినవి పధికులు వానిని గమనింపక త్రొక్కుచు పోవుచున్నారు అవి యన్నియును భూగర్భము(లోనికి)న ప్రవేశించినవి. అందుకే భూమి 'రత్నగర్భ' యైనదని పండితులు భావించిరట. ఈ పద్యములో 'వామనగుంతలాట' పేరు తెల్పినాడు

కవికి విరోధాభాసపై మక్కువ మెండు వచనములలోను పద్యములలోను దీనిని ప్రయోగించినాడు ఈ పద్ధతి తెలుగువారికి బాణుడు పెట్టిన భిక్ష

అరిడిం జూడగ చిత్రకూటరుచిరామాహ్లాదమౌ నీపురం
బరిడిం జూడగ చిత్రకూటరుచిరామాహ్లాదమై యొప్పు నీ
హరినిం జూడగ... (౧-౧౩౧)

అని శ్రీకృష్ణుని-త్రివాదవిరోధాభాసలో శ్లేషచమత్కృతితో వర్ణించినాడు

అభిమన్యుడు చంద్రవంశ్యుడు గాబట్టి నామసాదృశ్యముతో చంద్రుడే ఇతని ముఖముగా మారినాడట ఆవిషయమును-

కనుఁగొన చంద్రవంశజుఁడు గావున తద్విధుబింబలీల యా
ననమున దత్కళంకరుచి నల్లనిమీసములన్, సుధారసం
బును మృదువాక్కులం దరుణపుం జిగివాతెఱ, నిండు వెన్నెలల్
తన చిఱునవ్వునం బొలయఁ దాఁ జెలువొందె మనోహరాకృతిన్(౨-౬౪)

అనినాడు చంద్రునిలో కళంకమున్నట్లు అభిమన్యుని 'ముఖచంద్రునిలో నల్లని మీసము, మాటలలో సుధ అరుణిమ పెదవులపై చిఱునవ్వు వెన్నెల ఈ ప్రకారముగా అభిమన్యుడు చంద్రునితో అభేదముగా గలడు ఇందుకు కారణము 'చంద్ర'వంశ్యుడు గాబట్టి అని కవిభావన.

నడుము సన్నగా నున్నదని చెప్పుట ఒకసమయము ఈకవి అభిమన్యుని నడుము ఎందుకుసన్నగా అయినదో ఇట్లు తెల్పుచున్నాడు

'. .సూనశరబాణ సంపీడ్యమానలైన
చేడియల దృష్టి తాకి కృశించె-'నట ఇది ఇతని సౌందర్యము

శశిరేఖకు యౌవనము పెకిలివచ్చినది అందుకు నిదర్శనముగా ఆమె వక్షోజములు బయలుపడినవి దీని నిట్లు చమత్కరించుచున్నాడు

ఆయబలామణీతనుగృహంబున గాపురమున్న శైశవ
ప్రాయము నమ్మరుండు చలపాదితనంబున నిల్లు వెళ్ళఁగాఁ
ద్రోయదలంచి తోడుతనె దొంతులకుండ లురంపువాకిటన్
వేయుగతిం గుచంబులు నవీనరుచిం జనియించె బోటికిన్ (౨-౨౪)

అని- ఇంటియందు వస్తువులు పోసి పెట్టుకునే కుండలను దొంతుల కుండ లందురు. దొంతులుగా కుండ లుంచునది దొంతుల అట్ట(అర) ఇంటి నుంచి వెళ్ళగొట్టునప్పుడు దొంతులకుండలను బయటవేయుట కొందరిగృహాలలో పోట్లాటలప్పుడు మామూలువిషయము ఇచ్చట మన్మధు డనేవాడు తన చలపాది తనముతో శశిరేఖశరీరమనే గృహంబున కాపురమున్న శైశవమను వ్యక్తిని వెళ్ళగొట్టి వెంటనే దొంతులకుండలను బయటపడవేసినాడట ఆవాకిలియే శశిరేఖ ఉరము. ఆకుండలే ఆమె స్తనములు 'కుంభ స్తని'యనుట కవిసమయప్రసిద్ధము, (కాని-కుచములు నవీనరుచిం జనియించె-'ననినాడు జన్మతోనే అవి కుంభసామ్య మందునా?అనుమానము)

శశిరేఖ అవయవముల వర్ణింప సంపర్భమున కవి కొన్ని వర్ణముల లోప ముతో' వర్ణచమత్కారార్థము'ను స్ఫురింపచేసినాడు ఆపద్య మిది,

'కంధరం' బెదిరించి కచభరంబున కోసె
దెసఁ జెడి తనుదానె దిశలు ప్రాకె,
రహి'కింశుకము' పాటవశక్తి గైకొననోడి
యందంద పురివిచ్చి క్రిందఁగూలె

'లహరు లా' త్రివళితో సహజంబుగా నోడి
ప్రతికూల మెనయుచు భంగపడియె
'సారసం'భావనచ్ఛాయ నోపక నోడి
పగలు పెంపున పంకభరిత మయ్యె

మొదలు వర్ణచ్యుతిని బొంది తుదినురోజ,
వాక్య మధ్యమ,హాస,సంపద,లభించె
'నన్యథా చింతితం కార్యే మన్నచోట
దైవ మన్యత్ర చింతయే త్సరణి'గాఁగ. (౨-౮౮)

దీనియందు- ఆయా అవయవాలకు విశేషణములైన-కంధరము-(కచమునకు) కింశుకము-(పాణిరక్తిమకు) లహరులు(వళికి)సారసం—(ముఖమునకు)అనునవి గలవు ఈ పద్ధతిలో ఇవి-ఈఅర్థములకు సరిపడును కాని-మొదలు 'వర్ణచ్యుతి' కలిగినగాని వీనికి ప్రాముఖ్యము వచ్చును. అందుకే-

'కంధరము'లో మొదటివర్ణము 'కం' చ్యుతిబొందిన-ధరము, ఇట్లే-'కిం' శుకము-శుకము 'ల'హరులు-హరులు, సా'రసం అగును-వీని నిప్పుడు క్రమముగా చేర్చి-గీత పద్యమునగల విశేషణములను ప్రక్క నుంచినచో-మిగిలిన అవయవములు కూడా ప్రతిభాసించును అవి యిట్లు—

కంధరము—కచభరము
ధరము—ఉరోజము
కింశుకము —పాణిరక్తిమ
శుకము—వాక్యము
లహరులు —త్రివళి
హరులు—మధ్యమము (సింహమధ్య)
సారసము —ముఖము (కమలము)
రసము—హాసము

మొదలు వర్ణచ్యుతిని బొందవలయును. లేనిచో ఈఅర్థము రాదు. అందుకే కవి అన్యథా చింతితం కార్యే మన్నచోట-దైవ మన్యత్ర చింతయేత్'

అనినాడు. పద్యార్థవిషయములోను ఇది తగును (ఈపద్ధతిలోనే-౯౩,౯౪ నెంబరు పద్యాలు గలవు)

ముఖమును చంద్రబింబ సదృశముగా చెప్పుట ప్రసిద్ధమైన విషయమే. ఇట్టి దీనిని భంగాభంగశ్లేషలో కవి చమత్కరించెను.

ఘనచంద్రబింబసామ్యం
బని మోమును జెప్ప కైశికాంగ మధరముల్
ఘన, చంద్ర, బింబ, సామ్యం
బెనసెం గద యిట్టిచిత్ర మెందును గలదే ! (౨-౧౦౦)

దీనిలోని-ఘనచంద్రబింబమును, ఘన, చంద్ర, బింబ, అని విడదీసుకొని వీనికి వరుసగా-ఘన-కైశిక, అంగ-అధర-బింబ, విశేషణములను వేసుకొనవలయును అప్పుడు ఘనచంద్రబింబము, కైశికాంగ మధరములకు సరిపడును. అందుకే కవి 'ఇట్టి చిత్ర మెందును గలదే'-అని పాఠకునకు పద్యమందలి శబ్దచిత్రము'ను తెలివిడిచేయుచున్నాడు

ఇట్టి ముఖమును-చంద్రు డనినచో రాత్రిమాత్రమే ప్రకాశము నీరజమనినచో దివాభాగముననే కాంతి. అందుకే ఈరెండును కుదరవు ఎల్లప్పుడు కాంతిమంతమగు నీముఖమును ఉభయమధ్యముగా అనగా అబ్రముగా చెప్పుట మంచిదట (౨-౧౦౧)

తన నామసాదృశ్యమున్న శశిరేఖ చంద్రుని గ్రహింపక అచటి ముత్యాలను గ్రహించినదట ఎందుకు?చంద్రుడు 'జడమతి', 'కళంకుడు'గదా!స్నేహమున కిట్టివారు తగరు(౨-౧౦౫)

భంగాభంగశ్లేషలో వర్ణచమత్కారమును జూపి ప్రౌఢోక్తులు పచరించిన పద్యము లీసందర్భమున మరికొన్నిగలవు.విస్తృతి యగునని వివరింపక సంఖ్యల నొసంగుచున్నాను గమనించగలరు.౨-౧౦౮,౧౩౦,౨౨౧,౨౨౫, ౨౨౮.

సంఖ్యల కూడికతో శశిరేఖ ముఖమును వర్ణించినాడు ఆపద్యము

బాలిక కాపితామహుడు ఫాలతలంబున నొంటుబెట్టియున్
మేలగు కర్ణయుగ్మ మెలమి న్నపికంబుల వ్రాసి భ్రూయుగం
బోలి గసంబడం బదునొకం డిట ముప్పదిగా గణింపఁగా
నానలిమోము నిండునెల యామిని పస్లిసేయు టబ్రమే (౨-౯౮)

ఈమె ముఖము 'నిండునెల'వలె నుండుటకు ఇతర అవయవముల 'కూడిక' కారణమట ఆకూడిక ఇది-

ఫాలతలము- ౧ (ఈఅంకెలరూపము ఆయా అవ
కర్ణయుగ్మము- ౯,౯ యవాలకువిశేషింతురు)
భ్రూయుగము- ౧౧

౧+౯+౯+౧౧=౩౦ కూడిక వచ్చును,నిండునెలకు 30 దినములు గదా!నిండునెల యనిన అమావాస్య యగును తగదు ఇది విశేషణచమత్కృతి, నిండు-నెల = సంపూర్ణచంద్రుడు అనిభావన చేసికోవలెను

చంద్రోదయవర్ణన మనిన కవులకు మిక్కిలి ప్రీతి వారికవితానైపుణ్యము నందు చూపి సంతృప్తి నందుదురు ఎఱ్ఱన-శ్రీనాథ-పోతనలు-ఈవర్ణనమున పరాకాష్ఠత నందినారు ఈకవియు సమయముచూచి చంద్రవర్ణన చేసెను (౨-౧౦౫ నుండి ౧౧౧వరకు ఇందులో ఒకపెద్దవచనమ గలదు) ఆసందర్భములోని దొాక చమత్కారపద్యము—

సరసమై వసుగంధప్రసక్తి బూని
శతభిషక్క్రియ మొాచు సత్సంగతిఁ దగి
వివిధరుజ్మండలి హరించి కువలయప్ర
మోదము నొసంగె పూర్ణచంద్రోదయంబు-(౨-౧౦౯)

అని దీనిలో 'పూర్ణచంద్రోదయము' గలదు చంద్రపరమైన యర్థము వాచ్యార్థమున సులభము. కాని అట్లు కాక,'పూర్ణచంద్రోదయము' అనున దొాక ఔషధము దాని రీతి దీనిలో నిట్లు గలదు.స-రసమై రసమనగా పాదరసము,

వసు-బంగారము, గంధ-సుగంధద్రవ్యములు, శతభిషక్క్రియ - నూరు వైద్య (మూలికల) పద్ధతులు రీతులు, వివిధరుక్ మండలి-అనేకరోగసమూహములు, కు-వలయ భూలోకము,-అనగా-పూర్ణచంద్రోదయమను ఔషధము పాదరసము బంగారు సుగంధద్రవ్యములు చేరి నూరువిధములుగా పుటపాకాదు లొనర్పబడినది అది అనేకరోగములు హరింపచేసి భూలోకమున సంతోషమును ఆరోగ్యమును చేకూర్చునది ఇది దీనిలోగల వ్యంగ్యార్థము కవికి వైద్యము, వైద్యపద్ధతులు తెలియుననుట కీపద్యమేగాక, ౩-౧౩౪ సైతము గలదు.

సుభద్రాభిమన్యు లడవిలో వెళ్లుచుండగా సుభద్ర మార్గాయాసము వర్ణింపబడినది (౪-౧౪౬ నుండి ౧౬౭ వరకు) ఆమె నడచి వెళ్లనప్పుడు-

ఎండకన్నును నీడక న్నెఱుఁగకుండ
పాదముల ముద్దరా లొత్తఁ బఱఁగుసతికి
ఎండకన్నును నీడక న్నేకమగుచుఁ
బాదముల ముద్దఱా లొత్త పథిగమించె (౪-౧౫౦)

అనినాడు పద్యమందలి పూర్వభాగముసుభద్రరాణివాసమునందలి సుఖము, ఉత్తరార్ధము అడవిలోని బాధ గలదు అంతఃపురములో ముద్దరాలు = స్త్రీ, చేసిన సపర్యవలన ఆమె అసూర్యంపశ్య యైనది

అడవిలో ముద్దఱాలు = ముద్దలుగా నున్నశిలలు, ఒత్తుకొనుచుండగా - బాధతో నడచుచున్నది రేఫ-శకటరేఫలమార్పుతో ఈభావము స్ఫురించును

పెండ్లికూతురును వివిధాలంకారములతో అలంకరించుట ఒక సరదా సంప్రదాయము ఈకవిగారు మాత్రము శశిరేఖకు ఎన్నో ఆభరణా లుంచినారు. ఇవన్నీ తననా డున్నాయేమో ! అందుకే పుక్కవదీర కావ్యములోని కన్యకకు కూర్చి సంతోషించినాడు అవి-

పాపెట బిందియల్, పసిడిపావడ లందియలు న్మెఱుంగు ని
ద్ధాపవడంబు చౌకట్లుఁ బండెకడెంబులు బాజుబందు లు

ద్దీపితతారహారములు తేఁటగుకమ్మలు బావిలీలు మి
న్నాపనిమేల్పులాకి రతనంబుల జేసరి దీర్చి రెంతయున్ (౫-౪౭)

నేడు వీటిలో ఏకొన్నిమాత్రమైనను మారుమూలపల్లెటూళ్ళయం దున్న వేమో! ఆక్కడ లేకున్నను అంగడివంటి ఈపద్యముగలదు దీనితో బాటు ౬-౧౪౩-

శశిరేఖను పెండ్లికూతును (అసలుపెండ్లికి) చేసినప్పుడు చెలికత్తెలు తనివిదీర అలంకరించి-ఇట్లనుకొనుచున్నారు-

ఈపద్మలోచన హితమెఱింగి యొసంగు
కలికిరో యుదయరాగంపుచీర
యీమానినీరత్న మామోద మౌనట్లు
హేమభూషణములు నిడవె తరుణి

యీసైకతశ్రోణి కిష్టమైయున్నట్టి
గురుహంసతతు లొసంగుమి శుభాంగి
యీకల్వపూరెమ్మ కిచ్చజెందిన చంద్ర
కావి యొసంగుమో కమలనయన

గ్రందుముత్యాలపందిరిక్రింద నిందు
మానినీమణి నీలతకూన నునిచి
చిలుకపిలుకలు బింబోష్ఠిఁ జేరకుండ
కావలిగనుండు సాంకవగంధి నీవు (౬-౧౩౭)

ఈపద్యమునందు శశిరేఖకు విశేషణములు అలంకారవస్తువులు ఇట్లుగలవు, పద్మలోచన-ఉదయరాగపుచీర.

మానినీరత్నము-హేమభూషణములు
సైకతశ్రోణి-గురుహంసతతి
కల్వపూరెమ్మ-చంద్రకావి

ఇట్టి ఇందుమానినీమణిని ముత్యాలపందిరిక్రింద నుంచి-బింబోష్ఠి యని చిలుకలు చేరరాకుండ చూడవలసినదని అనుకొనుచున్నారు. పద్యమునం దీవిధ ముగానే గాక-అంతరార్థము వేరుగా గలదు. విశేషణములకు- అలంకారములకు సామీప్యము సార్థకముగా నుండునట్లు-

పద్మ-ఉదయ, ఉదయకాలము పద్మవికసనమునకు.
రత్నము-హేమము, బంగారములో పొదిగినగాని రత్నానికి విలువ.
సైకతము-హంస, హంస సికతాతలమున విహరించును
కల్వ-చంద్ర, చంద్రుడురాగానే కలువ వికసించును
ముత్యాలు-మణులు, ఆభరణయోగ్యములు.

చిలుక—బింబము, అధరము బింబసమము కావున శుకబాధ పైవిధముగా-ఆలోచించి అర్థసమన్వయము చేసికోవలయును ఇదియొకవిధమైన పదచమత్కృతి,

స్థాలీపులాకన్యాయముగా వీనిని చూపినాను. ప్రతిపద్యమునం దొకవిశేషము, చమత్కృతి, అలంకారము-కలవు రసజ్ఞులైన పాఠకులు వానిని చవిచూతురని భావన.

కవియొక్క బహుముఖప్రజ్ఞ - లోకశాస్త్రకావ్యాద్యవేక్షణత్వము వీనిలో వ్యక్తమగుచున్నది వివిధవిషయముల సూక్ష్మేక్షికతో దర్శించి వర్ణించినా దనుటకు-మరికొన్ని యుదాహరణములు, (పద్యసంఖ్యల నిచ్చుచున్నాను) ౨-౧౫౩, గంటముప్రాత, కరణము, ౬-౧౭ లగ్నము శ్లేష, ౬-౩౭,౩౮, శుభలేఖ, ౬-౫౮ కావ్యములోని రసములు-ఆటలు-౧-౧౦౬,౧౦౧,౧౨౦, అభిమన్యుని విద్యలు ౨-౫౩,౫౪,౬౯. కావ్యనామములు ౨-౧౦౯, దేవాంగనలు. ౨-౧౨౭, ఉర్ధ్వాపదాలు ౨-౨౦౮, ౪-౧౧౩, సంగీతము, ౨-౨౪౬,౬-౧౨౨, సిపాయిలు ౩-౪, మందులు, వైద్యము. ౩-౧౩౪,౧౩౫, దోహదక్రియలు ౩-౪౬, ఇక, ద్వారకావర్ణన, ఋతు, సూర్య, చంద్ర, మన్మథ, యుద్ధ మొదలగు వర్ణనలు, శృంగారవర్ణనలు సరే సరి, ౩-౬ లోని దోహదక్రియలు. 'అశోకా శ్చరణా హత్యా-' శ్లోకానికి

అనువాదము నిరంకుశోపాఖ్యానమునందు-మన్మథుడు 'తురక'యైనాడు పెద్దన చంద్రుని-గోవధము సేయు తురకలదైవ మనినాడు ఈకవి, మన్మథుని-'ప్రబల కందర్పబహదురీపాదుషాహి-' అని తురకలలో చేర్చినాడు

మరియొక ముఖ్యవిషయ మేమనగా-కవి ఆయా సన్నివేశములకు దగినట్లు రసపోషణ చేసినాడు ఎచటెచ్చట ఏయేరసము గలదో వివరించుటకన్న-ఈవిష యమున కవిరాసినపద్యము నుదాహరించుచున్నాను

'చెలి నెత్తుకొనిపోయి చెలిరూపు తాసయ్యె
నన్న విస్మయరసం బావహించె
నాలక్ష్మణుండు దిగంబరుండై పాటె
ననిన హాస్యరసంబు ననుకరించె
రౌద్రజంతువులు కౌరవుల ద్రేల్చె నటన్న
సరణి భీభత్సరసంబు వొడమె
తమకు కర్ణుండు నిందలు వచించె నటన్న
వెలుచ వీరరసంబు బిక్కటిల్లెఁ

చదకు రాముడు కన్నీ నిత్తునని బల్కె
నన్న శాంతరసంబుమై చెన్ను మిగిలెఁ
బెండ్లికి సుభద్ర నినుజూడ ప్రేమగొరె
ననిన శృంగారరసమంత కంత జెలఁగె' (౬-౫౮)

అనువాదములు.- ఈప్రకారముగా అనేకములైన రసములు వర్ణన లీరచనయం దుండి కొన్ని పద్యములు ప్రసిద్ధములగు శ్లోకములకు అనువాదప్రాయ ములుగా గలవు

'జగతిని కిన్నియల్ వధుని చక్కదనంబె గణింతురు- '(౪-౪౬)
ఈ పద్యము

'కన్యా వరయతే రూపం
మాతా విత్తం పితా శ్రుతం

బాంధవాః కుల మిచ్ఛంతి

మృష్టాన్న మితరే జనాః-' అనే శ్లోకమున కనువాదము, ౫-౫౦
స్వప్నలబ్ధములైన సౌఖ్యసంపద లట్లు

లిఖియించు జలముపై లిపులమాడ్కి-' ఈ పద్యముకూడా అనువదింపబడినదానివలెనే గలదు (నాకా శ్లోకము స్ఫురణకు రాలేదు )

కవి విశిష్టాద్వైతి కావున-సమయానుగుణంగా విష్ణుపారమ్యమును ప్రవచించినాడు అర్జునుని తీర్థయాత్రల పురస్కరించుకొని అతనిని విష్ణుక్షేత్రములలో సంచరింపజేసెను ౧-౨౦౨-౨౦౮, 'సర్వం విష్ణుమయం జగత్' అనుదానిని 'మనుపులు పురుషోత్తమఖ్యాతి దీపింప-' (౧-౧౩౬)అను పద్యమునే వివరించెను అటనట ఇట్టివి గలవు తనకవిత 'గూఢశ్లేషాశ్లేషశ్లాఘనీయ'మనివాడు (౧-౧౧) అందుకు తగినవిధముగా గ్రంథమునందు పద్యములు గలవు (వీనిలో కొన్ని వివరించ నైనవి)

*చిత్రకవిత* - సంస్కృతమునుండి తెలుగువారు గ్రహించిన కవితాప్రక్రియలలో నొకటి ఈ 'చిత్రకవిత'. ఇది-ఆశు - మధుర - చిత్ర-విస్తరములని ప్రచార మందినది వీనినే చతుర్విధకవిత లందురు తెనుగుకవు లీప్రక్రియలను కొద్దికొద్దిగా ప్రారంభించి యనంతరము పరాకాష్ఠదశకు చేర్చినారు ప్రత్యేకముగా ఏ పద్ధతిలో గ్రంథములుకూడా రచింపబడుట ఇందుకొక తార్కాణము నన్నయశ్రీనాథులు వీనిని పేర్కొనినను, నన్నెచోడ, భైరవాదులు తమ రచనలో చిత్రకవిత(లో చేరిన బంధకవిత్వమును) చెప్పినారు[1] వీని నిందు వివరించుటలేదు.

---

1. *చిత్రబంధ కవితలగూర్చి ప్రబంధరాజు వేంకటేశ్వరవిజయవిలాసము పీఠిక, సం. వేదం వేంకటరాయశాస్త్రిగారు, ముద్రణ. 1977. ఆం ప్ర సా. ఎకాడమీ, తెలుగుభాషలో ఛందోరీతులు- రావూరి దొరస్వామి శర్మగారు 379 పుట. మరియు శ్రీరంగమహత్త్వము భైరవకవి, (పుట CXVII-C X X పీఠిక) సంపాదకుడు - ప్రస్తుత గ్రంథపరిష్కర్త, ముద్రణ : 1979. ఆం ప్ర. సా. ఎకాడమీ.*

తెలుగువారికి మొట్టమొదటి దశరథరాజనందనచరిత్రమను, నిరోష్ఠ్య రచన నందించిన కవి మరింగంటి సింగరాచార్యులవారు [1] (నిరోష్ఠ్యరచనకూడా చిత్రకవితాశాఖాంతర్గతముగదా) ఈవంశకవులు తమపూర్వుడైన సింగరాచార్యుల వారిని ఆదర్శముగా గొని తమ తమ రచనలలో చిత్రకవిత(కవిత్వబంధములు) చెప్పినారు నేటికి అముద్రితాలుగా నున్న మరింగంటి వారిబహురచనలలో శ్రీకృష్ణ శతానందీయము, శల్వాపిళ్ళరాయచరిత్రము గలవు వానియందు చక్ర,నాగ,పుష్ప గోమూత్రికాబంధము లున్నవి

వీరందరిని చూచి కావచ్చు తాలాంకనందినీపరిణయకర్త కొన్ని బంధముల చెప్పినాడు ఇవియే గాక సోష్ఠ్యత్ర్యక్షర,సోష్ఠ్యనిరోష్ఠ్య,నిరోష్ఠ్యపద్యములను కూడా రచించెను ఈగ్రంథమున-

౧ -౩౨౧ పతాకబంధము,

౧ -౩౨౨ ఖడ్గబంధము

౨ -౨౯౩ నాగబంధము

౫ -౩౩౦ సుమగుచ్ఛబంధములు గలవు

౧ -౩౨౪ నిరోష్ఠ్యపద్యము

౩ -౧౬౫ సోష్ఠ్యనిరోష్ఠ్యము

౪ -౩౫౨ సోష్ఠ్యత్ర్యక్షరకందములు గలవు

వీనియందు ఖడ్గనాగసుమగుచ్ఛబంధములు ప్రసిద్ధమైనవి పతాక బంధము మాత్రము ఈకవిచిత్రకవితావైదగ్ధ్యమునకు పతాక యనవచ్చును దీనికి లక్షణ మెచ్చట లభించినదో నాపరిశీలనలో ఈబంధమునుగూర్చి ఎచ్చటను సమాచారము లభింపలేదు ధర్మసూరి సాహిత్యరత్నాకరమునందు గలదేమో అనిఅనుమానము [2] దీనివిషయమై మిత్రులు సుప్రసిద్ధపరిశోధకులు

---

1. దశరథరాజనందనచరిత్రపీఠికలో నిరోష్ఠ్యరచనాసంప్రదాయము,రచనలు గూర్చి వివరింపబడినది.

2. నావద్ద ఉస్మానియావిశ్వవిద్యాలయ సంస్కృతఅకాడమీ వారు ప్రచురించిన 'సాహిత్యరత్నాకరము గలదు. అది 1-5తరంగాలవరకే ముద్రితము.

శ్రీరావూరి దొరసామిశర్మగారికి(మదరాసు)వ్రాయగా సహజముగా వారికిగల చిత్ర కవితాభిమానముతో పరిశోధించి 'మీలేఖ నన్నెన్నో గ్రంథములఁ జదివించినది' అని వ్రాయుచు పతాకబంధలక్షణము లక్ష్యము చిత్రము(మాదిరి)లను తెల్పినారు వారికికృతజ్ఞతల తెల్పుచు లక్ష్యలక్షణముల నిచ్చుచున్నాను

మండపాకవారి *ప్రబంధసంబంధనిబంధన గ్రంథమున* ఈ పతాక బంధవిషయ మిట్లు గలదట-

'స్తంభాకారమునందుఁ బ్రాక్చరణముం దత్రత్య వర్ణంబు లా
రంభం బంతము నౌసటుల్ ధ్వజపటాగ్రం బట్ల యౌనట్లు త
చ్ఛృం భత్పార్శ్వములందు మధ్యపదముల్ శ్లోకాంత మాద్యంఘ్రికా
గంభీరాశయు లిట్లొనర్తురు పతాకాబంధ మందంబుగాన్

ఇది లక్షణము, దీనికి లక్ష్యము—

రాకరాకత్రిరాకారా
రాజతాగగతాజరా
రాగాసారరసాగారా
రాకారాత్రికరాకరా।

ఈశ్లోకము నాలుగుచరణాలు- అనులోమవిలోమములుగా గలవు. ప్రథమ పాదమును విలోమముగా చదివిన చతుర్థపాదము కాగలదు మండపాకవారు లక్షణమును తెనుగులోను-లక్ష్యమును సంస్కృతములోను చెప్పినారు. దొర సామిగారు వేసి పంపిన పతాకములో ఈశ్లోకము సరిపడినది (అనులోమవిలోమ పద్ధతి-మరియు శ్లోకము గాబట్టి) కాని- ఇందలి పద్యము ఆపద్ధతిలో కుదురదు ఆపద్య మిది-

వేదపథప్రదర్శన। నవీనఘనద్యుతిదేహ। దేవదే
వా।దరసారధారణ।శుభప్రభవాభరణప్రదీప్త।దా
మోదర।వాదిభేదనదమోదయ। మానసచాసవాజరు
ద్రాదిమభావ। భావితపదాంబుజ।తాపసబృందమోదదా।

దీనిలో కొన్ని అక్షరములు మాత్రమే పునరావృత్తమగును అవి-ద,న, దే,ర,భ,చ,వా,భా, మోదదా-అనునవి, శర్మగారు వేసిన బొమ్మను ఆధారముగా గ్రహించి-కొంత సౌందర్యముగా నుండవలెనని పతాకమును నేను పద్ధతిలో

చిత్రించినాను (ప్రథమాశ్వాసము చివరలో చూడగలరు) విజ్ఞు లెవరైనను-ఈ బంధమునుగూర్చి మరికొంత సమాచారమును దెల్పిన కృతజ్ఞతతో గ్రహింతును.

ఇక-పద్యవిషయము - మూడుప్రతులలోను ఈ పద్యము ఇట్లే గలదు యథాతథముగా బంధమున వేసినచో కుదురలేదు దీనిని కొద్దిగా మార్చినాను

వేదపథ బదులు- వేదపద
వాదిభేదన ,, వాదఖేదన
బృందమోదనా ,, బృందమోదదా-ఇది నేను చేసిన మార్పు.

దీనివలన అర్థభంగము కాలేదు (వేదపథ-పద మాత్రము కొద్దిగా అర్థభేదమగును) ఇప్పుడు బంధము కుదిరినది బంధమువద్ద సవరించిన పాఠములతో పద్యము నొసంగినాను నేను సవరించిన అక్షరాలు బంధమందు పునరావృత్తము లగుట గమనించగలరు

మిగిలిన ఆయాబంధములందు పద్యములు యథాతథముగా కుదిరినవి, ఇవి సుప్రసిద్ధములై-ప్రచారమందిన బంధములు కావున వివరించలేదు

ఇక - ఈ గ్రంథమునందు ఆయా సందర్భములకు తగినట్లు గల అలంకారములు, సామెతలు జాతీయముల తెల్పుదును

## అలంకారదర్శిని

ఈ గ్రంథమునందు అనేకాలంకారములు గలవు. వాని నిచ్చట చూపుచున్నాను కవికిగల అలంకారప్రియత్వము వీనిద్వారా వ్యక్తమగును. 'అలంకారప్రియో విష్ణుః' గదా!

(ఇందలి సంఖ్యలు ఆయాఆశ్వాసాలలోని పద్యసంఖ్యలు, వచనములు కొద్దిగా నున్నను అవి ఎక్కువభాగము విరోధాభాసశ్లేషానుప్రాణితములుగా గలవు ఇందా వచనముల చేర్చలేదు).

ఉపమ-I ఆశ్వా-౩౬, ౩౭, ౪౭, ౫౧, ౫౪, ౬౫, ౭౦, ౧౧౮, ౧౨౪, ౧౪౬-౧౪౮, ౧౬౯, ౧౭౭, ౨౧౮, ౨౪౬, ౨౬౫.

II ఆశ్వా- ౧౧, ౧౨, ౨౨, ౨౩, ౨౫, ౨౬, ౩౪, ౪౦, ౫౧, ౫౭, ౫౮, ౬౨, ౬౩, ౬౬, ౭౦, ౭౩ ౭౪ ౭౯, ౮౦, ౮౧, ౮౯—౯౩, ౯౮, ౧౦౬, ౧౨౯, ౧౩౩, ౧౪౯, ౧౫౧, ౧౫౨, ౧౫౫, ౧౫౭ ౧౫౮, ౧౭౩, ౧౭౪, ౨౦౧, ౨౧౧, ౨౨౫, ౨౩౩, ౨౪౩, ౨౪౫, ౨౪౮, ౨౫౦, ౨౫౧, ౨౫౫, ౨౫౭

III ఆశ్వా- ౮, ౨౫, ౩౯, ౫౧, ౬౩, ౮౯, ౧౦౪, ౧౦౫, ౧౬౭, ౧౭౧, ౧౯౬

IV ఆశ్వా- ౧౪, ౧౬, ౨౮, ౮౮, ౧౨౪, ౧౩౭, ౧౪౮, ౧౯౫, ౨౫౦, ౨౬౦, ౨౬౧, ౨౬౬, ౨౮౭

V ఆశ్వా- ౫, ౧౯, ౨౪, ౫౦, ౮౦, ౮౨, ౯౦, ౯౧, ౧౨౧, ౧౨౨, ౧౫౧, ౧౩౭, ౧౪౮, ౧౮౦, ౨౦౨, ౨౬౨, ౨౭౮, ౩౧౫, ౭౨౫, ౩౨౬.

VI ఆశ్వా- ౭౪, ౧౦౨, ౧౦౩, ౧౦౬, ౧౦౮, ౧౨౨, ౧౨౩, ౧౨౪, ౧౨౯, ౧౩౦, ౧౩౧, ౧౩౪, ౧౩౫, ౧౪౧, ౧౪౫, ౧౬౨, ౧౬౫, ౧౬౯, ౧౯౭, ౧౯౯, ౨౦౨, ౨౧౪, ౨౧౬, ౨౨౭

అనన్వయము-I ౧౨౨, ౧౫౫ IV ౧౧

ప్రతీపము-II ౨౩౭, ౨౩౫, IV ౪౯

రూపకము-I ౨౮, ౪౨, ౪౬, ౪౨, ౫౫, ౭౧, ౮౦, ౮౧

II ౧౬, ౬౦, ౬౧, ౯౯, ౧౦౩, ౧౦౪, ౧౫౬, ౧౭౭, ౨౪౨

III ౫౯, ౬౩, IV ౨౨౭ V ౩౭, ౨౦౭ VI ౧౨౭, ౧౪౬, ౧౫౧, ౨౨౦

పరిణామము-I ౬౦, ౧౪౪ III ౯, IV ౩౩౪

ఉల్లేఖము- I ౫౦, ౧౩౫, ౧౫౨, ౧౭౮, ౧౯౯, ౨౬౩, ౨౬౮,
II ౧౭౯, ౧౮౯

III ౫౮, ౬౦, ౯౮, ౧౦౧, ౧౦౬

స్మృతి-II ౧౪౮, ౨౧౧

భ్రాంతి- I ౧౧౧, III ౨౦, ౫౦, ౬౫, ౬౬, ౬౭, ౭౦ IV ౧౭౭ V ౧౭౦, ౧౭౧, VI ౧౪౫

సందేహము-I ౨౧౨, II ౪౪, ౮౭, ౧౦౧, ౧౦౨, ౧౬౨, ౧౭౫, ౨౨౪, ౨౨౯, ౨౩౧, ౨౪౨ IV ౨౦౯, V ౧౩౨, ౧౪౩

అపహ్నుతి-III ౪౪, ౩౫, ౧౩౭, ౧౬౨.

ఉత్ప్రేక్ష- I ౭౬, ౭౮, ౭౯, ౮౨, ౮౩, ౮౪, ౮౫, ౮౬, ౯౪, ౧౦౩, ౧౧౫, ౧౧౬, ౧౧౭, ౧౨౮, II ౧౭, ౩౪, ౨౫, ౭౩, ౭౪, ౮౨, ౧౫౩, ౧౫౪, ౧౫౨, ౧౭౬, ౧౮౮ ౨౪౬, ౨౬౦ III ౫౨, ౭౩, ౯౨, ౯౫, ౯౭, ౯౯, IV ౧౦౭.

అతిశయోక్తి-I ౯౫, ౯౬, ౧౪౭, ౧౫౦, ౧౫౩, ౧౫౪, ౧౬౪, ౧౭౪, ౨౧౧, ౨౪౦, II ౬౮, ౭౧, ౭౭, ౮౩, ౧౧౮, ౧౩౨, ౨౦౮, ౨౧౯, ౨౨౩, ౨౬౮, ౨౭౫, III ౩౨, ౧౨౪, ౧౩౨, ౧౪౯, IV ౨౯, ౨౩౨, V ౧౩౬

తుల్యయోగిత-I ౧౬౯, VI ౨౦౯, ౧౩౨

దీపకము-V ౨౩౨

దృష్టాంతము-V ౧౨౮,

నిదర్శనము-II ౨౬౬, ౨౭౪, III ౮౨
సహోక్తి-I ౧౭౬, II ౬౮, III ౮౦, ౧౧౦, VI ౧౮౯,
సమాసోక్తి-I ౨౯౮, II ౨౧, ౧౭౦, ౨౦౩, ౨౦', ౨౦౬, ౨౦౭,
౨౪౭, ౨౪౮, ౨౫౮, ౨౬౧, III ౮౪, ౧౭౨, VI
౨౧౦, ౨౨౩
పరికరము-III ౯౫, ౧౩౫, ౧౪౫, ౧౫౬, V ౪౮,
పరికరాంకురము-౯౧, ౧౩౮,
శ్లేష-I ౨౬, III ౧౦౩, ౧౦౮, ౧౪౪
పర్యాయోక్తి-I ౪౩, ౨౨౮, VI ౧౯౫, ౨౧౧
వ్యాజనింద-I ౧౦౦ III ౧౨౦
విరోధాభాస-I ౧౨౨, ౧౩౦, II ౧౯౫, IV ౧౫౦, ౧౫౨ VI ౧౦౪
అసంభవము-IV ౨౮౧, V ౧౪౧, ౨౭౨
అసంగతి-II ౧౭౯, III ౧౫౮, ౧౬౮
విషమము-I ౨౩౦, II ౨౩౨, III ౧౩, ౧౯, ౧౫౩, IV ౧౬౬
అధికము-II ౯౫.
అన్యోన్యము-VI ౧౬౩
ఏకావళి-IV IV ౨౦౧,
యథాసంఖ్యము-I ౧౩౭, II ౮౪, ౨౨౨, ౨౨౫, ౨౨౯, III ౪౩
పరిసంఖ్యము-I ౧౨౬
సముచ్చయము-I ౧౭౮, II ౭౫, ౧౧౬, ౧౪౬, ౨౭౧, ౨౭౨ IV ౬౬,
౧౬౫, ౧౭౪, ౨౨౧, ౨౨౪, ౨౩౮, V ౧౯౦
కారకదీపకము-V ౨౩౪
ప్రత్యనీకము-II ౮౪

4)

కావ్యలింగము-I I ౭౮, ౭౯, ౧౧౦, ౧౨౭, II ౬౪, ౭౬, ౯౬, ౧౦౫, ౧౦౬, ౧౯౯, ౨౨౦, ౨౨౬, ౨౨౭, ౨౩౦, III ౩౦, ౧౪౧, ౧౫౨, V ౩౨౪

అర్థాంతరన్యాసము II ౨౦, III ౬౯, ౯౧, IV ౧౨౯, ౧౭౩

ప్రౌఢోక్తి-I ౨౫౮, II ౧౬౨ III ౧౪౧, ౧౫౪

ముద్ర-II ౧౦౯, ౧౨౭

రత్నావళి-II ౯౦, VI ౧౭, ౫౮

తద్గుణము-VI ౧౩౬

అనుగుణము-II ౧౨౬, IV ౩౩౮

ఉన్మీలితము-III ౪౪, ౪౫,

వ్యాజోక్తి-I ౯౧,

గూఢోక్తి-II ౭౮,

వివృతోక్తి-II ౧౩౦,

లోకోక్తి-II ౪౭, ౪౮, ౪౯, ౮౮, III ౮౮, ౧౪౯, ౧౫౬ ౧౬౦, IV ౨౦౩, ౨౧౩, V ౩౨౭

వక్రోక్తి-I౯౦, ౯౬, ౧౦౦, ౧౦౫,

స్వభావోక్తి I ౧౩౦, ౧౭౩, ౨౨౫, ౨౫౬, ౨౬౬, ౨౬౮ II ౧౨, ౧౩, ౧౯, ౨౭ ౨౮, ౬౩, ౨౦౦, ౨౦౨, III ౬, IV ౯౩, ౧౧౩, ౧౩౯, V ౩౮, ౪౩, ౧౨౪, ౧౪౬ ౧౫౫, ౧౫౬, ౩౨౩, VI ౫ ౧౦౯, ౧౨౦, ౧౨౧, ౧౫౯,

ఉదాత్తము-I ౩౮, ౫౬, ౭౭, ౧౦౯, ౧౨౨, ౧౩౨,౧౩౮, ౧౪౯, ౧౨౧, ౧౬౧, ౧౯౨, ౨౯౨, ౩౦౩, III ౨౬, ౪౮, ౧౨౧, ౧౬౮ IV ౬, ౮, ౧౩౦, ౧౯౯, ౨౧౬, V ౮౩, ౩౦౨, VI ౧౨, ౧౩, ౨౨౨,

నిరుక్తి-I ౫౭, ౧౦౬, ౧౩౬, ౨౦౧, II ౧౦౯, ౧౬౯, ౧౬౪,
౨౧౦, III ౩౪, ౪౦, ౪౨, ౫౫, ౬౮, ౭౧, ౧౩౪,
౧౫౫, ౧౫౮, IV ౨౭, ౨౦౦, VI ౨౧౨

విధి-II ౧౨౮

ఇవి యీ గ్రంథమునందలి యలంకారములు ఇక సామెతలు, జాతీయములు

సామెతలు-జాతీయములు-సామెతలు కావ్యకన్యకకు 'ఆమెత'వంటి వన వచ్చును సందర్భోచితముగా ప్రయోగింపబడినచో నివి కావ్యమునకు మరింత శోభను చేకూర్చును, వీనివలన పాఠకున కుత్సుకత కల్గును ఈకవి ఇట్టి సామెతలను జాతీయములను సంస్కృతలోకోక్తులను పద్యములలో చక్కగా నిమిడించి నాడు సందర్భోచితవివరణచేసిన విస్తృతియగునను భావనతో కొన్నిటిని జాబితాగా ఇచ్చుచున్నాను

౧-౨౩ నిమ్మకు నీర మెక్కుగతి

,,-౧౦౦ గుడపర్వతరీతి (దేవరకొండలో దేవర లేదు-బెల్లంకొండలో బెల్లం లేదు అని దేవరకొండవైపు వాడుక)

౨-౪౫ రోళ్ళురోకళ్లను పాడుట

౨-౪౭ యద్భావం తద్భవతి.

౨-౮౮ అన్యథా చింతితం కార్యం మన్నచోట దైవ మన్యత్ర చింతయేత్

౨-౨౬౬ అడవి గాసిన వెన్నెల

౩-౧౩ ములు వెడలిచి కొఱ్ఱెత్తికొను విధము

౩-౬౨ మేలుస చేరువార లోపికగాని యాపద గ్గలుగువేళల చెంతలకైన వత్తురే!

౩-౯౯ అప్పులందు బడిన యట్లు

౩-౧౧౬ శలగో శలగో యని

౩-౧౪౩ సర్వనాశాయ మాతుల

౩-౧౪౯ పాపీ చిరాయు

౪-౫౧ శుభస్య శీఘ్రమ్

౪-౧౨౩ సింగడు బుర్రదైన చందాన

౪-౨౧౩ ఈపద్యమునం దన్నియు సంస్కృతోక్తులు

౪-౩౨౬ వెన్నముద్దకు మునుకోరలువచ్చి దూలములు గంకునొకో !

౫-౪౬ కలిబోసినయుట్లవంక కనుగొననేలా !

౫-౧౨౨ గొంగడిలో దాళ్లువైచి గ్రుద్దిన గతి

౫-౧౪౦ కలమేన ప్రాణముండిన బలుసాకున్ మెసవియైన బ్రతికెద

౫-౧౪౩ పెద్దపెండ్లి చేసెదరేమో !

౫-౨౧౭ కొఱవిగొని నెత్తి గోకికొను

౫-౩౧౪ '-నూనియ నూవు లేకంబెకాని గాండ్లవా డొక్కరుడు తేరగాడు గాడె.

౬-౨౧౯ మగవారు స్వకార్యధురంధరుల్ గదా !

ఇవియేగాక-పద్యాలలో చేర్చిన లోకోక్తులు మరికొన్ని గలవు

*పదప్రయోగములు*-ఈగ్రంథమునందు ఉర్దూఫారసీపదాలు బహుళముగా ప్రయోగింపబడుటయేగాక సంస్కృతాంధ్రపదములను కవి-అతిస్వతంత్రముగా వాడినాడు వీనిలో కొన్ని విసంధులు మరికొన్ని అప్రసిద్ధప్రయోగము లున్నవి. పరిశీలింపగా కవి తననాటి సంఘమున నిత్యవ్యవహారములో నిలిచియున్న పదాలను యథాతథముగా ప్రయోగించినట్లు తోచుచున్నది. కొన్నిటిని సవరింప వీలున్నను-కవిస్వతంత్రతకు భంగకరమని నే నాపని చేయలేదు. వీనిలో నేటికీ తెలంగాణమునందు వాడుకలోనున్న మాండలికములు కొన్నియున్నవి. కేశవస్వామిశతకములోగూడా పైపద్ధతులకు చెందినపదములు గలవు, దానిప్రభావము ఇతనిరచనపై గలదనుటకు పదములేగాక-పద్యములును గలవు. (తాలాంక-' ౫-౨౦౦ కేశవస్వామిశతకమునకు పూర్తిగాఅనుకరణ)

జాబితా ఎడమవైపు గలపదాలు గ్రంథములోనివి కుడివైపున్నవి 'ఇట్లుండవలయును'-'ఈఅర్థమున ప్రయోగింపబడినవి' అనితెలియచేయుటకు నేనిచ్చినవి.

## ప్రథమాశ్వాసము

(పద్యసంఖ్య)

౧౨౧ ధీకొను = డిచ్చకొట్టు ('ఢీకొట్టు'రూపాంతరమని శ.ర.) (కవి యిచ్చట డిచ్చకొట్టుకొను ఆటను తెల్పెను)

౨౨౨ అచ్చుతు = అచ్యుతు, (కవి దీనిని వచ్చిప్రభానతీర్థ... అచ్చుతు' అని ప్రాసస్థానమున పెట్టినాడు)

౨౫౦ అరంగడె = అర గడియ, అరగడె

౨౬౪ ఉక్కబొట్టు = ఉక్కుబొట్టు, చుక్కబొట్టు (చిన్న పిల్లలకు పెట్టుబొట్టు)

## ద్వితీయాశ్వాసము

౧౪౪ వల్న = వలన

౨౦౪ జల్కము = జలకము (౫-౩వ లోను ఈపదము గలదు)

## తృతీయాశ్వాసము

౬౧ విచ్చలపీడి = విచ్చలవిడి

౧౨౫ విసవిత్తు = విసపువిత్తు

౧౫౫ పుట్నింట = పుట్టినింట ఇట్టిపదము ౪-౧౪౪లో గలదు. (అప్పప్పకవి దీనిని బాగా వాడినాడు. కేశవ స్వామి శతకమునను గలదు)

## చతుర్థాశ్వాసము

౭ వైతాళికుల్ = వైతాళికులు

౧౨ సుల్లభము = సులభము, సౌలభ్యము, మార్పునకు వీలు కాని విధముగా ఈ పదము గలదు)

౬౨,౧౭౫ కళ్వళము = కళవళము

౯౩ బొట్ప్రేలు = బొటనప్రేలు

౭౪ కోసంబోక = కోసుబోక, త్రోసువోక

౧౦౨ గరివించి = గర్వించి

౧౦౮ తల్లిదండ్రాదులు = తల్లితండ్రి మొదలైనవారు

౧౫౬ ద్వయితవనము = ద్వైతపనము (మార్పునకు వీలే లేదు)

౧౫౮ ఒచ్చోట = ఒకచోట

౧౬౯ వైసు = వయస్సు

౨౯౦ చీకట్లమయం = అంధకారమయం, నిండుచీకటి

౩౦౬ తల్పు = తలఁపు

౩౨౧ నాట్నుండి = నాటినుండి (౫-౧౮౩ లోను ఈపదమున్నది)

౩౩౫ కామోలు = కాబోలు

పంచమాశ్వాసము

౩౦ పైనము = పయనము (పైకము = పయికమువలె)

౩౫ విడిదిండ్లు = విడిదియిండ్లు

౬-౧౧౩ విడిదిండ్లు = విడిదియిండ్లు

౪౮ వెతావెత = వ్యథకు వికృతి, వెతవెతలు

౯౨ ఒండొర్లు = ఒండొరులు

౧౨౩ మదమేనుఁగు = మదపుటేనుఁగు

౧౩౯, ౧౬౩ మొఱోమొఱో = మొఱ్ఱో మొఱ్ఱో

౧౫౯ చెట్లాకుదుంపలు = చెట్ల ఆకులు దుంపలు

౧౬౦ వెనుదౌలు = వెనుదవులు, = వెనుదగులు

౧౮౧ దిగీభ = దిగిభ

౧౯౨ ద్వీపి = ద్వీపి = పెద్దపులి

౨౦౦ తండోపతండ = గుంపులు, గుంపులు

౨౨౨ బటానబయలు = బట్టబయలు

౨౨౪ కుశిగుంపులు = కుసిగుంపులు (బాధ శ్రమయని శ. ర.)

| | | |
|---|---|---|
| ౨౩౯ | భవిష్యతి | = భవిష్యత్, 'భవిష్య ద్దెలియన్' కావలె మార్చ లేము. |
| ౨౬౬ | చిట్లనచీకట్లు | = చిమ్మచీకటి |
| ౨౨౨ | ప్రతికారము | = ప్రతీకారము |
| ౨౮౦, ౩౦౮ | నివుగాక | = నీవుగాక |
| ౩౦౦ | పరుఁ దవ్వయుందవు | = పరుఁడ వవ్వయుందవు |

షష్ఠాశ్వాసము

| | | |
|---|---|---|
| ౩౦ | తండోపతండ | = తండలుతండలు, గుంపులుగుంపులుగా అని, |
| ౩౯, ౪౯ | ద్వారావతి | = ద్వారవతి |
| ౪౮ | ఉభయత్రలు | = ఉభయత్ర |
| ౧౦౯ | ఆడాడ | = అక్కడక్కడ |
| ౧౯౦ | నివు | = నీవు |
| ౨౦౦ | మర్వున | = మఱుఁగున |
| ౨౦౨ | తత్తలుమని | = తాళుతాళుమని. |

కవి ప్రయోగించిన పదములలో నివి కొన్ని మాత్రమే. వ్యావహారిక పదాలతో సంభాషణాత్మకమైన పద్యములను కూడా వ్రాసినాడు ఆనాడు నిత్య వ్యవహారములో గల పదములను కవి గ్రంథస్థము చేసినందు కభినందింప వచ్చును, ఈ శబ్దముల సాధ్వసాధుత్వములను నేను నిరూపించదలచ లేదు. వీని తర్వాత

*అనుకరణలు-పోలికలు :-*

ఈ రచనపై తత్పూర్వముగల రచనల ప్రభావము మిక్కుటముగా గల దనుటకు ఆయా పద్యముల భావ, అనుకరణములేగాక పోలికలును గలవు. పూర్వకవితాశైలిని అనుకరింపక తప్పించుకున్నకవులు తక్కువగాగలరు ఆయా కవుల శైలిపైగల అభిమానము అందలి చమత్కారము అనునవి అనుకరణకు దోహదకారులు. 'అనుకరణ ఒక కళ' గదా!

'తాలాంక-' కర్తకు అనేక ప్రబంధపరిచితి, కావ్యానుశీలన గలదు కావున-వాటిప్రభావమునుండి తప్పించుకొనజాలకపోయినాడు

ఈ సమాలోకనములో నాదృష్టికి తగిలిన పద్యములను ఇతరకవుల రచనలలోని పద్యములతో సామ్య మున్నటుల భావించి వాని నిచ్చుచున్నాను ('తా' తాలాంకనందినీపరిణయము, 'రామా'- రామాభ్యుదయము, 'శశి' అప్పప్పకవి శశిరేఖాపరిణయము-అని గ్రహించునది మిగిలినవారిపేర్లు సులభావగాహనములు.)

| | |
|---|---|
| అందు భవన్ముఖోదితమునై గనుపట్టు | తా-౧-౨౦ |
| ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని— | ఆంధ్ర మహాభారతము-ఆది |
| అనృతు లనాచారు | తా-౧-౧౨౪ |
| పరదార పరధనాహరణ | పాండురంగ-౪-౨౭౯ |
| శరజాతప్రభవుండు నేర్పు దలరన్ | తా-౧-౨౫౭ |
| నేరెటేటి యసల్దెచ్చి నీరజాప్తు | మను-౨-౩౬ |
| అకళంకబిరుదాంకసుకవీంద్రు లౌకవంక | తా-౧-౩౦౦ |
| ఒకచాయ ననపాయ పికగేయ | వసు-౨-౭ |
| ఆపురిటియింటి మణిమయ | తా-౨-౨౫ |
| ఆపురిటియింటి కుడ్యోద్దీపంబుసు | భాగ-౧౦-౧౧౪ |
| పెదవిరాగం బెంచి పెఱమాట | తా-౨-౭౩ |
| వాతెఱతొంటి కైవడి | ఆముక్త-౭ |
| మనసిజుఁడన్ పురోహితుడు మానిని | తా-౨-౨౯ |
| స్మరుఁడ న్విప్రుడు యవ్వనంబను తనూ | *బిల్హ-౨ఆశ్వా-౫౭ పుట. |
| గురుకుధరాభమైన | తా-౨-౮౦ |
| చెలి బలితంపు గబ్బివలి | బిల్హ-౨-౫౭ |
| మారుఁ డనేటి కర్షకుఁడు | తా-౨-౮౧ |

* బిల్హణీయము (బిల్హ) నకు ప్రక్కన వేసినది పుట సంఖ్య (1942 ముద్రణ)

| | |
|---|---|
| చెలిసింగారపుఁ బువ్వుదోట | బిల్హా-౨-౫౮ |
| వలిగుబ్బ లధికమో | తా-౨-౮౨ |
| చనుఁగవ బరువో | బిల్హా-౨-౫౮ |
| సకలసుమాళి వాసనల | తా-౨-౮౯ |
| నానాసూనవితాన | వసు-౨-౪౭ |
| అటువలె యౌవన | తా-౨-౧౧౧ |
| ఎక్కడినుండివచ్చెఁ దరశేక్షణకున్ | విజయ-౧-౧౦౪ |
| మొలకతేనియ | తా-౨-౧౧౫ |
| ముద్దాడవలదె యీమోహనాంగుని మోము | విజయ-౧-౭౧ |
| చిరమాకందచయ | తా ౨-౨౪౫ |
| వనభూకన్యక | తా-౨-౨౪౫ |
| తనకుం గౌఁగిలి | విజయ-౧-౧౩౯ |
| ధారాశుద్ధిఁ బ్రసిద్ధి గాంచి | రామా-౬-౧౩ |
| కుముదకుట్మలముల కొనలు | తా-౩-౯౦ |
| ఏవిహంగము గన్న నెలుగిచ్చుడును | మను-౩-౧౬ |
| గగనేభేంద్రము | తా-౩-౯౭ |
| తనువున నంధకారపు | పారి-౨-౩౨ |
| అహరంబుధిని ప్రదోషాగస్త్య | తా-౩-౯౮ |
| ప్రథమసంధ్యాంగనాఫాల | భీమే-౨-౪౯ |
| దినవారిరాశిమాపను మౌని | పారి౨-౩౪ |
| పెనుచీకటి మొగుళ్ళ | తా-౩-౧౦౧ |
| వితతచకోరికా వితతి దాహముదీఱ | తా ౩-౧౧౦ |
| ప్రిదిలి కైరవదళ శ్రేణి | మను ౩-౨౩ |
| కార్కొన్నకటికచీకటి | పారి-౨-౩౭ |
| బుధనుతుండగక్షీరనిధి | తా-౩-౧౫౧ |
| అవతంసంబవు పార్వతీపతికి | శృం.నై-౨-౧౨౯ |
| తమినిబద్మిని నిదురించి | రా ౩-౧౭౧ |

| | |
|---|---|
| కమ్మకస్తురిగుళికలు | పారి-౨-౬౪ |
| తనయునితో సుభద్ర | తా-౪-౧౪౯ |
| ఆకుమఱుంగు పిందెయయి | పాండు-౩-౮౨ |
| తామసం బెవరికి తగదంచు | తా-౨-౨౭౨ |
| మాధవాగ్రజుఁ డాడు మాటలు | పాడు-౩-౮౨ |
| సతతవంశానువర్తనోన్నత | తా-౪-౧౫౨ |
| కానకకన్న సంతానంబు | రామా-౫-౧౨ |
| శుక్రు డప్సరవధూ సంగీతసంస్తుతి | తా-౫-౬౮ |
| పడిచె నింద్రుఁడు కాహళులు మ్రోయ | వరాహ-౨-౮ |
| తాపత్రయాభీలదావాగ్ని జల్లారు | తా-౫-౩౦౨ |
| ఏనీగుణములు కర్ణేంద్రియంబులు | భాగ-౧౦-౧౭౦౧ |
| పంచాస్యభోగ్యవస్తువు | తా-౫-౩౦౫ |
| శ్రీయుతమూర్తి యోపురుషసింహమ | భాగ-౧౦-౧౭౦౧ |
| తెలతెలవాఱెఁ దారకల దీప్తులు | తా-౫-౩౨౩ |
| వెలవెలబాఱె చంద్రుడును | భీమేశ్వ-౨-౪౮ |
| నవఘర్మకణగణస్రవణకాశ్మీరాంగ | తా-౬-౨౨౧ |
| ముహురప్రయత్ననిర్ముక్తనీవీబంధ | తా-౬-౨౨౨ |
| సహసానఖంపచస్తనదత్త | మను-౩-౧౧౬ |

ప్రథమాశ్వాసమునందు విజయవిలాసమును సభాపర్వమును—ఆధారముగా గ్రహించి కథను తెల్పుటే గాక-వర్ణనలు విజయవిలాసమునే బాగుగా అనుకరించినట్లు చదువుచుండగనే మనకు తెలియును కావున వానిని తెల్పలేదు ౩-౧౬౮ కోడికూత వర్ణింపబడినది, తెలుగుకవు లెందరో దీనిని ప్రత్యేకముగా వర్ణించినారు వారిలో నందిమల్లయ, ఘంటసింగనలు, పెద్దన, తిమ్మన రాజమరాజభూషణులు ప్రసిద్ధులు, ఈ పద్యముల పోలికలను నేనిందులో చూపలేదు

*సంశయములు :—*

గ్రంథములోని కొన్ని విషయములు ఎట్లు సమన్వయపఱచుకొందమని నను కుదురుటలేమ. అందుకే ఈశీర్షికతో తెల్పుచున్నాను.

'ప్రమాదో ధీమతామపి'-ఒక్కొక్కసారి ఇది 'ధీమతామేవ' అనిపించును ఈకవి కొన్ని సందర్భాలలో ఎందుకో పొరపాటుపడినాడు ఔచిత్యభంగములు కావించినాడు, మహాప్రబంధనిర్మాత కొన్నివిషయములలో పొరపాటుపడ వచ్చును,కాని ముఖ్యములైనవానికే ఈగతి దాపురించుట బాధాకరము

౧ తాళపత్ర-లిఖితప్రతులలో ఆద్యంతములయందును, తాలాంకనందనీ పరిణయము ' అనిగలదు ఇది 'నందనీ' లేదా 'నందనా' కావలయునుగదా! నందినీ అనియే నేను మార్చినాను

౧-౧౧౦ పురవర్ణన సందర్భము, లలనలగీతములకు ముత్యాలుకరిగి కాల్వలలో ప్రవహించి చెఱకుగడలలోకి ఎక్కినవట ముత్యాలు భస్మమగును కాని కరుగునా ? ఇట్లెవరైనా వర్ణించిరా ? అనుమానము

౧-౧౨౧ విరోధాభాసశ్లేషలతో కూడిన పెద్దవచనము, దీనియందు అష్టదిక్పాలకులను చెప్పినాడు, కాని నిర్‌ృతి మాత్రము లేదు

౧-౨౭౭. రాజసూయధనాహరణార్థము ధర్మజానుజులు నలుదిక్కులకు పోవుదురు, ఆసందర్భములోని దీ పద్యము. దీనిలో క్రమభంగము గలదు సవరించినచో ప్రదక్షిణదోషము

౨-౨౫ శశిరేఖ యంగవర్ణన బాగున్నది పరిశీలింపగా-పద్యము లోని విషయములకు-చివరచెప్పిన వానికి(సమన్వయము)క్రమము కుదురుటలేదు

అభిమన్యుడు తల్లిని సుదతీమణీ ౪-౧౧౬. మిహికాకరాస్య. ౪-౧౬౩, సుమసుకుమారగాత్రి ౪-౧౬౪,సుకుమారి ౪-౧౭౫ అంభోజాతపత్రేక్షణా ౪-౩౪౧, అని సంబోధించుట ఎంతవరకు తగును (నన్నయగారు వినతను-'పయోరుహాననా'అని-వైనతేయునితో అనిపించినాడుగదా!)

తన తండ్రులను అభిమన్యుడు కౌంతేయులు'౪-౧౬౫ అనును పాండవు లందరు కౌంతేయులు కారుగదా! ఘటోత్కచుడు కృష్ణుని స్తుతించుచు 'చంద్రమయ చేల' ౫-౨౯౯, అని సంబోధించును కృష్ణుడు చంద్రమయచేలు డెట్లగును?

బలరాముడు శశిరేఖను-"కన్నులకల్కి రమ్మనుచు గౌఁగిటజేర్చి నిజాంకసీమయం దున్నతినుంచి'-నట్లు కవిగారివ్రాత, కన్నులకల్కి-అర్థము ? తరువాత ఈపద్యములోని ఔచిత్యము ఆలోచించవలసినవే.

౫-౧౭౦ ఘటోత్కచుని భీకరమాయాకృత్యములకు వెఱచిన విప్రులు పరుగెత్తిపోవుచు అప్పుడు 'అన్యసుందరులను స్వభార్యలే యనుచు దాపునకేగి పయంట లిగ్గుచు భయపడవద్దని చెప్పి వేరొకవాడలో గోడలచాటునకు తీసుక పోయినారట. ఈసందర్భంలో శృంగారం, అందున పూర్తి అనౌచిత్యభావన,ఏమీ బాగులేవు

ఇన్నిటిని మించి మరియొక ముఖ్యవిషయముగలదు అది శశిరేఖాభిమన్యుల వయస్సు

౨-౩౯ లో, శశిరేఖ ౫ సం, అభిమన్యుడు ౭ సం, వయస్సు గల వారని తెలిపినాడు

పాండవులు రాజ్యాన్నివదిలి అడవికి పోవునప్పుడు అభిమన్యుడు చిన్న వాడు తరువాత శశిరేఖాజననము, పాండవులవనవాసము చివర అనగా ౧౨ వ యేటి చివరలో వీరివివాహము జరిగినట్లు కవిగారి వ్రాత అప్పటికి శశిరేఖ. ౧౨, అభిమన్యుడు ౧౪ సంవత్సరాల వయస్సులో నుండియుందురు నాయికా నాయకుల వర్ణన, విరహము,శృంగారప్రలాపములు చూచినచో వీరు ప్రౌఢవయస్కులనిపించుదురు ఇందు కొకకారణము, సనాతనధర్మము బాల్యవివాహము జరిపినా కవిగారిశృంగారకావ్యలక్షణము ముందుకు పరుగెత్తించి ఈ వర్ణనలు చేయించినది

మరింతలోతుగా పరికించినచో కల్పితమైన ఈ కథవలెనే, అభిమన్యుని వయస్సుకూడా ఆంధ్రమహాభారతము నిర్ధారణగా చెప్పలేదు. సంస్కృత భారతము ఆది ౬ అధ్యాయము ౧౬ సంవత్సరాలు అభిమన్యునివయస్సు అని, తెల్పును యుద్ధమువరకు ౨౭ లేదా ౨౮ సం. వాడు. ఇతని ఆయుఃపరిమితి ౧౬ సం అనుకున్నచో వనవాసమునకు ముందు ఇతడు, రెండు సంవత్సరాల ఆరుమాసములవాడు

ఇక, ధనుర్వేదాభ్యాసము ఉపనయనానంతరమే గదా ' గర్భాదేకాదశే రాజ్ఞే' అనుప్రకారము ౧౧ యేట ఇతని ఉపనయము జరుగవలయును. అభిమన్యుడు సకలధనుర్విద్యాకోవిదుడైన తరువాతనే అర్జునుడు ఖాండవవన దహనము చేసినట్లు (ఆది-౮-౨-౨౭) తెలియుచున్నది

ఖాండవదహనము తర్వాత మయసభానిర్మాణమునకు ౧౪ మాసాలు, తర్వాత రాజసూయము, అరణ్యవాసము ౧౨ వత్సరాలు, అజ్ఞాత ౧ సంవత్సరము, యుద్ధము ఆరునెలలు-వీనన్నిటిని బట్టిచూచిన అభిమన్యుడు ౩౦-౩౧ సంవత్సరాలు కలిగియుండును దీనికి సంబంధించిన సంస్కృతభారతకథను అగ్రాహ్యమనో ప్రక్షిప్తమనో నన్నయగారు గ్రహింప లేదు[1] ఇది అభిమన్యుని వయస్సు

ఈ కవిగారు మాత్రము బాల్యములోనున్న వీరిని శృంగారలక్షణ బద్ధులచేసి వర్ణించినాడు దానివల్ల కొంత వ్యత్యయము ఏర్పడినదని నాభావన

౫-౧౦౬, ౬-౨౦ పద్యములలో బలరాముని 'సైనేయుడు' అభిప్రయోగించెను, ఇది శైనేయుడు కావలయును సాత్యకికి శైనేయనామమున్నట్లు సంస్కృతవాచస్పత్యమున గలది 'వైనతేయః' వలె సైనేయః, సిద్ధమగుటకు ఇతనితల్లి 'సేన' కావలయును ఈ పేరు ఎచ్చటనైనా గలదా ?

౧-౨౯౬. రాజసూయయాగమయిన తరువాత మయుడు సభాభవనమును తెచ్చియిచ్చినట్లు ఈకవిగారివ్రాత భారతపద్ధతి యిట్లు లేదు

బలరాముడు శశిరేఖను దుర్యోధనపుత్రున కీయదలచి వివాహప్రయత్నాలు చేయుచుండును. లగ్నము ఆరు రోజులు మాత్రమే వ్యవధిగా నుండగా తనయునితో సుభద్ర అలిగి వెళ్ళి పోయినది రుక్మిణి సత్యభామ మొదలైన స్త్రీజనము ఏకమై రేవతిదగ్గరకు వెళ్ళి యడుగగా ఆమె

“ మనమున మత్కుమారి నభిమన్యున కీయక నన్యరాజనం
దనున కొసంగువార్త శతథా కలనైన నెరుంగ నక్కటా - (౪-౧-౮౧)
'భూనభము లగ్రసాక్షిగ-' (౪-౧౮౨)

'మదనసమానమూర్తి యభిమన్యుడె యిల్లట పల్లుదంచు (౪-౧౮౪) అని వచ్చిన స్త్రీలకు ప్రత్యుత్తర మిచ్చును బలరామసుభద్రలకు ఇంత రభస జరిగినను లగ్నముసమీపించినను రేవతికి తెలియలేదా ?

---

1 అభిమన్యుని గూర్చిన సమాచారమునకు-ఆంధ్ర మహాభారత నిఘంటువు శ్రీఅబ్బరాజు సూర్యనారాయణ 445-418 పుటలు, 1979 ముద్రణ ఆం.ప్ర-సా. అకాడమీ ప్రచురణ.

ఈ విధమైన పొరపాట్లు గ్రంథమునం దున్నట్లు నేను సమాలోచన చేసి నాను

పరిష్కరణ - రెండుతాళపత్రగ్రంథములు, అసమగ్రముగా నున్న ఒక లిఖిత ప్రతి వీనిసముపప్రయో నాయీ పరిష్కరణ ఏప్రతి ఎట్లున్నది పూర్వప్రకరణ ములోనే తెల్పినాను కృతి ప్రారంభము మాత్రము దేనిలోను లేకపోవుట బాధా కరము నావద్దగల తాటాకుపుస్తకమున లేనిభాగాలను హైదరాబాదు నందలి ఆంధ్రప్రదేశ్ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునగల తాళపత్ర ప్రతిలో చూచి వ్రాసుకున్నాను ఈ భాగాలు గ్రంథమున ప్రత్యేక పద్ధతి అక్ష రాలలో చూపినాను.

మూడు రోజులు తాళపత్ర గ్రంథాలయములో నాప్రతితో సరిచూచు కొనుటకు అనుమతించిన గ్రంథాలయ డైరక్టర్‌గారికి నాకు మిక్కిలిసాహాయ్య ముగానున్న గ్రంథాలయోద్యోగి మిత్రులు శ్రీ విఠల్‌రెడ్డిగారికి కృతజ్ఞతలు తెల్పుకొనుచున్నాను

మూలప్రతులలో ౧-౯ తర్వాత అంతరాళమున చక్కంజూచి ౧-౨౪ హరిపదసక్తులుం-౧-౨౫ సురుచిరవృత్త ౧-౨౬-తమకైతాము-౧-౭౨ అనే పద్యాల తరువాత-'ఇట్లు శ్రీమద్వృషధరాధర-౧-౧౦, వచనమున్నది ఈపద్ధతి- వ్రాయసగాండ్లు చేసినది కావచ్చు ఎందుకనగా- కవి. ''—సుకవి కుకవిజనంబులనమస్కరణపురస్కరణతిరస్కరణపూర్వకంబుగా ప్రశం సించి—''(౧-౩౦) అని చెప్పినాడు దీనిప్రకారము పైపద్యముల వరుస కలువవలయునుగదా ! ప్రతులలో పైన నేనుదాహరించినట్లే గలవు. కవిగారి. వచనమునకు (౧-౩౦) తగినట్లు వీనిని నేను క్రమపద్ధతిలో చేర్చినాను. చక్కగా కుదిరినవి విజ్ఞులు దీనిని పరిశీలింతురని ఆశింతును.

పద్యాలు కొన్ని అసమగ్రములుగా గలవు వానిని అట్లే చేర్చినాను చినిగిపోవుచున్న తాటాకులలో కొన్నినాళ్లకు ఈమాత్రము పద్యశేషాలైన మిగులునట్లు లేవనే భావనతో దొరికినంతవరకు వ్రాసినాను

గ్రంథనామము ఆశ్వాసాంతపద్యము గద్యములలోను 'తాలాంక నందనీ—' అనియే గలదు. దానిని 'తాలాంకనందినీ' అని మార్చినాను

అచ్చుటచ్చుట – కొన్నిపద్యాలలో దోషములు కనుపడినవి వానిని సరిజేసి పూర్వపాఠమును అధోభాగమున పేర్కొన్నాను

౫-౩౩౧-మాలిని చివరిపాదము-చివరిభాగము 'వృషగిరిశ్రీరమేశా-' అని గణభంగముగా గలదు దానిని 'విస్తృతాద్రీంద్రవాసా' అని మార్చినాను

పద్యాలలో అక్కడక్కడ వ్రాతతప్పు బాగాగలవు వానిని దిద్ది సరి చేసినాను తేడా వచ్చే మార్పులను అచ్చుట సూచించినాను. కావున—ఆయాభాగా లను ఇచట పేర్కొనుట లేదు.

ఇవి నాయూహకు తట్టిన సవరణలు - మార్పులు కథ ప్రసిద్ధమైనదే కావున దానిని వ్రాయలేదు

ఈకవిశాఖ – అన్నగారిశాఖలకు చెందిన కవులగూర్చి – వారిరచనల గూర్చి తెల్పినాను ఈగ్రంథకర్త తరువాత గలవారిలో చాలమందిని గూర్చిన సమాచారము తెలియలేదు లభించినంతవరకు వంశవృక్షము నొసంగినాను తాళపత్రలిఖితప్రతులగూర్చి – వాని బాగోగులగూర్చి వివరించినాను ఈ సమాచారము ముందు పరిశోధనచేయువారి కుపకరించగలదని నా యాశయము

గ్రంథసమాలోకనమునందు అన్నివిషయములను వివరించి చూపినాను సామెతలు, అలంకారాలు, అనుకరణలు కొంత విస్తృతియైనా పేర్కొనుటకు కవికి వానిపైగల అభిమాన గౌరవములు కారణములు

చిత్రకవితనుగూర్చి ఎక్కువగా వివరింపక వానిసమాచారమునకు ఆకర గ్రంథముల పేర్కొని విషయమును తెల్పి అచ్చుటనే సవరణలుకూడా చేర్చి నాను.

నేను పరిష్కరించిన ప్రతిగ్రంథమునకు పద్యసూచిక దానిలోనున్న కవిత్వబంధములను (సచిత్రములుగా) వేయించుచుందును ఎందుకనగా ఇప్పటికే ఈ బంధములపైపఠువురికి అభిమానము తగ్గినది కొంతకాలమునతరువాత ఇవి కూడా లభింపవు వీనివలన నాటికవులయొక్క ఊహాశక్తి, కవితానైపుణ్యములు వ్యక్తమగును మనము వీనిపై మక్కువచూపినా చూపకపోయినా బాధలేదు కాని నిస్సారములని మాత్రము నిందించుట తగదు

దాదాపు ౧౧౦ సంవత్సరాలకు పూర్వము ఇంతచక్కని ప్రబంధము వచ్చి వసుచరిత్ర, చంద్రికాపరిణయాదులను స్ఫురింపవేసినది మన యదృష్ట మున పూర్తిగా శిథిలముగాకుండ నిలిచి నేటికి సాహితీ సూర్యాలోకభాగ్య మంది నది దీనిని పరిష్కరించినందుకు నేను సంతోషించుచున్నాను

కృతజ్ఞతలు —

ఇంతకాలముగా అముద్రితస్థితిలోనున్న మరింగంటి వారి మరియొక కృతియైన దీనికి సంపాదకత్వబాధ్యత నప్పగించి కృషిచేయు నవకాశమును గల్పించిన ఆంధ్రప్రదేశ సాహిత్యఎకాడమీకార్యవర్గమువారికి అందు ముఖ్యముగా కార్యదర్శి డా. శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తిగారికి,

గ్రంథప్రకటన విషయమున నాకన్న ఎక్కువశ్రద్ధగలవారై తమ సలహాలనిచ్చి తొందరపెట్టుచు ఈపని చేయించిన డా॥ బిరుదురాజు రామరాజుగారికి,

గ్రంథపరిష్కరణసందర్భమున మిక్కిలి ఓపికతో సహకరించిన ఒప్పు తప్పరయు రసజ్ఞమూర్తియైన మిత్రులు శ్రీ కపిలవాయి లింగమూర్తిగారికి,

-పద్యబంధకవిత్వచిత్రాలను అందంగా చిత్రించిన మిత్రులు శ్రీ బాల కిష్టయ్యగారు

వీరందరికీ కృతజ్ఞతలు —

పద్యసూచికనుకూర్చిన అంతేవాసి- చిరంజీవి వెలుదండ నిత్యానంద రావునకు మంగళాశాసనములు. నాయీకృషి సాహిత్యప్రియంభావుకులకు ముద మొనగూర్చిన సంతసింతును

“భానుఁ డెందాక నభ్రగతుఁడై చరియించు
చంద్రుఁ డెందాక తేజస్వి యౌను
ధరణి యెందాక సుస్థిరరూపమును జెందు
గగన మెందాక నూర్ధ్వగత మొందు
నుడుగణం బెందాక నడచు హేమాద్రిపై
జ్వలనుఁ డెందాక జాజ్వల్యుఁ డౌను,
మహిని నెందాక రామాయణంబు బఱంగు
ధర విభీషణుఁడు నెందాకనేలు

నిగమసారంబు లెందాక నెగడుచుండు
భూమిభారంబు నెందాక బూను నయ్యు
నంతనామఫణీశ్వరుం డంతదాక
బఱఁగు *తాలాంకనందినీ పరిణయంబు*”.

శ్రీరంగాచార్య

పాలెం 509 215
మహబూబునగరం జిల్లా
సిద్ధార్థి–ఫాల్గుణబహుళ దశమి
సోమవారము, 25-2-1980



'తాళపత్ర ప్రతిలోని రెండు ఆకులు.'

కం. ... ... . ... .. ..
... ...... . ... ...
... ... .. ... శుక వాల్మీకి వ
చశ్శ్రీ వర్ణింతు ననయ సవినయ నియతిన్ ౬

సీ. ... ... . . ... ... ...
... . ... ... ...
మహి వరాహీశనామఖ్యాతిఁ దీపించి
పంచాస్యముఖనుత ప్రభ గణించి
... ... ... ... ... ...
శుభాధారైకగరిమ గాంచి
స్థిరత రసాతలాధిపతియై దీపించి
యాభోగబలభద్రుఁడై రహించి

గీ. పాదుగ హరిస్వరూపమై యాదిచక్రి
రూపదశకంబు తనతో నిరూఢి దెల్పి
.. ... ... ... ... ...
... .. ... .. ... . . ౭

గీ. ... తత్వసుహృదత్వసులభత్వసత్వ ...
... ... బహుళగురుత్వపావ
నత్వస్వాముఖమహత్వభార .. ..
... ... ... ... ... ... ... ...'' ౮

గీ. ... ... ... ... ... ... ...
ప్రాంజలిప్రణుతిప్రణామ మర్థి
హరిరమానంతగరుడసైన్యవరచక్ర
ముఖమహాయుధగురుకవిముఖ్యులకును⊕ ౯

---

⊕ వినితర్వాత కొంతభాగము 'ప్రా'లో గ్రంథపాతము, మ౨౦, ౨౨-౨౩ సంఖ్యలుగల పద్యము లున్నవి తర్వాత, ఇట్లు 'శ్రీమద్వృష ధరాధర—' వచనముతో ప్రారంభము, 'తా' - లో ౧౦ సంఖ్యా వచనముపంక్తియే గలదు

ఇట్లు శ్రీమద్వృషభాధరసౌధవిహారుండగు వేంకటరమణు నుద్దేశించి రంగదపాంగసంగత కరుణాతరంగాంగణమగు మంగాంగ నాంతరంగానుషంగాభంగవైభవప్రసంగంబుఁ బ్రశంసించి, శేష గరుడ చమూ నాథ విశేషప్రభావం బాశ్వాసించి, దివ్యాయుధపంచకాంచన్మహత్త్వసత్వంబునకు గురుత్వంబు గావించి, భగవద్గుణగణ విభవానుభవ ప్రభావాతిశయకృత దినచర్యా మద్వంశాచార్య పరంపరానుకంపా సంపల్లాభంబున కభినివేశించి, సకలాలంకరణ పదప్రకరణ గూఢశ్లేషాశ్లేష శ్లాఘనీయ పురాణరచనాప్రవీణ చమత్క్రియా ధురంధర కవిపురందర వాఙ్మరందస్యంద దమందప్రధానమాధుర్యంబునకు విశ్వసించి, దుష్కరపదపుష్కల శుష్కకవితాపరిష్కారులగు దుష్కవుల నిరసించి, కలుషలతావితాన లవిత్రంబుగా పవిత్రజనస్తోత్రపాత్రంబగు నొక్క చిత్రకథాచరిత్రంబు రమాకళత్రాంకితంబుగ [1] యోచింపు మటన్న, నెటులో యని వివరింపుచు, తద్గుణానుభవపరాయణుండనై యొక పుణ్యవాసరంబున న్నిద్రాపరవశుండనై యున్న సమయంబున - ౧౦

కం. భాసురమగు నానిశి హరి
వాసరమున శేషగిరి నివాసరమేశం
డాసురపోషణుఁ డనవర
తాసురఘోషణుఁడు సత్కృపార్ద్రహృదయుఁడై ౧౧

సీ. శ్రీధరుం డరుణజపాధరుం డఖిలధ
రాధరుండును రుచిరాధరుండు,
సుందరుండు, ధృతోరుమందరుండు, గుణాళి
కందరుండు సుతపురందరుండు,
పావనుం డసురాజహితావనుం డాశ్రితో
జ్జీవనుం డవితసంభావనుండు
తారకుండు త్రిలోకధారకుండగు మహోప
కారకుం డసురసంహారకుండు

---

1 యోచింపుమటంచు - అని పలెను,

గీ నెల్లలోకములకు గన్నతల్లిలీల
నుల్లసిల్లెఁడు కరుణామతల్లి కేక్ష
ణోల్లసితనేత్రయుగ రమావల్లభుండు
గానన య్యెను స్వప్నసాక్షాత్కరముగ ౧౨

తే గీ తరణికిరణప్రకరణధిక్కరణరుచిర
విస్ఫుగణతనుతేజఃప్రవీణ విభవ
లోకనానేకసంభవోత్సేకభక్తి
కేల్మొగిడ్చి పునర్నమస్క్రియ లొనర్చి. ౧౩

క యోగ్యంబేమో మును,మ
ద్భాగ్యమునే శ్రీరమాధిపతిఁ గనుట మహా
భాగ్యంబై జన్మం బా
రోగ్యం బయ్యెనని బొగడ రూఢిఁ దలఁచితిన్ ౧౪

## గునుగుసీసము1

పరమయోగిహృదయశరణములగు చర
ణములు, తారాగణాభిముఖములు, న
ఖములు, తాపెళములకరణి సేవళములై
బొదలు ప్రపదములుఁ, బొంకమైన
గమకంపు బంగరుకాహళికల హాళా
హళిసేయు జంఘలు, తళుకు తిన్ని
యల వన్నియల మిన్నయగు పిఱుందులు, గజ్జ
నంటిదంటల కడగంట గెంటఁ
గల మగంటిమి జాల్తొడలనడరు, బెడంగు
పిడికిటిలోననే సడఁగెఁ గన్ను
జెదటి బాపురె యన జెల్వగు లేఁగౌను,
*చౌకుచౌకం జేసి.. .....

---

1 'గునుక సీసము' అని 'తా' ప్రతులలో గలదు

* మూలప్రతులలో ఈ పాద మింతే గలదు.

టక్కు బఱచెడి బల్మిటారంపు సడలు,న
ల్వాను దొడ్డబిడ్డఁగాఁ గనిన బొడ్డు,
తమ్మియు మినువాక తరఁగలఁ బొరగల
బడఁద్రొబ్బి యుబ్బు నిబ్బరపుఁ ద్రివళి
యు, నిఖిలజీవప్రయుక్తబ్రహ్మాండభాం
డంబులు తండతండంబు లగుచు
నిండి బుళ్ళుళ్ళురని గదల నొదుగైన
నుదరము రుచిరవిద్యోతమాన
కౌస్తుభమణిడోలికగు హేలగతి కాపు
రంబుఁ జేసెడి విస్ఫురదరవింద
మందిరయైన మాయిందిరచే నతి
సుందరమైన వెడందఱొమ్ము,
చెలువైన చిన్నిచీమలబిడార్గేరు ని
గారంపు నూఁగారు గరిగరికద
రము, నధరదరము రమ్యకంధరము క
రికరముల ననుకరించు బాహు
వులు, కుధరశృంగములకన్న నెన్నిక
యగు మొగుభుజముల సొగసు,మేల్మె
ఱుంగు బంగరురంగు బొంగారు చేల చె
ఱంగుల వలెవాటు రహి వహించు,
⊕ నారంగములన నూఁగారును దులకించు
దరహాసచుబుకము, తళుకుటద్ద
ములఁ గద్దరించు గోమున చాకచక్యమ్ము
లగు ముద్దుచెక్కిళ్ళు, జిగిమిగిలిన

---

⊕ *నారంగములతీరునను నూఁగారు - మూలప్రతులు.*

సాధుసుధామాధురీ ధురీణాధర
మును, చిన్కుఁబూసల మురుపు నీన
డించు పల్వరున, మండితమణిఖచిత కుం
డలముల గీల్కొన్న దంబుఁగల చొ
కాటంపు నిడుద, శ్రీకారములకు మొకా
రించుకర్ణములు, వర్ణితదయా ర
సార్ణవాకీర్ణ సంపూర్ణకటాక్షని
రీక్షితములైన దృక్సీరజాత
యుగము, తొగమ గని దెగడు నగుమొ
గము, గములుగొను భృంగముల నమ్మ
గల యుంగరపు ముంగురుల మెఱుంగు, సహస్ర
కోటిభాస్కర నిరాఘాటకాంతి

తే.గీ. మయకిరీటము, గలజగన్మంగళావ
తరణసంసేవ మద్భాగ్యగరిమఁ గంటి
హతసురవిరోధ ! విస్మృతాశ్రితాపరాధ !
జయరమానాథ ! శ్రీశేషశైలనాథ ! ౧౫

కం. అని వారిజనాభుని నే
ననివారితభక్తియుక్తి నతినమ్రత నా
తనివారఁ బొగడఁగా నా
తనివారఁ గనుల దయామృత మొలుకం బలికెన్ ౧౬

కం. అంకితము మాకుగా తా
లాంకతనూజాసదుద్వహకథాస్థితి ప
ర్యంకగతి గావ్యరచనా
కైంకర్యము సేయు బాలకా సువివేకా ! ౧౭

కం. నాతనయునిగతి నీకు స
నాతనకవివాఙ్నిరుక్తి నాకృప నిత్తుఁ
పూతనయ ! విను మనిన కం
జాతనయను వాక్యములకు సంభ్రమమతినై . ౧౮

తే.గీ. అప్పు డిటువంటి మధురవాక్యముల జుంటి
తేనియపనంటివలె నంటి తెలుప, తొంటి
యింటి వేల్పైన మాతమ్మికంటిఁ గంటి
మేలుకొనఁదగు ననుకొంటి మేలుకొంటి. ౧౯

కం కల యని వెరఁగున నెన్నఁడు
గలయని శుభకారణానుకరణాకృతి ముం
గలఁ దోఁచె నెట్టి భాగ్యము
గలదో చర్చింప శౌరికరుణాదరణన్ ౨౦

మ. శుకవాల్మీకిపరాశరాత్మజముఖాస్తోకప్రణీతప్రబం
ధకథాసారవినోదుఁడౌ హరి విచిత్రంబయ్యె గాదే మద
ల్పకృతిన్ గోరుట యజ్ఞభోక్తయగు లీలావేషి యా బీదవి
ప్రకులుం డెట్టిన ముష్టి మెక్కెడె నతత్రాణైకహారీశుఁడై ౨౧

కం అనుచు వృషాచలపతి స
న్ననుచు నెనరుఁబూని కోరిన ట్లి కావ్యం
బనుపమగతిఁ జేసి యశం
బనుప మతిం దలఁతు శ్రీవిహారిన్ శౌరిన్ ౨౨

మ. కవితాకల్పనకల్పభూరుహసహస్రాక్షాళిచే మద్గురు
ప్రవరానుగ్రహమే నిధానముగ గన్పట్టన్ రమాజాని స్వ
ప్నవశుండై కృతిఁ గోరె తన్నియమనప్రౌఢిన్ బుధు ల్మెచ్చ నీ
యవని న్నిమ్మకు నీర మెక్కుగతి కావ్యం బూర్జితం బయ్యెడిన్. ౨౩

మ. . .. అంతరాళమున చక్రం జూచి యంచత్కృపా
మృతధారాప్తి నివృత్తదోషముగ కూర్మిన్ నిర్మలప్రాభవా
న్వితగాఁ జేతురు మత్కృతిన్ జగతి స... ... ... ...
... ... ... ... ... ... ... ... ... ... ... ... ౨౪

చం. హరిపదసక్తులుం, గువలయాప్తులు సత్పథవర్తులౌచు ను
ర్వర నభివృద్ధి గాంచు ద్విజరాజు లనందగు సత్కవీశ్వరుల్
. ... . ... ... ... ... ... ...
సరసత కీర్తిచంద్రికల సాధుతరుల్ గురిపింపఁజేయరే! ౨౫

## కుకవి నింద

చం. సురుచిరవృత్తనేమములఁ జూడక హీనకథాప్రసక్తిచే
గురులఘువర్ణనిర్ణయముఁ గొంచెములేక పదార్థసంగ్రహ
స్థిరమతి సత్ప్రబంధరుచిఁ దేఱక, శయ్యలు విశ్రమస్థలం
బెరయక హీనజాతులక్రియం దగు దుష్కవులన్ గణింతురే. ౨౬

మ. తమకై తాము వికల్పనార్థగతశబ్దంబుల్ దగం గూర్చి, ప
ద్యములుం గొన్ని సభన్ వచింమనెడ[1] విద్వాద్వార్యుఁడుం బూర్వప
క్షము గావించిన నోరుమూతురు తమిం గన్నంబులోఁ దేల్చి టు
క్కుమనన్ మీటిన దొంగబం టయిన ప్రక్కన్ మిక్కుగా
నుండఁడే. ౨౭

ఉ. రామకవాఙ్మయుక్తి మధురస్వరపంచమసూక్తి రక్తిగా
గోమలలీలఁ బల్క విని గోకిలఁ గాకినిగా గణింతు రు
ద్దామసదర్థబోధ కవితారచనం బ్రకటింపకున్న వి
ద్యామహిమాఢ్యు గౌరవగుణాఢ్యుని మౌఢ్యునిగా దలంపరే. ౨౮

---

1 విద్వత్కౌశలుం-మూలప్రతులలో పాఠము

## కావ్యప్రశస్తి

చం. ఉరుతరకందవేణి, లసదుత్పలలోచన, చంపకాంగి భా
సురతనుమధ్య రమ్యవళి సుందరవృత్తనితంబ గీతవి
స్తర, బహుమత్తకోకిల రసస్వరభాస్వర యైన కావ్యసుం
దరిని వృపాచలేశున కుదారత గౌరత ధారవోసెదన్ ౨౯

వ అని యభీష్టదేవతాసుకవికుకవిజనంబుల నమస్కరణపురస్కరణ తిరస్క
రణపూర్వకంబుఁగాఁ బ్రశంసించి యేతత్ప్రబంధనిబంధనప్రారంభధురంధ
రుండనై కృతిముఖాలంకారంబుగా మదీయవంశావతారం బభివర్ణించెద ౩౦

## (వంశావతారవర్ణన)

కం కల్యాణకరణగుణసా
కల్యుఁడు ముక్తివిభవానుకరణతపస్సా
ఫల్యుఁడు సౌశీల్యుఁడు వా
త్సల్యుఁడు మౌద్గల్యుఁ డనెడు తాపసి యలరున్ ౩౧

కం ఆసూరికులవరేణ్యుం
డాసూరికులాధినాథుఁడై నిజతనుశో
భాసూరుఁ డగుచు విబుధస
భాసౌరమణిప్రభావిభాసురమహిమన్ ౩౨

ఉ శ్రీరమణీమణీవిభుని జెల్వగు నమ్మనిగోత్రజాతుఁ డా
సూరికులావతంసుఁడు విశుద్ధతపస్వి యశస్వి సాధుభ
ట్టారకుఁ డాగమాన్వయవిడంబితమంత్రరహస్యరాసశాస్త్ర
త్సారసుఁడై యతిప్రవరుసన్నిధి పెన్నిధిగా వసింపగన్ ౩౩

చం. యతిపతి యొక్కకాలమున నాకురుశేఖరసాధుభట్టరుల్
జతగొని సన్నిధి న్నడువ చయ్యన రంగనిసేవకై సుహ్నా

ష్టత జనుదెంచునంత గరుడధ్వజుఁ డాదరభావుఁడై మహా
చతురత నిట్లు బల్కె యతిచంద్రునిజూచి రసోచితంబుగన్ ౩౪

కం కంటిమి మిముఁ గూరేశులఁ
గంటిమి మీవెంట వచ్చు ఘను లెవరో మఱిం
గంటి మని బల్క నది మా
కింటికి పేరుంటగా మహిన్ రహి కెక్కెన్ ౩౫

కం ఆ నంబెరుమా ళ్కృప ని
ట్లానతి నిడ నాటనుండి యస్మద్వంశ
శ్రీనిధి జగద్ధితప్రభ
బూని ధరం బిల్లచెఱకుపోల్కెం బ్రబలెన్ ౩౬

కం వారలమహిమలు ద్రాక్షా
వారలహరు లట్లు నిఖిలవసుధాస్థలి దై
వార లసదార్యజనుల కు
వార లహా! యనఁగ గొంతవర్ణనఁ జేతున్ ౩౭

సీ మంత్రమంత్రార్థస్వతంత్రమంజులబోధ
చేత చేతనుల రక్షించినారు,
దీనావనకృపానదీనాభిధావచిం
తామణిఖ్యాతిచే దనరినారు,
కుంభినీపరవాదికుంభినీంద్రవిభేద
కంఠీరవప్రభ గాంచినారు,
శమదయాగుణరత్నసముదయావాప్తిని
క్షీరాబ్ధియనఁ గీర్తిఁ జెందినారు

తే గీ. నయవిలక్షణసత్త్వవినయగరిమల
మహి మహిమగాంచి రఖిలదిఙ్మహితకీర్తి

సర్వచార్వాకముఖమతదుర్వహోగ్ర
గర్వహరులు మఱింగంటి పూర్వగురులు ౩౮

కం ఆ మహనీయాన్వయజనుఁ
డై మహదంశమున భావనాచార్యుఁ డనం
గా మహిని వెలసె మత్ప్రపి
తామహుఁ డనవరతసుగుణతామహిమ నొగిన్ ౩౯

సీ తనదువాక్ప్రౌఢసిద్ధాంతసూక్తులు జగ
ద్గురునకు వజ్రపంజరము లయ్యె
తనురచించిన ప్రబంధకథాసుధానిధుల్
దాస్యకోటికి భాగ్యధనము లయ్యె
తనుజేయు సంతతదానధారాసుధల్
పండితాళికి మెట్టపంట లయ్యె
తనయశశ్చంద్రికాధవళరుక్తతి ధరా
తరుణికై శికపుష్పదామ మయ్యె

గీ తనదు జిహ్వాంచలంబు వాగ్వనిత కెపుడు
మంగళోత్తుంగమణినృత్తరంగ మయ్యె
ననఁగ జెలువొందె విమతసంహతివిదారి
జనమనోహారి భావనాచార్యసూరి ౪౦

తే గీ అట్టికోవిదునకు కూర్మిపట్టి యగుచుఁ
బుట్టి సిరిఁజట్టిగొను జగజెట్టి మహిమ
లుట్టిపడ చెట్టవిమతులబట్టి మట్టె
దిట్టయగునట్టి నరసింహదేశికుండు ౪౧

కం దురితౌఘదూరితుండను
బిరుదాంకుఁడు- వాదిమతవిభేదుండగు నా
నరసింహార్యులు సాక్షా
న్నరసింహులుగాక దలఁప నరమాత్రుండే. ౪౨

సీ. తగనాంధ్రసంస్కృతద్రావిడకవితాస
మర్థుఁడై యేమహామహుఁడు జెలఁగె
శాస్త్రప్రసంగవచశ్శక్తి కుమతుల
కే దేశికుండు హృద్భేది యయ్యె
నిష్కారణకృపాపరిష్కృతహృదయుఁడై
యేసూరిమణి చేతనేచ్ఛ దీర్చె
శ్రీసదాచార్యసేవాసక్తి సంతతం
బేగురుం డతిపీతరాగి యయ్యె

తే గీ శేషభూధరవర సర్వశేషిగుణ వి
శేషమహిమా ప్రవచన నిశ్శేషిత స్వ
దోషధిషణానుసక్తసంతోష లసద
శేషశుభసింధువరుఁడు నృసింహగురుఁడు ౪౩

కం. ఆ నయమతికిని ధరణీ
శానయవచహితనిరూఢి నవనీస్థలి వి
జ్ఞానయశోధీన సుశో
భానవశోభితులు సుతులు ప్రబలి రిరువురున్ ౪౪

కం కలవేదశాస్త్రమహిమల
నిలవేడలచిలువ చెలువ మెఱయుదు రన స
వ్వలవేఁ డలఁపఁగ నేటికి
నల వేంకటకృష్ణభావనార్యోత్తములన్. ౪౫

కం వారిరువురిలో ననుజుఁడు
వారిరుహాక్షాదరప్రవర్ధితవిద్యా
[1]చారయశస్సారవచ
స్స్ఫురదశ త్రిదశగురుఁడు భావనగురుఁడున్. ౪౬

---

1 యశస్సారవశస్ఫార - 'మూ'

సీ. శాస్త్రనిషిద్ధాన్యజనకాలకూటంబు
  కుటిలకుతర్కాళి గుండె దిగులు
విజ్ఞానశూన్యదుర్విమతాళికి నిమిత్తి
  వెక్కసలకు నుక్కుముక్కు గొడ్డు
వికటమాయావాదులకు బొమ్మగాలము
  బౌద్ధకాననబృహద్భానుమూర్తి
చార్వాకమతతమశ్చటభాస్కరద్యుతి
  క్రూరజైనేభకంఠీరవంబు
తే. గీ. సకలవేదాంతశాస్త్రప్రసంగపాళి
సంభృతాఖిలసౌశీల్యసద్గుణాళి
కుటిలదుర్మదశైలేంద్రకటకపటల
చటులదంభోళి భావనాచార్యమౌళి ౪౭

సీ. భాషాసతీకచభరముపై వలఁగొన్న
  తెలిపూవుదండలై తళుకుఁ దనరి
ఘనహలాయుధునీలికాశపెందట్టిపై
  శుభ్రాంశుకస్ఫూర్తి చుట్టుముట్టి
ప్రమథనాథుని కంఠభాగంబునకు గంధ
  పాటీరపంకమై ప్రభ నొసంగి
యోషధీశ్వరుని పెన్నుఱమున వన్నెల
  మగఱాలపతకమై సొగసుఁ బొలిచి
తే. గీ. మహిని మాలిన్యగతుల నిర్మలులఁ జేసి
హారనీహారకర్పూరహీరతార
పారదక్షీరడిండీరచారుకీర్తి
సలరె మౌద్గల్యభావనాచార్యకీర్తి ౪౮

కం. ఆభావనగురుఁ డంబుజ
నాభావనతజనశుచిగనన్ ప్రథమశ్రీ
శోభాపసధిగతిం గలు
షాభావనవినహృదయుఁడై ధర నెగడెన్ ౪౯

ఉ. ధీమతి యాఘనుండు నలదీఁగెకులాబ్ధి జనించు శ్రీరమా
కామినిబోలినట్టి బుధకల్పకవల్లి, సతీమతల్లి, గం
ధామలపుష్పవల్లి, సుగుణౌఘమణుల్గల పాలవెల్లి స
త్ప్రేమను రంగనాయకిని పెండిలిగా గొనె ధర్మపత్నిగాన్ ౨౦

తే. గీ. తుంటవిల్తునిగను తమ్మికంటియదను
నంటియుండిన సిరివాలుగంటివలెను
గంటిలేనట్టి మా మఱింగంటివారి
యింటి మణిమయదీపంబువంటి దయ్యె ౨౧

తే. గీ. వృషగిరీశకటాక్షసమృద్ధిఫలన
నమ్మహాదంపతీవరుల్ ముమ్మ గనిరి
యిరువుఱ తనూజులను మాననీయకీర్తి
గలిగె తద్గౌరవ ప్రౌఢికతన మాకు. ౨౨

క. శ్రీమద్వేంకటరాఘవ
ధీమణియె మదగ్రజుఁడు-తదీయఘనకృపా
స్తోమముచే నేమముచే
క్షేమముచే మనితి నారసింహార్యుఁ డనన్ ౨౩

తే. గీ. గురుతమోహారి సంతతకువలయాప్తుఁ
డురుకళానిధి సత్సంగతోత్సవుండు
విష్ణుపదసక్తకరుఁడు కవిప్రియుండు
వసుధ మాయన్న మాయన్నవంటివాఁడు ౨౪

సీ. గురునియామకము జేకొని ధర్మదీక్షచే
నారామపదమునం దధివసించె
దానవారిప్రభాతతి దిగ్భరణఁ జేసి
పంకపెధర్మశాసనత మించె

కడుజడధిక్రోధగర్వం బపనయించి
మిత్రజాతస్నేహపాత్రతఁ గొనె
షడ్గుణఫల రసాస్వాదనామోదియై
యంగదాదిబహూకృతిం గ్రహించె

తే గీ. వాదకోవిద దుష్ప్రతివాదిపంక్తి
ముఖవిభంగయశఃప్రాప్తి ముదితుఁడయ్యె
చిత్రకావ్యుండు మౌద్గల్యగోత్రజుండు
రాఘవార్యుండు రెండవరాఘవుండు ౫౫

చం సరసగుణాకరుం, డఖిలశాస్త్రవివేది, మనోఽసుందరుం,
డురుకరుణాకరుండు, వినయోజ్జ్వలశీలుఁ డఖండకీర్తిసం
భరితుఁడు, రంగనాయకితపఃఫలమూర్తి మదగ్రజుండు నా
గరికత కంటిజెప్పవలెగాఁచిన వేంకటనారసింహుఁడన్ ౫౬

సీ నిరతాఖిలావనీభరితాఖ్యచే శేష
శైలవిఖ్యాతి నిశ్చయము గాదె
చేతనాఘవ్రాతఘాతనాధికవృత్తి
ధర్మాద్రి యనుట వాస్తవము గాదె
లోకావనాపాంగలోకనాథుని మోయ
గరుడాద్రి యనుట సార్థకము గాదె
ఘనముక్తులకు మోక్షధనము కన్నులఁ జూప
సంజనగిరి తథ్యమయ్యె గాదె

తే గీ యట్టి వృషగిరికటకమహాగుహాంత
రాళమణిమయసౌధాంతరస్థుఁడైన
వేంకటేశ్వరునకు వేనవేలొనర్తు
చలితవర్తి పునర్జన్మనాశకములు

# షష్ఠ్యంతములు

కం. ఈదృశమహిమాతిశయ గు
ణాదియశశ్శరధి కహికులాంతకరథికిన్
వేదపదామోదపదా
పాదకదామోదరునకు భవహరణునకున్. ౫౮

కం. అంగీకృతరంగద్రణ
రంగజయరథాంగునకు విరాజత్కరుణా
పాంగతరంగసుసంగ (త)
శృంగారదృగంగణునకు శ్రీరమణునకున్ ౫౯

కం. హతదోషున కపరిమిత
ద్యుతిభూషున కమృతరసమధురభాషునకున్
మితరహితాహితజనతా
కృతినిహతామోఘబలసుఖితవేషునకున్ ౬౦

కం. చిత్రసుచరిత్రునకు తా
పత్రయతరుదాత్రునకు శుభక్రమణకృపా
పాత్రపవిత్ర జగత్త్రిత
యత్రాతకు గురుగుణత్రయాతీకునతున్ ౬౧

కం. పాథోధిజాపయోధర
భూధరతటనటదనల్పసుపనధరునకున్
[1] వేధోదితయూథాగమ
గాథాసమవిలసదర్థకలితస్తుతికిన్ ౬౨

---

1 వేధోదిమ (తా లి)

కం తృటితసముత్కటవిద్వి
ట్పటలికి పటుహాటకమయపటికసమమహా
కిటికి రమానికటికి వేం
కటమహిభృత్కిటికి పాణిఘటితసుకటికిన్ ౮౩

వ. సంతతనితాంత కల్యాణపరంపరాక్రాంత దిగంతవిశ్రాంతం బగునటుల నే రచియింపబూనిన తాలాంకనందినీపరిణయం బను శృంగారప్రధాన ప్రబంధంబునకు కథాసూత్రప్రారంభప్రకారం [1] బెట్టిదనిన- ౮౪

## కథాప్రారంభము

కం. జనమేజయనరపతి భూ
జనమే జయజయకరప్రశస్థితి బొగడం
గ నమేయదయాకీర్తుల
గన మేయెడ నితని కెనయగా నన నెగడెన్ ౮౫

చం అతఁ డతులప్రభావమహిమాప్తిని సాత్యవతేయవాగుదీ
రితనిఖిలాగమాంత[2]సపరిష్కృతమైన పురాణకోటి సం
తతము తదీయశిష్యులు యథావిధిగా వినిపింప-విన్చు సు
స్థితనతి నీతిసంయుతమతిన్ నుతికెక్కె కుతూహలోన్నతిన్ ౮౬

కం ఆ యనఘుఁడు కృష్ణద్వై
పాయనమునివలన బొడము భారత మవ్యతో
పాయనముగ విని వైశం
పాయనజై మినిసుమఁ తపై పలసన్ ౮౭

---

1 బెట్టిదంబెని-'తా' 2 సుపరిష్కృతం-'తా'

కం వారలనలువురిలోన న
పారదయాశీలు దుష్టభవనిర్మూలున్,
శౌరిపదభక్తలోలు
న్నీరదవాగ్జాలు పైలునిం గని బల్కెన్ ౭౮

కం సారతరనిగమబోధిత
భారతములు వేరువేరు బలుకుటచే వి
స్తారతమిఁ దొలఁగె కుతుక మ
నారతము స్గలిగె మీదు నలుగురిపలనన్ ౭౯

చం అందు భవన్ముఖోదితమునై గనుపట్టు మహాపురాణమున్
కొందఱు ధర్మశాస్త్రమని కొందఱు తాత్త్వికసంగ్రహంబు నా
గొందఱు నేతిహాసమని కొంద ఱనాదిపురాణమం చనిన్
గొందఱు వేదగూఢ మనుకొందురు భారత మానుపూర్విగన్ ౮౦

మ విమలజ్ఞానము మూలకందము లసద్వేదాంతము ల్శాఖ లా
గమగాథల్ మృదుపల్లవంబులును యోగన్యాసమే పుష్పసం
ఘములున్ గేశవభక్తియే సుమపరాగంబున్, మహాయోగిభృం
గములున్ వ్యాసవచోఽమృతాభ్యుదయమై కల్పద్రుమం బట్ల ను
త్తమధర్మంబులు నిల్వనీడయగు నేతద్భారతామ్నాయమున్ ౮౧

కం. అటుగాన మీర లిటు మా
రట సాత్యవతేయువలె పురాణముఖ నట
త్తటినీతటనటదూర్మి
పటల ప్రకటతరఘటన బలికితిరిగదా ! ౮౨

కం. అం దందము తాలధ్వజ
నందిని శశిరేఖ నందనందనభగినీ
నందనుఁడు పెండ్లియాడె న
నందసరిక గాథ మఱి వినం దనరె మదిన్. ౮౩

కం. మును పది సంక్షేపముగా
వినిపించితి తత్కథన్[1] సవిస్తారముగా
మనమలరఁ దెలుపు మృదులవ
చనముల సుధ లొలుక మౌనిజనకులతిలకా. ౨౪

చం అన విని పైలుఁ డిట్లను నృపాగ్రణితో నభిమన్యురేవతీ
తనయవివాహసత్కథ యథావిధిగా వినఁగోరె తీవు పా
వనుఁడు పరాశరాత్మజునివల్లను నాకు లభించినట్లు బో
ధనపడగా నచింతు ప్రమదస్థిరబుద్ధిని యాలకింపవే! ౨౫

## ద్వారకానగరవర్ణన

మ కల దభ్రంకషసౌధయూథవిహరత్కాంతాజనాలోకితో
జ్జ్వల గంగాతటినీతరంగచయ చంచద్గోళికాయాలికా
కలనక్రీడిత రాజహంసమిథునాక్రాంతంబునా ద్వారకా
విలసన్నామకరాజధాని యలరుం బ్రాంతసంపత్స్థితిన్ ౨౬

కం. ద్వారకవాటము కనక
ద్వారకవాటాభిశోభితస్ఫూర్తిపురు
ద్వారకనత్సౌధమహా
ద్వారకమై యొప్పె లవణవార్నిధిసడుమన్ ౨౭

ఉ. ఆ పుటభేదనావరణ మభ్రతలోన్నతిగాగఁ దూఁగి యా
గోపురసాలముం గెలిచి గొబ్బున తజ్జయలక్ష్మి పెండ్లికై
ప్రాపుకుబోవ నొంటి ద్విజరాజశశంబును దుర్నిమిత్తము
ల్గా పొడగాంచి యవ్వలకుఁ దాటఁగ నిల్చినరీతి భాసిలెన్ ౨౮

చం. తిరముగ కోటకొమ్మలను దీర్చిన సద్గరుడోపలంబుల
న్నెరసి భుజంగరజ్జువులు స్రుక్క చికాకున నొంటి[2] కంటి తే

---

1 తత్కథా-(లి) 2 'ఒంటి-మూ'

రొరిగి యహస్కరుండు భయమొందుట గాంచి విధాత మాస మొ
క్కరొకరివంతుఁ జేసె నదికారణమే పదిరెండ్రు భాస్కరుల్ ౭౯

ఉ. బాపురె! యర్ధచంద్రుఁ డొకబాసికమై చెలువొంద దేవతా
ద్వీపవతీసువర్ణమణిదీపితకంకణమై దనర్చ తా
రాపటలంబు సేసతలఁబ్రాలుగ తత్పురరత్నసాలమా
గోపురలక్ష్మిఁ బెండ్లిగొనె గొబ్బున ప్రాప్తసువర్ణసంగతిన్ ౮౦

ఉ బంగరుకోటపళ్లెర, ముపస్థితశాఖలు దీపముల్, తదు
త్తుంగబలాహకప్రతతిధూమము లట్లు వెలుంగ, ద్వారకా
భంగురలక్ష్మి విష్ణుపదభక్తి నొసంగెడు మంగళార్తి నా
రంగు బొసంగె, మంగళతరంగవిశాలము దీర్ఘసాలమున్ ౮౧

మ పరిఖానీరమునం జనించు విలసత్పంకేజనాళంబు లా
వరణావాలము వెంట డిగ్గి భుజగావాసంబునన్ వ్రేల న
య్యురగస్త్రీతతి డోలికోత్సవములం దుయ్యాలజంపాల యం
చు రహిం దూఁగుదు రాసుగంధజనితాస్తోకానిలాక్రాంతలై ౮౨

చం బలిసదనాపగాంతరుషపంక్తులు ఖేయజలంబు జొచ్చి యు
జ్జ్వలమగు కోటకొమ్మలవిశాలవిధూపలరాజి నిండువె
న్నెలల గరంగుధారలను నింగికి దా మెదురెక్క ఖస్థలిం
గలిగెను మీనరాశిపరిఖావరణంబుల నిమ్నతోన్నతిన్ ౮౩

మ వియదాదర్శనమందుఁ దత్పురము బింబింపంగ దానిన్ సురా
లయమున్గా నటమానవుల్ సురవరుల్గా, నందు రాజున్ శచీ
ప్రియునింగా గురుతు ల్గణింతురు నభోవీధి న్నిరాలంబన
క్రియగా స్వర్గ మటంచు బల్కుట పళుళక్కింగాక తథ్యంబె తే ౮౪

మ మును శ్రీకృష్ణుఁడు దేవకీరమణికిన్ ముల్లోకసంపత్తు లా
ననసీమం బొడసూపుటల్ పరులుగానన్ లేమి కిన్నేడుభూ

జను లెల్లం గన పట్టణాకృతిని స్వేచ్ఛ న్నిల్పి తావిప్పుమో
మన వప్రంబు దగెన్ సమస్తజనమోహద్రవ్యము ల్లోగొనన్ ౮౩

చం. ఇఁక నొక రక్షకుల్ మనల కెవ్వరు లేమిని రాజతాచలం
బొకడును పెల్లగించె, మఱియొక్కఁడు మేరువు నొంచె,వింధ్య నిం
కొకఁ డతికాల రాచె,మఱియొక్కఁడు క్రౌంచ మణంచె నంచు ద్వా
రక హరిచాటుగాంచు కుధరంబు లనం దగె రత్నసౌధముల్. ౮౪

చం. పురిపరిఖాయితాంబునిధిపుష్కలపుష్కర మెల్లఁ బీల్చి గో
పురతటినిం బడంగ పటుఫూత్కృతులన్ వడి జిమ్మి తద్ధునీ
శరముల బీల్చి యంబునిధి జల్లి వధూవరసంగమంబు ని
వ్వరుస నొనర్చి యప్పురి నవారణవారణరాజి రాజిలున్ ౮౫

సీ. అభ్రదంతిని ఢీకీల్మని తాక బిల్చెడి
కరణితుండంబు లాకసను కెత్తు
కుంభజాకృష్టమహాంభోధి నిదె నింపు
నను మాడ్కి మదధార నినుమడించు
నిల ప్రోయ నేనొక్కఁడే చాలు కమఠాహి
కరులేల నని ధూళి శిరము దాల్చు
నఖిలదిక్తతి నాలుగంగలలోఁ జూచి
వత్తు నం చనుమాడ్కి తత్తరించు

తే గీ. హిండదద్భుతతుండవచ్చండదాన
మండితస్ఫూర్తి నప్పురినుండు మెండు
చండఖండనరిపుకాండ ఖండనోగ్ర
తాండవోద్దండనటులు వేదండఘటలు ౮౬

చం. దురమున శాత్రవప్రతతి దోప్పడకున్న మదారురోహకుల్
శరముల నేయ మజ్జవనచాతురికాశరపంక్తి రౌతు వె
న్నొరయక యున్నె యీ యపజయోక్తికి నెట్లు సహింతు మంచు దు
ర్భరత హయంబులున్ ఖరఖురంబుల రావులు గొట్టి భూస్థలిన్. ౮౭

కం. ధారలఁ దగి సపలాలం
కారంబులు, వడియు కందగతిలక్షణ వి
స్తారంబగు హయములు శృం
గారకవిప్రోక్తమైన కావ్యముఁ బోలెన్ ౯౦

కం. తానుచ్చైఃశ్రవ మెట తన
పై నొక వృద్ధశ్రవుండు బలురౌతట మి
న్నానెనని వేల్పుతేజిన్
దీనిధిని హసించు [1] హింకృతిన్ బురి హయముల్. ౯౧

చ. తమ పదవేగమున్గొనిన తార్క్ష్యపదాహతిలో నణంగు నా
గములకు భీతి జెందు నునుగాడ్పులకున్ బురివిచ్చి కూలు సూ
నముల శరంబులన్ మరుఁ డణంచఁగ భీతివహించునట్టి చి
త్తముల నధఃకరించి త్వరితంబున మించి గమించు ఘోటముల్. ౯౨

మ. ఘనచక్రప్రభచే సువర్ణరుచు లాకాశస్థలిన్ నిండ చై
త్రనవస్ఫూర్తి నవక్రగామితము నుద్యత్పద్మరాగప్రభా
జనకంబై శరపర్వనాస్పదముగా ఛాయామనోహారమై
కనులం జూడఁగ భానుమండల మనంగా నొప్పె తేరు ల్పురిన్. ౯౩

చం. హరికులిశాతిభీతిని మహోబ్ధిని దాగిన శైలజాల మీ
హరిపురిలో నుపేంద్రుని సహాయబలంబున క్రొవ్వి యాపురం
దరుని వివాదుకుం దిలుచుదారి నవాతవిఘాతకేతనాం
బరపరహస్తసంజ్ఞల నభంబునకానె రథంబు లాపురిన్. ౯౪

ఉ. కేసరిమీసముల్ పటులు గీల్చి మరల్చి పెగల్చి మేటియ
ద్భాసికరాసిదూసి శరభమ్ముల తొమ్ముల నెమ్ము లూడ్చి య
త్రాసత బెబ్బులిం దఱిమి థట్టియు నెట్టియు కట్టి ప్రేతు రా
సీసపుగుండ్లపోలికను చిక్కటి మిక్కటి యెక్కటుల్ పురిన్. ౯౫

---

1 ఘింకృతి-'తా', ప్రా.

మ ఒకటిన్ రెంటిని బైటిపల్లియుల నెంతో పోరి గెల్పొందె, యం
ధకునిం ద్రుంచెను, బొడ్డుబిడ్డపునుకం దట్టించె, పూఁగోల బా
లకునిన్ భస్మ మొనర్చె, నమ్మొగపుకేల్వావి న్వడిన్ గెల్చె, వాఁ
డొక నక్షత్రపరాపతంసుఁ డిక మాయుద్దే యనున్ సైన్యముల్ ౯౬

సీ తనయాలు సాధ్విని తలవాకిటనె యుంచె
నాభిజాతుండైన నలినభవుఁడు
శ్రుతిహీనుఁడై వక్రగతి మెలంగె సహస్ర
ముఖుఁడైన భుజఁగ సముదయవిభుఁడు
సత్రభుగ్వృత్తిచే సర్వభక్షకుఁ డయ్యె
పటుజాతవేదియౌ పావకుండు
కువలయద్వేషియై రవిపద్మినీప్రీతి
సలుపఁడే పుష్పిణీసంగమంబు

తే గీ వలచి విధిశేషశక్రపూషులను దెగడు
విలసదభిజనసుపథసద్వృత్తి నిరత
బ్రహ్మచర్యవ్రతాది సంపత్కలాప
దీప్రసుకరులు నప్పురి విప్రవరులు ౯౭

మ. చిరకావ్యప్రియసద్బుధుల్, విషమదృష్టిత్యక్తసర్వజ్ఞులున్,
వరసత్సంగతసూరివర్యులు, గురుప్రాప్తానుకంపాకళా
ధరు లాత్తప్రతిభోగులై వివిధవిద్యాదక్షతన్ ధారుణీ
సురు లప్పట్టణమందు బ్రహ్మవిదులై స్ఫూర్తి న్విడంబించరే! ౯౮

సీ మరుదధీశుండనేమాత్రమే పాకారి
హవ్యవాహుఁడు సంతతాశ్రయాశి
యా శమమెందు ప్రేతేశుఁడే యూహింప
కర్బురుం డూనాంబకాప్రియుండు
దీప్రనక్రాలోహుఁ డప్రప్పుండు దలంప
ఘననాగభుగ్బంధు గంధవహుఁడు

భావింపఁగా నగ్నైకావాసి ధనదుండు
గౌరీమనోహారి ఖండపరశుఁ

తే.గీ. డని యనూనబలస్ఫూర్తి నెనసి రచట
ఖండనోద్దండవైరిప్రకాండకాండ
ఖండనాఖండ సత్కీర్తిహిండమాన
చండకోదండధరులు రాజన్యవరులు. ౯౯

చం. జనకుని భంగపెట్టి గురుశాపవిరోధము జెంది యాత్మమి
త్రుని సిరిగాంచి కుందుచు ప్రదోషమునంటి మయిం గలంకతన్
గని నిరతంబు సారసవనప్రతికూలత నొంది రాజుపే
రను జెలువొందె నౌర యని రాజిలు రాజులు రాజమాత్రులే ౧౦౦

చం. నవనిధు లింటగల్గు ధననాయకునిన్ శివభక్తుఁ డన్నచో
భవుఁడు దిగంబరంబున కపాలము చేఁగొని భైక్ష్యవృత్తికిన్
దవిలిన రాజరా జనుప్రధన్ గుడపర్వతరీతి గాంచె నం
చవిరతి గేలిసల్పుదు రహర్నిశ మప్పురి వైశ్యనాయకుల్. ౧౦౧

సీ. తాను శ్రీనాదుఁడై తగు నిల్లు మంచంబు
గానక పాలేటిగడ్డ నిలిచె
పోలింపఁగ మహావిభూతివంతుం డౌచు
నేకాలమును భిక్షమెత్తి బ్రతికె
వితతధనాధిపత్యత వహించి పిశాచ
సఖుని పంచ వసించె సంతతంబు
సిరిని తాఁగని యప్పుచే మునింగియు రాల
కట్ట మ్రోయుచు నరికట్టఁబడియె

గీ. ననుచు వికృతోక్తి లీలాప్రహాసములను
కేశవేశధనేశధనీశవరులఁ
గేలిసల్పుదు రఖిలాశ్రితాశికల్ప
వాటి యవ్వీటి మేటికిరాటకోటి. ౧౦౨

ఉ పండినధాన్యరాసులు నభం బొరయంగను, పైన జాళువా
పిండిని ప్రేయుముద్రలను విష్ణుపదీజల మంట పంకమై
మెండుగ తత్సరోజములమీఁదగ జారిన పైడితమ్ములై
యుండెను పాదజుల్ భగిని కున్నతిబంగ రొసంగరే భువిన్. ౧౮౩

ఉ. చాలిన పంటచే నూరుగు సస్యములన్ గననయ్యె నెట్లనన్
హాలికవృత్తి మమ్ము గనినట్టి మహిన్ ఖననం బొనర్చు శూ
ద్రాళి మదర్థమేకద యటంచు తదంతరకైరవాత్ములం
జాలు మరందబాష్పములు జారఁగ మూర్ఛిలుప్రాలు పోలికన్. ౧౦౪

సీ. కైదండఁగొనగోర్కెఁగలిగిన జేకొమ్ము
పైకమ్ము చేనుంచి పలుకవలదె
పాటించె దిచ్చనుబంతు లిష్టంబె నీ
వీబంధనపుమాట లింక విడువు
మఱినేమి శయ్యపైమాట లోకొనెదొ- చే
తోఁజాతకార్యమే తుది లభించు
మరుమాటలాడక ధర బొందుపెట్లు నేఁ
డిక ప్రొద్దుబోయె నింకేటిజాగు-

గీ నమ్మికల గొట్టిజూచుట నయముగాదు
మంచితావులగోరంట మనసుగలిగె
ననుచు నునుజూడ్కులను మరుల్గొనుచు, కోడె
డొరల కిత్తురు చిత్రవై ఖరుల విరుల ౧౦౫

సీ వేమారు ప్రీతిమై వెలగఁ జేకొననిమ్ము
తెలవాఱినందాక ఫలము గొనుము
పృథులకుచములు గప్పిన హేతు వేమి? వా
టిని జూడవలెనె వాడినవి గావు
తూఁగి నీ వాతెఱలోగల ఫలమిమ్ము
బలుకాటు ధరకొంట భరము గాదె

పడతి నీ సహకారఫలము చేకురు బెట్టు
　　మనసుగోరిన బండుగొనుచె సుఖము

గీ　హొందుగానిమ్ము బైకోర్కె లొందె తరుణి
కొను మనంగ సుఖాప్తి చేకొన వటంచు
మదనకదనానుమోదసంపదలఁ బొదల
ముదిత లెప్పాట ఫలము లమ్ముదురు వీఁట　౧౦౬

చం.　పురవరసౌధవీథుల నవోఢలు [1]వామనగుంటలాఁడు న
త్తఱి చెయి జింది భూనిపతితంబగు రత్నములెల్ల పౌరు లే
ర్పరపక ద్రొక్కఁగా ధరణి పాదుకొనన్ వసుధావధూటిని
న్వరుసను రత్నగర్భయని వాడిరి లోకములోన పండితుల్.　౧౦౭

చం.　పటుతరకంకణప్రకటభవ్యనినాదమునన్ మహోర్మికా
పటలవిరాజమున్ విధృతభాసురపుష్కరవిభ్రమంబు ను
త్కటతరమంజుకోకనదకాంతివిశేషసముజ్జ్వలంబుగా
నట కమలాకరంబులగ్రియం గమలాకరముల్ జెలంగెడిన్　౧౦౮

సీ.　హల్లకప్రసవసం ల్లసల్లికా
　　పల్లికాతల్లజవేల్లితములు
నిందీవరాచ్ఛమరందానుభవ సన్మి
　　ళిందబృందానందకందళములు
బిసకాండమండలగ్రసనమత్తమరాళ
　　రాజపక్షానిలభ్రాజితములు
సంభశ్చరన్మీనశుంభన్మహావాల
　　సంభూతజలబిందుజృంభణములు
తే.గీ　లలితకందర్పకేళీవిలాసకుతుక
పరవశభ్రాంతచక్రదంపతి విలాస

---

1. వామనగుంత (తాలి)

సత్కుశేశయరమ్యమౌ సరసి కాక
రమ్ములు తిరమ్ముగలుగు పురమ్ములోన. ౧౦౯

చ లలనలు మేఘరంజ నములాపనజేయఁ బయోదపంక్తిని
న్వెలువడి ముత్తియమ్ము లురువృష్టి ధరం బడి తత్సుగీతవా
క్కలన గరంగి యాచెఱుకుకాల్వల కెక్కిన తొంటిరూపులన్
మొలుచుటగాకి తుంటలను ముత్తియముల్ జనియింప నేటికిన్. ౧౧౦

సీ తనతురంగం బున్న తావిదే యనుచునో
ముగుదలముఖబింబములను వెదకి
తనహయం బాశచే జను మృగతృష్ణయో
యని సతీసఖముఖఘృణుల నెమకి
తనను ప్రైమోయువాహన మిదే యనియునో
లలనల నేత్రాంచలముల నరసి
తనహయమదసుగంధవ్యాప్తి యనుచునో
సుదతుల చనుఁగవల్ [1]జొచ్చి చూచి

గీ. పుడమి నెల్లను తనదు తత్తడిని గనక
బడలువడ దీరువెనుక నల్గడలు నెమక
గోరి యుపవనముల సేవదీర మెల్ల
మెల్లన జరించుచుండు సమీరణుండు ౧౧౧

చ విరులఁ దొలంగు పుప్పొడిని వెన్నెలకుప్పల నాడి పువ్వుదే
నెరసపుచెమ్మట ల్గురియ నేర్పలరం 'జెడుగుళ్ళ'నాడి క్రొ
మ్మెఱుఁగుల చిమ్ము జూచలుపమేడల 'జీకుమబండ'లాడి క
ప్పురఁపు టనంటి గుంపులను బూచుల 'దాగిలిమూత' లాడి వే
సరి కడుడస్సి దూబటిలి సారసనేత్రల చన్నుదోయి క
ప్పురముల చల్వ చెమ్మటలఁజెంది చెలంగు మరుత్కిశోరముల్. ౧౧౨

---

1. చూచి మూచి (లి)

సీ. శ్రీగంధవనలసత్సౌగంధ్యసుమనఃప
రాగాంధకారభారమున బొరలి
గంధసింధురదానగంధబంధురితపు
ష్పంధయోభయపత్రసంధి వెడలి
సంతతానూనవాసంతికాంతలతాంత
తాంతవిశ్రాంతిచే సంతసించి
సారకాసార విస్ఫారసారసవార
చారుసౌరభపూర మారగించి

తే.గీ. యంగనాలింగనానంగసంగరప్ర
సంగసంగతఘర్మానుషంగసురభి
తాంగుఁ డౌచుఁ జరించు పురాంగనాభి
రంజనుండైన మలయప్రభంజనుండు. ౧౧౩

మ. పురసౌధాగ్రములందు ముగ్ధయువతుల్ పుంభావకేళీరతీ
పరిరంభత్వర హారము ల్తెగినచో పయ్యంట సారింపఁగా
వరుసం జారిన మౌక్తికంబు లని విభ్రాంతాత్మలై దోయిటన్
బరఁగం దారల నెత్తఁజూతురు దమున్ బ్రౌఢాంగనల్ నవ్వఁగన్. ౧౧౪

చం. అతివలు సౌధవీథుల విహారము చేయుచుఁ దత్సమీపసం
గతసుమనోసరిత్కనకకంజము లాత్మసుసౌరభాపహా
స్థితిఁ గను చోరులంచు నతిశీఘ్రగతిం దమదీర్ఘకేశపా
శతతిని గట్టివైతు రళిఝంకృతుల న్మొరబెట్ట బెట్టుగన్ ౧౧౫

చం. సరసులయందు కోకనదసంఘములున్ విలసిల్లు తత్పురీ
తరుణులనేత్రసంపద కధఃకృతమై కనుమూయక న్మహా
వెరపుననున్న మత్స్యముల వేకరుణింపఁగ తామ్రపత్రికల్
బరువడి శాసనంబులుగ బంపినకైవడి యొప్పె మెప్పుగన్. ౧౧౬

చం. ఉపవనసంచర న్నృపవయోవనితాధరపాణిచారు కాం
తిపటలబింబపల్లవ సుధీసముపాగతకీరకోకిల

స్వపము పత్త్రివాతపరిచర్చితపుష్పరజంబు నొప్పె న
య్యుపవనలక్ష్మి విష్ణుపదినుంచిన యప్పటవాసమో యనన్. ౧౧౭

సీ. గబ్బిసిబ్బెపుగుబ్బ కవబంగరు(పుగిండ్లు
తరుణబాహుద్యుతుల్ తమ్మితూండ్లు
భువనమోహనమైన బొమలు సింగిణివిండ్లు
తెలికనుంగవలు శ్రీదేవియిండ్లు
ఘనకటిద్వయము చొక్కు(పుజాలువా బండ్లు
తులలేని యధరముల్ దొండపండ్లు
తనుదీప్తి మీనకేతనుని పువ్వులచెండ్లు
వలచి దావలపించు తలిరుబోండ్లు
గీ. దొరల గిడిగిండ్లు మేడ లబ్బురపుటిండ్లు
యిండ్లమద్దెండ్లు బలువిటకాండ్ల దండ్లు
కల్లపండువుగల వెలయాండ్లపిండ్లు
వేడ్క విహరించుచుందు రవ్వీటియందు ౧౧౮

సీ. తమచంచలతలు నేత్త్రములను సంధించి
సతులైన ఘనతటిల్లతిక లొక్కొ
తమకఠినతలు సుస్తనములందున మాటి
తరుణలౌ వజ్రపుత్తలిక లొక్కొ
తమవక్రతలు కుంతలములలోపల డాపి
కాంతలౌ శశిమయూఖంబు లొక్కొ
తమపాండురతలు హాసములలో దవిలించి
గరితలౌ తారకాగణములొక్కొ
గీ. సకలలోకైకవంచనాధికతపఃప్ర
భావభావభవప్రభాప్రభవసిద్ధి
యోగధేయులు పల్లవభాగధేయు
లైన వేశ్యాంగనలు గుంపులు గతుల ౧౧౯

వ. ఇప్పగిది నొప్పులకుప్ప యగుచు నొప్పు నప్పురంబు వొప్పుఁ జెప్పనొప్పని మెప్పుగను కప్పురంపు పుప్పొడులకుప్పలం దొప్పు గొప్పయుప్పరిగల కప్పుతాతిప్పలందొప్పు కప్పురగంధుల కప్పుకొప్పులం జొప్పడు కమ్మ విరిపుప్పొడులు గుప్పుగుప్పునం దెప్పదేలి, యమందకుందమందార నిష్యందమరందబిందుబృందమ్ముల నందంద నానందఁబులం బొంది, మందమందగమనంబునం బొలయు ఘుమ్మరంపు కమ్మతెమ్మెరల తుటుమ్ము లిమ్ముగా నభ్రంకషశుభ్రమణిగణకిరణస్ఫురణభర్మహర్మ్య భాగవినిర్మలసముల్లసన్నవనవరత్నసంఘటిత వాతాయన జాతంబుల వలనం జొచ్చి, ప్రవీణవైణికావీణానూనతానగానమ్ము లనవద్యహృద్య పద్యాదివాద్యవైశద్యాలాపంబులు కర్ణకలాపంబులుగా నుచ్చస్థానంబుల మూర్ఛశయ్యా మిత్రవర్జ భేదచాతురీరీతులసుధారసధారాప్రధానమాధురీ కౌశలపేశలంబులంగరపు తదపరోధవధూగాత్రఘర్మబిందుసందోహపరి శ్రాంతి నొందించు సుందరీబృందకరారవిందకలితకంకణకింకిణీమంజుశిం జారవంబులు విషమాపాయతాళమానంబులుగా చివ్వచివ్వనన్ విసరు పువ్వసు రటీల మన్వంపుపిల్లవాయువులం గలసి మెలసెడిచిత్రంబుల వశీ కృతగాత్రలై యవలోకించు సురసుందరీసందోహంబులం దనరు సాల భంజికాపుంజరంజిత పద్మరాగాధరవిలోకనబింబఫలభ్రాంతంబులై బాలర సాలఫలజాలంబులం బాసి గమకించి నిశితనాసాపుటంబులం బొడచి, చిత్తంబులనిరాశాయత్తంబులై శుకపికారావంబులం బ్రకటించుచు సౌధ వీథికాగారబహిర్ద్వారాంగణవలమానమంగళతోరణప్రాయంబులై శ్రేణీ రూపంబులం బొలయు శుకనికర పక్షవిక్షేపణాఽక్షీణవాతజాతవిధూతసు మరచోపటలపయోధర భ్రాంత తాండవకేళీవిలోలపురకామినీపరిపాలిత కేకీనికాయవిలసిత చంద్ర కాంత-మణి స్తంభసంభరిత శుంభచ్చాత కుంభ కుంభవిజృంభమాణమంచ ప్రాకారగోపుర విటంక విరాజిత ప్రతిగృహ ప్రాంగణంబునై - వసుదే వసందనా వాసంబు గావున సాక్షాత్ త్రివిష్టపంబును కృష్ణవర్త్మపవిత్రంబు గావునరెండవవైశ్వానరపుట భేదనంబును హరికుమారసంచారంబు గావున నభినవపరుణనివాసంబును - మహాబలసంవృతంబుగావునఁ బ్రతిభటవాయు నగరంబును, ముకుందశంకమకరాంకకలితంబుగావునఁ బ్రతియలకాపురంబును. నిరంతరార్యానుషంగంబుగావున నపూర్వకైలాసంబును, దానవారి యుక్తంబుగావునఁ బ్రశస్తవైరోచనిహస్తంబునై యుండె వెండియు. ౧౨౦

ఉ. ఆ నగరంబులోఁ గనకహర్మ్యములం గల బాలికల్ సుధా
ఖానునితో స్వకీయముఖపంకజవైరము నెంచి ధీయటం
చానఁగ దాకినన్ నొసటియచ్చపుకస్తురిబొట్టు నంటఁగా
దాన కళంకి యౌటయెగదా! మఱి గానము వేఱె హేతువున్ ౧౨౧

లయగ్రాహి. తుంగములు వైరిజనభంగములు విజయరణ
రంగములు మత్తమాతంగములు, శుంభ
త్స్వాంగములు నిర్జితకురంగములు, చిత్రగతి
చంగములు పారసితురంగములు, నుద్య
చ్ఛృంగములు సంగరాభంగములు రుగ్జితప
తంగములు కాంచనలతాంగములతోఁ బౌ
రాంగణ మభంగురజయంగతసుసంగతి బొ
సంగె నతిమంగళతరంగము లొసంగన్. ౧౨౨

మ. వరగంధర్వచయంబు పుణ్యాజనసద్వాసంబు లుద్యద్ద్విజో
త్కరగేహంబులు-కాంచనద్రుమములున్ గన్పట్టు నవ్వీట నే
వరగంధర్వచయంబు పుణ్యాజనసద్వాసంబు లుద్యద్ద్విజో
త్కరగేహంబులు కాంచనద్రుమములున్ గన్పట్ట నవ్వీటనే. ౧౨౩

సీ. మండితతారకామండలంబును బోలె
కవిబుధద్విజరాజకలిత మగుచు
చారుమహామేరుశైలరాజముఁ బోలె
సర్వజ్ఞు ధర్మ్మప్రశస్త మగుచు
రామణీయకతుషారగిరీంద్రమును బోలె
వరసర్వమంగళావాస మగుచు
బంధురస్ఫురితకిష్కింధాపురము బోలె
నుత్తాలతాలసంవృత్త మగుచు
తే గీ. క్రమతరమగు స్వర్గలోకంబుఁ బోలె
లలిసదానందనందనోల్లాస మగుచు

సరసకాసారమునుబోలె పరమహంస
మోదనంబగు నప్పాటభేదనంబు ౧౨౪

సీ. అనృతు లనాచారు లజ్ఞు లకృత్యకు
లనభిజ్ఞు లకృతజ్ఞు లనభిజాత్యు
లనభిమాను లదాను లల్పాయు లవగుణు
లవిలక్షణు లభాగ్యు లవికృతఘ్నుl
లన్యాభిలాషు లమాన్యు లనారోగ్యు
లల్పు లనధ్యాయు లనుపకారు
లప్రమాణపాత్రు లతిదూష్యు లపరాధు
లశుభు లనాకారు లప్రశస్తు
గీ. లనతిథిప్రియు లతిచోరు లచట లేక
మిగుల నొగలను పగలను వగల యెగల
కుందుదు రఖండసంపద ల్నిండి యఖిల
తేజములఁ బూని ద్వారకారాజధాని. ౧౨౫

సీ. అజ్ఞానమెల్ల సుప్తావస్థలందునే
చాపల్య మింతులచక్షువులనె
పక్షపాతము ఖగప్రతతులయందునే
వక్రప్రవృత్తి భ్రూవల్లికలనె
యతిజాడ్యతలు సతీగతిచమత్కృతులనే
బహుదరిద్రత మధ్యభాగములనె
వితతమూర్ఛలు గానవిద్యలయందునే
నయనబాష్పంబు లానందములనె
తే.గీ. పీడతాడన లారతిక్రీడలందె
గాని గానఁగలేని యనూనమైన
సిరుల బొరలుచు నఖిలదిగ్వరులుఁ బొగడఁ
గరము తిరమయ్యె ద్వారకాపురము గరిమ ౧౨౬

మ. నగరిన్ సౌధసౌఖాగ్రకర్షణత మేనం గప్పు నొప్పంగ నా
ఖగజైవాతృకబింబయుగ్మములు రాకన్నె ల్వీలోకించి మి
త్రగతిం గుంకుమ నింపఁగా నరుణుఁడై రాజించెనేగాక ని
మృగధారింబలెనే దివాకరునకున్ మేన్కందుబాటిల్లదే ౧౨౬

కం తత్పుటభేదన మాసుర
హృత్పుటభేదనుఁడు జగదధీశుఁడు గుణసం-
పత్పటలుం డాఖండల
జిత్పటరథుఁ డేలుచుండు శ్రీకృష్ణుఁ డనన్ ౧౨౭

కం. ఈ త్రిభువనజనముల కతఁ
డే త్రాతయు నేత యభవుఁ డీశుఁ డనఘుఁ డా
చిత్రచరిత్రులు దశశత
నేత్రుం డణుమాత్రమైన నేర్చునె తెలియన్ ౧౨౮

శా. శ్వేతద్వీపమున న్వికుంఠనగరిన్ శేషాహితల్పంబునన్
చేతఃప్రీతి నజాదులుం గొలువ లక్ష్మీభూమినీళ ల్పదా
బ్జాతద్వంద్వసపర్యఁ జేయ సుఖుఁడౌ సాక్షాత్పరబ్రహ్మ మీ
రీతిం ద్వారకలో వినోదగతి వర్తించెన్ సుఖేచ్ఛారతిన్. ౧౨౯

మ. అరిదిం జూడఁగ చిత్రకూటరుచి రామాహ్లాదమౌ నీపురం
బరిదిం జూడఁగ చిత్రకూటరుచిరామాహ్లాదమై యొప్పె నీ
హరినిం జూడఁగ చిత్రకూటరుచిరామాహ్లాదుఁడుం గాడె య
వ్వరుసన్ భూజనపాలనక్రియకళావర్ధిష్ణుఁడై రాజిలెన్. ౧౩౦

సీ శ్రీస్తనస్తబకవిన్యస్తకస్తూరికాం
కస్తుతాస్తోకవక్షస్థలుండు,
తండోపతండసత్కాండజాతభవాండ
మండితాఖండపిచండిలుండు,

సంగరాంగణసముత్తుంగవిహంగమ
పుంగవాభంగతురంగముండు,
నక్షీణకరుణాకటాక్ష వీక్షాదక్ష
చక్షురంభోజవిలక్షణుండు

తే గీ సర్వపూర్వామరాఖర్వదుర్వహోగ్ర
గర్వనిర్వాపణ మొనర్చి యుర్వి ధర్మ
నిర్వహణధూర్వహుండై జనించినాఁడు,
అఖిలకార్యచణుండు నారాయణుండు ౧౩౮

సీ. పుట్టుపిన్నతనానఁ బూతనజనుఁబాలుఁ
గొసరి బ్రాణములతోఁ గ్రుక్కఁగొనియె,
బసిగాపుతుటుము కుబ్బసమైన కార్చిచ్చు
కసటుకారపుమందుగా గ్రహించె
సుడిగాలిరక్కసు మెడమేడమీద ను
య్యాలజంపాలగా లాలిఁ దూఁగె
నిండుచల్లనిగాలితిండి కాళియునిపై
దుడదుడవడి తప్పటడుఁగు లిడియె

తేగీ వింతగోవర్ధనాద్రిచే బంతులాడె
లాలితాశ్చర్యబాలలీలావినోద
మహిమహిమనొప్పు నమ్మహామహుని సద్గు
ణములు వాఙ్మనసాగోచరములు భూప. ౧౩౯

సీ. తనపూర్వభాగ్య సంతానంబని దలంచి
నిండుపండువుగ నందుండు జెలఁగ
దినదినాభివ్యక్తిగని ఘనుం డగుటకు
మదిని యశోద సమ్ముదము బొదల
చారుజగన్మోహాకారరూపము గాంచి
వల్లవీయుల్లముల్ పల్లటిల్లి
దీప్రలలామానుషప్రభావము గాంచి
యఖిలలోకము విస్మయమున జెలఁగ

తే.గీ మొలకవలె సౌకుమార్యమై మొగ్గరీతి
వృత్తమై, పుష్పముంబలె వికచమై, శ
లాటువలె నీటుగల్గి, ఫలంబు గలిగి,
మధురమై తేనెవలె మధుమథనుఁ దలరె. ౧౩౩

సీ. పరగ నందునితపఃఫలపు ముద్దులపట్టి
వల్లవీపల్లవభల్లమూర్తి
గోపికానికరానుకూల కులస్వామి
హితబంధుజనముల కింటివేల్పు
చాణూరముష్టికప్రాణాశనీఘాత
కంసవిధ్వంసనకాలమృత్యు
వఖిలమౌనీంద్రసదానందతత్త్వంబు
తతఖలప్రతతి కుద్దండదండి

గీ. పావనేతరమూఢమనోవికలుఁడు
నరులకద్భుతసుఖజీవనప్రదాయి
యగుచు లీలామనుష్యవేషగతుఁ డయ్యె
కుటిలసంహర్త సాక్షాద్వికుంఠభర్త. ౧౩౪

సీ. మనుజులు పురుషోత్తమఖ్యాతిఁ దీపింప
సతులు శ్రీకాంతసంగతిఁ జెలంగ
నిభరాజములు కుంభినీశస్థితిని గోర
హయములు హరిసమాఖ్యత వహింప
రథములు పీతాంబరస్ఫూర్తిఁ జెలువొంద
సరసులు చక్రభృత్సరణిఁ దనర
సుమలతావలి మధుసూదనస్థితి నొప్ప
వనతతుల్ మాధవవ్యాప్తి నెసఁగ,

తే గీ సర్వమును విష్ణుమయ మటు సరణిఁ దెలియ
జనుల నవికుంఠతాభోగఘనతఁ దేల్చి

మొదల సారూప్యసామీప్యముల నొసంగి
తదనుసాయుజ్యసత్ఫలాస్పదుఁడు నయ్యె. ౧౭౫

సీ. పాలేఁటితరఁగలపై దోలలాడు స
ర్వాంగంబులను జిడ్డునంటుకొఁచు
శయనించువేళ భుజంగరాడ్భూత్కార
విషవహ్నిఁ గ్రాగిన వెచ్చఁదనము
జడదారిగమి చెంతఁజేరి పూజింపుచు
వినుతింప నోటివాసనల పెడుసు
బీదదాసరులు చప్పిడియుప్పుడుల్ బెట్ట
వాచవి న్మెసఁగు నరోచకంబు

గీ. దీరెను యశోద పుడిసెడుతేఁటనీట
గోపికానీకచందనాలేపనమున
వల్లవస్త్రీకచాననవాసనలను
విప్రభామార్పితాపూపవితతివలన. ౧౭౬

సీ. శ్రీరమాంశసుజన్య శ్రీరుక్మిణీకన్య
సాధ్వీజనలలామ సత్యభామ
చిత్తజవిజయ ప్రమత్త దంతిసుదంతి
తతమృదుగాత్రి మార్తాండపుత్రి
పతిహితోపేత జాంబవదాత్మసంజాత
చిత్రభోగానంద మిత్రవింద
లలితసద్గుణపేటి లక్షణాఖ్యవధూటి
నిఖిలకార్యాభినిర్నిద్ర భద్ర

గీ. దర్పకోద్యత్కురంగి రాధాలతాంగి
మొదలుగలచంద్రవదనల సదనములను
మదనకదనానుమోదసంపదలఁ బొదలి
వసుధ కంసారి సంసారివలెఁ జెలంగె. ౧౭౭

మ. కరుణాసింధువు భక్తవత్సలసమగ్రప్రీతి జన్మించి యు
ర్వ్వరుసం బూతన, బండిరక్కసుఁ, దృణావర్తుం, బకున్ మద్దులన్
ఖరునిం, బౌంద్రకు, జైద్యునిన్, నరకునిం, గంసున్, మురుం
ద్రుంచి భూ
భరముం బాపి నిరంకుశప్రతిభచేఁ బాలించుచుండెన్ భువిన్. ౧౩౮

కం. ఈరీతి నష్టమహిషీ
నారీతిలకములచే ననార్యతము నిజే
చ్ఛారీతి మెలఁగుచును ఘన
వారీతులనుడిపె నతఁ డవారితకరుణన్. ౧౩౯

కం. ఆలమ్మున మురనరకుల
గూలంగ నడంచి తెచ్చుకొనినట్టి పదా
ర్వేలాంగన లాలింగన
లోలింగన దా ననంగయుక్తి నెసంగెన్. ౧౪౦

కం. గారామున గోరిన వని
తారాజిని గలసి మెలసి తా రాజిలె ని
త్యారామసీమలందు వి
హారామలచిత్తవృత్తి నత్యుత్సుకుఁడై. ౧౪౧

కం. క్షుద్రారిమదవిదారుం
డద్రీంద్రసమానధీరుఁ డఖిలసుగుణని
ర్నిద్రసముద్రుం డగు బల
భద్రుం డగ్రజుఁడు నెగడె భద్రయుతుండై ౧౪౨

చం. తలప ననంతుఁడై మొదల దాస్యములెల్ల లభించి పిమ్మటన్
సలలితరామచంద్రు ననుజన్ముఁ డనందగి లక్ష్మణాఖ్యచే
నెలకొని యగ్రజుం డలర నిత్యసపర్య లొనర్చి గావె యీ
యలఘుఁడు కృష్ణమూర్తి కిపుఁ డగ్రజుఁడై చెలువొందె వేడుకన్. ౧౪౩

కం. తమ్మునియెడ నరలేని హి
తమ్ము నిగుడ సర్వసమ్మతమ్మున దమచి
త్తమ్ము లెఱింగి మెలంగిరి
తమ్ము నిఖిలసురలు సంతతమ్ము నుతింపన్. ౧౪౪

చం. ఘనమణిలోన కాంతు లెడగాని తెఱంగున, బుష్పములన్ సుగం-
ధనిచయము ల్దొలంగనివిధమ్మున, మర్త్యునితోడ నీడ యేఁ
గునటుల, క్షీరనీరములకున్ హితమైన తెఱంగు రేవతీ
శునకును కృష్ణమూర్తికిని జొప్పడుమైత్రి గణించ శక్యమే. ౧౪౫

ఉ. సంగరరంగవైరిజనచండపరాక్రమనిర్దళత్సదా
భంగురవిక్రమక్రమణబాహుబలాధికు లంగనిర్జితా
నంగులు యాదవాన్వయజనాధిపు లాబలభద్రకృష్ణు లు
త్తుంగయశోవిశాలపరితోషితు లౌచు జెలంగి రిమ్మహిన్ ౧౪౬

మ. హరిపాదోద్భవయౌట నగ్రజనకవ్యామోహతన్ దేవని
ర్ఝరిణిన్ గౌఁగిటఁ జేర్చినట్లు ధవళచ్ఛాయాంగముం దోప న
వ్వరుసన్ భానుసుతానుయోగమున నేవస్త్రంబు నైల్యప్రభన్
స్ఫురణింపం బలభద్రుఁ డాయతభుజస్ఫూర్తి న్విడంబింపగన్. ౧౪౭

ఉ. ఆతఁడు రైవతుం డను నృపాగ్రణిసూతను రేవతీసమా
ఖ్యాతను ధీసమేతను జగత్ప్రియపూతను రూపవిభవో
పేతను, సత్కృతేతరవిభీతను, నిర్మలసచ్చరిత్ర సం
ఘాతను బెండ్లియాడె కనకంబును సౌరభ మందుకైవడిన్. ౧౪౮

సీ. కమలమ్ము చెలువమ్ముగని దిమ్ముగొనజిమ్ము
నెఱిసొమ్ములకు, సొమ్ము నెమ్మొగమ్ము,
పగడంపు వగగుంపు నొగినొంపు చెఱువంపు
జిగికెంపు తులకింపు చిగురుమోవి,

యరవిందములబ్బంద మరడింద పొలుపొందఁ
గలయందమున జెందఁ గలుగుకనులు
జతజక్కవలకెక్కు నుతికెక్కు గతినిక్కు
రుచినెక్కు బెదనెక్కు కుచయుగంబు

తే.గీ. మించు మించుగమించఁగా మించుమేను
కరముదరమును దరము కంధరము భరము
మెఱుఁగుతఱఁగల బరఁగు బిత్తరపుతరులు
జడలమెకములసుడివడ నెగడు నడుము. ౧౪౯

మ. బలుఁ డారేవతితో నిరంతరము శుంభత్కేళికామందిరం
బుల నుద్యానవనాంతరంబులను సొంపుస్మీరు పూఁబాన్పులన్
బలభిన్నీలహరిన్మణీవిరచితప్రాసాదహర్మ్యాంతరం
బుల కందర్పవిలాసవిభ్రమణసమ్మోదాత్ముఁడై వర్తిలున్ ౧౫౦

ఉ. వారికి ముద్దుచెల్లెలు సుభద్ర యనన్ లలనాలలామ శృం
గారసమగ్రసీమ కసుగందని పున్నమచందమామ వి
స్తారగుణాభిరామ తనుధామవినిర్జితహేమ మోహనా
కారతటిత్ప్రధామ యనఁగాఁ దగె పల్కులతేనెతేమయై ౧౫౧

గీ. నవరములనెంచు తనకు దాసవరులంచు
బర్హములనెంచు టది కరం బర్హమనుచు
తమము గణుతించు టదియె నుత్తమ మటంచు
కప్పుఁగలకొప్పు భృంగాళి కప్పులొసఁగు ౧౫౨

కం. తొడలా రంభవిజృంభణ
లొడలా హేమప్రభావ మురునాసిక జూ
పడు నాతిలోత్తమాకృతిఁ
గడువేడుక మంజుఘోషగతిఁ దగె పలుకుల్. ౧౫౩

చం. కనులబెడంగులున్ నగుమొగంబు మెఱుంగు పిఱుందురేవి చ
క్కని నెఱిసోగముక్కు గమకంబు గళఁ బధరంబు కెంపు మే

ల్చనుఁగవ పొంకము న్నడుముసన్నదనం బలబోఁటిసాటియౌ
వనితల మూఁడులోకములవారి నెగాదిగఁ జూడఁ గానమే. ౧౩౪

కం. ఆకాంతాతిలకంబున
కే కవ్వడిచే జనించు హితుఁ డభిమన్యుం
డాకామపాలనందని
గైకొన్న కథాక్రమంబు కడబడ వినవే. ౧౩౫

వ. కావున నిట్లఖిలజగద్వల్లభుండగు రమావల్లభుండు నందవ్రజసుందరీసందోహనయనారవిందానందకందళత్సుందరతామందిరుండును, అనర్ఘ్యమణిగణకిరణస్ఫురణదేదీప్యమానహారకేయూరకటక శ్రీవత్సకౌస్తుభవైజయంతీవనమాలికాకుండలగ్రైవేయప్రముఖదివ్యభూషణుండును, సహస్రకోటిభాస్కరనిరాఘాటసుషమావిడంబితరథాంగ శంఖాసిగదాధనుర్ధరణచతుర్భుజవిరాజితుండును, నిఖిలజగత్పూజితుండును, సమస్తవస్తుజాతాస్తోకవితరణప్రశస్తనిరస్తస్వస్తరుస్తోముండును, యదువృష్ణిభోజాంధకకులార్ణవరాకాసుధాకరుండును, షడ్గుణైశ్వర్యసంపన్నుండును, దేవకీజఠరశుక్తిముక్తాఫలుండును, షోడశసహస్రరాజకన్యాపరివృతుండును, అష్టమహిషీసేవితుండునునై యుండె వెండియు — ౧౩౬

తే.గీ. అఖిలలోకాధినాథుఁడై యలరు శౌరి
నందనందనుఁ డగుచు నేడిందు మధుర
శూరసేనాదిదేశముల్ భూరిమహిమఁ
బూని పాలించె నుగ్రసేనానుమతిని ౧౩౭

తే.గీ. పుండరీకాక్షుఁ డఖిలబ్రహ్మాండనాథుఁ
డొండులేనట్టిమహిమ నఖండవైభ
వుం డగుచు నుండువార్త నీరెండుచెవుల
నిండ వింటివి దీని నటుండనిమ్ము. ౧౩౮

కం. ఆశాంతవిశదకీర్తి సు
రేశ బిలేశయకులేశు లెన్నఁగ నతిష్ఠం

కాశమగు చెలువుగల కురు
దేశము గల దదియు మున్ను దెలిపెద వినవే ౧౫౯

మ. అటపాండుక్షితినాథసంతతికి నిత్యావాసమై హోమవి
స్ఫుట సౌధాంతరవేదికాంబుజముఖీకుంభ స్తనాగ్రస్ఫుర
త్పటవాసప్రమదప్రమోదితసభోభాగీరథీనీరజో
త్కటచంచద్భ్రమరీకదంబమగు నింద్రప్రస్థము న్భాసిలెన్. ౧౬౦

కం. చంద్రప్రస్తరనిర్మిత
సాంద్రప్రస్ఫురితహేమసౌధోన్నతని
స్తంద్రసురేంద్రపురప్రతి
నింద్రప్రస్థంబు దగె నహీనశుభగతిన్ ౧౬౧

మ. పరిఖాసాలశిఖాపతాకభవనప్రాసాదరథ్యారథ
ద్విరదోత్తుంగతురంగసద్భటవితర్దిద్వారహర్మ్యాసర
త్తరుణీధాన్యధనస్ఫురన్మణిగణోద్యానంబులన్ సంపదా
కరమై యుండె పురంబు ద్వారకపలెం గల్యాణసంధాయియై ౧౬౨

సీ. వావిదప్పువిధాతవర్తన నిందింతు
రతిసదాచారులౌ నచటి ద్విజులు
ధనువునీడిన జామదగ్ని నెమ్మది మెచ్చ
రతిసాహసాంకులౌ నచటినృపులు
నాదిభిక్షునిమైత్రినలరు ధనదుని గేలి
సేగ్గింతు రచటి వణిగ్గణములు
చేబూనె హలము నిస్సీబలుండేమందు
రఖిలధాన్యసమృద్ధి నచట శూద్రు

తే. లామహామేరుసదృశంబు లచటిరథము
లభ్రవిభ్రాజితంబులౌ నచటిగజము
లనిలవేగంబు మదిమెచ్చ వచటిహయము
లశనిశకలంబులను బోల్తు రచటిభటులు, ౧౬౩

సీ. సురగురుప్రముఖు లప్సరిమహావిద్వాంస
జనుల కంతేవాసిసముదయంబు
దేవతాకవిముఖ్యు లావీఁటికవివర
శ్రేణికి లేఖికాచిత్రఘనులు
నిర్జరవైణికానీకంబు లచ్చటి
గాయకాళికి శ్రుతిదాయకులును,
దేవాంగనలు తత్పురీవారకామినీ
పటలంబులకు దృష్టిపాత్రసమితి

గీ. దైవతద్విపమచటిదంతావళముల
కింటిపెంపుడుగున్న వేగంటిజేని
తురఁగ మటనుండు హరులకు బరువుతట్టు
వనఁగ నాకంబు తత్పురంబునకు నెనయె. ౧౬౫

కం. వితతద్యుతి తత్పుర మతి
చతురతఁ బాలింతు రఖిలజనవితతి మహో
న్నతినీతిగతిని పాండు
క్షితిపతిసుతు లతులితతాపజితవిమతగతిన్. ౧౬౬

కం. దుర్జయులు ధర్మసుతభీ
మార్జుననకులసహదేవు లనవరతయశో
పార్జితులు పటుధనుర్జ్యా
గర్జితనిర్జితరిపుప్రకరు లూర్జితులై. ౧౬౭

మ. ధరణీదేవసమర్చనం బఖిలవిద్వన్మైత్రి సత్యవ్రత
స్ఫురణోద్వృత్తి,భుజాబలంబు,జయనైపుణ్యంబు,నుద్దామసం
గరరంగప్రబలప్రతాపము,త్రిలోకవ్యాప్తసత్కీర్తిసం
భరితుల్ చంద్రకులప్రదీపకులు నప్పాండుక్షితీశాత్మజుల్. ౧౬౮

సీ. జనులయం దుద్యానవనులయం దొకరీతి
సుమనోవిలాసవిస్ఫూర్తిఁ దనర

కరులయందును రాజవరులయం దొకరీతి
బంధురప్రమదసంపదఁ జెలంగ
నగరాంతరమ్ము తగ్గగనాంతరము రీతి
ఘనలసత్సంపదాకరముగాఁగ
పౌరులం దాహవశూరులం దొకరీతి
పరధర్మదీక్షానుకరణ మెసఁగ

తే గీ. కార్ముకములందు సత్సతీగణములందు
నొక్కరీతిని సుగుణప్రయుక్తిఁ దనర
ధర్మతనయుండు ప్రతిపురందరునిలీల
రాజ్య మట నేలె నొకటఁ గొఱంతలేక ౧౬౮

కం ఏలన్వలె నితఁడే భువి
నేలన్వలె నితరధారుణీశ్వరు లనుచు
న్మేలెన్నఁగఁ గురుమండల
మేలె న్నగభిత్సమానహితభోగములన్ ౧౬౯

కం అందఱిలో మధ్యముఁడు పు
రందర నందనుఁడు యదుపురందరకరుణా
మందకటాక్షేక్షణరస
మం దనురాగంబు డెందమందు నటింపన్ ౧౭౦

కం. వేయాలకింపుమాటల
వేయేల వచింప పాండవేయున కేనయే
నాయజుఁడుం గానుజుఁడున్
వాయుజుఁడుం జతురరూపవరభుజబలిమిన్. ౧౭౧

చం. పదములు లేఁజిగుళ్లు నఖపంక్తులు తారలు జానుజంఘల
భ్యుదయము, లూరువు ల్పొగసు లున్నతమౌ పిఱుఁదుల్ మనోహరా
స్పదమగు బొజ్జ, దిద్దినకవాటముదీటు వెడందఱొమ్ము- న
వ్వొదవెడు తేఁటమోము చెలువొందఁగ భాసిలె మోహనాకృతిన్. ౧౭౨

ఉ తీరిచినట్టులు న్నొసగుఁదేరుబొమల్ కనుదోయినిండు సిం
గారము చారలం గొలువఁగాదగు కంబుగళంబుడంబు నొ
య్యారపుఁజెక్కులుం దళుకుటద్దము లున్నతబాహుమూలవి
స్ఫారరుచుల్ జెలంగ నెఱప్రాయమునందు కిరీటి రాజిలెన్. ౧౭౩

ఉ. సూనృతజన్మభూమి తనుసుందరతానిధి ధర్మమార్గసం
స్థానము కీర్తివాస ముచితంబులతావు వివేకరాశి సు
జ్ఞానగృహంబు శాంతజనకంబు వివేకనిధాన మంచు స
న్మానతఁ గాంచె పాండునృపమధ్యమపుత్త్రుఁడు రాజమాత్రుఁడే. ౧౭౪

మ హరితో స్వర్గము కేఁగి ఖాండవవనం బాయగ్నిభట్టారకే
శ్వరు సంతుష్టి నొనర్చి తత్కరుణ భాస్వద్దివ్యగాండీవకే
తురధాశ్వాస్త్రచయంబులుం బడసి దోర్దృప్తి శౌరి కారుణ్యభా
వకతిన్ స్వర్గసుఖైకభోగముల దేవస్వామిలీలం దగెన్. ౧౭౫

తే గీ అతఁ డీరీతి నీలజారాతిభాతి
దినదినంబును గళలెల్లఁ దేజరిల్లి
నిఖిలసుగుణము లొకతట్టు నిలిచినట్టు
సమధికప్రాభవముఁ జెందు సమయమందు ౧౭౬

కం ద్వారకలోపల నందకు
మారకసోదరిసుభద్రమంజులరుచిరో
దారకథలోక్కరికదై
వార కరము వినియె మిత్రవర్గమువలనన్ ౧౭౭

ఉ కోరికచే భ్రమించు,సమకూడుటలే విధియంచు నెంచు,కం
సారి గలం డటంచు ధృతి యాశదలంచుఁ జలించు గాంచు నే
మారు గృశించుఁ దాళఁ దరమా యని యెంచు భ్రమించు మించు వే
సారకె చేఁజలించు చెలిచక్కదనంబు గణించు చిత్తమా
ద్వారకయందు నుంచుఁధను ధానె గమింపదలంచుచుండఁగన్. ౧౭౮

తే గీ. దైవవశమున నొక్కభూదేవమౌళి
గోగణంబులఁ దస్కరుల్ గొని పలాయ
నంబు గొనిరంచుఁ దెల్పఁగా నరుఁడు సాధు
రక్షణైకాభిరతి సత్వరమున లేచి ౧౭౯

కం. వడి వెంటనడచి తస్కరు
లడుగంట నడంచి తెత్తునని ధర్మజు మే
ల్పడ కింటనుండు ధనువున్
కడగంటం గని బిరాన గైకొని జనియెన్. ౧౮౦

ఉ. దొంగల నంగలోఁ గలసి దోర్బలశక్తి కరివ్రజంబులో
సింగముభంగిఁ దూకి పటుశింజిని మ్రోయ గడంగి విక్రమా
భంగురసంగతిన్ విశిఖపంక్తుల వారలఁగూల్చి గోగణం
బుం గొని నిస్సహాయజయభూరియశోన్నతిఁ దెచ్చెఁ జెచ్చెఱన్. ౧౮౧

కం. తెచ్చినగోగణములఁ దా
నిచ్చిన భూసురవరేణ్యుఁ దెచ్చినప్రేమన్
మెచ్చి నయోక్తుల దీవన
లిచ్చి నిజాలయమునకు సుఖేచ్ఛం జనియెన్. ౧౮౨

గీ. ఇంటి కేతెంచి యర్జునుం డొంటిఁ దలఁచె
వింటికై యగ్రజుని పడకింటఁ జొచ్చి
యుంటి-నిటువంటి కాలుష్య మంటకుండ
పంటవాల్గంటి వలఁగొంట గెంటు ననుచు. ౧౮౩

కం మతికేను భూప్రదక్షిణ
గతికే నిశ్చయముసేయఁగా ద్వారవతీ
స్థితి కేఁగుటయు-సుభద్రా
సతికేళికి నిదియ యుక్తసమయం బనుచున్ ౧౮౪

ఉ. అన్నకు మ్రొక్కి-నీదుశయనాలయ ముద్ధతిఁ జొచ్చి మచ్చుపై
నున్న శరాసనంబు గొని యొక్కధరామరగోగణాపహున్

భిన్నముజేసి విప్రునకు బ్రీతి నొసంగితిగాని పాపమం
చెన్నక నీగృహంబు జొరు నీయపరాధ మికెట్లుఁ బాయునో. ౧౮౫

వ. అనిన- ౧౮౬

కం తమ్మునితో ననలేక హి
తమ్మునిమిత్తమ్ము దుష్కృతమ్ములు జేయం
దమ్ముజొర వనుచు శ్రుతిజా
తమ్ములు మొఱవెట్టె సంతతమ్ము కిరీటీ! ౧౮౭

గీ దీని కొకమేర గలదు సుధీవరేణ్య!
భూప్రదక్షిణమేబోలు గోప్రదక్షి
ణంబనుమఁ దెల్పె ముని పురాణమ్ములందు
వినయము లెఱుంగవే రాజతనయ! సనయ! ౧౮౮

తే. గీ. చెప్పినట్టుల నా మాట చెవిని నాట
మతిని దలపోయుమంచు సమ్మతి వచించు
నేర్పు చెలువొందు ధర్మజు నీతియందు
నెయ్య మింతైన గనక దానియ్యకొనక. ౧౮౯

చం తలఁపు సుభద్రపైఁ గలకతమ్మున, ధర్మజుఁ డెన్నిధర్మముల్
బలికిన, భూప్రదక్షిణ నెపంబునగాని మనోరథంబు నా
కలవడదంచు నెంచి- తనయన్నకు మ్రొక్కి- సుధీజనంబుచే
సెలవు గ్రహించి వల్దని వచింపఁ గమించెను శీఘ్రగామియై. ౧౯౦

కం అటుపురి వెలువడి గంగా
తటినిన్ రంగత్తరంగ తట సంగటనా
ర్భటినిం గాశీనగరని
కటినిం గని నిటలతట విఘటి తాంజలుఁడై. ౧౯౧

చం. తన పరివార యుక్తముగ తానములాఁడి యనేక తైర్థికా
జనములు ప్రాణమిత్రుఁడు విశారదుఁ డర్మిలి వెంటఁ గొల్వ మౌ

ననియతితోఁ జపించు నెడ నాగకుమారి యులూచి నాకన
త్కనక బిస ప్రసూన ధళధాళధళాయతనేత్రిఁ గాంచియున్ ౧౯౨

ఉ. ఆదరహాస మామురిపె మా సొగ సొరుచి యావిలాస మా
హ్లాదము గొల్పఁగా గని యయారె వయార మిటుంత మిటుండ వల్దె యం
చాదరలీల మెచ్చుచు మహామటు మాయల విద్యచే నరుం
బ్రోదిగ బట్టి వేఁగఁ గొనిపోయెను భోగవతీపురంబుకై. ౧౯౩

ఉ. అంతట పాకశాసని యొరయాపుఁగన్నులు విచ్చి జూచి య
క్కాంత యులూచి నాగకులకామిని గాఁగ నెఱింగి మోహవి
భ్రాంత దురంత కంతు శరబాధితుఁడై వలపాపలేక న
త్యంత కుతూహలంబున యధావిధి గూడె ననంగసంగతిన్ ౧౯౪

కం. ఆ పూప పాప జవరా
లాపార్థున మోఘ వీర్యమది సద్యోగ
ర్భాపాదితమై కడు మే
ల్గా పాపఁడు బొడమె నతఁ డిలావంతుఁ డనన్ ౧౯౫

ఉ. దానముహూర్వికాస విదిత స్థిత మానసుఁ డౌచు కూరిమిన్
దానము లెన్నియో సలిపి తైర్థిక సంఘముఁ జేరఁ బోవ డెం
దాన ముదంబు సంధిలఁగఁ దద్భుజగాంగనఁ జూచి యట్లనెన్
దానము చిద్విషత్సుతుఁ డదభ్ర మహాభ్రరవభ్రమోక్తులన్ ౧౯౬

ఉ నీరజపత్రనేత్రి విను నీవును నీసుతుఁ డేను తీర్థయా
త్రారతిదీర్చు పిమ్మట పురమ్మునకుం జనుదెమ్ము మత్పురీ
వారము లాత్మ నెంత వలవంతల జెందిరొ ! పోయివత్తు నం
చారసికుండు బల్కి సతియట్లనె జేర్చెను జాహ్నవీతటిన్ ౧౯౭

ఉ. అంత కిరీటిరాకకు నిజాశ్రితులైన విశారదాదు ల
త్యంతకుతూహలాభ్యుదయమంద యులూచి మనోహరాకృతిన్

స్వాంతమునం దలంపుచు హిమాద్రికివేఁ జనియుం దదీయప
ర్యంతధరిత్రిసేనవిడి యన్నియమించి యుదంచితంబుగాన్. ౧౯౮

ఉ. బంగరుకొండపట్టి తనపట్టపురాణిగ మేలుమేటి య
ర్ధాంగము భర్తనంటిన మహాసతి నిన్గనుభాగ్యశాలి యు
త్తుంగపవిప్రహారమున దొర్లనిబిడ్డనిగన్నతండ్రి చూ
డంగడుమానికంబుల కొటారము శీతనగంబు గాంచియున్. ౧౯౯

ఆ.వె. అరయ సర్వమంగళావాసమై యొప్పి
హితవిభూతిచే సహీనకటక
రమ్యమగుచు నీధరాధరమ్మను గిరీ
శాఖ్య గనుటకేమి యబ్బురంబు. ౨౦౦

సీ. తత్ప్రదేశంబునదగు నగస్త్యవటంబు
గాంచి యచ్చట నిర్గమించి వెడలి
రహి భృగుశృంగహిరణ్యతీర్థము గ్రుంకి
నైమిశారణ్యమునకు గమించి
నారాయణస్వామి నారాధన మొనర్చి
యాప్రయాగకు నేఁగి యటఁ ద్రివేణి
సంగమంబున గృతస్నానుఁడై మాధవుఁ
బొగడి పంచక్రోశమునకు నేఁగి-

తే.గీ. కడలి మణికర్ణికను గ్రుంకి గయకు నరిగి
పొగడి శ్రీపురుషోత్తమంబునకు నడచి
శ్రీజగన్నాథశౌరి నీక్షించి కొలిచి
యాతలను గౌతమీనదీస్నాతుఁ డగుచు ౨౦౧

కం చని చని యనిమిషనాథుని
తనయుండు సమస్తపుణ్యతటినీతతిమ
జ్జనదానవిధు లొనర్చుచుఁ
గనుఁగొని యాకృష్ణవేణికడకుం జనియెన్ ౨౦౨

చం. పులినశ్రీకటి మీనలోచన లసత్ఫుల్లాంబుజాతాస్య యు
జ్జ్వలచక్రస్తని జీవనభ్రమణభాస్వన్నాభి చక్రాంగమం-
జులయాన త్రివళీతరంగ మధులిట్ శుంభత్కచాబంధ కో
మలబింబాధర కృష్ణవేణి హరిరామాయీ నదీయైనదో ! ౨౧౩

వ. అని వినుతింపుచు ౨౧౪

కం. అటు తటుకున వెడలి మహో
త్కట శుభద మహోబలంబు గని గడఁచి రుచి
స్ఫుట పటల దిక్తటము వేం
కట మహిభృత్కటకమణినికటమున విడిసెన్ ౨౧౫

ఉ. శ్రీ తిరువేంగడప్పని భజించి పదంపడి కాంచికాపురీ
నీతనతాదరు న్వరదునిం గని మ్రొక్కి కవేరకన్యకా
శీతల వీచికా తుషిత చిత్త సనాథుని రంగనాదు స
త్యాతుర భక్త పూజ లిడి యవ్వల సేతువు గాంచి వేడుకన్ ౨౧౬

తే.గీ. శ్రీ ధనుష్కోటి స్నానంబుఁ జేసి వెడలి
పదియు మూఁడవ నెలకు నప్పాండుసుతుఁడు
మహిని మలయధ్వజుం డేలు మణిపురమ్ము
చెంత నొక్కెడ నుపవనసీమలోన ౨౧౭

ఉ. రంగదనంగమంగళతురంగి మెఱుంగుల మేలితావి సం
పంగి విలోలలోచన విభంగిత బాలకురంగి మోహనా
పాంగి కళానుషంగి రుచిరాబ్ధితరంగి మనోహరాంగి చి
త్రాంగద పేర నొప్పు మలయధ్వజు కూతురుఁ గాంచె దవ్వులన్. ౨౧౮

సీ. కనుఁగొన దళుకు తళుక్కని దృష్టి లోఁదోఁచ
ఘనతటిల్లతిక యంచును దలంచు

ఘనతటిల్లతకు నిల్కడ గల్గునే! నిండు
    వెన్నెలతేఁట యంచు న్నుతించు
వెన్నలతేఁట కీ వన్నెలా? వలరాజు
    చిల్కపటానితేజి యని గాంచు
చిల్కపటాని కెమ్మెల నడ ల్గలవె? రా
    యంచ గాఁబోలు నం చతిశయించు

గీ నైన రాయంచ కలరు నీమేని సొబఁగు
మేని సొబఁగును బూనిన ప్రాణమైన
గుందనఁపుఁ బొమ్మ గాఁబోలు నిందువదన
యనుచు వినుతించె తమినాటి యా కిరీటి. ౨౦౯

తే.గీ. పడతి నడఁకకు మును గజపతియు నోడె
హరిపతియు సూక్ష్మ మధ్యమం బందు నోడె
సుదఁతి మెఱుఁగైన వాడి వాల్చూపు తూఁపు-
లరసి నరపతిలోఁబడు టబ్బురంబె. ౨౧౦

కం. విజయుం డాసతి మలయ
ధ్వజు కూఁతురుఁగా నెఱింగి తమిచే నబ్భూ
భుజు పాలికావిశారదు
నిజసుమనోరథముఁ దెలుపు నెట్టన బనిచెన్ ౨౧౧

చం. పనిచిన నాతఁ డర్థిజని పాండ్యపతిం గని బల్కె పాండుభూ
జనపతిసూనుఁ డర్జునుఁడు చక్కని నీతనయన్ వనంబులోఁ
గనుఁగొని యుద్వహక్రమణకౌతుకహేతుమనీషఁ డౌచు మీ
మనమరయంగ బంపె ననుమానపుమాని యొనర్పఁగాఁ దగున్. ౨౧౨

కం అని విని యెనలేని ముదం
బును బెనఁగొన బల్కెఁ బాండుపుత్రునకును నా
తనయను సతిఁగా నొసఁగం
బనిపడె నిది యింతకన్న భాగ్యము గలదే ! ౨౧౩

కం ఈకన్యకామణికి యిపు
డా కవ్వడిచే జనించునట్టి కుమారు-
న్నా కలిమికి రాజ్యమున క
నాకులగతి సాధుఁ జేతు నని సమ్మతుఁడై ౨౧౪

చం అని యిటు లుత్సహించి శుభమైన ముహూర్తము నిశ్చయించి, మే
ల్గనరుపనుల్ రచించి, విబుధప్రతతిం బిలిపించి, పెండ్లికూఁ
తునకు నలంకరించి, పటుతూర్యనినాదము మించి దిక్కులం
బెనఁగొన మేళవించి పురవీధుల చిత్రము లేర్పరించియున్ ౨౧౫

చం. వరుస నవద్యహృద్యశుభవాద్యము లెల్లెడ నిండి మ్రోయ క
ప్పురఁపుమెఱుంగు టారతులు పుణ్యవధూజను లీయ, వృద్ధభూ
సురవరు లాగమ ప్రథిత సూక్తుల దీవన లీయ, పాండ్యభూ
వరసుతకుం గిరీటికి వివాహ మొనర్చి రతిప్రమోదులై ౨౧౬

తే గీ మధురవృత్తులు రీతులు పృథుగుణములు
గలుగు కూతురునకు నలంకారము లిడి
పాండుసుతునకు మలయధ్వజుం డొసంగె
కవి రసజ్ఞుకు కృతినిచ్చు కావ్య మనఁగ ౨౧౭

చం. ఇటులం బెండ్లి యొనర్పఁ బిమ్మట నరుం డిచ్చారతిం గొన్నినా
ళ్లట చిత్రాంగదకేళికారతిసుఖాయత్తాత్ముఁడై యుండున
ప్పట నయ్యంగన కందిపుచ్చుకొనురేవం గర్భచిహ్నంబు లం
తట జూపట్టె నహస్కరాభ్యుదయప్రోద్యత్పూర్వశైలక్రియన్ ౨౧౮

క తొమ్మిదినెల లీగతి నతి
నెమ్మదిగా గడచినంతనే శుభమౌ ల
గ్నమ్మిదియని వినుతింపఁగ-
నమ్మదిరాక్షి కిని తనయుఁ డపు డుదయించెన్ ౨౧౯

క తనమనుమని గనుఁగొని నం
తన యనుకంప పాండ్యధరణీపతియుం

దనదుహితాపత్యంబున
దనదు హితం బమరెనని ముదంబున జెలఁగన్ ౨౨౦

చం. అతనికి బభ్రువాహనుఁడు నా నొక నామ మొసంగి యర్జునుం
డతులితతద్ధరాతలమహాధి పతిత్వము వానికే దహో
వ్రతవిధిగాఁ దదన్వయిమఁ రంజిలఁగా నిడి వారిచే సుహృ
ష్టత సెలవందుచు న్వెడలె చయ్యన దక్షిణతీర్థయాత్రకై. ౨౨౧

మ. చనుచో పంచముఖప్రవాహ మగుచున్ సౌభద్రతీర్థంబు నా
జను దత్పంచకపుణ్యతీర్థములలో స్నానంబు గావింపఁ బో
యిన నందచ్చర లేవు రాది నొకమౌనీశోగ్రశాపాహతిం
ఘనన(క్రా)కృతి బూని తైర్థికుల ద్రిమింగం జొచ్చుట గ్గాంచియున్. ౨౨౨

కం. తనచే శాపవిమోచన
మును జేకురు దెలిఁగి తీర్థముల గ్రుంకిడి యం
తను వామకరముచే తొలి
తనువామకరములు దాల్ప దరిబడవై వన్ ౨౨౩

చం. చనుఁగవపొంకముం జిగురుచాయిలవాతెఱలు న్నెరాతళు
క్కనుజిగిమేనులున్ సటువులైన పిఱుందులు ముద్దుమోములుం
గనుఁగవమేల్చెడంగులు చొకాటపుచక్కని సోగముక్కు లిం
పునజెలువొందువేల్పుఁ బువుబోఁడుల రూపముదాల్చి నిల్చినన్. ౨౨౪

కం అంతట నకాకాంతలవ్ర
త్రాంతము నాద్యంతమరసి యతిమృదుభాషా
సంతతులన్ వీడ్కొలిపి య
నంతర మటవెడలి పశ్చిమాశాస్థలికిన్. ౨౨౫

ఉ. వచ్చి ప్రభాసతీర్థవనవాటికడన్విడి ప్రాణమిత్రుఁ డా
యచ్చుతుఁ బిల్వఁ బంప నతఁ డర్జును చిత్త మెఱింగి యిట్లనున్

వచ్చినభావ మేర్పడె సుభద్రను రాముఁడు రాజరాజుకే
నిచ్చెద నన్నవాఁడు సతి నేగతినైనను నీకె గూర్చెదన్. ౨౨౬

కం. అన విని వనజనయను మన
మున తనువెనరెనయ నునిచి పనుపనుకొనురీ
తిని వనిత నెనయు చనువును
వెనుకొను కపటత్రిదండివేషము దాల్చెన్. ౨౨౭

సీ. ఘుగఘుగవాసించు మృగనాభిఁ దుడిచి స
ద్విమలమృత్స్నోర్ధ్వపుండ్రమును దీర్చి
పుటపాకగాంగేయపటము సడల్చి కా
షాయవస్త్రము గటిస్థలి ధరించి
జ్యావల్లికాటంక్రియావిధాయకమైన
దక్షిణపాణి త్రిదండ మూని
గాండీవగుణకిణాంకంబైన డాకేల
సలిలపూరితకమండలువు దాల్చి

తే.గీ. వీరరసమెల్ల నిర్జించి విమలశాంత
రసము నేకీభవించి తారసిలునట్లు
ఘనజగన్మోహనాకారుఁ డనఁగ నెగడు
విజయుఁ డవ్వేళఁ దాపసవేషి యయ్యె. ౨౨౮

కం చెలులవిడి సన్న్యసించుట
లిలలో సహజం బటందు రీ చెలికై యా
శలఁజెంది సన్న్యసించఁగ
నలవడి యర్జునుఁడు రైవతాద్రికిఁ జేరెన్ ౨౨౯

కం. ఈవిధి రైవతకాద్రివ
నీవాటిం జేర్చి మౌననియమము చే ధా
త్రీవరతాపసవేషను
ధీవరమతి నుండు మనుచుఁ దెలిపి హరి జనెన్ ౨౩౦

కం గోపాలాగ్రణి యంతటి
లోపలనే బోయి పురములోపల జనులన్
రేపే రైవతకోత్సవ
మాపాదింపంగవలయునని చాటింపన్. ౨౩౧

శా. నందుం డాదిగ యాదవుల్ మిగుల నానాజాతిజాతంబు గో
విందప్రీతికరాంగనాజనము వేవేల్ రాజకన్యాజనం
బుం దేవేరులు రుక్మిణీప్రభృతులున్ భూషామణిస్ఫీతులై
యందందం జనుదెంచి రప్పురములో నాబాలగోపాలమున్ ౨౩౨

శా ప్రీతిన్ రైవతకోత్సవంబునకు శౌరిన్ గూడి రాముండు దా
నేతేరం గపటత్రిదండికడ కెంతేనేర్పునం జేరి కం
జాతాక్షుండు వినమ్రుఁడై బలికె నోస్వామీ! కృప న్మీరలీ
చాతుర్మాస్యము మద్గృహంబుననె భిక్షం జేయ వేంచేయరే ౨౩౩

వ. అని యక్కడలి బోదమిన జడుతపదతివదయుం దవ్వేదఁగు జదదారి
యొడంబడునటుల మదతనుడువుల నుడివిన- ౨౩౪

కం. అనుజుం దనుమాటకు బలుఁ
డనుమతిఁ గైకొనఁగ నుత్సవాంతంబున నే
తనుతనవారలతో న
మ్ముని దోకొని బోయి భవనమున వనవాటిన్. ౨౩౫

కం. నిలిపి, సుభద్రామణి న
య్యలఘునకు సపర్యసేయునటు నియమించెన్
బలదేవుఁడు మునులకు క
న్యలెకా శుశ్రూషజేయనగు వారనుచున్ ౨౩౬

కం. అన్నల యనుమతి నీగతిఁ
గన్నియ శుశ్రూషజేయఁగా దొరకొనియెన్

మున్ను ధనంజయు నెనయ మ
ది న్నెగడు మనోరథంబు దీరు నటంచున్ ౨౩౧

సీ. ౧ అరుణపల్లవము లాదరణత నిడు-తన
యధరంబు సాటివి యన్న యట్లుఁ
౨ బుష్పముల్ దెచ్చి నేర్పుననిచ్చు తనసౌర
భాంగము కివి సాటి యన్నయట్లు
౩ రసఫలంబులుఁ దెచ్చి యొసఁగును తనమధు
రాలాపముల సాటి యన్నయట్లు

తే.గీ. విమలపత్రపుటంబుల విధుశిలాది
పాత్రలను నించి, వినయసంభ్రమత మించి,
భక్తి సేవించి విజయుండు పతియుఁ గాఁగ
గోరియానారి రాజదదారిఁ జేరి. ౨౩౨

సీ. చారునఖద్యుతుల్ చరణారుణచ్ఛటల్
గలసి కుంకుమగంధ మిల కొసంగ
మంజీరశింజినీరంజితధ్వని శుకా
రావంబుతోడ బేరజము లాడ-
వాల్గన్నులమెఱుంగు వాఁడిచూపులు దిశా
తతుల పువ్వుల వసంతంబు లాడ
పాణిపల్లవరుచుల్ పటుకంకణధ్వనుల్
కలకంఠములను విందులకుఁ బిల్వ

తే గీ ఘంటికాకాంచి లేఁగౌనునంటి మ్రోయ
బలుని యనుమతితోడ సపర్యఁ జేయ
మనసు భద్రముగా వేగమున సుభద్ర
భక్తితోఁ జేరె మాయాతపస్వికడకు. ౨౩౩

కం. ఇటు లాకుటిలాలకనృప
జటి కభ్యర్చనలు సలుప సలుపఁగ మునిహృ

త్పటము దిటమెల్లవిడి యం
తట నేనర్జునుఁడ ననుచుఁ దగఁ బలుకుటయున్. ౨౪౦

మ. మునుపే వాసవి రూప చిహ్నముల నాప్తుల్ జెప్పఁగా విన్నరీ
తిని యమ్మౌనికి గాననయ్యెనని సందేహింపఁగా తథ్యమ
య్యె నటంచు న్ననుసిగ్గు దొంతరలు నయ్యేణాక్షికిం దోడుగా ౨౪౧
జని యభ్యంతరసీమఁ జేరె తను సంజాతాహతస్వాంతయై.

తే.గీ. అన్న యెడ రుక్మిణి సత్యలన్ని చిన్నె
లెన్ని వెన్ను నిచే మున్ను విన్నకతన
కన్నె కన్నుల విలుకాని బన్నములను
సన్నగిలనీక శిశిరముల్ గొన్ని బన్ని. ౨౪౨

చ. నరునకు భోజనోపకరణ ప్రముఖార్చన లాదరించి త
త్పరిణయ కార్య సంఘటన బంకజనాభుఁ డొనర్ప మేచకాం
బరుఁ డిది విన్నచో సమయ భంగ మొనర్చు నటంచు హస్తినా
పురమునకుం బ్రయాణమయి పోయె నిజాగ్రజుతోడ గూడుకన్. ౨౪౩

సీ. తన మంత్రి వరులతోడను సుభద్రార్జునో
ద్వాహరహస్యములు యుక్తముగఁ దెలిపి
కేవలహిత సాత్యకీ యుద్ధవాదులఁ
దగు కార్యముల జాగ్రతల నమర్చి
నేర్పు మీఱఁగ రుక్మిణీ సత్యభామల
హితశుభక్రమణసంగతి విధించి
కవ్వడితో లగ్నకాలంబు కిదె వచ్చె
ద నటంచు నభయ ప్రదాన మొసఁగి

తే.గీ. జనని యెడ నుంచి సుముహూర్త సరణి నెంచి
లలి సుభద్రార్జునులకు నలంకరించి
హితపురోహితు లతికుతుకత ధరించ
విధి విధాగతిఁ బెండ్లి గావించి మించి. ౨౪౪

సీ. కుచకోకముల మైత్రి గొనఁగ తానై వచ్చు
పూషుం దనఁగ తాళిబొట్టు గట్టి
కల్యాణ లోకనాగత ఘనచ్యుత వృష
తృటలంబనా దలఁబ్రాలు వోసె
తనమన్మథవ్యథల్ తరళాక్షి చెవితోన
జెప్పనేఁగినమాడ్కి చెట్టఁబట్టె
నీకాలిగోరున కేకాంతసరియన్న
భావంబుగా సప్తపదము లానె

తే.గీ. భీషణత మున్ను దన్ను దపింపఁజేయ
మేటికందర్పశరవహ్ని మ్రింగునట్లు
దోప హోమాగ్ని నాత్మ నారోపణంబు
సలిపె సమయోచితము జూచి సవ్యసాచి ౨౪౫

తే.గీ. అంతలోన సుభద్ర హృదంతరమున
గొంత సంతసమంది యొక్కింత చింత
నన్న రాఁడాయెనని యనుకున్న తఱిని
చెల్లెలి మనంబుఁ గని దారసిల్లె శౌరి ౨౪౬

ఉ. అత్తఱి శేషహోమదివసాంతమునన్ ఫలశోభనోత్సవా
యత్త మొనర్ప మోదమున నర్జునుఁ డంగనతో దినత్రయిం
జిత్రజకేళిలో మణితసీత్కృతహావవిలాసవిభ్రమో
పాత్తమనస్కుఁడై ప్రముదితాంబుధిలోఁ దగ నోలలాడుచున్. ౨౪౭

సీ. తనువుననంటు చందనకర్దమము నాఁటి
భసితాంగరాగసంపదను దెలుపఁ
దళుకుకుంకుమజిల్కు మొలశాటి మునుపటి
కాషాయవస్త్రసంఘటన దెలుప
నుదుటిము త్తెఁపుసరు లెదనొత్తుటలు నాఁటి
నలినాక్షమాలికోన్నతిని దెలుప

ఘాలంబు నంటి తత్పదనఖరేఖలా
మృతోన్నిద్ధపుంభ్రసమృద్ధిఁ దెలుప

తే.గీ. నంగజానందయోగాంతరంగుఁ డౌచు
ప్రేమనధరామృతాతిధ్యభిక్ష మెసఁగి
యోగియో గాక కామినీభోగియో య
నంగ వెడలెను దత్కేళికాంగణంబు. ౨౮౮

శా. ఈలీలన్ సుఖవార్ధినిం దనిసి లక్ష్మీశుండు వీడ్కొల్పఁగా
చాలా ప్రేమను రుక్మిణీముఖసతుల్ ప్రక్చందన స్వర్ణవ
స్త్రాలంకారము లిచ్చిపంపిన బురం బర్థిన్ బ్రవేశింపఁ బో
నాలో కొందఱు సీరపాణిహితు లుద్యత్కోపసన్నద్ధులై ౨౮౯

ఉ దొంగవలెన్ సుభద్ర నడె దోకొనిపోయె కిరీటియంచు ను
త్తుంగబలాంగులై తనునెదుర్కొనువారి నాధను
శ్చ్యంగుఁడు పుష్పసంభృతనిషంగుఁ డెఱుంగఁడె లోనగెల్చి య
బ్బంగి శుభాంగితోఁ జనియె భంగజయంగతపేటి పీటికిన్ ౨౯౦

కం నానావిధవాద్యంబుల
నూనగతిన్ మ్రోయఁ బురజను లెదుర్కొనఁగా
నూనాస్త్రకోటి రుచిరన
వీనాంగుఁడు తత్పురప్రవేశం బాయెన్ ౨౯౧

కం. సతిపతు లీరీతి ననా
రతము హితము దోప సౌఖ్యరతి మెలఁగుతఱిన్
కతిపయదినములకును త
త్సతి కతికుతుకతను నెలమసలె సలలితమై. ౨౯౨

చం. తనువు చెమర్పసాగె, కనుదమ్ముల మబ్బు ఘటిల్లె వేవిళు
ల్గనఁబడె చన్మొనల్ నలుపుఁ గాఁదగె చెక్కులు వెల్లనయ్యె బో
జనము లసహ్యమయ్యె గతి జాడ్యత గాంచెను. మంటిపెల్లలం
దున రుచిమించె జిట్టములుదోఁచె కటిం బెగడయ్యెఁ బోటికిన్. ౨౯౩

కం. ఈ రీతి గర్భచిహ్నము
లాలోలవిశాలనేత్రికలవడఁగ సము
త్తాలానువేలసుషమా
జాలారుణవిలసదుదయశైలము బోలెన్. ౨౫౪

ఉ అంత లతాంతపేశలశుభాంగి సమస్తజనుల్ కుతూహల
స్వాంతులుగా నవగ్రహశుభాకలితాద్భుతలగ్నమందు శ్రీ
కాంతజయంతనైషధనృకాంతవసంతమంజులా
క్రాంతమురంతబాహుబలరంతు దిగంతరకీర్తివంతునిన్. ౨౫౫

స్రగ్ధర. కనియెం బుత్రుం బవిత్రుం గలుషచయలతాఖండనోద్దండదాత్రుం
ఘనగాత్రు జైత్రు న్నచ్చరిత్రుం గలితదరహసత్కంజాతనేత్రున్
జనమిత్రున్ శత్రు న్సకలబుధజనాబ్జాతసంఘాతమిత్రున్
జననాథస్తోత్రపాత్రుం బటులరిపువనజ్వాలికావీతిహోత్రున్. ౨౫౬

మ శరజాతప్రభవుండు నేర్పు దనరం జాంబూనదం బందు భా
స్కరబింబంబును సానబట్టి రజముం జల్లించి రాకాసుధా
కరసారంబును చిందుచుం బడునుగాఁ గైజేసి మర్దించి శం
బరవైరిం బడి యచ్చునొత్తి సృజియింపం బోలు నబ్బాలునిన్ ౨౫౭

సీ కురువంశవల్లికాంకుర మీతఁడని కోర్కె
దనరఁగా ధర్మనందనుఁడు జెలఁగ
నాపదుద్ధరణహస్తాలంబ మీ యప
త్యం బని భీముఁ డుత్సాహ మంద
స్వర్గాపవర్గసంసర్గహేతువె పుత్ర
సంతాన మని సవ్యసాచి యలర
బాలకుండీక్షణభాగధేయ మటంచు
నకులుండు సహదేవునకు వచింప

తే.గీ. నిటుల ననుకంప జనకుల కేర్తరింపఁ
బొల్పు దీపింపఁ గౌతుకంబున నిలింప

వరులు విరులను వర్షింప సిరుల బెంపఁ
దరమె వినుతింపఁ బడఁతి కాతఁడు జనింప. ౨౫౮

కం. నెనరున గుంతీసతి దా
గనుఁగొని గనుగొనల వివిధగతులన్ మతులన్
జనువనుఁగుల్ బెనఁగొనఁగన్
మనుమని మను మనుచు దీవెనల నిడి వేడ్కన్. ౨౫౯

కం. నరుడుం గన్నకుమారుని
పురుఁడుం గణుతింపఁగలఁడె భువనత్రయి న
మ్మరుఁడుం గలఁడేమో యని
బురుఁడుం గావించి రఖిలపుణ్యాంగనలున్. ౨౬౦

ఉ. ధన్యుఁడు కల్పకవ్రతివదాన్యుడు విశ్రుతరాజలోకమూ
ర్ధన్యుఁ డనారతాశ్రితశరణ్యుఁడు రూపవిలక్షణైకసౌ
జన్యుఁడు దుష్కరారిజయసైన్యుఁ డితం డగుగాక యంచు స
న్మాన్యుఁడు ధర్మసూనుఁ డభిమాన్యుఁ డనన్ మహదాహ్వయం బిడెన్.

సీ. సకలాగమాంతభాసకశాస్త్రిచే బృహ
స్పతిరీతిని మహానుభావుఁ డగును
నిఖిలాస్త్రశస్త్రప్రముఖనీతి చతురత
పరశురామసమప్రభావుఁ డౌను
సంతతాత్మజ్ఞానసంసర్గను సనత్కు
మారునిగతి జగన్మాన్యుఁ డగును
కమనీయసుందరాకారగౌరవమున
కందర్పకోటిసంకాశుఁ డగును

తే గీ. ననుచు దీవించి ధర్మజుం డతిశయించి
దానము లొనర్చి జాతకోత్సవ మొనర్చె
బ్రియము మొనదేల నిధిఁ గన్న బేదలీల
నుల్ల మిగురింప నభిమన్యుఁ డుద్భవింప. ౨౬౨

సీ. తలనంటి మేనజొబ్బిలఁగ జమ్మి ర్బ్యాసి
 సకలాంగములు దిద్ది చక్కనొత్తి
జలకముల్ గోర్వెచ్చజలములచే నార్చి
 తడిబోవఁ గర్ణరంధ్రముల నూది
చలువసన్నపు పుట్టములమేన దడియొత్తి
 పట్టుపొత్తుల మెత్తపడక నునిచి
నునుపైన కాటుకఁ గనుదమ్ముల ఘటించి
 బొమలుదీరిచి యుక్కబొట్టుఁ బెట్టి

తే గీ. పొదిఁగిటను జేర్చి పాలిచ్చి బుజ్జగించి
కెంపురవచెక్కడంపు నిద్దంపు సొంపు
నింపునుయ్యాలలోన నిద్రింపు మనుచుఁ
బాటఁబాడుచు నూచి రాపట్టినపుడు. ౨౬౩

సీ. కనుఱెప్పలిడక చక్కనజూచు తనకూర్మి
 తండ్రిని గను బురందరుని బోల్కి
పాలబుగ్గలపెంపు బరఁగును దనకుల
 స్వామిబుట్టిన దుగ్ధజలధిలీల
కరము లల్లనజాచి కదలించు తనవంశ
 కర్తయై తగుసుధాకరునిమాడ్కిఁ
బుడమినిల్వడి తప్పడుఁగుల నిడు బలి
 మథనుఁడౌ తనమేనమామ పగిది

తే.గీ. వైభవగభీరరుచిరకృపాభిరతులఁ
దేజరిలునంచు నికవేరె తెలుపనేల
ననుచు బుధులు నుతింప నయ్యతివబెంప
చిన్నిబాలుఁడు ముద్దులఁ జేయుచుండు. ౧౬౪

సీ. తొల్లైపైపికిలిబంతులుజూడఁగా సాగె
 మొగమెత్తి పొరలి బోరగిలసాగె

చెల్వమౌ జోపాట వెవియొగ్గి వినసాగె
కిలకిల నగి ముద్దుజిలుక సాగె
కూర్చుండి చప్పట్లు గ్గొట్టి యూగఁగసాగె
వేడుకల్ జూపి దొగ్గాడసాగె
చేతుల నప్పచుల్ జెయిమన్న జేసాగె
వడి తప్పటడుఁగుల నిడఁగసాగె

తే గీ. నంతకంతకు దోఁబూఁచు లాడసాగె
నెత్తుకొని దించుమనపుడు పోర్వెట్టసాగె
బిలుచువారలతొడలపై నిలువసాగె
మాటికతఁ డిట్టు ముద్దులమూట గట్టి ౨౯౫

శా చుంచుం బుత్తడి ముత్తియాల్ మెలుచుకుచ్చు ల్పచ్చరా లుచ్చులున్
మించం జాలు కడేలుడా ల్దొడల గ్రొమ్మ్రంమం గమించుం గరాల్
రించత్కాంచన నూత్న రత్నకృతమౌ జాబిల్లి ఫాలాగ్రమం
దంచత్ప్రీతి చలింప క్రీడఁగొను లోకానందసంధాయియై. ౨౯౬

కం. దుడదుడ నడుఁగులు దడఁబడ
కడువేడుక నిడుచు తల్లి కడ నాడును నే
యెడ ధర్మ మిటుల భూస్థలి
నడుఁగుల నడిపింతునని యథార్థముదోపన్ ౨౯౭

శా. గున్నై న్న మిన్నగు చిల్కుతాళ్ళ సరిఫిణీల్గొలుసుల్ సరాల్కుండలాల్
సన్నాజిల్గురు మాల్తురాయి మొలనూల్ జూపట్టు నట్టిట్టుమే
ల్వన్నెల్ గుల్కఁగ నాటలాడుతరి నవ్వయ్యార మయ్యారె యే
మన్నాతీరున కండ్ల పండువలు సేయం జూడఁగానే వలెన్ ౨౯౮

కం. ఈ చందంబున బాలుం
డాచందనగంధి బెంప సభ్యుదయుండై
యాచం చపమామతో తుల
దూచం దగు మేని కళలతోఁ బెరుగుతటెన్. ౨౯౯

వ అంతం గ్రమక్రమంబున నెలబాలునింబోలు నబ్బాలుండు దినదిన
ప్రవర్ధమానుం డగుచు నుండె మఱియును ౨౨౦

ఉ అంతట రాజసూయ మహదధ్వర మా సమవర్తిసూనుఁ డ
త్యంత ముదంబునన్న ఆలుప నర్థిఁ దలంచి దిగంతరావనీ
కాంతుల నెల్లఁ గెల్వ మురఘస్మరుఁ డెందు సహాయ మంచు సు
స్వాంతమునం దలంచి యనుజన్ములకీ తెఱఁగెల్లఁ దెల్పియున్. ౨౨౧

కం. నయమీ క్రతువు విపక్ష
క్షయము యశస్సర్వ దిగ్విజయ మఖిల సుహృ
త్ప్రియము వశీకృత లోక
త్రయ మిదియు నుపక్రమింపఁదగునని మఱియున్. ౨౨౨

కం. గెలుతము శాత్రవనృపతుల
వెలుతము తద్రాజ్య కలిత వివిధ శ్రీలన్
నిలుతము సత్కీర్తి నిదే
ఫలితము లోకైక ధరణి పాలుర కెల్లన్. ౨౨౩

వ. అని వచించి విజృంభించి ౨౨౪

కం. తమ్ములకు రథభటాశ్వ గ
జమ్ములనిడి భూనభోదిశాగతరిపురా
ష్ట్రమ్ముల విజయమ్ములచేఁ
గొమ్మని రమ్మనుచు వీడుగొలిపి ముదమునన్ ౨౨౫

సీ సంజయాదినృపాలకుంజరాన్వితు సహ
దేవుని దక్షిణదిశకు బనిచెఁ
బ్రకటసేనాచతుష్ప్రకరంబుఁ గొలువఁగా
నకులుని పశ్చిమాశకు విధించె
దుర్జనరిపుజయోపార్జితుండగు సవ్య
సాచిని యుత్తరాశకు విధించె

భద్రకేకయమత్స్యపతులతో భుజబలో
ద్దాముని భీముఁ బ్రాగ్భూమి కనిపె

గీ. నంత చతురంగభూతలాక్రాంతమనుజ
కాంతసంతానదుర్మదధ్వాంతతాంత
కాంతికాంతనిశీథినీకాంతులన దు
రంతవిక్రము లగుచు నంతంత వెడలి ౨౭౬

కం. ప్రాచీనదక్షిణప్రత్యగు
దీచీభూభాగదుర్మదీభూతధరి
త్రీచక్రేశులధైర్యసు
ధీచతురత గెలిచి వారలతిత్వరితగతిన్. ౨౭౭

చం. నలుదెసలం జయించి నరనాథులచే తగుయప్పనంబు లు
జ్జ్వలతరనూత్నరత్నగజవాజిశతాంగభటాంగనాంబరం
బులు శిబికంబులుం గనకభూషణము ల్గొనిదెచ్చి ధర్మజుం
డలర నొసంగి మ్రొక్కి వినయాన్వితులై వచియించి రున్నతిన్. ౨౭౮

కం. మీపంపున గాదే రిపు
భూపాలుర గెల్చి జయముఁ బొందితిమి భవ
త్కోపానురూపమై దగు
చూపున కెవఁడైన వ్రేలు జూపం గలఁడే! ౨౭౯

కం. అని వినయమునను తము దె
చ్చిన ఘనకనకమణిధనవిశేషములను స
య్యన నొసఁగిన నవియు సుయో
ధను నందుకొనంగ నాజ్ఞ తగ నియమించెన్ ౨౮౦

కం గంభీరనిధి యుధిష్ఠిరుఁ
డంభోరుహనాభు నియమ మటుగొని సవనా

రంభోరుమతిని తత్త
త్సంభారములుం గ్రమానుసరణతఁ గూర్చెన్ ౨౮౧

సీ. అఖిలార్తిజనమనోహరవస్తుసంచయం
బెఱిఁగి గోరినరీతి నిడఁగ గర్ణు
షడ్రసోపేతభోజనచిత్రవైఖరుల్
వడ్డింపఁగా గంధవహతనూజుఁ
బద్మాక్షు నిఖిల సపర్యల నొనగూర్చి
సరసబాయకనిల్వ సవ్యసాచి
క్రతుసమయోచితార్జిత శుభద్రవ్యముల్
బ్రేమఁ దెప్పించి యిప్పింప నకులు
గీ. గురుబుధద్విజ దేవభూసురుల నరసి
పూజ గావింప సహదేవు పుణ్యసతుల
భక్తి నర్పింప ద్రుపద భూపాలపుత్రిఁ
దగ నియోగించె నీరీతి ధర్మసూతి ౨౮౨

సీ. వ్యాస వైఖానస వాల్మీకి పరతంతు
వాలఖిల్య వసిష్ఠ వామదేవ
కౌండిన్య గశ్యప కపిల కౌశిక కణ్వ
కవన కవ్య క్రతుజ్ఞ కవల కాండ
గాధేయ గాంధార గౌలస గార్గేయ
గౌతమ గాలవ గర్గ గవయ
మైత్రేయ మౌద్గల్య మాండవ్య మాగధ
మధు మతంగ మరీచి మందపాల
తే. గీ. శక్తి జమదగ్ని జాబాల ఛంద చ్యవన
సాంఖ్య జైమిని శాండిల్య సనక సరళ
బక భరద్వాజ భార్గవ భరతముఖ్య
మునుల రావించి విధ్యుక్త మనుసరించి ౨౮౩

ఉ మేఁచతుర్దిశాకలితమేదినిపాలనధుర్యులైన సౌ
వీర విరాట చోళ కురువీర వరాంగ కళింగ వంగ కా
శ్మీర మరాట యాపనక సింహళ గౌళ పుళింద మత్స్య గాం
ధార కరూశ కేరళ విదర్భముఖావనిపాలు రున్నతిన్ ౨౧౪

కం అరుదెంచి ధర్మతనయుని
బిరుదెంచి వినమ్రు లౌచు ప్రియ మలర సుధా
సరిదంచితోక్తులను మఖ
మరుదెంచి ప్రమోదహృదయులై యున్నయెడన్ ౨౧౫

చం హరి శిఖి ధర్మ నైర్‌ృతి మహార్ణవనాథ మరు ద్ధనేశ శం
కర రవి చంద్ర భూజ బుధ కావ్య గురు స్థిర రాహు కేతు పం
కరుహతనూజ సిద్ధ సుర గారుడ గుహ్యక సాధ్య కిన్నరుల్
కురుకులు లాంబికేయ కృప కుంభజ భీష్మకు లేఁగుదెంచినన్ ౨౧౬

కం ఉచితోపచారవిధులన్
రచియింపుచుఁ దత్తదవసరంబుల ఋత్వి
క్ప్రచయంబు లుచితవిధులన్
వచియింపఁ దదైకభక్తివశుఁడై నిలిచెన్ ౨౧౭

కం. అత్రిముఖాఖిలమును లౌ
ద్గాత్రమున న్నిఖిలహోమకర్మంబులు త
త్సూత్రవిధి నడప, ధర్మధ
రిత్రీపతి వారి ననుసరించి యొనర్చెన్. ౨౧౮

సీ. వివిధసంపన్నముల్ విమలశాల్యన్నము
 లూపముల్ రుచిరానురూపములును
సకలశాకంబులు సారస్యపాకంబు
 లతిరసంబులు సుధాతతిరసములు

ఘృతములు సౌరభాయతసమన్వితములు
క్షీరముల్ మధురానుసారములును
చిత్రోదనంబు లార్జితమోదనంబులు
దధులు వజ్రోపలప్రథితనిధులు

తే. గీ. రుచుల చవిగొని మెసఁగఁ గోరుచు లలింభు
జించి ధర్మజుఁ డటులఁ బూజించి కప్పు
రంపు విడెముల నీయ తోరంపు మహిమఁ
గరము జెలువొందె విప్రనికరము లపుడు. ౨౮౯

కం. ఆహవనీయప్రముఖ మ
హాహవనాగ్నులు ప్రదక్షిణార్చుల వెలఁగెం
దాహముఁ దీఱఁగఁ గ్రతుపూ
ర్ణాహుతిశ్రుతిమంత్రవిధుల నటు వ్రేల్చుతటిన్ ౨౯౦

సీ. క్రతుమహోత్సవ సమాగత విప్రభోజనా
హ్వాన రణద్భేరిభాంకృతంబు
నఖిలభూసురదేవతార్చన నైవేద్య
సమయ ఘంటానాదఝూంకృతంబు
నానాభినయనాట్యగానానురాగ వ
ర్ధిత మృదంగాది దిందీకృతంబుఁ
దాపసపూజావిధానార్ఘ్యపాద్యాది
కూలంకపాంబు ఘుంఘూకృతంబు

గీ. నొక్క మొగి దిక్కులను నెక్కి పిక్కటిల్లు
నాద మంతటఁ ద్రిభువనాహ్లాదమైన
భూసతీమణి తృప్తిచేఁ బొగడె ననఁగ
సమధికము జెందుఁ గ్రతుమహోత్సవమునందు. ౨౯౧

కం. మోదమున లక్షభూసురు
లోదనములఁ దృప్తి నొంద నొకసారి మహా

నాదమున మొరయు దుందుభి
నాదారక మ్రోసెఁ గ్రతువున నహర్నిశలన్ ౨౯౨

సీ. హవ్యోచితద్రవ్యనవ్యసత్కృతులచేఁ
బ్రముదితాత్ముం డయ్యెఁ బావకుండు
వినయ సపర్యాది సనయప్రయుక్తిచే
మది సంతసిలె రాజమండలంబు
నర్ఘ్య పాద్యాఖిలానర్ఘ్య గౌరవముచేఁ
బరితుష్టి నొందెఁ దాపసకులంబు
షడ్రసోపేతభోజనదాన విధులచే
సుఖు లైరి భూసురా ద్యఖిలజనులు
తే. గీ నిర్మలావభృథస్నానధర్మమునను
వివిధ లోకంబులెల్లఁ బవిత్రమయ్యెఁ
బలరిపువిభాతి నీరీతి పాండుసూతి
యాచరించిన రాజసూయాధ్వరమున. ౨౯౩

చం. సకలధరామరాళికి ప్రసర్పణ దక్షిణతోడ హస్తిఘో
టక శిబికారథంబుల దృఢస్థితి భక్తి నొసంగి, లోకనా
యకుఁ డగు నందనందను గృపాభిరతిన్ వివిధానుభూతియం
దొకటి గొరంతలేకను సహోదరసేవితుఁ డౌచు నుండఁగన్. ౨౯౪

చం. మయుఁ డను విశ్వకర్మకులమండనుఁ డాసురకోటికిం జమ
త్క్రియలగు శాంబరీమయనికేతనము ల్విరచించి సర్వది
‘ ‘మును బొందనేర్చు జయశాలి యితం డొక దివ్యమౌ సభా
లయ మొనరించి తెచ్చి యకలంకగతిం దనకీయ వేడుకన్ ౨౯౫

వ. అది మఱియును - ౨౯౬

సీ సురలోకమువిభాతి సుమనోనిధానంబు
నబ్ధిసంగతిబాడ బాస్పదంబు

గిరిరాజమునుబోలె సరసుల కనుకూల
మభ్రంబుగతి సత్కళాంచితంబు
ప్రాగ్దిశాసదృశంబు భాస్వదినప్రాప్తి
యటవిపోలిక వివిధాగమనిధి
ఘనవసంతముమాడ్కి గణికాభిరామంబు
బాణంబుగతిని ధర్మానుకూల

తే గీ. మల రసాతలలీల భోగులకు వసతి
విమలసన్మణివలెఁ బ్రాసవిరహితంబు
నల శశినిబోలె సదరిభయంకరంబు
నగుచుఁ జెలువొందు మయుని సభాలయంబు ౨౯౭

ఉ నీరము లేనిచోట నతినిమ్న జలంబులు భూరివారిసం
పూరితమైనచోట మరుభూములు, ద్వారము లేనిచో మహా
ద్వారములుం, దురాత్ములకు తథ్యముగాఁ గనుబట్టి సత్ప్రియుల్
జేరినచో కనత్కనకచిత్రితమై ముద మావహించెడిన్ ౨౯౮

మ. ఒకనాఁ డాసభలోన ధర్మతనయుం డుద్యత్ప్రమోదాప్తి గా
యకసామంతకవీంద్రమాగధపరీహాసద్విజానీక ము
త్సుకతం గొల్వ పురందరప్రతిభచే సొంపొందఁ బేరోలగం
బకలంకస్థితి దాను సోదరులు నిత్యానందులై యుండఁగన్ ౨౯౯

సీ అకలంకబిరుదాంక సుకవీంద్రు లొక వంక
సురుగాయకనికాయ మొక్క చాయ
పటుహాటకకిరీటపతికూట మొక చోట
నుద్వేలహితజాల మొక్క మూల
సులతాంతతనుకాంత సురకాంత లొక చెంత
నుద్గీతవరుతిరావ మొక్క త్రేవ
వనచారఘనసౌరమునివార మొక మేర
నుద్దామభటభీమ మొక్క సీమ

గీ. పెక్కువగఁ జిక్కు నటకు లొక్కొక్కదిక్కు
నుట్టిపడినట్టి మాగధు లొక్కతట్టుఁ
గొలువ కొలువున కొలువుండె నలువచెలువు
మయునిమాయామయాలయమధ్యమునను. ౩౦౦

చం. అపు డతిమత్తుఁడుం దురభిమాని దయారసవర్జితుం డస
త్యపథుఁ డహంకృతుండు కలుషాత్మకుఁడుం గులపాంసనుండు బం
ధుపటలవైరి యార్యజనదూషకుఁ డైన సుయోధనుండు త
ద్విపులసభాంతరస్థలికి వే జనుదెంచె నుదంచితప్రభన్. ౩౦౧

సీ. అతిచిత్రగతిమిత్రతతి వేత్రములఁ బూని
బలశీలురై వెంటబలసి గొలువ
సకలాభినయశోభితకళాభిరతులచేఁ
బ్రమదాలి నర్తన ప్రమద మెసఁగ
మణికంకణాలంకరణఝుంకరణము తో
రములుగా సితచామరములు వీవ
నసమానలసమానరసగాన మెనసి హృ
ద్యములుగా నిఖిలవాద్యములు సెలఁగ

తే. గీ హితపురోహితసుత సుహృత్ప్రతతివినుత
సతతహితగతి నతికుతుకతదనర్ప
వచ్చె నచటికి నతిమద మచ్చరమున
గ్రోధమానధనుండు దుర్యోధనుండు ౩౦౨

మ చనుదేరం గపటాత్ముఁడౌ కతన నాస్థానంబు మాయావిమో
హనముం గావున నిర్జలస్థలి ప్రవాహప్రాయమై నీరము
లనుబట్టం దన చింగులెత్తుకొని డాకాలూఁతచేతం జివు
క్కున లంఘించు జలంబుగల్గునెడలం గూర్చుండు భావభ్రమన్. ౩౦౩

కం ద్వారములుగలుగు నెడ-పెడ
దారిని యేతెంచి భిత్తితాడనముల — వే
సారుచు నాకచోనైనం
ద్వారము గనలేక బేలతనమున దిరిగెన్. ౩౦౪

చం. మదిని చికాకుఁ జెందు కురుమండను గాంచి, వృకోదరుండు ద్రౌ
పదియును దక్కుభూపతులు ఫక్కున నవ్వఁగ బాండవాగ్రజుం
డది గని, గన్నుసన్నల నయంబున వారి నదల్ప లజ్జమై
నొదవ సుయోధనుండు కుపితోగ్రత హస్తిపురంబుఁ జేరియున్ ౩౦౫

కం మయమాయామోహసభా
లయమున నీరీతిఁ గళపళం ఒగుచు నిజా
లయమునను నిలిచి యతిని
ర్దయచేఁ దత్క్షణమె ప్రతికృతం బూహించెన్ ౩౦౬

మ కపటద్యూతముగూర్చి, పాండవభుజాగర్వంబుఁ బోకార్చి, రా
జ్యపదభ్రష్టత జెందఁగా శకునిమాయల్ జేర్చి, నానామహా
విపినస్థానములందు దుర్దశల నుర్విన్ సంచరింపంగ నే
నిపుడే సేయకయున్న మత్కురుకులాధీశత్వముం జెల్లునే. ౩౦౭

కం అని యిటుల దురాలోచన
లొనరిఁచి సమవర్తిసూను నొయ్యన కపటా
త్మనిరూఢి హస్తినాపురి
కనుకూలునివలెనె బిలువనంపిన నతఁడున్. ౩౦౮

కం. శకుని సుయోధను బక్షము
నకు నిలిచి, తదక్షముల నణంగిన మాయా
వికటంబు గనక ధర్మజుఁ
డకుటిలమతితోడ జూద మాడ దొడంగెన్ ౩౦౯

ఆ. వె. జూద మనుసరించి వాదముల్ వేరముల్
దగులు ననెడి రాజధర్మ మెఱిఁగి
బేల యగుచు బుద్ధి పెడతలఁబట్టె ని
కేమిఁ జేయవచ్చు నీశ్వరాజ్ఞ ౩౧౦

కం. ఆడఁగ నాడఁగ, మఱుమా
టాడఁగనీకన్ సుయోధనాహ్లాదమె చే
కూడఁగ, ధర్మతనూజుం
డోడఁగ దొణఁగె న్వినిర్గతోత్సాహుండై. ౩౧౧

సీ. వేసారకను జూడు మీసారి వ్రేటుచే
నాసా రెచేహూలు నడిపి గెలుతు
రేపాడనిత్తునా రాపాడి యికనైనఁ
గాపాడ నీజోడు గదలఁ దీతు
నీ పట్టు లొకసారి నా పట్టుఁ జూడు నీ
దాపెట్టు లేకుండఁ దరిమి పెడుదు
నీవంకఁ జూడకు నీవింక నిశ్శంక
నీ బింకము లడంచి నిలువరింతు

తే. గీ. ననుచు శపథోక్తులను జూద మాడ దొడఁగె
శకుని యవ్వేళ సుపథదుశ్శకునుఁ డగుచు
నిచ్చగల పందెములఁ దన కిచ్చుచుండ
సాధుబాధకుఁడైన దుర్యోధనుండు. ౩౧౨

ఉ. ఇమ్మెయి ధార్తరాష్ట్రుఁడు జయింపఁగ ధర్మజుఁ డాడ నాడ న
ర్థమ్ముల నోడె- గాంచనరథమ్ముల నోడె, గజాశ్వసద్భటౌ
ఘమ్ములనోడె- సర్వకటకమ్ములనోడె- జగత్ప్రపూజ్యరా
జ్యమ్ముల నోడె- తన్ను ననుజన్ముల నోడె నిజమ్ము నోడకన్ 303

కం ఆతటిఁ ద్రుపదాత్మజబహు
రీతులఁ బాండవుల నుద్ధరించి తగ, పున
ర్ద్యూతమునకు దొరకొనఁగ వి
ఘాతకుఁడగు శకుని విషమగతి కపజితుఁడై 304

కం కొండారణ్యంబుల, పది
రండేడులు వెతల సంచరింపఁగ మఱియు
కొ్కండే డజ్ఞాతమ్మున
నుండఁగ నియమించె నాసుయోధనుఁ డంతన్ 305

చం. సకలధరాధిపత్యము విసర్జనం జేసి సతీసహోదర
ప్రకరముతోడ, దా నటవి పర్యటనం బొనరింపఁబూని బా
లకు నభిమన్యుపై నెనర లంఘ్యముగావున బాయలేక కొం
డొకతడ వాత్మ చింతిలి నయోక్తులతోడ సుభద్ర కిట్లనున్ 306

కం. ఓసాధ్వి! నీవు నీసుతుఁ
డీ సమయము గడప, పుట్టినింటికిఁ జని య
త్రాసతఁ బదమూఁ డేడులు
వాసిగ సోదరులవశత వర్తించఁదగున్ 307

కం. అని, జననీతనయులఁ ద
క్షణమే వీడ్కొల్పి ద్వారకాపురమునకుం

ఖనిచి, మహారణ్యమునకు
జనియెం ద్రుపదసుతుతోడ సహజులు గొలువన్. ౩౧౮

సీ. కుంతిని ధృతరాష్ట్రుచెంత నుంచి, సుభద్ర
నభిమన్యు ద్వారక కనుపుటయును
ద్రౌపదితో కామ్యకారణ్యంబు జొచ్చి భీ
ముండు కిమ్మీరుని జెండుటయును
భవుఁడు వరాహనెపమున బోరఁ జయించి
యర్జునుం డస్త్రంబు లందుటయును
గాలకేయనివాతకవచుల నాతండు
దివమున కేఁగి వధించుటయును

తే. గీ నియతమతి ద్వైతవనమున నిల్చుటయును
వినిన దుర్యోధనుఁడు విఱ్ఱవీఁగుటయును
దెలిసి జనమేజయుఁడు మోదించుటయును
నవలికథ దెల్పుమని బైలు నడుఁగుటయును ౩౧౯

## —: ఆశ్వాసాంతము :—

ఉ వేదపదప్రదర్శన ! నవీనఘనద్యుతిదేహ దేవదే
పతాక వా!దరసారధారణ ! శుభప్రభవాభరణప్రదీప్త! దా
బంధ మోదర!వాదభేదనదమోదయ ! మానసవాసవాజరు
ము ద్రాదిమభావ ! భావితపదాంబుజ ! తాపసబృందమోదదా ! ౩౨౦

కం. శూరవరసారకరఖర
ఖడ్గ మారణరణరంగనిహతమధుమురనరకా !
బంధ కారణసమధికనిపుణ ర
ము మార్గమణీమానసౌక ! మన్మథజనకా ! ౩౨౧

## -: పతాకబంధము :-




ఉ. వేదపదప్రదర్శన ! నవీనఘనద్యుతిదేహ ! దేవదే
వా ! దరసారధారణ ! శుభప్రభవాభరణప్రదీప్త ! దా
మోదర ! వాదభేదనదమోదయ ! మానసవాసవాజరు
ద్రాదిమభావ ! భావితపదాంబుజ ! తాపసబృందమోదదా !

(౧-౩౨౦)

## -: ఖడ్గబంధము :-



కం. శూరవరసారకరఖర
మారణరణరంగనిహతమధుమురనరకా !
కారణసమధికనిపుణ ర
ఘూరణీమానసౌక! మన్మధజనకా !    (౧-౩౨౮)

చం నలినజశంకరత్రిదశనాథశరణ్య ! దయాంతరంగ ! స
నిరో జ్జలజశరాంగ ! సారదరశార్ఙ్గగదాసిజయాగ్రసాధనా !
ష్ఠ్యము కలితధగద్ధగితకాంచనగల ! నిశాకరాయతా
స్యలలిత ! శేషశైలశిఖరాగ్రనికేతన! తార్క్ష్యకేతనా ! ౩౨౨

భుజంగ రమాకామినీచిత్తరాజీవభృంగా !
ప్రయా నమజ్జన్యచేతోవనశ్రీకురంగా !
తము అమర్త్యద్విషత్కర్దమాంచత్పతంగా!
సముద్యద్ద్విషాగాగ్రసంచారచంగా ! ౩౨౩

మ. ఇది శేషాద్రిగుహావిహారకమలా
హృత్రోల్లసద్భావనా
ర్యదయావత్సుత రాఘవార్యగురుచం
ద్రప్రాజ్ఞసోదర్యమో
హదమౌద్గల్యకులీన వేంకటనృసిం
హాచార్యసంప్రోక్తధీ
వదతాలాంకసునందినీపరిణయా
శ్వాసంబు ప్రాధాన్యమున్. ౩౨౪

గద్య-

ఇది శ్రీమచ్ఛేషధరాధరసౌధవీధీవిహారణవేంకటరమణ
చక్షుర్విలక్షణాక్షీణకృపాకటాక్షవీక్షణాపరిలబ్ధ
లక్ష్యలక్షణానవద్యవిద్యావిలాస శ్రీనివాస
గురుచరణస్మరణాభ్యసనరసనావికాస
నిస్తుల్య కల్యాణ సాకల్య మౌద్గల్య
గోత్ర పవిత్రభావనాచార్యపుత్ర

పర్వత్రయ కైంకర్య విధాన
వేంకటనృసింహార్యాభిధాన ప్రణీతంబైన
తాలాంకనందినీపరిణయంబను
మహాప్రబంధంబునందుఁ
ప్రథమాశ్వాసము ౩౨౫



# తాలాంకనందినీపరిణయము

## ద్వితీయాశ్వాసము

కం. శ్రీమహిళామలహృత్పుట
ధామా! ధామనిధిధామ! దళితారిజన
స్తోమా! దోర్దండబల
స్థేమా! శేషాద్రిధామ! దేవలలామా! ౧

కం. జయ జగదీశ్వర జనమే
జయజనపతి యడుగఁ బైలజటి బల్కెఁ దదా
శయ మెఱిఁగి మృదువచస్సం
చయమృదుమధురసుధ లధికఝురులై బొరలన్. ౨

శా. కుంతీసూనుల నిట్లరణ్యమునకుం గ్రోధాత్ముఁడై బంపి ని
శ్చింతం జెంది సుయోధనుం డతులితశ్రీగర్వదుర్వార వి
భ్రాంతాపస్మృతి మిన్ను మన్ను వివరింపన్ లేక నుద్యన్మదా
క్రాంతుండై కురురాజ్యసంపదల నేకచ్ఛత్రుఁడై యేలఁగన్. ౩

చం. శమనతనూజుఁ డిట్లనుప సాధ్వి సుభద్ర సుతోదయప్రమో
దము విడి మేఘనాదముదితంబగు గేకి ధనుర్ధ్వనిం భయ
భ్రమవడి బాఱినట్లరిగెఁ బట్టిని దోడ్కొని బుట్టినింటికిన్
రమణవియోగసాగరితరంగవిభంగనిజాంతరంగయై. ౪

కం. ఈరీతి వెతల సౌనా
సీరసతీమణి కుమారశేఖరుతో నా
ద్వారవతి కరుఁగుదెంచిన
సీరియు శౌరియుఁ బ్రియింపుఁ జెల్లెలిఁ గనియున్ ౫

ఉ. కొమ్మరో! దీనికి న్వేతలఁ గుందఁగ నేటికి బాండవుల్ త్రిలో
కమ్ములఁ బూజ్యు లట్లగుటఁ గౌరవకృత్స్నమయత్రయోదశా
బ్దమ్ములు శీఘ్రతం గడపి దజ్జయలక్ష్మి వరించి వత్తు రో
యమ్మ సుభద్ర నీహృదయమందున నమ్మఁగదమ్మ సమ్మతిన్ ౬

మ అదిగాకన్ భవదాత్మజుం డధికశూరాగ్రేసరుండై శుభా
భ్యుదయస్ఫూర్తి రహించఁగా గలఁడు వేరొం డేమియున్ లేక నీ
పదమూఁడేడు లిట న్వసింప నటపై బాలుం డఖండప్రభా
స్పదుఁడై పాండుకులప్రదీపకుం డగున్ శాతోదరీ! సోదరీ! ౭

కం. అని తరలనయన నీగతి
ననితరలాలన మృదూక్తు లాడిన సతియం
తన దనయనుమతితోడం
దనతనయుఁడుఁ దాను సమ్మదమ్మున నిలిచెన్ ౮

ఉ తల్లియు నౌ యశోదయు మొదల్గల యాదవభామినుల్ మనం
బుల్లసిలం గవుంగిళుల నొత్తుచుఁ జెక్కున జెక్కుఁ జేర్చి-మా
తల్లి సుభద్ర ! నీమది వెత ల్గనవేటికి నాడు తోడులం
దెల్ల విధంబుల న్నెసరు లింతుల కొక్కటి గావె జూడ సం
ఫుల్ల సరోజనేత్రి యని బుజ్జగిలం బలుకం బ్రమోదియై. ౯

కం. అన్నలు వదినెలు నీగతి
నున్నతిఁ దను గారవింప నొక పాటిగ, దా
నన్నరు మీది[1] మరు ల్మదిఁ
గొన్నిదినంబులకు మరుపుఁ గొనినటు లుండెన్ ౧౦

కం. ఇభనిభశుభగమన రఘూ
విభుని సమాదరణపలన వెత సుడిగి మహా

1 మరుల్గొన-మూ

ఏభవ భవభూతిఁ దనరఁగ
నభిమన్యుఁడు పూటపూట కభివృద్ధిఁ గనెన్. ౧౧

మ. పులిగోరుం బతకంబుఁ గంఠమున సొంపున్ గుల్కఁ ఫాలంబునన్
నెలరా ల్బచ్చలరావిరేక కటిపై నిద్దంపు బంగారుకెం
పుల మొల్నూల్ రవగుల్కు టందియలు నింపుల్మీర పాదంబులం
దులకింపున్వడి తప్పట ల్నడచు దాదు ల్కేలు లందీయఁగన్. ౧౨

మ. మెలతల్ రుక్మిణి సత్యభామ మొదలౌ మేనత్తలుం దాము - క
న్నులు చేమోడ్చుక చక్కనయ్య యితఁడేనో వచ్చె మాయప్పుడం
చెలిమిన్ జెల్వగు నంగున న్నడచి పైకేతెంచఁగా - సంబరం
బులచే నక్కున జేర్చి నవ్వుదురు సొంపుం బెంపు వాటిల్లఁగన్ ౧౩

కం. ఈలీల బాల జాబిలి
పోలిక దినదినము వృద్ధిఁ బొందెటి తఱిలోఁ
గేలంది పుచ్చుకొను గతి
పాలించిన చెఱకుపండు బంతినకరణిన్. ౧౪

మ. అలరుల్ బుట్టుచునే సుగంధజనకం బైనట్లు - బాలుండు కో
మలలీలం బచరించు నంతటనె రమ్యం బొప్ప నయ్యింటనే
గలిగెం భాగ్య మటంచు లోకులు సమగ్రప్రీతి భాషింపఁగా
బలభద్రాంగనయైన రేవతికి గర్భం బేర్పడెన్ రమ్యమై ౧౫

సీ. తరుణతాగర్వసాగరమందరాగంబు
మంజుమధ్యమ నిధానాంజనంబుఁ
దతకపోలస్వర్ణదలపారదం బభి
లాషలతాలవాలస్థలంబు
సౌగంధ్యమ్మృత్తికాశకలయాచ్ఞాంపరం
బలసదావన్య మంత్రౌవధంబు

సకలభూషణతిరస్కారవిజ్ఞానంబు
ఘనమాంద్యసంధానకరణితరువు

తే గీ. దీర్ఘనిశ్వాసభవనశంకుప్రతిష్ఠ
ప్రబలనిద్రాగతాంకురార్పణమహోత్స
వం బగుచు నంతకంతఁ బ్రబలంబవైరి
యువిద కేర్పడె నపుడు గర్భోదయంబు ౧౬

మ. తరణీమధ్యమృగేంద్రడింభము వయోదంతావళంబున్ మహో
ద్ధురత న్మెక్కి తదీయగర్భగరిమం దోచంగ దచ్ఛేషమౌ
కరముల్ కుంభములట్ల కప్పు దనరంగా గుబ్బచందోయి యా
రురహి న్మించెను బంకజాననకు [1] నారు ల్జూచి మోదింపఁగన్ ౧౭

చం. బిగిగల చన్గవల్ సడలి బిట్టువ జారఁగఁ బేదకౌను పె
ల్లుగ నభివృద్ధిగాంచ వళులు న్దళుకు ల్వాడి మాయనింపు పెం
పుఁ గని బయల్పడం దలముబోవిడి మక్కులుఁ జార నారుసో
యగమున మించె నొకలిమిహాధర లేమియు లేమి కల్మియౌ. ౧౮

మ. చెలిచెక్కుల్ తెలుపెక్కెఁ, జిట్టెములు చేజేతం బ్రవేశించె, చ
న్నుల ముక్కుల్ నలుపయ్యె, పెంపెసఁగె కౌను న్లేనడల్మాంద్యమై
యలరెం గోరిక లెక్కువయ్యె, నునునూగా రంతకు న్నిక్కెఁ, గ
న్నులనిద్రాగతి జెందెఁ బోటికిని జెన్నున్ మీర నానాఁటికిన్. ౧౯

చం. గరితకుచంబు లెంతొ గమకంబని గాచుకయున్నగౌను న
త్తఱి కడకొత్తఁ దత్కపటతన్ తనలేమిడివీడి సత్త్వము
న్నెరపిన మధ్యమంబుఁ గని నెవ్వగచేఁ దము దామె మెత్తనై
బరఁగెను జన్గవల్ కఠినభావుల కిట్టివెకా స్వభావముల్. ౨౦

తే గీ. మంచిదని మధ్యమము నాశ్రయించియున్న
వళుల విడనాడెఁ దాను సత్త్వమును బలసి

---

1 పేరుల్ జూచి మోహింపఁగన్-మూ.

గలిమిగలనాఁడు మిత్రులకడకు ద్రోయు
టహహ! కౌనుదె గాక సాహసము జగతి ౨౧

సీ. స్వర్ణభూధరశృంగసంగతాభ్రము లట్ల
లలిచూచుకములు నైల్యము వహించె
సితకైరవభ్రమాగతశశిద్యుతు లట్ల
విమలాక్షిమోము వెల్వెలఁగఁ బారె
జరరాంతగతశిశుచ్ఛాయ పెంపగురీతి
రమణినెన్నడుము గౌరవము దాల్చె
యౌవనరాజ్యజయస్తంభగరిమచే
కాలికచ్ఛవిని నూఁగారుఁ దనరె
తే. గీ. మట్టిరుచిఁబుట్టి చిట్టెముల్ బెట్టు లగుచు
నుట్లచట్టిని బాల్త్రోడు బెట్టినట్టు
పొట్ట బిగబట్టి యిట్టట్టు చిట్టికుట్టు
లుట్టు పొలఁతికి ప్రసవ ముద్యుక్తమయ్యె ౨౨

కం. అల నిండుచందురుని వె
న్నెల నిండిన బగిది కమలనేత్రికి మైవ
న్నె లలిం దేలఁగ దొమ్మిది
నెలలుం బరిపూర్ణమగుచు నిండిన పిదపన్. ౨౩

మ తరణీందుప్రముఖగ్రహంబులు శుభస్థానంబులం దున్నవే
ళ రహిన్ శీతలవాతపోతములు లీలన్ వీవఁగా భవ్యసు
స్థిరమౌహూర్తికలగ్నమందున శుభాప్తిన్ క్షీరవారాశి నిం
దిర జన్మించినరీతి రేవతికి పుత్రీరత్నముం గల్గినన్. ౨౪

కం. ఆపురుటియింటి మణిమయ
దీపమువలెఁ జెలఁగు రేవతీసుతవిలస
ద్రూపంబు గాంచి విస్మయ
లై పౌరాంగనలుఁ గౌతుకాయుత్తమతిన్. ౨౫

చం నెలఁతలు గోరువెచ్చకలినీటను జిల్కుచు బొడ్డుఁ గోసి చె
క్కులు సరినొత్తి దిద్ది, తలకున్ మెయికిన్ జము రంటి చేటలో
పల నవరత్నధాన్యములపైఁ దెలిపొత్తులమీద వజ్రపు
త్తలికనుబోలు రేవతిసుతం బవళింపఁగజేసి కూరిమిన్. ౨౬

కం. ఆమదనమోహనాకృతి
గోముదనంబునకు వెఱఁగుగొని దమదమ చే
తోముదమున వీక్షింపుచు
నాముదమున వ్రేలు గుడిపి రంభోజముఖుల్ ౨౭

చం. చెలఁగుచుఁ జెక్కుల న్నలిమి సీత్కృతులం గిలగొట్టి లేతన
వ్వొలయఁగ జేసి మోములర యొంచుచు మాటికి ముద్దుముద్దనిన్
బలుకుచు మోవికెంజిగురుబట్టి బయల్గొని ముద్దువెట్టి చ
క్కిలిగిలగింత లిచ్చి నెరకేరఁగ జేసి హసింతు రొక్కటన్ ౨౮

కం. ఏణాక్షులెల్ల శిశువును
మాణిక్యపుఁ దొట్లె నునిచి మధురమధుసుధల్
రాణింపఁ జోలఁబాడిరి
వాణీవీణాక్వణారవంబులు నెసఁగన్. ౨౯

కం. జోజో ! శిశుశశిబింబా
జోజో ! తనువిజితజంబ సుగుణకదంబా
జోజో ! తటిదుపబింబా
జోజో ! రుచిరావలంబ ! శుభనికురుంబా ! ౩౦

వ. అని వచింపుచు— ౩౧

కం. చేతోజాతప్రీతిస
మేతులునై దత్తదుచితమితదినముల న
ప్పోతోత్తమకు హితంబుగ
జాతం బొనరించి రపుడు శాస్త్రోక్తవిధిన్. ౩౨

కం బలకృష్ణసాత్యకీము
ఖ్యులు కౌతుకమున ననుంగుకూఁతురునకుఁ నిం
పొలయ శశిరేఖయనఁగా
కలితశ్రీదనర నామకరణం బిడియున్. ౩౩

ఉ ఆశశిరేఖ నామమె యథార్థముగా నజుఁ డాననంబునన్
వ్రాసినరీతిగా దినదినంబు కళాభ్యుదయప్రపూర్ణమై
పేశలరుక్మిణీముఖరభీరువులెల్ల సుభద్రహర్ష చి
త్తాశయమ న్లెలింగి వికచాననలై వచియించి రొక్కటన్. ౩౪

ఉ. కొమ్మ! సుభద్ర! నీకనుఁగుఁగోడలుఁ గల్గె గదమ్మ! మాకు మో
దమ్ము లభింప నీయభిమత మ్మొనగూడఁగఁ గుందనంపుఁగీల్
బొమ్మయు రేవతీరమణిపుత్రిక కీ యభిమన్యుఁడే ప్రియుం
డిమ్మెయి ధాతఁ గూర్చుటిది యింటినిధానముగాదె కోమలీ! ౩౫

మ. తనుదానే జలకమ్ము లార్చి యటమీఁదం గావు బొట్టుంచి మె
ల్లన బంగారఁపుదొట్టెలో నునిచి లాలిం బాడు కో ''రేవతీ
తనయా! యోయభిమన్యు దృక్కుముదచంద్రస్వానసా నిద్రబో
మ్మ''ని జోకొట్టుచు నిద్రఁ బుచ్చి మురిపెం బందుం దదై కారతిన్ ౩౬

తే గీ తల్లిచనుఁబాలు గ్రోలుచే దక్క నితర
పోషణాదికకృత్యవిశేషములును
దినదినం బాసుభద్రాసతీలలామ
తానె సవరించుఁ దనకోడలౌ నటంచు. ౩౭

వ ఇట్లవ్వనజలోచన మవ్వంపు నివ్వటిల్ల బోషింపఁ బ్రతిపచ్ఛశిరేఖయుం బోలి యాశశిరేఖ దినదినప్రవర్ధమానంబుగాఁ బెరుఁగుచున్న సమయంబున- ౩౮

ఉ పంచాబ్దమ్ముల రేవతీతనయకుం బ్రాయంబు సంధిల్ల, భ
వ్యాంచత్సూక్ష్మశరత్సమాన్వితుఁడునై యప్పార్థసూనుండు య

త్క్రించిద్భేదము లేక శైశవశుభక్రీడావిహారంబుల-
న్మించెం బంచశరప్రభాగరిమఁ బేర్మిం జెందె నానాఁటికిన్. ౩౯

ఉ. బొమ్మలపెండ్లి లంచు విరిపువ్వొడిఁ దిన్నెలు బన్నియాడ మే
ల్బొమ్మయె నీకుఁ గోడలని బుత్తడి యీమొగబొమ్మ నాసుతుం
డిమ్మెయి దంపతీప్రతిమ లేర్పడఁగా మనకే సతీపతీ
త్వమ్ము లభించె నంచుఁ బ్రమదం బెనయంగ హసింతు రొండొరుల్. ౪౦

ఉ. లీలను బొట్టె చేడియలు లేగలపిండని తొంగియాడ నే
మేలగు కోడెదూడనని మేకొని రంకెలు వైచుచుం దమిం
బ్రేలుచు నందులోన శశిరేఖయె బల్సెలపెయ్య యంచుఁ బై
బ్రాలి యెదం బడుంగతిని బైకొను శైశవవేళ నీక్రియన్. ౪౧

చం. మఱియు నొకానొకప్పు డభిమన్యుఁడు నాశశిరేఖఁ జేరి క్రొ
మ్మెఱుఁగులపెన్నెఱు లుమ్మడిచి మిన్నతిగా సిగవేసి తావిపూ
సరములుఁ జుట్టి- బంగరుపిసారుజిలుంగు పయెంటఁ జేర్చి నీ
టరసి 'భళీరె' యంచు ముదమంది పసం దొనరించు నవ్వుచున్. ౪౨

శా. ఈలీలం జిఱుప్రాయఁపుం జెలులతో నిచ్ఛావిహారంబుఁగాఁ
బాలక్రీడలు సల్పుచుండఁ గని దత్పౌరాంగనల్ వేడ్కని
బ్బాలారత్నము కీతఁ డీతనికి యీబాలామణిం దైవ మి
ల్లాలుంగాఁ దగకూర్చు టబ్బురమె యం చానందముం జెందఁగాన్ ౪౩

ఉ. పుత్తడిబొమ్మలో! పగడఁపు న్నునుదీవెలో! క్రొమ్మెఱుంగులోఁ
జిత్తజుఁబువ్వుఁదూఁపులో! శశిద్యుతులో! తులితస్వరూపసం
పత్తిని గాంచినట్టి బలభద్రసుభద్రతపఃఫలంబులో
నుత్తము లీకిశోరు లని యుత్సవమొందుదు జెల్లచూపరుల్. ౪౪

---

౪౫ నెం. పద్యము నుండి - ౧౫ నెం పద్యము నాల్గవ చరణము సగ
భాగము వరకు తా. ప్రతి శిథిలముగా గలదు.

ఉ. ఎల్లజనుల్ నరాత్మజున కీశశిరేఖయె పత్నియౌను మే
నల్లుఁ డితం డనందగు నదంతియెగాక సమానరూపసం
ఫుల్లతనూవిలాసములఁ బొందికజెంది రటంచు బోళ్లరో
కళ్లను బాడుచుండ మురఘస్మరుఁ డిన్విని యూరకుండఁగన్ ౪౫

ఉ లోకులవార్తలు న్విని బలుం డభిమన్యుని రూపవిభ్రమా
స్తోకవిలాససంపదలఁ జొప్పడు నీశశిరేఖకే తగుం
గాక యటంచు నెంచి తనగాదిలిచెల్లెలితో సుధాప్రవా
హాకలితోక్తులం దనదయామతి తేఁటపడంగ నిట్లనెన్. ౪౬

కం ఓ! విమలగుణవతీ! నీ
వేవిధములఁ దలఁచి తటులనే సమకూడెన్
దైవానుకూలమున ‘ య
ద్భావం తద్భవతి’యను శుభస్మృతి సరళిన్ ౪౭

కం. కోడలికి కొడుకు కొడుకుకు
కోడలు తగినటుల రూపగుణవిభవములం
దీడుం జోడుం గలుగుట లా
డంబోయినను దీర్ఘమబ్బుట గాదే. ౪౮

మ వనితా నీదు మనోరథంబునకు దైవప్రేరణం బొచ నా
తనయారత్నము నీకుమారునకు యాథార్థ్యంబుగాఁ బెండ్లికాఁ
తునుగాగన్ సృజియించె నవ్విధి మనస్తోషంబు జెందం దగున్
జనవాక్యంబె ధ్రువం బటంచు ధరణిన్ శాసించవే శాస్త్రముల్ ౪౯

వ అని యిట్లు సోదరిన్ మేదురానుమోదానువాదంబుల నాదరింపుచుఁ జేతో
జాతప్రీతిం గూతుం జామాత కొసంగుతెఱం గెఱుంగుబడం బలుక
నమ్మచ్చకంటి నిచ్చ నిచ్చ న్మచ్చికలెచ్చన్ బొచ్చెంబులేక నయ్యభిమన్యు
శశిరేఖ లనన్యగతిం బోషింపుచున్న సమయంబున- ౫౦

మ. తనుజీవంబులభాతిఁ బుష్పములను నెత్తావుల్ బలెం బాలునీ
ళ్ళనుబోలెన్ వరచంద్రచంద్రికలలీలన్ శబ్దశబ్దార్థరీ
తిని భాస్వత్కులశీలసంగతిని బ్రీతిం జంటగానంటి య
ర్జునసంకర్షణపుత్రపుత్రికలు కోర్కుల్ మీఱఁ గ్రీడింపఁగన్. ౨౧

ఉ. అంతకుఁ గొన్నినాళ్ళరుఁగ నాయభిమన్యుఁడు తోడిబాలకుల్
చెంతలఁ గొల్చి రాగ గురుశిక్ష వహించి-సమస్తవిద్య లా
ద్యంతము నభ్యసింపఁగ నహర్నిశలు న్మతిభీతిప్రీతిచే
చింతలచే దొణంగె నయశీలుఁడు సభ్యజనానుకూలుఁడై. ౨౨

సీ. సామాదినిగమప్రసంగము ల్బరియించెఁ
దద్రహస్యంబు లాస్థత లభించె
లక్ష్యలక్షణము లెల్లను వే నధికరించె
విమలషడంగముల్ వెస గ్రహించెఁ
బాణినీయన్యాయభాష్యాదులను నేర్చె
తాత్వికవ్యాసమతంబు దెలిసె
సాంఖ్యమనస్కాదిసాధనంబు లెఱింగె
నఖిలపురాణార్థ మాకళించె
తే.గీ. నిఖిలనృపదండనీతుల నేర్పు లరసె
సభ్యనుతమగు వైద్యంబు నభ్యసించె
ఘనధనుర్వేద మఖిల మొక్కటనె జదివె
ధన్యుఁ డభిమన్యుఁ డార్యసన్మాన్యుఁ డగుచు. ౨౩

ఉ. చారుతరార్థబోధనల శయ్యల రీతుల శబ్దవృత్త్యలం
కారములన్ రసస్ఫురణకల్పనలన్ మృదునర్మగర్భగం
భీరతరధ్వనిస్ఫురణభేదములం గుణదోషసూక్ష్మవి
స్తారములం గ్రహించి కవితల్ రచియించఁగ నేర్చె నేర్పునన్. ౨౪

కం. అష్టాదశవిద్యలు గురు
నిష్ఠము శుశ్రూషఁ జేసి హితమతికృతి వి

స్పష్టముగ మది గ్రహించి వి
శిష్టం బుపపాదనంబు సేయును మగుడన్ ౫౫

కం. కరితురగరథారూఢచ
తురతన్ వివిధాస్త్రశస్త్రతూణీరధను
ర్ధరణశరముష్టిపుష్టుల్
గుఱుతెఱిఁగె నతండు బదునొకొండవయేటన్ ౫౬

శా రాణింపన్ నవశైశవాభ్యుదయసంరంభంబునందే మహా
నాణెంబై దగు గుజ్జువిల్కు-ఱచబాణాల్ పొట్టికోలల్ మహా
బాణి న్నెట్టనబట్టి చెట్టుగుఱులుం బాటింపుచున్ లోకసం
త్రాణుండై దనమేనమామవలె నుద్యచ్ఛూరుఁడై భాసిలెన్ ౫౭

కం అకలంకగతిని కురుబా
లకుఁడు చతుష్షష్టివిద్యలను నేరిచి దా
నొకటఁగన కొఱతలేకన్
సకలమణుల్ గలుగు జలధిసరణిం దనరెన్ ౫౮

మ. సుమిళిందాయితకాకపక్షములతో సోమాభసంస్మేరపూ
ర్ణముఖాంభోజము తో దయామృతరసభ్రాజద్దృశాపాంగసం
భ్రమగండద్వయితో మృణాళనిభశుంభద్బాహుయుగ్మంబుతో
రమణీయంబుగ సంచరించఁ గని దూరం బయ్యె బాల్యం బొగిన్. ౫౯

ఉ శ్రీయుతమూర్తియైన నృపసింహునకుం జనియించె యౌవన
ప్రాయము హింతమానపటుబాహుపరాక్రమమేరుశేఖర
ప్రాయము శాత్రవీనిటలభాసురకుంకుమతోయమున్ సదా
శ్రేయము కౌరవప్రకరజిహ్మగసంచయవైనతేయమున్. ౬౦

సీ శ్రీకరశృంగారచేష్టాపయోరాశి
యతనుసంకేతవిహారవసము

సకలాంగపటిమప్రశస్తసంజీవని
తతముదాలోకనాదర్శనంబు
భావగర్భప్రౌఢభాషణజనకంబు
కోపహుంకారఘంటాపథంబు
సాహసనిపుణతాసంగ్రామరంగంబు
భాసురసౌందర్యపణ్యవీథి

తే.గీ. లోకనామాత్రకాముకోద్రేకలోక
లోకనాచంచరీకనాళీకవనము
ఘనముగాగను జెందె జవ్వనము నతని
దినము దినమును జనము నెమ్మనము లలర. ౬౧

సీ. కెమ్మోవితేనెకై గ్రమ్మిన చిన్ని చీ
మలలీల నునుమీసములు జనించె
లలిచెక్కుటద్దంపులఁ గప్పు కప్పు నా
గమకమై బవిరిగడ్డము దనర్చె
దొలినుండి దన్ను నెంతోగొప్పగను జాల్చి
ముడిగిన గౌనువెంబడె కృశించెఁ
దనురుచిత్రివిభక్తమైనగై వడి నవ
యవస్ఫురణ వేడుకచు బలిసె

తే గీ. గామినీచిత్తశాణచక్రప్రకషణ
జాతశాతశరవ్రాతరీతిఁ దనరె
మంగళాభంగవిలసదపాంగగరిమ
రాజసుతునకు యౌవనారంభవేళ. ౬౨

కం. కుందనమునకుం బరిమళ
మొందినగ్రియఁ జూటితేనె కొకతటితేటం
జెందినటుల సంక్రందన
నందననందనుని జవ్వనము భాసిల్లెన్ ౬౩

చం. కనుఁగొన జంద్రవంశజుఁడు గావున దద్విధుబింబలీల- యా
ననమున దత్కళంకరుచి నల్లనిమీసములన్ సుధారసం
బును మృదువాక్కులం, దరుణపుంజిగివాతెఱ, నిండువెన్నెలల్
దనచిఱునవ్వునం బోలయఁ దా జెలువొందె మనోహరాకృతిన్. ౬౪

తే గీ. సరసునకు నిండుపర్వంబు జవ్వనంబు
జెన్నుమీఱంగ నెఱికౌను సన్నమయ్యె
సూనశరబాణసంపీడ్యమానలైన
చేడియలదృష్టిదాకి కృశించె ననఁగ ౬౫

సీ. కౌనసొగుశశిరేఖకోర్కె లీగతియన్న
వడువున బాహువుల్ నిడుదలయ్యె
సతియౌవనోద్భవస్థితిఁ దెల్పఁ జనులీల
నెగుభుజంబులు చెవుల్దగుల నుబికె
బలభద్రసుత నిందుఁ బవళింప సమకూర్చు
బలిమికై వడి ఱొమ్ముపటిమ దనరె
విరహాగ్నిశిఖ లిక వెడలు నిట్లనురీతిఁ
గన్నుల నరుణరేఖలు జనించె

తే.గీ. భావితనుజెందు మోహాబ్ధిపగిదిఁ దోప
చతురవాక్కుల నతిగభీరతఁ దనర్చెఁ
దనను వలచిన రేవతీతరుణి తనయ
నెమ్మనముబోలె నతనిబాల్యమ్ము గడఁగె ౬౬

ఉ గోరునగీరునామ మొకకొంచెముగానిడి పచ్చికస్తురిం
దీరుచు పెన్నెఱు వ్వెనుక దిద్దుచు జారుసిగం ఘటించు వ
య్యారము గాఁగడానిజిలుఁగంచుల మేలురుమాలుజుట్టి జా
ళ్వారుచి దుప్పటంబువలె వాఁ?ొనరించు నటించు నీటునన్. ౬౭

ఉ. ఆనెఱప్రాయ మాసొగసు లాతొడ లానడ లాపిఱుందు లా
కౌనురువార మాకలికికన్నులసోయగ మామెఱుంగుమే

నానుచుచెక్కు లానొబఁగు లాతల పావల పావయారమే
మానవతుల్ గనుంగొనిన మక్కువ నెక్కొననోడి బోవరే ౧౮

సీ. ప్రౌఢతరోక్తులు భాషింపఁగా నేర్చి
మునుబల్కు ముగ్ధభాషణము లుడిగె
శయ్యాచమత్కృతుల్ జదివి పాడఁగ నేర్చి
ఘనవేదశాస్త్రముల్ గట్టి పెట్టె
సోగకన్నుల వారజూపు జూడఁగనేర్చి
సతుల నేమరిజూచు జాడ విడిచె
సరసులౌ జాణలసాంగత్యముల నేర్చి
పసిబాలురతొ నాటపాట మరచె

తే గీ. దినము దినమొకనీటుగా దిద్దనేర్చి
దాదులు నలంక్రియల్ సేయు తలఁపు మానె
పలుకులో శ్లేష లిమిడించి పలుక నేర్చి
జనులసహజాలాపముల్ వినఁగ దొలఁగె ౧౯

కం. శివునిం బగఁగొని తా,నప
యవముల గోల్పోక సురుచిరాంగంబులు గ
ల్గ విహారం బొనరించెడి
నవమన్మథువలెనె జవ్వనము నిండి దగెన్ ౨౦

సీ. కంఠీరవము నొక్కకౌనుచేతనె గాదు
ఘనపరాక్రమసమగ్రత జయించెఁ
బద్మారి నొకముఖప్రభచేతనేగాదు
తతయశశ్చంద్రికోద్ధతి నడంచెఁ
గలభంబు నొక భుజాబలరూఢినే గాదు
గంభీరగమనసంగతి నడంచె
జలదంబు నొకదానశౌండీర్యతనె గాదు
నిగనిగనిగల పెన్నెఱుల గెలిచె

తే. గీ. నాభుజాసార మాతోర మావయార
మాశుభాకార మాధీర మానిగార
మామహోదార మాచార మావిహార
మాగభీరవిచారంబు లౌర దెలియ ౨౧

కం. ఆలోపల శశిరేఖా
నాళీకాననకు దినదినం బొకచాయన్
బాలుం బొంగినకై వడి
బోలిచె తారుణ్య మపు డపూర్వరుచిరమై. ౨౨

సీ. పెదవిరాగమె బెంచి పెఱమాట లనసాగెఁ
గౌటిల్యగతిఁ బూనె కచభరంబుఁ
గన్నులు సిరులెక్కె గడకంటనే జూచె
మో మప్పటికె బొమముడి వదల్చెఁ
గుచగర్వమున నెట్టుకొని వచ్చె వక్షంబు
నంతకంతకు జాడ్యమయ్యె నడిత
మలినమోర్వని సౌకుమార్యంబుఁ గనె మేను
కడురిత్త దశ జూపెఁ గౌనుదీఁగె
తే. గీ నాభిమాత్రమె గంభీరతాభిరతిని
బొలిచె నన్నిట మత్ప్రియంబును దొలంగె
నహహ! యిట నుండుటిక ననర్హం బటంచు
వదలి చనుమాడ్కి సతిశైశవంబు దొలఁగె ౨౩

ఉ. ఆయబలామణీతనుగృహంబున గాపురమున్న శైశవ
ప్రాయము నమ్మరుండు చలపాదితనంబున నిల్లువెళ్ళఁగాఁ
ద్రోయఁదలంచి తోడుతనె దొంతులకుండ ఒరంపువాకిటన్
వ్రేయుగతిం గుచంబులు సవిసరుచిం జనియించెఁ బోఁటికిన్. ౨౪

మ. సమమైుం బొంకము సోయగంబుబిగియున్ సౌందర్యమున్ వట్రువన్
గొమరుం బింకము లావరి స్నినుపుదెక్కు స్నిక్కుటంబు న్పైడం

గు మెఱుంగుం బొడసిబ్బెపు న్నొగసుజగ్గ న్నిగ్గుచొక్కాట మం
దములుం గల్గు చనుంగవల్ నెగడ నంతంతన్ వయస్సంపదన్. ౭౬

మ. మరునిం గెల్వ చను ల్గిరీశ్వరుని ప్రేమం గొల్చి ప్రార్థించి ద-
ద్గరిమం జెంద సహింపకన్ విషధరాకారంబు నూగారు దా
బరఁగ న్వేనలి నీలకంఠరుచి నొప్పెన్ గౌను పంచాస్యమై
ఖరిజెంద న్నగుమోము సోముఁ డన సంకాశించె నబ్బోటికిన్. ౭౭

కం. భూమిని యౌవనమహిమ ని
కేమని వర్ణించి నిర్ణయించఁదరం బా
సోముని బదియేడవకళ
కాముని యారవశరంబు గతి రంజిల్లెన్ ౭౮

ఉ. బాలిక కాపితామహుఁడు ఫాలతలం బొకవాంటు బెట్టియున్
మేలగు కర్ణయుగ్మ మెలమి న్నవకంబులవ్రాసి భ్రూయుగం
బోలి గనంబడం బదునొకం డిట ముప్పదిగా గుణింపఁగా
నాలలిమోము నిండునెలయామిని వర్ణనసేయు టబ్రమే. ౭౯

చం. మనసిజుఁ డన్ బురోహితుఁడు మానినియౌవన మన్ సుతుండు సం
జననము గాగ- బాల్యమను జాతకకృత్యము దీర్ప స్వస్తివా
చనమునకై సువర్ణకలశద్వయి కుంకుమబూసినిల్పిన
ట్లనె కుచకుంభయుగ్మము జెలంగె జిలుంగుపయంటమాటునన్. ౮౦

చం. గురుకుధరాభమైన కుచకుంభయుగంబులభార మోపకం
బిఱుదులు నున్నదినిఁయల నిల్చునొ నిల్వదొ కౌనటంచు- నా
సరసిజసంభవుండు మది సంశయమును దలపోసి తా నభం
గురగతి యుక్కునారసముగూర్చినకైవడి యారు శోభిలెన్. ౮౧

ఉ. మారుఁ డనేటికర్షకుఁడు మానిని ప్రాయఁపుఁ బువ్వుఁదోట శృం
గారరసంబు నింప వలిగబ్బిచనుంగవకోడెలెంక నే

మో రచియించి యారనెడి మోకును జేకొని మోటఁద్రోలు కా
సారమనంగ నొప్పె చెలి చక్కనినాభి గభీరతాగతిన్ ౮౧

కం. వలిగుబ్బ లధిక మో- పిఱుఁ
దుల బరువధికంబొ దీని తుల జూతు నటం
చలరు విలుకాఁడు పిడికిట
బలుపట్టిన పట్టనంగ భాసిలె నడుమున్ ౮౨

కం. ఆనాతికనులు చారల
చేనైనం గొలువవచ్చు సిబ్బెఁపుఁ గుబ్బల్
వేనలిమి గ్రుచ్చవచ్చును
గౌనున్నదొ లేదొ తెలియఁగారాదు గదా ! ౮౩

సీ తనసిరుల్ మిన్నందుకొని యున్న కౌదీఁగె
చేముష్టిమాత్రములో నణంగెఁ
దగనహీనవిభూతిఁ దనరు వేణీభరం
బునకొక నైల్యమే బొరయు చుండె
దఱుఁగని కొండంత సిరిగల జన్గవ
కేకాల ముపవాసమే ఘటించె
దినదిన శ్రీసమృద్ధిని జెందు పీనులుఁ
బోలింప నవతకే పాలు పడియెఁ

తే. గీ. గలితదరహాససంపదాకరములైన
చారుదృష్టికి శుద్ధచంచలతఁ గలిగె
సతతరుచి నాతికాభోగజంఘలకును
నాఁటికిని నేఁటికిని దొక్కులాటలయ్యె ౮౪

ఉ. చిన్నని మోమునం గనులుఁ జేరల కించుక నెక్కు డున్నెఱా
సన్నపుమోవియం దమృతసారఘటం బతిసూక్ష్మమధ్యభా
గోన్నతసీమయందు కుచయుగ్మముఁ గొండలలిల భారమం
చెన్నక నవ్విరించి సృజియించిన సృష్టికిఁ జిత్రమయ్యెడిన్. ౮౫

సీ. నవలాకుచములకే నవలాకుచము లిడు
కురులు బంభరముల కురులుఁబోలు
బింబంబుతోఁ బ్రతిబింబంబు గెమ్మోవి
ఘనసారఘనసార మెనయుఁ గీర్తి
ముఖ మిందుబింబాభిముఖమై ప్రదీపించు
వళు లబ్ధివీచికావళుల నేలు
పరవంపుఁ బసిఁడిపెం పరవంపు మైఁదీఁగె
కరము లంబుజశుభంకరము లయ్యెఁ
తే గీ. గౌను మిన్నతినెన్నజోకౌను మిన్న
నగ్గళము శంఖసంపద కగ్గలంబుఁ
దమ్ములనునేలు పదము లద్దమ్ము లగుచు
నెంచవేయేల వేయాంకించఁ దగదె ౮౬

సీ. దినదినం బధికమౌ చనుగొండలను మోయ
నోపలేకను దాగియున్నదేమొ !
తను నొత్తుకొనివచ్చు తతనితంబభరంబు
పొందికగని భయం బందెనేమొ !
నాతి నీవీబంధనము బిగింపున కోర్వఁ
జాలక భీతిచే జరిగెనేమొ
ధూమకేతుచ్ఛాయ రోమరాజిని జూచి
కాలాహియని భీతిగలిగెనేమొ !
తే. గీ. మాటిమాటికి కీల్జడపాటుప్రేటు
లోరువఁగలేక దానిగంభీరనాభి
కూపమునదూకెనో గాకఁ గౌంచెమైన
గానరాకున్నదది యేమొ కౌనుదీఁగె ౮౭
సీ. కం'ధరం' బెదిరించి కచభరంబున కోడె
డెసఁజెడి తనుదానె దిశలు బ్రాకె
రహి కిం'శుకము' పాణి రక్తి గై కొననోడి
యందందఁ బురివిచ్చి క్రిందఁ గూలె

ల'హరు' లాత్రివళితో సహజంబుగా నోడి
ప్రతికూల మెనయుచు భంగిపడియె
సా'రసం'భావనచ్ఛాయి నోపక నోడి
పగలుపెంపున పంకభరిత మయ్యె

తే గీ. మొదలు వర్ణచ్యుతిని బొంది తుది నురోజ
వాక్య,మధ్యమ,హాస,సంపద లభించె
'నన్యథా చింతితం కార్య' మన్నచోట
'దైవ మన్యత్ర చింతయే' త్సరణి గాఁగ ౧౧

చం సకలసుమాళివాసనల సంభ్రమతం గొను బంభరంబు నే
నకట సువర్ణజాతినగు నన్మదుపేక్ష యొనర్చె నంచుఁ బా
యకి వనిలోన గంధఫలి హాళి తపం బొనరించి యింతి నా
సికగతి బుట్టఁగా నళులుఁ జేరిన కైవడి యొప్పె నేత్రముల్. ౧౯

సీ చారుపద్మసమృద్ధి చరణద్వయం బందు
పటుకచ్ఛపచ్ఛాయ ప్రపదములను
మకరసంపత్తి కోమలజంఘికలయందు
మంగళవరరూప మంగగరిమ
శంఖవిస్ఫూర్తి భాస్వత్కంధరం బందు
వరరదంబుల కుందవైభవంబు
ప్రకటమహాపద్మభాగ్య మాననమందు
నీలభాస్వరత వేణీభరమున

తే.గీ. తళుకుటారు ముకుందనందనవిభూతి
నిలిపి యజుఁ డెట్లు సవినయవిధులఁ గూర్చు
లెక్క దెలియఁగ మో మిఁగ ప్రక్కలందు
వ్రాయుగతి పీను లమరు నవ్వనజముఖికి. ౯౦

తే.గీ. మమ్ము కలువలచెలి తుంగమడుగు ద్రొక్కఁ
కాలరాచెడి వెతఁ బడజాల మనుచు
జలజములు రాహువేణియౌ సతిని శరణ
మనుచు బొందినగతి చిన్నియడుగు లమరె ౯౧

కం. చెలి యొడికట్టు బిగించిన
బలిమికి నోరువక కృష్ణఫణి నాభిగుహన్
వెలువడుచు కుచగిరీంద్రం
బుల డాగం జనెడురీతి బొలిచె న్నారున్ ౯౨

సీ. తోయజగంధి ముద్దులపల్కులే కావు
కచభరంబునగెల్చు కప్పురాలఁ
బ్రబలతనూసౌరభంబుననే గాదు
సతికంఠమున గెల్చు సంకుమదము
నవ్యకాంతిస్ఫురన్నఖదీప్తినే గాదు
గమనవైఖరిగెల్చు కలభములను
పొలిండ్లనేగాదు పాటలాధరముచే
గెలువఁగా జాలుఁ బ్రాఁగెంపుబంతి

తే.గీ. మృదుపదంబులనేగాదు ముదిత పిఱుఁదు
పటిమనెత్తమ్ములను గెల్చు పద్మభవుఁడు
చిత్రగతి నేర్పుదనర సృజించెనేమొ
దాని కెనయైన చానఁ జగాన గాన. ౯౩

సీ. ముఖ మసాధారణమ్ముగ వంచనము సేయ
సారసం బెనసె హంసంబుతోడ
కన్నులు ముఖవర్ణగతి నడంచ చకోర
కములఁ బొల్పొందె చన్గవలతోడ
పద మధరమునయి కమలధరం బట్లు
తగు సాటిగనె హస్తయుగముతోడ

కటిసీమ వాదించి కలగింప వసుధయే
రహిఁ బూనె మధురాధరంబుతోడ

గీ. భంగపడి నిల్చి మారురూపములనైన
హొసకుచయుగహస్తతలాధరములఁ
బోలెనేగాని యెడబాయజాల వయ్యె
సుదఁతియౌవనభాగ్య మెట్టిదియొ గాని. ౬౪

కం. లికుచంబు లగ్రవర్ణము
లకుఁ జెడినకుచంబులై నెలంతకలరిఁ బై
నొకనైల్య మొదవె వర్ణము
నకు జెడువారికి మొగంబు నలుపగు టరుదే ౬౫

చం. చెలిముఖకాంతి నవ్విధుఁడు జేకొనఁగోరి కళాభిపూర్ణుఁడై
నిలిచి తదాననానిలవినీతసుగంధము తన్నులేమికిన్
గలితసదాకులత్వమున కార్శ్యత పొండిమ మొందెగాక భూ
స్థలి బలవద్విరోధములు తాము దలంచుట హాని జెందదే ౬౬

గీ. భూధరమ్ములఁబోలు పయోధరములు
పటుపయోధరములఁబోలు భ్రమరకములు
భ్రమరకములనుబోలు నంబకయుగంబు
నంబకయుగంబులనుబోలు నతివ చూపు ౬౭

కం. ఆగగనతలముకన్న త్రి
భాగమ్ములు కౌను సూక్ష్మభావమ్మని తా
నై గణితరేఖ లజుఁ డిడె
నాగవళిత్రయము నడుము నాతికి సమరున్ ౬౮

కం. వనితామణికిని నెఱజ
వ్వనమున బాహువులు నిడుదవాటిలి పీన

స్తనమేరుమందరావృత
కనకలతా ప్రాయమై ప్రకాశము జెందెన్

కం. ఘనచంద్రబింబసామ్యం
బని మోమునుజెప్ప కై శికాంగ మధరముల్
ఘన,చంద్ర,బింబ,సామ్యం
బెనసెం గద యిట్టిచిత్ర మెందును గలదే ౧౦౦

చం. చెలివదనంబు చంద్రుఁడని జెప్పుట రాత్రి రుచించు టంతెపో
వలనుగ నీరజంబన దివంబున గాంతి వహించు టంతెబో
నలఘుతర ప్రదీప్తుల నహర్నిశ మభ్యుదయంబు జెంపు కో
మలిముఖ మభ్రమం చుభయమధ్యముగా వచియించు టొప్పగున్. ౧౦౧

కం. కన్నియవీనులు శ్రీకా
రోన్నతిగలవౌట శ్రీల నుల్లంఘింపన్
జన్నదని నిలిచె గావున
గన్నులు తల చుట్టుఁ దిరుగఁగా జనకున్నే. ౧౦౨

గీ. ఖావిబాధితమన్మథబాణవర్ష
సూచకప్రా ప్తధమ్మిల్లమేచకాభ్ర
జనితసుత్రామవరశరాసనములట్టు
మొలకనగుమోమునను బొమల్ దళుకుమీఱె. ౧౦౩

చం. అల శశి సైంహికేయుని మహాత్రికి నోడి నభంబు పీడియున్
నెలఁతముఖస్వరూపముననే జనియింప నతండు వెండియున్
విలసితవేణికాకపటవేషగతిం గబళించ నిల్చిన
ట్లలవడె పూర్వవైర మహహా! కడఁ ద్రోయవశంబె యేరికిన్. ౧౦౪

చం. కడలి జనించు చంద్రునిముఖప్రభతోడ జయించి యన్పటం
బొడమిన ముత్తెము త్తలను బూనె వధూమణి ''లోకమందు నె

వ్వడుపున బ్రాహ్మణులున్ సుగుణవంతుని మిక్కిలియాదరింపుచుం
జడమతులౌ కళంకులను జాలతిరస్కరణం బొనర్పరే". ౧౦౪

మ. ఘననాభీసరసిన్ మరుం డతివశృంగారంపునీరంపుతో
నునునూగారను వల్లరిం బెనుప పైనూల్కొన్నబూఁగుత్తులో
యన బర్వంపుఁజనుంగవ ల్పొదమఁగా నందొప్పు సారంబు గ్రో
ల నటన్ వ్రాలినగండుఁదుమ్మెదలలీలం జూచుకంబు ల్దగెన్.

ఉ. తాను సువర్ణమంచు వనితామణి నిద్దఁపు మేనితావిఁ దాఁ
బూనదలంచి యగ్నిఁబడి పొంగి పుటంబులఁ ద ప్తమై లవం
బై న సుగంధ సంపదలనందక పొందకయుండె నౌర మే
లీనిఖిలావనిం బరసమృద్ధులకోర్వనివారి కబ్బునే. ౧౦౬

సీ. చనుదోయి నాభిహ స్తతలంబు లొకరీతిఁ
దళుకొత్తుకోకనదములఁ గెల్వఁ
దనువుగెమ్మోవియాననలీల నొకరీతి
చంద్రబింబచ్ఛాయ చౌకళింపఁ
గచభారకటివచోనిచయంబు లొకరీతిఁ
ఘనసారరుచి తిరస్కరణఁ జేయ
హసనకంధరనఖ విసరంబు లొకరీతిఁ
దారకంబులదీ ప్తి తారసిల్ల

గీ. నుత్తచరణయానజంఘిక లొక్కరీతి
సుమకరినిభంబు లగుచు విస్ఫురణఁ దనర
దమకు దమలోన నైకమత్యంబు గలుగు
చున్నవా రెన్నటికి భంగ మొందగలరె. ౧౦౭

సీ. పొలతిపయోధరమ్ములు 'రసమంజరి'
నయనముల్ 'కువలయానంద'మహిమ
మేచకాలకపం క్తి 'మేఘసందేశంబు'
విమల'చంద్రాలోకనము' ముఖంబు

దరహాస మసమ'సిద్ధాన్తకౌముది' లస
త్సుధమహాగంభీర'సూక్తి'లీల
శ్రీరుచిత్రివళి 'శృంగారతరంగిణి'
సాకల్య 'సుగుణరత్నాకరంబు'

గీ. కామినులలోన నదియె శిరోమణియను
గాన యీచాన సకలకళానిధాన
యగుట నభిమన్యునకె జోడుదగిన దాల
తాంగి యంగజపుషితమాయాకురంగి. ౧౦౯

గీ. ధన్యు లాశశిరేఖాభిమన్యు లిట్లు
బాల్యము దొలంగి యౌవనస్థౌల్యు లగుటఁ
దొల్లి తమమౌగ్ధ్యభావంబులెల్లఁ దొలఁగి
రసికతానందశృంగారరసము లెసఁగ. ౧౧౦

కం. అటువలె యౌవన మత్యు
త్కటమగుతఱిఁ బార్థసుతుని గాంచినచో యె
చ్చటనుండి గల్గెనో గద
కుటిలాలక కపుడు క్రొత్తక్రొత్తని సిగ్గుల్. ౧౧౧

శా. ఇన్నాళ్లన్నవలె నాతఁ డిట్లెదురుఁగా నేతేఱఁగాఁ దళ్కువా
ల్గన్ను ల్వాలిచి వానిసోయగము క్రీగంటం గనుం జెంతలే
కున్నం జింతిలుఁ దల్పుచాటుఁగొని యత్యుత్సాహతం గాంచు నె
న్నెన్నో చిన్నతనాన గొన్నబను లూహించుం దద్దైకారతిన్. ౧౧౨

వ. ఇట్లు నిరంతరనిశాకాంతవసంతజయంతనలమహీకాంతనితాంతకాంత సుందరతానిశాంతుండును దోర్వీర్యదూరీకృతకుమారుండును నగణ్య లావణ్యాసింధురాట్కుమారీకుమారుండును చండవేదండతుండాయమాన బాహాదండపాండితీశౌండీర్యగాండీవికుమారుండును నైననయ్యభిమన్యునిం గాంచి, యక్కాంతదురంతలతాంతకుంతసంతానసంతాపితస్వాంతయై చింతిలుచుఁ దనమనంబున, ౧౧౩

ఉ. ప్రాయని ప్రేమచేఁ జిఱుతప్రాయమునుండి యితండు నేపయ
స్తోయములట్ల మైత్రిఁగొన దోడనె దత్ఫలపాత్రమై వయః
ప్రాయము సంభవించె బలభద్రుఁడు పెండిలటంచు సేయునో
సేయఁడొ! శంబరారిబుణశేషవిముక్తి లభించు టెన్నఁడో. ౧౧౪

సీ. మొలకతేనియకావిమోవి యున్న ఫలంబు
కొసరి యీతని ముద్దుఁగొనఁగవలదె
గబ్బిసిబ్బెఁపుగుబ్బకవ గల్గిన ఫలంబు
యితనిపై ఱెదగ్రుచ్చి యెత్తవలదె
మరికప్పు మెఱుఁగొప్పు నెఱిగొప్పుగల ఫలం
బితని సందిటిలోన నిముడవలదె
కనకంబు జిగిడంబు కాయంబుగల ఫలం
బితనిమేనున జేర్చి యలయవలదె

తే. గీ మిసమిసబొసంగు జవ్వనం బెసఁగుఫలము
దినము నీతనిశయ్య నిద్రించవలదె
చిన్ననాట్నుం డితనిగూడియున్న ఫలము
పంచబాణుని కేళిఁ గ్రీడింపవలదె. ౧౧౫

చం. అనుచు దలంచు గుట్టు బయ లందగనీక నణంచు గబ్బిచ
న్మొనలను బుల్కరించు మఱిమోహముబెంచు చలించుఁ బ్రేమ నె
మ్మనముననుంచుఁ గోరికల మాటికి రెప్పల నప్పళించు చెం
తను నతఁడున్నవేళఁ దనుదానె హసించు భ్రమించు నెంచుచున్. ౧౧౬

ఉ. శైశవవేళనే నతఁడు జెల్వుగ బొమ్మలపెండిలంచు నెం
తోశుభలీల సల్పెఁగ- సతు ల్పురినెల్లడ పార్థనందనుం
డీశశిరేఖ నింక పరియించగలం డని పాటపాడి ఱా
యాశయ మింక మీఁదట యథార్థమొ దంభవృథానులాపమో? ౧౧౭

ఉ. అరుచిరాననాంబురుహ మాబెళుకుంగను లాగళంబు పెం
పారమణీయబాహుయుగ మాభుజసౌష్ఠవ మాపిఱిందుమే

లారసికోక్తు లాసొగసు లాజగదేకమనోహరాంగశ్రీం
గారములెల్ల నాకనులగట్టినటున్న వికేమిసేయుదున్. ౧౧౮

కం. ఈయనువున శశిరేఖా
తోయజముఖి విరహజనకదోదూయత లోఁ
బాయక చింతిలుచుండఁగ
నాయభిమన్యుండు నిజహృదంతరసీమన్ ౧౧౯

కం. పిన్నతనంబున నేని
క్కన్నియతో శైశవప్రకారమ్ముల ము
న్నున్నగతిగాదు యిదినా
కన్నులకొక్కింతవింతగా గననయ్యెన్. ౧౨౦

మ. మరులెంతోఘనమై మనంబుధృతి నిర్మగ్నంబుగావించె ని
త్తరుణీరత్నము నాగతం బెఱిఁగి కందర్పశ్రమం దీర్పఁగా
పరిరంభాద్యుపచారరీతులను సంభావింపఁగాలేనిచో
మరునిం జూచిన బచ్చిబోయఁ డిక మోమోటంబు దానెంచునే. ౧౨౧

వ. అని తనలోన - ౧౨౨

కం. పరులెవ్వరు లేనియెడన్
మఱుఁగున శశిరేఖహృదయమర్మము దెలియం
బరికింతమని దలంచును
బరులుం గనుఁగొనిన జిన్నపని యనియంచున్. ౧౨౩

సీ. కలికిచెంత వసించుఁ గౌఁగిలించఁదలంచు
మాటమించునటంచు మది భ్రమించు
తనభావ మెఱిఁగించుఁ దలఁపున నుంకించు
సమయంబుగాదంచు శ్రమ వహించు
వలపులు రెట్టించు వారచూపులఁ గాంచు
నేరుపు లూహించు ధూర్త మెంచు

సరసమాడఁదలంచు సైగలు గావించు
సీటులు బచరించు నిమ్మళించుఁ

గీ జెనక గమకించుఁ ద్వరయేల యని వచించు
తరుణినీక్షించుఁ దనలోన దా హసించు
బలితమై మించు మోహంబు నిలువరించు
దర్పకుఁడు నించు శరములఁ దల్లడించు ౧౨౪

కం. శరదిందుబింబతేజ
స్స్ఫురణవయోరూపవిభవశోభితునకు బి
త్తరిచూపున్ మరుచూపున్
దదితీపున్ వెరపునెఱపు తహతహతోడన్ ౧౨౫

మ తొలుతం చంచలవృత్తి దోఁచె మఱి, కందోయిన్ విలోకింప న
వ్వలచిత్తం బనురాగముం గలిగె, క్రేవన్మోవి వీక్షింప-కే
వలధౌర్త్యంబు వహించెఁ జన్నుఁగవభావం బందు నిట్టట్టుగా
దొలఁగెన్ హారములన్ మనంబు కటినెంతో శూన్యమయ్యెన్ మదిన్
౧౨౬

మ. అల రంభాకృతు లీతొడ ల్విమలహేమాకార మీమేను- మం
జులనాసాపుట మాతిలోత్తమ లసత్స్ఫూర్తుల్ సుధల్ జిల్కు- చూ
పులలీలల్ హరిణీవిలాసములు నిప్పుఁబోణి దేవాంగనా
వలి నొక్కొక్కటి నొక్కయంగమున గెల్వంజాలు లీలాగతిన్. ౧౨౭

సీ ఘనసంపదలను నేనెనసియున్న ఫలంబు
పడఁతిపెన్నెఱులు జేపట్టినపుడు
నతులరాజాభిధానత గల్గిన ఫలంబు
చెలియమోమున మోముఁ జేర్చినపుడు
హితవృత్తి కువలయం బేలగోరుఫలంబు
కన్నెకన్నులు ముద్దుగొన్నయపుడు
భువనసామ్రాజ్యవైభవము గల్గు ఫలంబు

గీ. నమృతసేవన మటుమీఁద నంచుఫలము
కలికికెమ్మోవి చవిగొనఁగలిగినపుడు
నహహా! యిటువంటిచెలిఁ బొందునట్టి భాగ్య
మున్నదో? లేదా! తెలియరాకున్న దిపుడు ౧౨౮

కం. తూండ్లవలె భుజము లతనుని
విండ్లవలెం బొమలు ధరణి వెదకిన నిదె పూఁ
బోండ్లతలమిన్న దీనిం
బెండ్లాడినవాని భాగ్యవిధి మేల్దలఁపన్ ౧౨౯

సీ. తరుణికి విలసదధరముఖవర్ణలో
పంబౌచుఁ దనరె గుబ్బల బెడంగు
కలికికి యానవాకార శూన్యం బౌచు
నానాఁడు జెలఁగె నెమ్మేని సొబగు
లలనజఘనమండలదీప్తిని బొసంగె
జలజాక్షికుంతలమ్ముల మెఱుంగు
సతికిని చరమభాయుతకరమ్ములఁగాఁ బ్ర
కాశించె లసమూరుకాండయుగము

తే గీ. పొలఁతి కిటువలె నవయవంబులను దామె
యొకటి నొకటెంచి తమతమయునికి డించి
తాదృశాకృతులకు సాటి దనరుచుండ
మామకస్వాంతమలబడు టేమివింత. ౧౩౦

సీ. సారంగములమించు సతి కొప్పుననె గాదు
కనుదమ్ముల బెడంగునను హసించుఁ
బున్నాగముల మించుఁ బొక్కిలినే గాదు
గంభీరగమనసంగతి నడంచు
ఘనకాంచన మణంచు కాయంబుననె గాదు
సరసనాసావిలాసత వహించు

చంద్రఖండమునెంచు సతి చెక్కులనె గాదు
రమణీయమందహాసమున మించు.

తే. గీ. గాన యీచానతో నసమానమూన
బూనుననుదాని ద్విజగాననైన నేను
గాన గానికనైన యనూనమైన
సూన బాణాన మేనూనలేను గాన. ౧౩౧

ఆ. వె. ఘనముకన్న ఘనము కచబంధనచ్ఛవి
మెఱుఁగు కన్న మెఱుఁగు మేని సొబఁగు
విపులకన్న విపులము పడంతి సుశ్రోణి
[1]దానికన్న మిన్న దాని నడలు. ౧౩౨

తే. గీ. సౌరు బొలుపారు చీమలబారుఁ గేరు
నారు నలరారు నఁనటులతీరు నూరు
తారతారలఁ దూరు చెన్నారు గోరు
లీరమణిమీరు నారు లెవ్వారులేరు ౧౩౩

చం. సరసత నీవధూటి తనసందిటిలో ననుజేర్చి గబ్బియ
బ్బురపుమెఱుంగు గుబ్బలను బొందుగ నాయురమందు జేర్చి వా
తెఱనిడి మోముమోమున గదించి ముదంబుజెలంగ నామనో
హరము లెఱింగి కూడెడు మహావిభవంబు లభించు టెన్నఁడో ౧౩౪

ఉ. గోరున గుబ్బలొత్తి జడకూఁకటి జేకొని మోము మోమునం
జేరిచి కన్నుదమ్ములరఁజేయుచు నునుసన లేతసీత్కృతుల్
సోరెకు సల్పి చెక్కుటరచందురులం బలునొక్కు లుంచి వే
మారు సుధారసంబు చవిమానక నీసతిగూడు టెట్లొకో ౧౩౫

వ. ఇట్లభిమన్యశశిరేఖ లన్యోన్యమోహాతిరేకంబు లేకీభవించి—ప్రత్యూషంబు
తెఱంగున బ్రచ్ఛన్నదారకంబై సత్కవికల్పితకావ్యంబుకరణిఁ బ్రకటీ

1 దాని = ఏనుఁగు

కృతాశ్వాసంబై గ్రీష్మసమయంబుభాతి కేవలతాపోపయోగ్యంబై ప్రదోష కాలంబురీతి విప్రలాపాధికంబై తురుష్కనాయకశృంగారంబుబోలె విచ్ఛిన్నాలంకారంబై యున్న సమయంబున- ౧౩౬

మ. బలభద్రుం డొకనాఁడు హేమమయశుంభత్సౌధభాస్వద్విధూ
పలవేదిన్ మణిభద్రపీఠమున జెల్వంబొప్ప నాసీనుఁడై
లలనారత్నము రేవతీరమణి లీలం జేరి సేవింప సం
కలితామోదత నాత్మపుత్త్రి శశిరేఖం బిల్చి దానిట్లనెన్. ౧౩౭

చం. సుగుణవతీమతల్లి చెవిసోఁక వినందగునమ్మ మత్ప్రియం
బగు వచనంబు లియ్యకొని యంతిపురంబున రాణివాసముం
దగ వసియించుటల్ సతులధర్మము గావున నీవు స్వేచ్ఛ నిం
పుగఁ జరియించగూడ దిట మున్ను శిశుత్వసులీల పుత్త్రికా ౧౩౮

కం. ఇన్నాళ్ళు శైశవక్రియ
నున్నటులం గాదు యౌవనోదయమున రా
కన్నియలు రాణివాసం
బున్న తెఱంగునను నీవటుండఁగ వలయున్ ౧౩౯

చం. పరులను జూడరాదు బహుభాష లతిధ్వని బల్కరాదు నం
దరు విన నవ్వరాదు యిలుదాటి బహిస్థలి నొంటిపాటునం
దిరుఁగగరాదు ధావనగతిం గమియింపఁగరాదు దాసినే
మరి విడనాడరాదు వినుమా యవరోధవధూటికోటికిన్ ౧౪౦

కం. కొమ్మా! నాయానతి గై
కొమ్మా! యిక శైశవప్రగోష్ఠిని విడుమో
యమ్మా! ముమ్మాటికి మీ
యమ్మలతో రాణివాస మట నిలువమ్మా ౧౪౧

కం * అనయాల నింక నీతో
వినయాదిమసద్గుణాభివృత్తులయెడలన్
మనయాదవులకు గలవం
తన యామరవలదు వినుము తనయా! సనయా! ౧౪౨

చం. హలధరుఁ డిట్లు కూర్మి తనయామణి నంతిపురంబులోపల
న్నిలిపిన చేటికాజను లనేకులుఁ గొల్వఁగ నిల్పి బుద్ధిలో
పల నభిమన్యు జూచు టెడబాయుటకీ యవరోధబాధ నా
కలవడె నంచు దర్పకశరాహతమానసయై వసింపఁగన్. ౧౪౩

ఉ. అంతట సవ్యసాచిసుతుఁ డాశశిరేఖ గృహాంగణంబునం
దెంతయులేమి యూడిగపుటింతులవల్ల బలుండు రాణివా
సాంతరసీమలో నిలువ నాజ్ఞ యొసంగినవార్త వించు నం
తంత లతాంతకుంతవిశిఖాహతమానసుఁ డౌచు భీతుఁడై ౧౪౪

ఉ. బాలిక నిన్నినా క్లొకటఁ బాయక వర్తిలునంత యౌవన
శ్రీలభియింప కోర్కెలికఁ జేకురునో యనిజూడ శత్రువుం
బోలిన రాణివాసమని బుట్టెను నామనసైనదీర నా
హా! లికుచస్తనిం గనులనైన గనుంగొన నోచనైతినా. ౧౪౫

చం. అని వనితామణిం దలఁచి హా! యని చింతిలు వెచ్చనూర్చు చెం
తను చెలి గాంచినట్లయిన దాల్మి వహించు చలించు నంతలో
మనమున నీతిగాంచు మరుమాయ లటంచు దలంచు నింతి నే
యనువున జూతునంచును దదాకృతులెల్ల గణించుచుండఁగన్. ౧౪౬

కం. వలరాజు వలన బొలిచెటి
యలరుల దూఁపులకు విలువనలనిగనక న
క్కలకంఠకంఠిపైఁ గల
వలపోపక మందిరోపవనముం జేరెన్ ౧౪౭

* మొదటి చరణము 'అననేల', నాల్గవ చరణము 'యేమరవలదు' అని.

సీ. మరువక చక్రిసంస్మరణయే గావించుఁ
గలికి కీల్జడ పొడగట్టినపుడు
తోడనే పూర్ణవిధుధ్యాన మొనరించు
నింతినెమ్మోము నూహించునపుడు
మతిలోన శ్రీధరస్థితి చింతనమొనర్చుఁ
దరుణిచన్గవఁ బుద్ధిఁ దలఁచినపుడు
తరలక హరిపదధ్యానమే యొనరించు
వెలఁదిలేఁగౌను భావించినపుడు

తే. గీ. పరుల తలయెత్తి చూడఁడు పలుకనోపఁ
డితర మేమాట విననొల్లఁ డెచట నిల్వఁ
డా రతీశ్వరవిగళితస్మారకప్ర
సక్తి వివిధానుభోగవిరక్తుఁ డగుచు. ౧౪౮

చం. జలధరమేచకాలకను జంచలలోచన నాత్మలోన నె
క్కొలిపెఁ దదీయకాంతిఁ గనగోరిన నాన్నృపసూతికిం తదు
జ్జ్వలతరకాంతు లిట్టివని జక్కఁగ జూపి ముదం బొనర్తునం
చలవడినట్లుగాఁగ జలదాగమముం గనుపట్టె నత్తఱిన్. ౧౪౯

సీ. భూరిజలోత్తీర్ణ భుజగావలోకనా
భీతమండూక సంఘాతరవము
భీతమండూక సంఘాతాభయప్రద
కేకారవాహ్వాన కేకికులము
కేకారవాహ్వాన కేకీగణప్రార్థ
నాయాతపటుగర్జితాభ్రచయము
నాయాతపటు గర్జితాభ్రసంతోషిత
కలనాదనుత చాతకవ్రజంబు

గీ. చాతకాశనిసంపాత ఘాతనాతి
భీతచేతోమరాళ సంఘాతములకు

చిమ్మచీఁకటి కారాగృహమ్ము లట్లు
గాఁగ బెంపొందె నప్రావృడాగమంబు ౧౫౦

వం. కలిగె ఘనాగమంబు ఘనగర్జితమం డుబుడుక్కు మ్రోయ చం
చలవలవా టొనర్చి హరిచాపము జాబిలి రేఖఁ బూని నె
మ్ముల బలుకేకలున్ శకునముల్ దగ నంచలకున్ బలాకికా
వలికిని కీడు మే ల్దెలుపవచ్చిన యా డుబుడుక్కువాఁడనన్ ౧౫౧

కం. గగనమున వానజేగురు
లగబడ గాలాహిసాధ్వసాకులతదిశలీ
దగలఁ దెగతిఱిగెనను బొ
ల్పుగఁ దెమ్మెర లపుడు నేలబొరయుచు విసరెన్ ౧౫౨

చ. అల జలదం బనేటి గణకాగ్రణి వానకు లెక్కఁజేయుచో
నిల నొకకొంత, కాననమహీస్థలి కొంత, మహాజలార్ణవం
బుల నొకకొంత, సప్తకులభూధరకోటులకొంత యంచు ము
వ్వలుగల గిల్కుగంటముల వ్రాయు రవంబన నొప్పె గర్జనల్ ౧౫౩

మ. తమముం దేజము లోకమెల్లఁ గొని హుద్దాహుద్ది శంపాభ్రరూ
పములం బోరఁగ దత్కచాకచిన దెంపై ధారుణిన్ వ్రాలు ఖం
డములో నావడగండ్లు జూపడియె వేంద్రంబైన దద్రక్తబిం
దుమతిభ్రాంతిదమై జనించె భువియందున్ శక్రగోపావళుల్. ౧౫౪

కం. మునుపటి మాయప్పులు మర
ల నొసంగు మటంచు భూమిలలనామణి పం
పున నభ్రభటుఁడు గిరగీ
సినగతి పరివేష ముల్లసించెఁ దరణికిన్. ౧౫౫

సి సతతోపవాసాచరిత చాతకవ్రత
పరిపూర్ణశుభ ఫలప్రదగురుండు

తతశైలకంధరస్థలి విహారిమయూర
నర్తనశిక్షావినయనటకుఁడు
ధరణీసతీగ్రీష్మ తాపజ్వరనిరాస
ఘనరసౌషధ వైద్యకర్మచణుఁడు
మహితబిసగ్రాస మదమరాళపిశాచ
మండలోచ్చాటన మంత్రవేది

గీ. కేవలామూలశిథిలిత కేతకీప్ర
హాసకారణ చిత్రవైహాసికుండు
ననెడు చెల్వున దగె నిఖిలావనీజ
నౌఘహర్షాగమంబు వర్షాగమంబు. ౧౫౬

చం. అతఁడును గర్భితంబను మహాజయభేరిని మ్రోవఁజేయఁగా
నతులితనీలకంఠభటు లార్భటిల న్విరహిజనప్రశమో
ద్గతముఖవాయువు ల్దిశలఁ గ్రమ్మినకైవడి మింట మంట ను
ద్ధతిని సమీరవారములు దార్కొని వీఁచె సమగ్రవేగమై. ౧౫౭

చం. జలదమహార్భటీశ్రవణసాధ్వసతన్ సమయాండజోదరం
బెలమి విభిన్నమై రుధిరమెంత దివి న్గరడైనయట్లు ను
జ్జ్వలరవిబింబ మొప్ప నతివాయుహతిం బ్రవహించి రేఖఁగాఁ
బొలిచినరీతి భాసిలె బుభుప్రభుకార్ముక మానగస్థలిన్ ౧౫౮

చం. అమరనదీస్థలంబు సవనాలయమ్ముం దటిదగ్నిహోత్ర మ
ర్యమవరమండలంబు వృషదాజ్యసుపాత్రయు కార్మొగుళ్లను
త్తమఘనవేదికల్ సలిలధారలు యూపములున్ మయూరసం
ఘము లతిథుల్ బొసంగెను మఖంబు ఘనాఘనయజ్వ్రవేల్వఁగన్. ౧౫౯

కం. ఆసమయంబున బుష్పశ
రాసనశరవిసరవిదళితాంగుండై సం
త్రాసమతి సీరధరు ను
ద్దేశింపుచు నులికి పలికె దీనాననుఁడై. ౧౬౦

సీ. తగు పెంపొసఁగవె యా పగవారికైనను
జయముల నీవె కుజనులకైన
కడిమి భరింపవే కఠవారి నిధులైన
గని పూనవే పరాగంబు నైనఁ
బ్రియము గూర్పవె సర్పభయదాయకులకైన
నాజ్ఞలో జనవె గోత్రారికైన
దయ నింపలేవె యెంత జడాశయులనైనఁ
గలిమి నీలేవె చంచలులకైన
తే.గీ. యిట్టి నీసిరి శిరసావహించియున్న
నీలవేణికి మరులొంది జాలిచెంది
వరలు నాసేమ మరయఁగా వచ్చినావొ
వాసవోపలసమదేహ వారివాహ ౧౬౧

చం అల శశిరేఖగీతకలనాభ్యుదయోన్నతిఁ జెందు నీవు న
చ్చెలితలమిన్నగారవముచే మును జెంచు శిఖావళార్భకా
వళికి ముదంబుగా నటనవర్తన జూపుచు దద్గృహాంగణా
కలితవనాళివృద్ధి గనఁగాఁ దగుఁ బ్రోచెదవే బలాహకా ౧౬౨

సీ. పెనువిరహార్తి నిబ్బెఁపుగుబ్బ సెగలపై
జల్లిన పన్నీటి పెల్లు పొగలు
మరుతాపవహ్నిఁ బ్రజ్వరిలు మేననలందు
ఘనసారమున రవుక్రొ్కనిన దీప్తి
పరిలిప్తపాటీర పంకమహోదారు
ణోశ్వాసమున వెడలుడుకు గాలి
నెదనించు పల్లవచ్ఛదముల సెగనుబ్బ
గుబ్బతిల్లుచు బయల్గొనిన చెమట

తే గీ. యిటుల శిశిరోపచారంబు లింతు లిడఁగ
ధూమవిజ్యోతి సలిలవాతూల మొకటిఁ
జేర్చి నిన్నై సృజించి యాచెలియ నాకు
దెలియఁగా బంపె నేమొకో దెలుపు జలద ౧౬౩

సీ నీచంచలములట్లు నేచెలి విరహాగ్ని
వడిహెచ్చెనని దెల్పవచ్చినావా!
కనకాంగినయనాశ్రుకణములు నీవాన
వలె నొప్పెనని దెల్ప వచ్చినావా
పొలఁతికి నీమబ్బుపోల్కె నేతమమెన
హెచ్చెనంచని దెల్ప వచ్చినావా ?
బోఁటిఘర్మోదకంబులు నీకరకలట్ల
వాటించెనని దెల్ప వచ్చినావా ?

గీ. దిశలు మెఱిసె మహావృష్టి దేరి కురిసె
నిరులు దొరసె జలాశ్మనికరము లురిసె
గాన భవదాగమం బికనైన దెలుపు
నీమనంబున దయఁ బూని ధూమయోని ౧౬౪

చం. వినగదవయ్య నామనవి, వేగమె మత్ప్రియురాలిపాలికిం
జనఁగదవయ్య నాకు దివసం బొక యేఁడుగ దోఁచియున్నదం
చనగదవయ్య, చిన్నతనమందున నాటిన ప్రేమ మానవ
ద్దనగదవయ్య మ్రొక్కెద దయాభివిశారద నీలనీరదా ! ౧౬౫

కం నీవారవములబెంప వ
నీవారము లుల్లసింప నిఖిలదిశాళిన్
నీవారవముల నింప ధు
నీవారుల నిమ్మడింప నీవే గావే ౧౬౬

శా. చేతోజాతఘనార్తిచే బొరలు నాసేమం బపేక్షింపఁగా
దే తన్వంగితనూస్థితుల్ దెలిపి ప్రీతిం జీవనం బిచ్చి తీ

రీతి న్నాతికి నావిధం బెఱుఁగ బేర్మిం దెల్పు నీమేలుమ
చ్చేతోవీథి నహర్నిశంబు విడకం జింతింతు ధారాధరా ౧౬౭

చం. అని వినుతించి కొంతతడ వాత్మ దలంచి యహా! యితండు మ
మ్మబ్బున బెడబొబ్బలన్ వదుఱుబోతని నేవినియుండి తెల్వి లే
కను వినుతించు టీవెతలుఁ గై కొని యాసతితోడఁ దెల్పు నే
వనిత సరోజనేత్ర యని వైరమునం గసిదీర్పకుండునే ౧౬౮

కం. పెడబొబ్బ లఱచుకొనుచున్
సుడిగాలిన్ సోకి దిరుగుచును బెనుడాలన్
వడి రువ్వి పిడుఁగు వై చెడి
చెడుగును ఘనుఁ డనుచు వినుతిసేయం దగునే. ౧౬౯

సీ. తేజమెల్ల నడంచె రాజని చూడక
పటుసంపదల బాపె పద్మినులను
కడలఁ ద్రోయుచు నైల్యగతిఁ జూపె ఘనులను
గిలఁగించెఁ బంకిలగతి సరసుల
మేలోర్వక గుదించె మిత్రప్రతాపంబు
బోనడంచెను తపస్ఫూర్తి నెల్ల
కొంచకరూపు మాయించె సత్పథమును
జడిపించె పరమహంసవ్రజములఁ
గీ. దాను జంపెలవృత్తి నెమ్మేన బూనఁ
గొను బొగలెక్కు విషధరాగమముతోడ
నెబులఁ దరియింప వశమునేఁ డింకమీఁద
నహహ శరదిందుముఖిరూప మరయకున్న ౧౭౦

కం. అంత నిరంతరచింతా
క్రాంతస్వాంతమ్ము చే నృకాంతుఁ డుపవనా
భ్యంతరమున వెత జెందఁగ
సంతటిలో ప్రావృడాగమాంతం బగుటన్ ౧౭౧

సీ. వనితలేనవ్వుతో నెనయు వెన్నెలఁ జూపి
 నెవదీర్తుఁ గువలయనేత కనియు
పొలఁతి వాల్గన్నుల బోల్దామరలఁ జూపి
 మురిపింతు సరసశేఖరుని యనియు
మగువయారును బోలు మదరేఖయును జూపి
 దనియింతు పున్నాగమునకు ననియు
కలికినాభిని బోలఁ గలగొలంకుల జూపి
 భ్రమగూర్తు రాజమరాళి కనియు
తే గీ. గాకయుండిన జగతి నల్గడల మించి
మెఱుఁగువెన్నెలగాయ తా మొఱలుజేయ
కొలఁకులకు నెల్ల ముదము దంతులకు మదము
గదర నేతంచె వరశరత్కాల మపుడు ౧౨౨

మ. శరజన్మప్రహతవ్రణశ్రమను నిచ్చల్ జెందఁగా గంధసిం
ధురదంతాహతి పెల్లుగానెగయ నందుం గల్గు నెమ్మొల్మహో
ద్ధురతం జాఱినరీతిగా సితగురుస్తోమంబులం గ్రౌంచభూ
ధరరంధ్రాంతరమందునుండి వెడలెం దద్రాజహంసావళుల్ ౧౨౩

ఉ. క్రౌంచమహామహీధ్రవివరం బిఱువంకలనుండి వచ్చు రా
యంచలపంక్తి యొప్పె శరదంగనకంఠమునందు మౌక్తికో
దంచితహారము ల్బలెనె యందు సరోవరదీప్తి కొల్కిఁగా
నుంచినబూసయుం బలెనె యొప్పెఁ ద్రిలోకమనోహరాకృతిన్. ౧౨౪

చం. తొలుతటిప్రావృడాగమముతోడ నిరస్తముజెందు నీపవం
జులము ఖరద్రుమవ్రజవిశుద్ధపునస్సృజనైకభావుఁడై
నలినభవుండు భూస్థలమునం డిగియుండెనొ గాక యున్నకే
వలధవళచ్ఛవిన్ ద్రుహిణవాహనము ల్ధరనుండ నేటికిన్ ౧౨౫

సీ ఘనమృణాళగ్రాసమున గ్రొవ్వు రాయంచ
కూనలుఁ గన్న లేగ్రుడ్డు లనఁగ
భాస్వన్మయూఖసంస్పర్శచే జనియించుఁ
గలితసానందాశ్రుకణము లనఁగ
పటునిశాసమయసంభవితచంద్రాతపం
బున జనించిన వేడిబొగ్గ లనఁగ
నురుతరభ్రమరనాదోచ్చారణత్వర
రాలిన వాక్శీకరంబు లనఁగ

గీ. బద్మవనలక్ష్మినిజదివ్యభవనములను
క్రమగతినుంచు వజ్రశిఖరము లనఁగఁ
దరళతారుణ్యనీరేజదళములందుఁ
బ్రవిమలంబైన తుహినబిందువులు బొలిచె ౧౩౨

సీ. మెఱుఁగువెన్నెలతీరు మేనఁబూసిన నీఱు
గొనబుటంచలతండ పునుకదండ
తలిరుపుప్పొడిమూఁక తలమీఁద గలవాక
జలజరాగఁపుసొంపు జడలగుంపు
కల్హారములవిప్పు కంటనంటిననిప్పు
కడిమిగ్రొమ్మొదుటుము మేల్కలభపటము
సితకైరవమతల్లి సికలోనిజాబిల్లి
కొలఁకుల చెలువమ్ము చిలువసొమ్ము

తే గీ. పొసఁగఁ బుష్పాస్త్రిఁ దభవుని బూజసేయు
భక్తికి నిజస్వరూపంబు భ్రమరకీట
కప్రకారంబున నొసంగుగతిని నిట్టు
లగుచు లోకైకగర్వనిర్వారణుఁ డయ్యె. ౧౩౩

చం పలుమరు హంససంఘముల బాధలువెట్టిన వార్షధార లా
జలనిధి కెప్పటట్లఁ జన జయ్యున కుంభజహంసు దబ్ధిమున్
గలఁచి వాఁడు మమ్మెటుల గాచును నామతదైక్యవైరమే

దలఁచు నటంచు భీతి ధర దాగి మఱిం దలయెత్తి చూచు చె
ల్వాలరఁగ రెల్లుగుంపు ధవళాప్తి రహించె దిగంతరంబులన్. ౧౭౮

సీ. సంపూర్ణరాజదర్శనసమాగతచక్ర
పటువాహనాయుధభ్రాంతిదములు
ఖాస్వదిరమ్మదప్రమదాంగనిర్ముక్త
శుచికంచుకాకారసూచకములు
తరణిఘృణీతప్తతారాపథవిలేప్య
పాటీరపంకవిభ్రమకరములు
శంభున్మరుత్కుంభికుంభాగ్రలంఘనో
ద్ధతమృగేంద్రమతిప్రదాయకములు
గీ. సరసి జాకరకేళీగజవ్రజాంత
లోకనామాత్రజలపానలోలమేఘ
పటలభీతిపలాయితపటుమరాళ
నికరభావదములు శరన్నీరదములు ౧౭౯

వ. ఇట్లఖిలసుమరజోవిసరధూసరిభాసురంబైన శరద్వాసరంబు లవలోకిం
పుచు భూవల్లభుం డుల్లసితపల్లవభల్లప్రఫుల్లపల్లవభల్లంబుల నుల్లంబు
పల్లటిల్లం దల్లడిల్లుచు నిట్లనియె- ౧౮౦

మ. సరసీకేళివిహారముల్ సలుపు వాంఛన్ రాజహంసావళుల్
జరియింపం గని బూర్వవైరమున నొంచన్‌లేక వెల్వెల్లనై
శరచాపంబులు బోనడంచి చపలేచ్ఛ న్మాని నీవీ వృథా
పరవిద్వేషత సంచరించుటిది దర్పంబౌనె శుభ్రాభ్రమా. ౧౮౧

తే. గీ. నిరతచపలవృత్తి నీరదవిఖ్యాతి
వలరు దీవు రాజహంసతతులు
సరసులందు మెలఁగి సారమెల్ల గ్రహించి
నిన్ను వెల్లఁజేయకున్న దెలియ ౧౮౨

వ. అని రాజహంసలం గూర్చి యిట్లనియె- ౧౮౩

చం. వనితను మీరు గూర్తురను వాంఛ నిరీక్షణసేయ మ(త్ప్రియన్
ఘనకచయంచు మీరలుకగా మొగమెత్తిన జేయనేల త
ద్ఘనమను వాచకార్థ మధికంబునకై ఘనవేణియై దగెన్
వినుఁ డిక యంచలార సతివేనలిచే ఘనముం జయించెడిన్ ౧౮౪

సీ తలఁపగా ఘనవిరోధము వహించిన మీకు
పరమహంసఖ్యాతి బరఁగు టెట్లు
పాటింప సరసుల భంగంబుగను మీకు
మానస(ప్రేమ మైబూను టెట్లు
భువనజాత మదంచి పొడచి పెంపగు మీకు
చ(క్రాంగనామంబు జరుగు టెట్లు
సత్యసంగతి విసర్జనజేసి మను మీకు
శారదావాహ ప్తి గోరు టెట్లు
తే గీ. ధరణి వెలిపుల్గులను పేర దనరు మీకు
సద్విజులలోన జేరంద జాలు టెట్లు
గాన మీపేరువిన్నమా(త్రాన నఖిల
వి(ప్రయోగులు కదలేనివెతలఁ గనరె ౧౮౫

సీ. ఘనవిముఖావాప్తి గల్గియుండుటె గాదు
పంకజాతాసక్తిఁ బాలుపడుట
య(ప్రియవృత్తిచే నలరియుండుటె గాదు
అచలరం(ధాన్వేషణాప్తిఁ గనుట
వసుధవిజాత్యనువర్తనయే గాదు
వాఙ్మా(త్రమై(త్రిభావమున గనుట
మానసోన్నతగర్వ మతిమెలంగుటె గాదు
సంతతమంద(ప్రచారు లౌట
తే గీ. తెలిసి శుచిపక్షులని సత్యనిలయు లనియు
మీదుముఖరక్తిఁ జూచి (భ్రమించి సఖిని
గూర్తు రంచని నమ్మి నే నార్తిచే— ను
తించితిని మిమ్ము నోరూర నంచలార. ౧౮౬

వ. అని యిత్తెఱంగునఁ జిత్తజోన్మత్తవృత్తిం దత్తరింపుచున్న సమ
యంబున. ౧౮౭

చం. మదనునకే వడంకు నభిమన్యున కింక మదాగమంబు చె
న్నొదవిన శైత్యకంప మతియున్నతియౌఁ గద నేఁట రేపఁటన్
మదవతి గూడెనేని కుచమండలి యౌష్ణ్యము సేదదీర్చు నం
చదనుగనుంచి యేమొ జగమంతటఁ గ్రమ్మె హిమాగమం బొగిన్. ౧౮౮

సీ. శిశిరుండు జలజముల్ చెండాడ బరువెత్త
గా జనించిన ఘర్మకణము లేమొ!
భువనజాతమునిండి పొలము దున్నక పండ
జల్లిన శీతబీజమ్ము లేమొ!
విమలశారదలక్ష్మి వెడలఁగాఁ ద్రోయ నే
ర్పరఁచిన శాసనాక్షరములేమొ!
తనరాకకును దిక్కితంబినీజనులెల్లఁ
జల్లు క్రొమ్ముత్తెపు జల్లులేమొ!
తే.గీ. గాకయున్న నహీనసంకాశ మగుచు
భూలతాతృణతరుచయంబులను తుహిన
బిందుసందోహములు బోల్చి పెంపుఁ గనె ది
గంతవిశ్రాంతమగుచు హేమంత మంత. ౧౮౯

మ. సరసులలో మునింగియు బిసంబుల గానక బైటిమెట్ట దా
మరలిరవొందు తావులను మాటికిమాటికి జూచిజూచి యే
కరణి మృణాళనాళములు గానక నాకట స్రుక్కి స్రుక్కి దు
ర్భరహృదయవ్యధన్ వనటబాటిలు నంచలగాంచి యిట్లనున్. ౧౯౦

కం. తగుమాట దెల్పెదను మీ
మొగ మెఱ్ఱనజేయనేల మొదటనె మిము నె
న్నఁగ మానసానువర్తను
లగు వాక్ప్రియు లౌట దెలియునదియుం గాకన్. ౧౯౧

సీ. కొంచెపునడకలో నెంచఁగాదగువారు
నొకమాటపై బెట్టుకున్నవారు
మీవేళఁ కొలఁదిగా తావు జేరెటివారు
విధిదప్పితే గండి వెదుకువారు
పక్షపాతంబు లెప్పటికి మాననివారు
మొదటినుండియు రక్తముఖమువారు
తమ్ముల వంచించి తనువు బెంచెడివారు
ఘనవిముఖత్వంబు గాంచువారు

గీ. గనుక మీరాకలఁ బ్రయోజనమె గాక
పాలుగలవారి భేదమేర్పఱచు బుద్ధి
మీకె గావున గలదె యేలోకములను
చాలు నిక బొందు రాజహంసంబులార ౧౯౨

కం. అని నిందించుచు వారల
కనుకూలంబైన నీరజాకరముల న
జ్జనవరుఁడు కోపరూప
మ్మున గని యాక్షేపరూపమున నిట్లనియెన్. ౧౯౩

మ. అకటా ! యీ వెలిపుల్గు లంగములు మీయం దుండుటం జేసి మీ
కౌక ఖంగంబు ఘటించె నంచు మదిలో నూహింపలేనట్టి మీ
కిక గంభీరము దక్కునే ఘనరసం బెక్కు న్వివేకంబు నిం
చుక లేనట్టి జడాత్ములన్ సరసులంచుం జెప్పఁగాఁ జెల్లునే. ౧౯౪

మ. దివి హంసచ్ఛవి నోర్వలేక తుహినాప్తిం గ్రమ్మ హేమంత మి
ద్భువి హంసచ్ఛవిచే విరిందనరు మిమ్ముం జూచి మీతమ్ములన్
నెవ జెంచంగ నడంచి శైత్యశరముల్ నింపం దలంపూనె నీ
సువివేకంబును లేమికిన్ సరసులంచున్ మిమ్మనం బాడియే. ౧౯౫

చం. ఇక మిము దూర నేమిటికి యింతిముఖద్యుతిగాంచు భాగ్య మ
బ్బకను తదాస్యసామ్యమగు పంకజదర్శనపుణ్య మబ్బె తా

వక సంరక్షించే నని ధ్రువంబుగ నమ్మిన నాకు దైవమో
పక కనుజూపుకైన నెడబాపక వాని నడంచె నయ్యయో! ౧౯౬

సీ. ప్రియురాలి మోవితేనియబోలిన సరోజ
మకరందములు జూడ మాయమయ్యె
పొలఁతిలేఁబాలిండ్ల బోలిన నాళీక
కోరకద్యుతి గాంచ దూరమయ్యె
లంనామణీబాహులతలఁబోలిన మృణా
ళమ్ములు గన నదృశ్యమ్ము లయ్యె
సతికన్గవలఁబోలు సత్కుశేశయదళ
స్ఫుటదీప్తిగన తటమటములయ్యె
తే. గీ. వనితవిద్యోతమానాంగవల్లిఁబోలు
హితసదంబోజలతికావిహీనమయ్యె
నయ్యయో'యేటికో తెల్పరయ్య- భవ్య
కరములార!లసత్సరోవరములార! ౧౯౭

వ మఱియు నాసమయంబున- ౧౯౮

మ చలిచే నభ్రపథంబునం దిరుగుచో చండాంశుఁడున్ గ్రుక్కి యా
జలధిం బాడబవహ్ని గ్రాగుకొని తచ్చైత్యంబు బోకార్పఁగా
దలఁపుంబూని యతిత్వరం జనుటచేతం గాదె దీర్ఘంబు బో
యి లఘుత్వంబును బొందె ఘస్రములు నా హేమంతకాలంబునన్. ౧౯౯

చం చనుల జవాదిపూత లిడి సౌధతలంబుల లోపటింటిమూ
లనషకలాతు దోమతెఱలం దగుకప్పుల నొప్పు జాళువా
పనిదగు పట్టెమంచములపై జిగిసంపెఁగ పూలపాన్పులన్
వనితలు సౌఖ్యసంపదల వల్లభకోటికి గూర్చు జత్తఱిన్. ౨౦౦

చం స్మరవిశిఖార్తిఁ జెందు నభిమన్యుని బాధ సహింపలేక స
త్వరత హిమాగమంబు జను సంధి వసంతుఁడు తన్నుబోలు భూ

వరు తనుతాపమార్ప ప్రసవంబుల సౌరభమెల్ల నింపి త
త్తరుణిని గూర్తు నంచుఁ దనుఁదాఁ జనుదెంచిన భాతి భాసిలెన్ ౨౦౧

చం. అరయ వనప్రియాకలితమై సితపత్త్రములుం దొలంగ వే
మరు శరము ల్వికాసగరిమం గన పాంథజను ల్వడంక ది
వ్యరుచిరదీప్తిచే కువలయం బొక వింత జెలంగ గ్రీష్మముం
గరము రహించె సారసవనప్రియమై జలదాగమంబునన్. ౨౦౨

చం. ఘనలతికాలతాంగు లను గారవ మొప్పఁగ దక్షిణానిలుం
డెనయ తుషారమన్ ముసుకులెత్తి విదల్చుచు పుష్పమంజరీ
స్తనములఁ బల్లవాంగుళులఁ దార్కొని యంటుచు పత్త్రభంగమై
జన బలుతావు లానుచు వెసం బెనగెన్ రుచిజూపి యత్తఱిన్ ౨౦౩

చం మదనుని కూర్మిమిత్త్రుఁ డల మాధవు పూర్వతపఃఫలంబ నా
గుదిరిన వాతపోతమునకుం బువుదేనియ జల్కమార్చియిం
పుఁదనరు పూలడోలికల పొత్తిలిలేఁ జివురుల్ ఘటించి మే
లొదవఁ బికస్వరంబుల వనోకహకాంతలు బాడి రుయ్యలల్ ౨౦౪

మ. తనభానుప్రభకుం దొలంగి హిమగోత్రశృంగముం జేరు శీ
తనికాయంబును బట్టి యాతని జగత్కంపప్రదాభీల ఖే
లనదోషాధికవృత్తి మాన్ప నవలీలం బంకజాతాప్తుఁ డం
తను దాక్షిణ్యముపీడి యుత్తరదిశాస్థానంబు జేరెంగదా ౨౦౫

మ మరుఁ దక్షిణఘనధ్వజప్రతిభ గ్రమ్మన్ జైత్రముం జూడ తె
మ్మెర తేరెక్కి జనంగఁ దద్గరిమ పేర్మిం జూడఁగా సొలవి
స్ఫురసౌధాగ్రము లెక్కి పల్లవకరాంభోజంబులఁ గుట్మలో
త్కరముం జల్లిరి వల్లికాతరుణు లుద్యద్భావిభవ్యాప్తికై. ౨౦౬

సీ మంజుల మహిళా భ్రమరకంబుల హళా
హళిసేయుచును ।బాకులాఁడి యాఁడి

మాటిమాటికిని శ్యామాసమూహము నేమ
కరపత్రభంగముల్ బరపి బరపి
నిలుపులేకను బద్మినీకంకణగ్రహ
ణాపాదియై తావు లరసి యరసి
ఘనగంధవిటపరాగప్రాప్తిని విజృంభ
మాణుఁడై యాశల మలసి మలసి

తే.గీ విమలవరవర్ణినీకాంచనముల వెదకి
వనిమధుపవృత్తి సూనాసవముల మెసఁగి
యటవిపక్షులతో ఫలాహతి నొనర్చి
ధౌర్త్యవృత్తిని మలయగంధవహుఁ డలరె. ౨౦౭

సీ గున్నలేఁమామిడిగుంపులఁ జిగురాకు
గా సంపఁగమికి 'తన్ఖా' లొసంగి
పూఁబొద ల్విరితేనె పొట్ట జీతంబుల
నల్లమూఁకకు 'మొఖాబిళ్ల' చేసి
పరువంపుదాడింబతరువుల ఫలలాభ
కారశూరులకు 'జాగీరు' లొసఁగి
బూవుపుప్పొడి దిన్నెతావునెల్లను సదా
గతివేగరులకు 'ఖిల్లతు'ల జేసి

తే గీ. యొక్కమొగి తనఫౌజులు పిక్కటిల్లఁ
గ్రొత్తపూఁగుత్తికత్తిచే హత్తి విరహ
చిత్తవృత్తు లడంప దండెత్తి వెడలె
కంతుఁ డుద్వేలలీల వసంతవేళ. ౨౦౮

వ. అంత నబ్జాక్షకాంతుడు నిజవిరహకీలికీలాజాలవాతూలాకారంబులగు శుకపికశారికాచంచరీకమలయ పవనాదుల న్విలోకించి 'యిట్లనియె- ౨౦౯

సీ. బంభరంబునుజూడ పటుశిలీముఖ మయ్యె
శుభగంధవహుఁ డొక సోకుఁ డయ్యెఁ

బాండురాంభోజంబు పుండరీకం బయ్యె
　　భాస్వన్మయూరంబు బర్హి యయ్యె
చర్చింపఁగా హిమజలము విషం బయ్యె
　　నవ్యమౌ పొన్న పున్నాగ మయ్యె
విమలప్రసూనరజము పరాగం బయ్యె
　　గురుచక్రవాకంబు కోకమయ్యె

గీ. ఘనవియోగాంబునిధిమగ్నతనున కిట్లు
లీల 'దైవే బలే దుర్బలే' యటన్న
గతిని సుఖదంబులెల్ల విక్రమము లగుచు
నహహ! వలవంత బలవంతమయ్యె సకట ౨౧౦

సీ. చెలిమాట లందితే చిలుకలారా! మీకు
　　దాడింబవనమెల్ల ధార వోతు
చానగానము వింటినేని కోవెలలార!
　　మాకందవని సర్వమాన్య మిత్తుఁ
దెరవనడ ల్జూచితే యంచలార! కా
　　సారతీరము లగ్రహార మిత్తు
సతికొప్పు వీక్షింపజాలితే నళులార!
　　తావి క్రొవ్విరిపొద ల్దానమిత్తు

గి. సుదతియవయవ సంశ్లేష లొదివెనేని
ఘనదళాంబుజమధురసంబులను మీకు
సంతసంబున నిచ సంతసంబు నందె
జాతర లొనర్తు మానసోత్సవము గూర్తు. ౨౧౧

సీ. తతపరాక్రమమహోద్ధతి దొలంగని మేను
　　తొందరగా కంప మందనయ్యె
పటుకార్యధుర్యశుంభత్కౌశలమనంబు
　　తుదలేనికళవళం బొదువనయ్యె

భూరినిశ్చంచలధీరతాగరిమంబు
నూరక శిథిలమై యుండనయ్యె
నప్రతీకస్ఫూర్తి నలరెడు శౌర్యంబు
ప్రాకటంబుడిగి చికాకుపరచె
గీ వట్టిమ్రాఁకుల చివురాకు బొట్టె కోల
బట్టి పాంథుల నిట్టట్టు నెట్టునట్టి
దిట్టసిరిపట్టిబోలినజెట్టి జగతి
గలుగునే యంచు మదినెంచు కళవళించు ౨౧౨

సీ. కవివర్యు 'లనఘవిక్రమశీల' యని బల్క
వినుటకు లజ్జమై వెరపు దోఁచు
మాగధు 'లతిధైర్యమణి'యంచు బొగడంగఁ
జెవియొగ్గి యాలించ సిగ్గు జెందు
బుధులెల్లను 'వివేకనిధి' యంచు గొనియాడ
ననుమోదమును బాసి మనసు రోయు
జనవరు 'ల్వరబుద్ధిశాలి' యంచు నుతింపఁ
బెంపెల్లడిగి తలవంపు లౌను-
గీ నహహ ! వలరాజు బలుదాడి కతఁడు నోడి
తాల్మిబోనాడి ధృతివీడి తడవులాడి
తనకు రక్షకు లెవరు మున్వెనుక గనక
చింతనంతంత వలవంత జెందు నంత. ౨౧౩

గీ. 'కామబాధా దహం కిం కరోమి' యనుచు
'అస్యథోపాస్తి నాస్తి క్వ యామి' యనుచు
'విస్మయా వేదనేన హతోఽస్మి' యనుచుఁ
బలువరింపఁగ సాగె నప్పార్థసుతుఁడు ౨౧౪

కం. అపు డొక నర్మసఖాగ్రణి
నృపసూతిం జేరి పలికె నీయట్టిమహా

విపులగుణశాలి నిటువలెఁ
దపియింపఁగ జేయు తరుణిఁ దాచక చెపుమా ! ౨౧౪

చం. అనుట నృపాలసూతి వినయం బెనయం జెలికాఁడ శైశవం
బున శశిరేఖతో చిఱుతపోడిమిలీల మెలంగుటెల్ల నీ
మనమున గోచరించె యిట మానిని యౌవనవేళ రాణివా
సనియతినుండుటల్ హృదయశల్యముగాఁ దగి బాయ దక్కటా! ౨౧౫

ఉ. కన్నియ కెన్నఁడీవయసుగల్గునొ దత్పరిరంభణాదిసౌ
ఖ్యోన్నతు లెవ్విధిం గలుగునొక్కొ ! నిరీక్షణసేయఁగా వయో
త్పన్నముజెంద పాపఁపువిధాతృవశంబున రాణివాస మం
చున్నను బాసె నాకసులఁజూచుటకైనను నోచకుండఁగన్ ౨౧౬

కం. వేడుకమాటలు బలుఁడీ
చేడియకు న్నాకు బెండ్లిజేసెద ననీ ము
న్నాడిన శపథోక్తుల నల
నాఁడే తనమదిని మరచినాఁడేమొ జుమీ.



కం. అతులతరరూపరేఖా
న్వితయగు శశిరేఖ తనువినిర్మలరుచులన్
నుతియింపఁదరమె యాఫణి
పతికి బృహస్పతికి తుదికి భాషాపతికిన్ ౨౧౮

సీ నెలఁతకురుల్ జాతినీలంబులే గావె
ఘనమన్మన స్తృణగ్రాహు లగుట
నింతినెమ్మోము పూర్ణేందువే మామక
నేత్రచకోరముల్ నెవలు విడుట
పొలఁతిపయోధరంబులు మందరాద్రియే
మద్గభీరమనోబ్ధి మథనగొనుట

వసితపొక్కిలిసరోవరమె మదీయవీ
క్షణమీనములె తొల్గకునికి గనుట

గీ. నింక జెప్పెడిదేమి యయ్యెగురుఁబోఁడి
కులుకుశృంగారరసములు జిలుకుతళుకు
కుందనపుబొమ్మ కలువపూగొనబురెమ్మ
సూనశరునిమ్మ పలుకుల తేనెతెమ్మ ౨౨౦

ఉ. ఇంతిబొమల్ జగంబుల జయించఁగ నించువిలేటికంచు న
క్కంతుఁడు తుంటవి ల్విఱిచి ఖండము జేకొని బోఁటిమాటఁగా
వింతగ బల్కుచిల్కకు నవీనసుధారసమందు ముంచి దా
నంతయు మేతగా నిడుక్రియన్ మధురాధర మొప్పె బాలకున్. ౨౨౧

సీ. బంగారుగిండ్లపై పటుచాకచక్యంబు
కుంభీంద్రకుంభసంరంభగరిమ
పటుతరకులశైలభవ్యమహోన్నతి
జలజకుట్మలముల గలుగు మొనలు
నెఱవేణికాయలు నెగడువట్రువయును
జక్కవకవనొందు చక్కఁదనము
ప్రాఁగెంపుబంతులఁ భఱిగిన దార్ఢ్యంబు
మేఁటితాళఁపుచిప్ప జోటిసమత

గీ. గలిపి విధిసతిచనులుగా నిలిపెగాక
నీమెఱుఁగులీపృథుత్వంబు లీకరినత
లీమొనలపొంక మీబటు వీపృథత్వ
మీమెఱుఁగు లీసమత్వంబు లెందుగలవు ౨౨౨

ఉ. ఏమని దెల్పుదుం గువలయేక్షణ చక్కదనంబు నెన్నవే
మోము లనేతకేయవశమో యనఁగా నితరు ల్గణింపఁగా
నేమగు దత్సతీమణి యహీననవీనవిలాసవిభ్రమ
స్తోమము లాస్థతంగనులజూచిన గాక నెఱుంగవచ్చునే. ౨౨౩

ఉ. నా మనసేమొ నేఁడు లలనాకుచయుగ్మముఁ జేరి రాదు త
త్తేమకరోరఘట్టనలచే నశియించెనొ! మోహవేదనో
ద్దామదవాగ్ని గ్రాగెనొ? నితంబిని సుందరతాప్రవాహమం
దే మఱి గ్రుంకెనో? ఖలరతీశ్వరతస్కరుఁ డాహరించెనో ౨౨౪

మ. బొమసింగాణిని లోచనాంబకము లింపు న్మీర సంధించి యా
హిమరుగ్బింబము రెండుఖండములుగా హేలాగతిం ద్రుంచి య
య్యమృతద్రావము నింకనీక సతిదివ్యాస్యోరుపార్శ్వంబులం
గొమరొప్పన్ సమకూర్చిన ట్లమరె చెక్కుల్ ధాళధళ్యంబులై ౨౨౫

సీ. జనుల నెమ్మన మాసఁగొనఁగఁ జేయుటఁ జేసి
యతివబంగరుబొమ్మ యనుట నిజము
నెఱి తళుక్కని మేను మెఱయుచుండుటఁ జేసి
వనిత తొల్కరిమెఱుఁ పనుట నిజము
గుబ్బచన్నుల పూవుగుత్తు లుండుటఁ జేసి
యంగనలతకూన యనుట నిజము
కువలయామోదంబు గూర్చియుండుటఁ జేసి
మినుకువెన్నెలతేఁట యనుట నిజము

గీ. కులుకుజిలిబిలివలఁపుజిల్కుటలు చేసి
యలరుగేదంగిలేమొగ్గ యనుట నిజము
మతి మరులుబోదు క్షణమైన మరుపురాదు
పంకజాయతనేత్రి తాలాంకపుత్రి ౨౨౬

గీ. హరిఁ గొలిచి కౌను తత్పదం బందె ననుచు
చన్గవ గిరీశుఁ గొలిచి తత్సమతఁ జెంద
హరిహరుల కిర్వురకు ప్రియం బందునటుల
వనితనూఁగా రహీనవృత్తిని దనర్చె ౨౨౭

సీ జలజములే తమ్ములై నిలిచె కోరిక లూర
తరుణీచరణమైత్రిఁ దలఁచియేమొ
పటుచక్రవాకములే పక్షులై విలపించె
చెలిచన్నవలసాటి జెందనేమొ
పరఁగు మంకెనపూవు బంధుజీవం బయ్యె
బాలికాధరలీల బరఁగనేమొ
కుముదినీనాథుఁ డెక్కువ సత్ప్రియుం డయ్యె
నింతిమోనసు మాశ్రయించనేమొ

గీ నవియు ఘనపంకజాతంబు లగుట-రహిత
గుణులు దోషాకరులని చేకొనదు తనదు
మార్దవస్నిగ్ధతాహాసమంజుకళల
నొప్పు చెలియంగకాంతులఁ జెప్పనేల ౨౨౮

చ గరితకచంబు సాటిగనఁగా ఘన మేదిశ కేఁగునో ? ముఖ
స్ఫురణ గనంగనోడి యలపూర్ణసుధాకరుఁ డెందు డాగునోఁ
యురుతరరోమరాజి రుచిరోన్నతి గైకొనఁగా భుజంగ మే
బొటియలఁ దూరునో యనుచు బుద్ధిఁ దలంపు జనించు నో సఖా! ౨౨౯

గీ జలజగర్వ మణఁచి సత్కళాభ్యుదయమై
తారకాప్తమైన తరుణి మోము
నిందుబింబ మనఁగ జెందదే గాకున్న
కలువ లనెడి పేరు కనులు గననె. ౨౩౦

సీ. ఘనకళానిధిరేఖఁ గాబోలునని చూడ
నతనికి నిష్కళంకతయు గలదె!
కంతు మాయావిద్య గాబోలునని చూడ
దానికి సశరీరతయును గలదె!
కోమలదేవాంగనామణి యని చూడ
నందు నిమేషదృగాప్తి గలదె!

తొలుకాఱు మెఱయుఁ దళ్కులమెఱుం గని జూడ
నచట నిశ్చలరీతియై గ దె!

గీ యనుచు వివరింప బాలోప్క నతనుమోహ
వార్ధిని మునింగియున్న నావనట దీర్ప
ఘనకృపాదృష్టి దైవయోగమున జేసి
యరుఁగుదెంచితి నా జీవమై వయస్య! ౨౩౧

కం పాలింఢ్లను కరినత్వం
బాలోకనములను చలత నజుఁ డొనఱచె నీ
లీలనె సతి మదిఁ గలిగిన
నేలాగు జయింపవచ్చు నిక చెలికాడా! ౨౩౨

సీ చెలిముఖం బబ్జారికళలనెల్ల హరించె
నెఱులు చీఁకటిగుంపు నెత్తి ద్రొక్కె
లలనకన్నులు తేఁటులను చెవుల్ బట్టీడ్చె
గళము శంఖమును పూత్కరణఁ జేసెఁ
గమలాక్షిచనులు కోకంబుల నెదద్రొక్కె
నారు భోగిని బొరదూర నడఁచె
నలినాక్షి కటి పులినములు వెన్కకు నెట్టె
నంఘ్రు లంబుజముల నడుసుద్రొక్కె

గీ. తనువుచాయలు పసిఁడి తప్తం బొనర్చెఁ
బొలతి కిటువంటి యవయవస్ఫురణ గలిగి
తుంటవిల్కారినడలు నావంటివాని
కెట్టు లొనగూడు చెలికాడ యిట్టి ప్రోడ ౨౩౩

సీ. నాతిముఖాలోకనము నే పరియించు
ప్రస్తుతవిధి సముపాస్తిఫలము
పతిప ద్మిత్రిల్లగ్రహణమునసే బొందు
నిలకిఁరిసమర్చనీయఫలము

రమణిలోచనచుంబనమ్మునసే సిద్ధించు
కమలాక్షుపూజానుకరణఫలము
పడతి సుధాధరపానంబుననె దీను
నరుణబింబాలోకనార్థఫలము

గీ. మంచి దీక్షామహొందు లభించెనేని
కంతుమంత్రాధిదైవంబు గన్న ఫలము
కోర్కె లొనగూడి యత్తన్వి గూడ నోడి
వేరనొకమూల తపము గావించనేల ౨౩౪

సీ అతివ నెమ్మోము ముద్దాడగల్గినదాక
నుందునా పున్నమ యొక్కప్రొద్దు
నాతికెమ్మోవి పానక మానునందాక
బూనుదునే ఫలదానదీక్ష
పడతిపాలిండ్లు చేపట్టెడునందాక
గావింతునే హేమకలశపూజ
నతివ సుశ్రోణి నే నధివసించినదాక
జనుదునా భూప్రదక్షిణము సేయ

గీ నటు లొడంబడకున్న నే నాత్మజాత
శాతశరజాతజాతపాతాతిభీతి
నేగతి భరింతు విరహాబ్ధి నెటు తరింతు
నింక నేమని యూహింతునే పరంతు ౨౩౫

కం. ఈరీతిన్ మారశరా
సారవిసారప్రసారచకితాత్మకుఁ డౌ
భూరమణకుమారమణి వి
చారము లుడుపంగ నర్మసఖుఁ డిట్లనియెన్ ౨౩౬

ఉ. స్వామి పరాకు'మీమది విచారమున న్వెత జెందనేల మీ
శ్రీమహనీయమూర్తి గని సిద్ధనరాసురయక్షసాధ్యనా

గామరకిన్నరీరమణులైన విమోహనిమగ్నులై భవ
త్ప్రేమ వహింపఁ గోర శశిరేఖ వశంవదయౌట చిత్రమే ! ౨౩౭

మ. అదిగాకన్ మును సీరపాణి భవదీయశ్రీకరాకారసం
పదలన్ మెచ్చి నిజాత్మజాతను మనోవాక్కాయత న్నీకొసం
గెదనంచు న్వచియింపలేదె! మన శ్రీకృష్ణుండు వీక్షింప నీ
మదిలో నింతటిలోన మోహఝుగి నిర్మగ్నుండవౌ టొప్పునే ౨౩౮

మ. అకటా ! నీ విటు లొంటిగా నిలిచి చింతాక్రాంతతం జెంద నే
టికి యుద్యానమున న్నికుంజవనవాటిం గేళిమై మానగో
త్సుకలీలం జరియింత మంచు మది నెంతోఁ బ్రీతి పుట్టించి భూ
పకుమారాగ్రణిఁ జెట్టఁ బట్టుకొని లేవందీసి తెల్విం గొనన్ ౨౩౯

గీ మిన్న యౌచున్న పన్నీట కన్నులొత్తి
నెఱు ఆఱఁగగీఱి సిగవేసి నిగ్గుపసిడి
తాయెతులు జుట్టి పైరుమా ల్దనర గట్టి
వన్నెదుప్పటి మైవలవా టొనర్చి ౨౪౦

మ. వదలంజాలని యీవిరాళిఁ గొని నెవ్వల్ జెందఁగా నేల నేఁ
డిదిగో చూడుమి నాథ!యీవనమునం దేవేళ రంజిల్లు పూఁ
బొదలందుం జివురుల్ ననల్ విరులు గ్రొంబూపల్ శలాటుల్ ఫలా
భ్యుదయాప్తిన్ శుకశారికాపికనినాదోత్సాహసౌజన్యమై ౨౪౧

చం. చిరఘనసారభూషితము శ్రీకరపీరమనప్రశోభితం
బురుసుమనఃప్రియంబు గణికోజ్జ్వల మాయతకాంచనంబు భా
సురవరనీలకంఠపరిశోభిత మాస్తుతిలోత్తమంబునై
సురనగరీప్రతిప్రతిభ శోభిలె నవ్వనపాళిఁ జూడుమా. ౨౪౨

చం. సుర లమృతం బహర్నిశము జుఱ్ఱుటచే వెగటుం జనించి వే
సరుట కిఁకన్ జలాశయకుశంబుల నెల శలాటికామిస

స్థిరవరకుంభజాతములఁ జేకొని నిర్జరకోటి నోటియ
య్యరుచి హరింపనీయ జనినట్లు బరంగెను నారికేడముల్. ౨౪౩

గీ. దేవ భవదీయవిమలకీర్తికి ఝలించి
మోము నైల్యము జెందెనేమో యనంగ
కుందగుచ్ఛంబులందు నిందిందిరములు
బొందియున్నవి జూడు మద్భుతము దోఁప ౨౪౪

మ. చిరమాకందచయప్రశోభితమునై శ్రీయుక్తమై చంపక
స్ఫురితంబై లలితోత్పలావృతమునై సువ్యక్తగీతాళిసుం
దరమై యార్యవినోదమై గురుతరద్రాక్షారసామోదవ ౨౪౫
త్తరవోదీరితమత్తకోకిలమునై దాఁబూనె కావ్యాకృతిన్.

గీ. సతత మివ్వని పున్నాగసహితమై వ
రాళిసంచార మగుచు నుత్తాలతాల
శోభితం బౌచు రాగవిస్ఫురణ దనరి
రమ్యమై యొప్పె సంగీతరస మనంగ ౨౪౬

మ వనభూకన్యక పల్లవారుణిమసుస్వాంతానురక్తిం బ్రభం
జనచంచత్సుమగుచ్ఛసుస్తనము లాస్థం జూపి దా నవ్వసం
తుని యామోదమునం బెనంగుటకు చేతఃప్రీతిచే షట్పదీ
ధ్వని దంభంబున బిల్చుచున్నవదె నాథా! చూడుమీ చిత్రముల్. ౨౪౭

కం. విరము రజోజృంభితమై
సరసామోదమున దా కిసలయస్ఫూర్తిన్
బొరయుచుఁ దాళోన్నతమై
బరగె వనము నాట్యమంటపస్ఫూర్తి నిలన్. ౨౪౮

గీ. వనవధూమణి బాలపవనచలత్కి
సాలకరముల నభినయసరణిఁ జూపి

భృంగనినదసుగానంబు చెంగలింప
మ్రోలనాఁడె వసంతుఁ డామోద మొదవ. ౨౪౯

సీ. లలనాముఖమురీతి లతికాభిరామంబు
వేశ్యమాడ్కిని బహువిటపయుతము
నభ్రంబుగతి రాజహంసప్రకాశంబు
భాగవతము శుకప్రకటస్ఫూర్తి
క్రీడాగృహము నారికేళికానుసరంబు
రవిలీల ఛాయానురాగభూమి
విద్వజ్జనునిభాతి వివిధాగమహితంబు
ప్రావృట్ప్రతిభ కందభాసురంబు

గీ. ధాతకై వడి వరశారదాప్రకాశి
కలితకైలాసగతి నీలకంఠయుతము
సవనవాటికవలె ద్విజోత్సాహమయ్యె
తావకప్రీతిగనుము నుద్యానవనము ౨౫౦

గీ స్వామి యిదె జూడు పుష్పగుచ్ఛములపైన
గండు మగతేఁటిగమి వ్రాలుచుండు టిదియె
భావిదేవర లిటు బలభద్రతనయ
కుచగుళుచ్ఛంబులను వ్రాలు గుఱిని జూపె. ౨౫౧

కం అల్లదె కనుమి రసాలసు
పల్లవముల గంట్లుజేసెఁ బరభృతములు నీ
వెల్లపుడు బలసుతాధర
పల్లవముల గంట్లొనర్చు పగిదిం జూపెన్ ౨౫౨

కం. అదె పున్నాగము పెనగొ
న్నది యొకలతకూన చనువునను శశిరేఖా
సుదఁతి లతకూన గావున
బొదవదె పున్నాగ సత్ప్రభుఁడ వీవగుటన్. ౨౫౩

మ. చెమటార్పం గదళీచ్ఛదం బిదె వీచెం దాళవృంతాదిక
భ్రమగా నీకు మనోజయం బిదియె భూపాలా! యికన్ రేవతీ
రమణీపుత్రి యనంగ సంగరమునన్ రంజిల్లుచో నీరతి
శ్రమబిందుప్రశమార్థమున్ సురటి వీచంబూను చందంబునన్. ౨౩౪

చం. పొగరున కీరదంపతులు పూఁబొదలందున గేరుచున్ సుమా
శుగసమరక్రియాకలన జొక్కుచు నున్నవి జూడు మట్లనే
తగురతికేళిలో బలసుతం వెనగొందువు యీ నికుంజపుం
జగురునికేతనంబులకు చాటుననేయనురీతి దెల్పెడిన్ ౨౩౫

కం. అని నర్మసఖుఁడు దెల్పఁగ
జననాథతనూభవుండు చయ్యన ఋషకే
తనకోటీఘనధాటీ
వనవాటీదర్శనోత్సవంబున వెడలెన్ ౨౩౬

గీ. పార్థతనయుని రాక కవ్వనపథాటి
కీరవారాంచితసజీవతోరణములు
నిలిపి- ఫలభారనమ్రసంకలితకదళి
కాతరుస్థితి మ్రొక్కు సంగతిఁ దనర్చె ౨౩౭

చం అలరిన చైత్రసత్రిపలయందు యదెచ్చు ఫలోపహారముల్
దలపడ వెక్కి సద్ద్విజవితానము శ్రుత్యమృతోక్తి శాఖికా
విలసితకేసరార్ద్రికనవీనసుభాక్షతలెల్ల వాల్చె న
బ్బలరిపుసూనుసూనునకు భావిశుభోదయసూచనార్థమై. ౨౩౮

చం. అమలశుకోక్తి రామకథనాంచితగీతములన్ లతావధూ
సముదయముల్ సదాగతిని జక్కనిగెంజికురాకుపళ్లెరం
బమరిచి నిగ్గుమొగ్గలవయారపుమ్రుగ్గులు తీర్చి శోభనం
బమరఁగ బూవుటారతులు నత్తటి నీడె నృపాలసూతికిన్. ౨౩౯

మ. అల చంద్రాశ్మనిబద్ధశుద్ధతరుమూలాలవాలముల్ సౌరభా
క్షళితోద్యత్సుమనోరజంబులును ఘూకంధాదిమాధుర్యస

త్ఫలజాలంబులు పల్లవారుణలసత్పట్టాంబరంబుల్ ధరా
తలనాథాగ్రణి కవ్వసంతుఁ డులుపాల్ దానప్పనఁ బిచ్చు మం
జులరౌప్యాంచితపాత్రలో యన రుచిం జూపట్టె వన్యావనిన్ ౨౬౦

చం. ధరణిపురాక చూడఁగ లతాతరుఋ ల్కలకంఠనాదవి
స్ఫురగతి నొండొరుల్ బిలుచుచుం జిగురాకుముసుంగు లొప్ప బం
ధురనవగంధిలప్రసవధూళి విదిర్చి నికుంజజాలకాం
తరములనుండి గుచ్ఛలపనప్రభలం బొడసూపె నత్తఱిన్ ౨౬౧

కం. ఈలీల నలరు వనిలో
కేళీలోలత జనించు క్రియ నర్మసఖుం
గేలూతగొని చరింపఁగ
నాలో శశిరేఖ తత్ప్రియాయత్తనుతిన్. ౨౬౨

ఉ అంతిపురంబునందున హలాయుధు నాజ్ఞ వహించి నిల్చి భూ
కాంతుతనూజు రమ్యతనుకాంతులు భావమునం దలంచి వి
భ్రాంతి వహించి భావభవుపల్లవభల్లవికంపితాగతిం
జింతిలి యంతకంతకు నజేయవియోగపయోధిమగ్నయై ౨౬౩

మ పగడా ల్దిద్దిన కోళ్లదోమతెఱ జాళ్వాపట్టెమంచంపుపై
జిగిజల్తారుమెఱుంగుచాందినిసిరుల్ జిల్కుం బుటీదారుమేల్
తగటుంజిల్కు టొరుంగు తక్కియల నిద్దాపాన్పునం దర్పకా
శుగపాతాహతచేతయై బొరలు లేచున్ వంతలం జింతిలన్ ౨౬౪

ఉ అమ్మకచెల్ల పిన్నతనమందున నే నభిమన్యుతోడుతం
బొమ్మలపెండిలాటలను బ్రొద్దులు బుచ్చి తదేకభోగమో
హమ్ము లొకుమ్మ డుమ్మడిలునంతటిలోపల నిట్టి రాణివా
సమ్ము విసమ్ముకోర్కె విరసంబునకై ఘటియించె నక్కటా! ౨౬౫

సీ. నను పొత్తులో నుంచుకొని భుజించుట యేనె
చెంతలేకున్న భుజింపలేదు

నాకుఁ బోఁకలను నే నందిచ్చితే గాని
యతఁ డొంటిగా విడె మందలేదు
సౌరభాదిసువస్తుచయములు నను వీడి
యేకసాక్షిగ దాఁ గ్రహించలేదు
తోటిబాలురతోడ నాటపాటలనైన
వెనువెంట నాజంట విడువలేదు

గీ. దైవ మీనాఁటి కెడబాప దలఁచె గాదె
యొంటిగా వానిమాని నన్నుంటఁ జేసె
నివ్వటిల్లిన నామేని జవ్వనంబు
నడవిగాసిన వెన్నెల యయ్యె నహహా! ౨౬౬

ఉ. హా విధి యెట్లు సేయునో ప్రియం బలరంగను వానిముద్దుకె
మ్మోవిని పంటికొద్ది చవిముట్టఁగ గ్రోలుచు కౌఁగిలించి మే
లౌ చలిగబ్బిగుబ్బ లురమంటఁగ గ్రమ్మి యనంగకేళి పుం
భావము జూపలేని యెలప్రాయ మికేటికి కాయ మేటికిన్? ౨౬౭

ఉ వాని వయార మిట్టిదని వర్ణన జేయదరంబె సిగ్గునె
మ్మేని మెఱుంగు కుందనము మించు మధువ్రతకోటి నంచు మే
లైన కురుల్గ ణించు మృదులానన మాశశినొంచు- కౌనదే
కానఁగరాదు నాకనులగట్టినటున్న పికేమి సేయుదున్. ౨౬౮

ఉ మత్సమసద్వయస్కుఁ డభిమన్యువరుం డదిగాక రూపసం
పత్సరసీరుహాంబకుఁడు ప్రాణపదంబగు మేనబావయం
చుత్సవ మొందుచుండఁగ వియోగవశాస్పదమైన యిట్టి యా
పత్సలిలప్రవాహ మెడబాసి కడంబడు టెట్లు దైవమా! ౨౬౯

గీ మునుపు సౌభద్రునకు నిజంబుగను నన్నొ
సంగెద నటంచు మాయత్త సంతసింప
వేడుకల మాట లొకకొన్ని యాడె గాని
మసలిమాయయ్య మరచెనో మొదటిమాట. ౨౭౦

కం అని తనలో తను కళవళ
మెనయఁగ మనసిజుని వెతలు నినుమడిగొన- జ
య్యన బొరలు లేచు బెగ్గిలు
ననితరఘనతరవియోగహతమానసయై ౨౭౧

సీ ఊరకే తలయూచు నులికి దిగ్గునలేచు
నిల్వుటద్దము జూచు నేలవ్రైచు
చిలుకకూతల కుల్కు పిలువకనే బల్కు
కనుల నశ్రువు లొల్కు గతికి నల్కు
మరువేదనలజెందు మది తహతహ బొందు
కళవళంబందు బెగ్గిలుచు గుందు
విభవంబులకు రోయు వెడఁదకన్నులు మూయు
దెసఁజెడి ధృతి బాయు ఓసల డాయు

గీ. దైవమును దూఱు తగని వేదనల దారు
నెలఁతలను రువ్వు బొట్ట్రవేల నేల్రదవ్వు
కాంతుని దలంచుఁ దమిబఁయ ల్కౌఁగిలించు
మదిని యెనలేని వేతఁబూని మంజువాణి ౨౭౨

ఉ. ఎవ్వరినే భజింతు నిక నెవ్వరి కీ వెత విన్నవింతు నేఁ
డివ్విధమెల్ల సాటిసతు లించుక విన్న ననాదరంబుగా
నవ్వుచు నర్మగర్భవచనంబులచే నను రెప్పనాడి తా
రవ్వల రవ్వలంబరపు టంతియెగాక హితం బొనర్తురే ! ౨౭౩

చం. చనువున నిన్నినాళ్ళు విడజాలని ప్రేమ మెలంగియున్న చ
క్కనివిభుఁ బ్రాయఁపుం దటిని కాంక్ష మెలంగనినాడు చెల్వ ! శూ
న్యనిలయమందు దీపమిడినట్లనెగాదె తలంపు వీనితో
నెనసెడి సుందరాంగి మునుపెంత తపం బొనరించియుండెనో. ౨౭౪

ఉ అద్దిర వానిచక్కఁదన మమ్మకచెల్ల తనూవిలాస మా
నిద్దఁపు జాళువా పసిఁడిసిగ్గులుజిల్కు చొకాటమౌ బొమల్

దిద్దినరీతి నొప్పు జిగిదేరెడు కావిమెఱుంగు మోవియే
ముద్దులగుమ్మ లుం గనిన మోహపయోధి మునుంగకుందురే. ౨౭౫

సీ. వానిముద్దులమోవి నానఁగా మదినాస
గొనుచు గ్రుక్కిళ్ళూరి కొన్నినాళ్ళు
మెఱుఁగువాని యెడందయురము పొందికఁ జూచి
గుబ్బలాము నణంచుఁ గొన్నినాళ్లు
తళుకులొ వానిచెక్కులఁ గాంచి యూరకే
కోరిక నోరూరఁ గొన్నినాళ్లు
దినదినంబును వాని తనురుచు ల్గని మది
గొదలేని వెతనొంది కొన్నినాళ్లు

గీ. నెదిరి చూడఁగ నేటికి యెద నొదవఁగ
దైవవిధిచే వియోగమే తారసిల్లె
నెటులఁ గనుగొందు యెపరి నింకేమ నందు
హితు లెవరు ముందు జీవనం బెట్లు గందు ౨౭౬

వ. అని యి తెఱంగునఁ జిత్తంబు చిత్తజాయత్తంబై వియోగజనితవిరహదహన దాహంబునకు మోహంబు సాహాయ్యంబై నిట్టట్టు నెట్టుబెట్టు నిట్టూ ర్పులం బిట్టదరి యెట్టకేలకుం బట్టులేక గొట్టుమిట్టాడుచు - నంతకంతకుం దురంతకంతులతాంతకుంతాహతస్వాంతరంగంబున నింతింతనరాని చింతాసాగరం బనివారితంబై పెల్లుం బెల్లగిల వెల్లిగొన నల్లగ్రుద్దులం దల్లుకొని మేరమీరిన విచారంబుచే నళుకుబెళుకులం దుళకించి తమ్ములం దొమ్ములాఁడు కందమ్ముల కందమ్ములగు కజ్జలమ్ముల కజ్జలమ్ములుగా నెమ్మ లెక్కి మెఱుంగుం దొఱంగం జేసి లసదరుణతరతరుణ సరసీరుహపరి మాణమ్ములగు దృక్కోణమ్ములఁ జెన్నారు కన్నీరు పూర్ణంబులై తూర్ణంబున వెడలి కర్ణయుగాకీర్ణం బగుట-తనుతాపపుటపాకస్వర్ణకర్ణావతంసంబులం గదయు బదునున వగలం బొగల బొగడు పొగలెగయ సుందరకరార విందంబునం గప్పు కొప్పుప్పళింపం గప్పు కపురంపుఁ బుప్పొడుల నొప్పు గొప్పవిరిసరులం దొరల, మబ్బునుబ్బునం గెబ్బు వేణీభరంబు వీడి

యవయవంబు లాచ్ఛాదింప- సంచరితనిఖిలగ్రహగణగణంబగు గగనం
బవిసి పయింబడు తెఱంగునం దోప-నిఖిలాంగంబుల బొడము పులక
సస్యాంకురంబులకుం బ్రవహింపం గట్టిన జలప్రవాహంబునం బ్రతి
క్షణజనితస్వేదకణగణగంగాతరంగంబుల౦ దొఱంగనికం గుదిఱించు
ఘటతరణిప్రతిభం దనరె-పయంటం దొలంగి మెఱుంగు బహిర్గతంబౌ
శాతకుంభకుంభోపమానవిజృంభితకుచకుంభంబు లుత్తంభంబులుఁగా
శూలిఫాలాభీలకీలాజాలభూతీకృతచేతోజాతవియోగజనితాకులతం దల్లి
డిల్లి జాబిల్లిం బట్టి బిట్టుశోకించు రతీకాంత తెఱంగున నొక్క నెలఱాలం
దిద్దిన మెఱుంగుటరుంగునన్ మేను జేర్చి మనస్సంగజాగరకృశత్వాద్య
ఖిలదశలం గలంగుచుండునంత- ౨౨౨

మ. తనలో దా నభిమన్యురూపములనే ధ్యానించుచుం జూచి న
ట్లనె మెచ్చుం బొలయల్కఁ జెందు మది వేడ్కన్ నవ్వుచుం బల్కరిం
చును దర్కించును లజ్జ జెందును చలించున్ చిత్తము న్నిల్వరిం
చును మేలెంచును దిక్కులెల్లఁ బరికించున్ మిథ్యలం చెంచుచున్. ౨౨౮

కం ఏతాదృశగతి చేతో
జాతశరవ్రాతపాతచకితాత్మకయై
శాతోదరి భీతిలఁగ వి
నీతాదరు లగుచుఁ జేరి నెచ్చెలు లెల్లన్. ౨౨౯

కం. బాలా యీలాగున రవ
మేలా! మేలాయె చిత్తమేలాగో నీ
మైలాగో! నీలోఁ గల
యాలోచన దెలియఁ బలుకవమ్మా! కొమ్మా! ౨౩౦

ఉ. ఎన్నఁడులేని వింత యిపు డేటికి నీవలపంత మున్ను రా
కన్నియ లింతహంతకముగా మఱచింత యొకింతబూని మేన్

మిన్నతికొంత గాసిలఁగ మిక్కిలి యింత గొలంతఁ బూనుటే
యెన్నని సంతకాంతనిక యెంతవిసంతల నెంతురో సఖీ ౨౮౧

చం. పెనిచినచిల్కలం దటిమి పెట్టెద వేమి?యనుంగు చేఁడెలన్
వెనుకకు నెట్టెదేమి? నిను వేమరు లొంచు మరాళశారికా
గణముల దిట్టె దేమి?కసుగందని నీనెలపోయగంబు క్రొ
న్ననవిలుకాని కాఁకల నణంగి కరంగదొలంగె దక్కటా! ౨౮౨

సీ. ఇంపుఁగా సమ్మృతంపు నింపఁగా తానముల్
బెంపఁగా వీణ వాయింపవేమి ?
కన్దమ్ములకుఁజూడ నంచమ్ముగా మంచి
గంధమ్ము మేన నలందవేమి?
దిట్టంబుగా తలకట్టుచుట్టున కలి
గొట్టుపూవుల దండఁ జుట్టవేమి?
నిద్దంపుక్రొమ్మించు టద్దంబు చేఁబూని
ముద్దుమోమున బొట్టు దిద్దవేమి?

గీ. కలికి!కపురంపుఁ బలుకులు జిలుసపలుకు
లొలుక చిలుకలపిలుకల కలరవముం
నింపుమీరంగఁ దెలియ బోధింపవేమి?
మహిని గలదటె నీవంటి మచ్చెకంటి ? ౨౮౩

కం. ఇంటంగల బలుపెన్నిధి
వంటి నరాత్మజుఁడు నీకు పరుఁడౌటయె క
న్గొంటి మిక వేరె కోరిక
పంటలకుం గొదువయేమి?బాలేందుముఖి ! ౨౮౪

చం. మనమున నీవు మీద నొకొ మానవనాథకుమారుఁ గోరి యి
ట్లెనుపఁ దలం గ్రహించి పతి భీతి వహించెదొ గాక పార్థనం!

చనని వియోగమోహపరితాపము నొందెదొ? మున్ను నిన్ను జూ
చినగతిగాదు నీనెడఁగుచిన్నియ లెన్న విచిత్ర మయ్యెడిన్ ౨౫౫

కం. కన్నియల నెందతేనిం
గన్నారముగాని సిగ్గు గడకొత్తి మదిన్
మున్నరికెలగొన్న సతిం
గన్నెల నెందైన జూడఁగా లే దబలా! ౨౫౬

ఉ. ప్రోడవుగావు జూడఁ బసిపూఁపవు నేటికి పల్లునెత్తి మా
టాడఁగలేవు యీగతి గయాళితనం బొనరింపకమ్మ నీ
వేడుకలెల్ల మేమె నెరవేర్చెద మమ్మ పసిండిబొమ్మ నీ
తోడిది నమ్మవమ్మ మముఁ ద్రోయకుమమ్మ కురంగలోచనా! ౨౫౭

ఉ. మత్సుతకుం బ్రియాప్తి నభిమన్యుఁడె భర్త యటంచు రాముఁడ
త్యుత్సుకతన్ వచింపుటది యొక్కటెగాదు సుభద్ర నీయెడన్
వత్సలతం గుమారున కవశ్యముఁ బెండ్లి యొనర్చు కోరికన్
హృత్సుఖలీల వర్తిలఁగ నింక విచారము లేల మానినీ! ౨౫౮

మ. అని ధైర్యోక్తులు నెచ్చెలుల్ బలుకఁగా నంభోజసౌగంధి నె
మ్మన మెంతే చిటమూని యాశఁగొని వేమారున్ బ్రియాధీనజీ
వనయై యొక్కనిమేష మబ్దముక్రియం భావించుచున్ మీనకే
తనబాణానుభవప్రభీతి మది సంతాపించుచున్నంతలో. ౨౫౯

కం. ఇవ్విధమున శశిరేఖయు
నవ్విడుపున నృపుఁడు మానసానుభవముల
న్నెవ్వగల బొగిలి రసఁగా
నవ్వలికథఁ దెలుపు మనుచు నధిపుఁ డడుగన్ ౨౬౦

# ఆశ్వాసాంతము

ఉ. పారదశారదాభ్రభుజంగపంకజకుందపటీరమల్లికా
నారదచంద్రఖండహిమనాగకులాధిపరోహిణేయమం
దారమరాళచందన విధాతృసతీశరతాహారడిం
డిరసురాధ్యజిష్ణుకరటిప్రతిభాచ్ఛయశఃప్రదీపితా ! ౨౯౧

పంచచామరము —

పురందరప్రభృత్యమర్త్య
పూజితస్వపత్కజా!
మరందతుల్యవాగ్విలాస
మంజులాస్యనీరజా!
అరిందమప్రతాపనిస్తు
లాయతస్ఫురద్భుజా!
ధురంధరప్రభాపతంగ
తుంగమంగళధ్వజా! ౨౯౨

*నాగబంధము*

చం ఖరకరకోటిభారవరకారణ
భవ్యదయారసౌఘదు
ష్కరమదవైరిదూరకర
సారసవిస్ఫుటితాగశోభనా !
సురవరమేనసారధర
శూరకవిస్ఫురితారభావితా
స్థిరఖగమోదకార,భవ
సేవనఘట్టనవాదకోవిదా! ౨౯౩

## నాగబంధము



చ. ఖరకరకోటిభారవరికారణభవ్యదయారసౌఘదు
ష్కరమదవైరిదూరకరసారసవిస్ఫుటితాగశోభనా!
సురవరమేనసారధరశూరక విస్ఫురితారభావితా
స్థిరఖగమోదకారభవసేవనఘట్టనవాదకోవిదా! (౨-౨౯౩)

10)

మ ఇది శేషాచలనాయకాంఘ్రియుగళీ
హృష్టాత్మశ్రీవాసవ
ర్యదళద్వేంకటరాఘవాగ్రిణియపి
యస్వచ్ఛమౌద్గల్యవం
శ్యదమోభావనవర్యపుత్రనరసిం
హాచార్యవాగ్భూషణా
స్పదతాలాంకసునందినీపరిణయా
శ్వాసద్వితీయం బిలన్ ౨౯౪

ఇది-

శ్రీమచ్ఛేషధరాధర సౌధపీఠివిహరణ వేంకటరమణ
చక్షుర్విలక్షణాక్షీణకృపాకటాక్షవీక్షణాపరిలబ్ధ
లక్ష్యలక్షణానవద్యవిద్యావిలాస శ్రీనివాసగురు
చరణస్మరణాభ్యసనరసనావికాస నిస్తుల్య
కల్యాణసాకల్య మౌద్గల్యగోత్ర
పవిత్రభావనాచార్యపుత్ర
పర్వత్రయకైంకర్యవిధాన
వేంకటనరసింహార్యాభిధాన
ప్రణీతంబైన
తాలాంకనందినీ పరిణయం
బను
మహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము



# తాలాంకనందినీపరిణయము

## తృతీయాశ్వాసము

కం. శ్రీరమణీకుచయుగఘన
సారమృగీమదసుగంధచర్చితవక్షా!
చారుసుమశరసదృక్షా
సారససదృశాక్ష శేషశైలాధ్యక్షా! ౧

కం. అవధారయ! జనమేజయ
నవధామనిధిప్రతాపునకు పైలుం డ
వ్యవధానముగ సుధాధా
రవిధాయకసూక్తు లాదరంబున బలికెన్. ౨

కం. అంతట శశిరేఖగృహా
భ్యంతరమున కుసుమతల్పమందు నొఱిగి య
క్కాంతుశరకుంతసంతతి
కెంతో మది చింతనొందు నింతటిలోనన్. ౩

చం. నునుజిగురున్ ఫిరంగి సుమనోరజమన్ వడియందు నింపి గ్ర
క్కున విరిగుత్తిగుం డొకటిగూర్చి పరాక్రమ మగ్గిఁ జేసి యం
గనకుచదుర్గసీమ గుఱిగా వలరాజుసిపాయివైచె ఫె
ళ్లన శుకశారికాదిభటులున్ వడి లగ్గలకెక్కి యార్వఁగన్. ౪

కం. ఆయేటున కోర్వక నహా
హా! యని తమిసోలి దుర్భరాయాసమునన్
జేయు నుపాయములేక ని
చాయతనమువెడలి చెలుల కగపడకుండన్. ౫

చం పనిగలరీతి మంచ మొకపట్టియు చేతుల నూత జేసి చి
వ్వున వడిలేచి మేల్ముసుఁగు బొందికవైచి కటిం జెలింపు పీ
డిన నెదకొప్పు వీఁపున సటింపఁగ లేఁజెమటల్ దొఱంగ త
న్వెనుకొను కీరశారికల వేసరిదిట్టుచు నూర్పు లొట్టుచున్. ౬

కం. వెఱపు విడి తానొకర్తుక
యురుతరవేదనల నంతికోద్యానమునం
జరియింత మను దలంపున
దరలెం దరళాక్షి మన్మథప్రేరితయై ౭

కం ఆరామపుత్రి యనదఁగు
నారామామణి గృహాంగణారామమునం
ధారాధరమ్ములోపల
నైరమ్మదలతిక జొచ్చినట్టులఁ జొచ్చెన్. ౮

సీ పిడుఁగులవలె వనప్రియరావ మదలింప
పులులట్ల కేకు లద్భుతము నింప
సుమపరాగము కంటకములై యడుఁగు లంట
సుమములు మన్మథాస్త్రముల గెంట
గండుతేంట్లు తుపాకిగుండులై యెదఁ దాక
నలసమీరము సోఁకుఁడగుచుఁ బ్రాక
పల్లవంబులు వాడి జల్లిటలై గ్రుచ్చ
వలిగప్పురము ధూలివలెనె హెచ్చ

గీ తిరిగి తిరిగినచోట్లనే యరిఁగి యరిఁగి
తడసి బెడసిన గతి యుడ్డుకుడిసి జడిసి
గొదల బొదలుచు మల్లెపూఁబొదల మొదల
దీనగతి కోర్చి యొక్కచో మేను జేర్చి.

చం. ఉలుకుచు నుస్సురంచుఁ దలయూచుఁ దగన్ వలవంతఁజెందు బె
గ్గిలు మదిలోన బొక్కు బులకించు నగుం బ్రలపించు గ్రుక్కు ని

శ్చలత వహించు చెమ్మటలు జారఁగ నూర్చు చలించు గద్గగా
కులత వహించు నుల్కు వెతఁ గుందుఁ గనుంగవ నించు బాష్పముల్. ౧౦

కం. ఇటు లనివారిత విరహో
త్కటజనితశ్రమను మదిని కటకటఁబడి య
క్కుటిలాలక దిటమోపక
సొటసొట కన్నీరు వడపుచుం దనలోనన్ ౧౧

సీ. మొగిలిరేకుకటారి మొననాట రొమ్మున
గ్రుమ్మి ప్రాణమ్ము బోజిమ్ముదాన
తుంగమై బొంగు గొజ్జంగి కాలువలోన
నుంకి గుభీలున దుంకుదాన
బూవుదండకు గుజ్జుమావికి నురిగూర్చి
కొంచక మెడ బిగియించుదాన
తేఁటతేనియలోన గాటమౌ కపురంబు
మెదపి సాహసముచే మ్రింగుదాన

గీ. గాక యీకోకిలబలాకలోక కేకి
కోకమదచంచరీకశారీకదంబ
మేకమై పైకొనుచున్న జికాకుఁజేసి
దాక యీకాక కెటు ముందు దాళకుందు ౧౨

కం. బెడిదమగు తుంటవిల్తుని
యడిదంబుల కోర్వలేక నారటచే ని
క్కడ కేఁగుదెంచు టమ్మలు
వెడలిచి కొట్టొత్తినట్టి విధమై దోచెన్. ౧౩

కం ఈలీల వియోగానల
కీలాజాలాసువేలకీలితయౌ త
ద్బాలామణిఁ బొడఁ గానక
నాలో నెచ్చెలులు భయసమాకలితమతిన్. ౧౪

ఉ. అచ్చటి రత్నపంజరములందలి చిల్కలు కాంతవార్త వా
క్రుచ్చి వచింపఁగా మదిని కేవల మార్తిని వారిలోన వా
రచ్చెరువందుచుం గట కటా పసిబాలగృహంబుబాసి నేఁ
డెచ్చటికేఁగె మనకి కేమి యుపాయ మటంచు నెంచుచున్. ౧౫

కం. అయ్యనుఁగుం జెలు లందఱ
లయ్యయ్యో మోసపోతి మని బెగ్గిలి దా
మెయ్యెడల నిలుపనోపక
తొయ్యలి నందంద వెమకదొణగిరి వనిలోన్ ౧౬

మ చెలి యీకప్రఁపుఁ దిన్నెలెక్కి పవళించెం జూడుడీ గుజ్జుమా
వుల నీడం జరియించె గాంచుఁ డిదిగో పున్నాగకుంజాంతరం
బుల గూర్చున్న దెఱుంగుఁడీ యిట విధుప్రోద్యచ్ఛిలావేదిక
న్నిలిచెం గన్గొనరమ్మ జాడ లిటు నిర్ణిద్రాప్తి జూడం దగున్, ౧౭

సీ. సౌపానముల నెక్కఁ జాలనిబాల యీ
కృతకాద్రులెట్టు లెక్కియుఁ జరించె
సుమలత ల్పొరయ నుస్సున నూర్చు బోఁటి యీ
మరుఁగుపూఁబొదరిండ్లు జొరఁగనోపె
వల్లకీధ్వని దల్లడిల్లు ముద్దియ యెట్లు
కోకిలల్ పెల్లార్చు ఢాకకోర్చె
సురఁటీల విసర వేసరటజెందెడి ముగ్ధ
యీగాలిధూళుల కెట్టు లోపె

గీ. ముంపునిద్దంపుసొంపు తా కెంపుటిండ్లు
జొచ్చి కనువిచ్చి మెచ్చనిమచ్చకంటి
బెట్టుకలిగొట్టుచెట్టుల చుట్టుముట్టు
లెట్టు దిరిగెనొ బొట్టిరాపట్టి యిపుడు ౧౮

సీ మూఁకలై పథికహృద్భికరంబులు గాఁగ
కోకిలానీకముల్ గేక లేయ

తుమ్మెద ల్బలు దుమారమ్ము లేపుచు బయల్
 గ్రమ్మి ఝుమ్మని తలది మ్మొనర్పఁ
బిల్లతెమ్మెరలు మేనెల్ల చిల్లులు వోవ
 చల్లనై బెల్లుగా నల్లుకొనఁగఁ
గప్పురంబుల బూదిపుప్పొడు ల్గొప్పలై
 తెప్పలా గుప్పున నప్పళింప

తే.గీ. నింటను చిరంటు లెవరు లేకుంటవలన
జంటవిడి యొంటరిగ కోనవెంట దిరిగి
తుంటవిల్కాంటతూఁపుల నంటి యెంతఁ
గంటకించెనో గదరె వాల్గంటులార ! ౧౯

సీ లలితమృణాళనాళమ్ము లచ్చట జూచి
 చెడుగుఁ జిల్వ లటంచు జడిసె నేమొ !
కోకిలంబులకూక లాకులంబు లొనర్పఁ
 బెనుభూతము లటంచు బెదరెనేమొ ?
కారుపూఁబొదల మయూరంబులను జూచి
 సోఁకుమూఁక లటంచు సొలసెనేమొ !
గుంపుమావిజిగుళ్ళజొంపంబు గనుఁగొని
 పనహుతాశనియంచు వణఁకెనేమొ !

గీ. లీలచేనైన క్రొన్ననవాలుజోలి
మూల మెఱుఁగని యిప్పసిబాలకీ వి
రాళిఁ దూలఁగజేసె యీవేళ గోల
నెందువెదకుదమని భయం బంది గుండి. ౨౦

సీ. సురపొన్నమ్రాఁకుల జోడుల నీడలఁ
 జెలువొందు కలిగొట్ల చెట్లపట్ల
పాటలద్రుమముల తోఁటలమాటుల
 లలితవాసంతికాలతల జతల

సురభితసురసాలతరువుల ఘురువులఁ
క్రీడావినిర్మితగిరుల దరుల
సారసప్రథితమౌ సరసుల సరసులఁ
బుష్పాసవములొప్పు పొదలఁ మొదల

గీ. నారయుచు వేఁక నొకమేర సౌరభప్ర
పూర లతికాకుటీర విస్ఫారచారు
సార సుమనోరజాప్త శృంగారవేదిఁ
జేరి పొగలెడి సిరికుమారి నెదుట ౨౧

మ. ముసుకుం బాయఁగ ద్రోచి నల్గడల నెమ్మోమెత్తి వీక్షించి లో
నుసురంచు స్మరుకంప చిచ్చులకు నిట్టూర్పు ల్వెడంబింప దృ
గ్బిసజాతంబుల బాష్పము ల్దొరగ కంపీభూతసర్వాంగయై
యసిధారాపథరీతి దల్లడిలు నయ్యబ్జాక్షినిం దవ్వులన్. ౨౨

కం. కాంచి యుదంచితధైర్యస
మంచితమతి యంచలంచ లట బొంచి నిదా
నించి సమీపించి సతీ
సంచయము లొకెంచుకన్ విషణ్ణహృదయలై ౨౩

సీ. ముత్యపుఁజిప్పలఁ బోలుచు కెంపులరీతి
కనుఁగప లరుణత గాంచు టేమి ?
హేమకుంభముల మోసెత్తు నీలము లట్లు
పాలిండ్లపులక లేర్పడుట లేమి ?
శంఖరాజము వజ్రశకలము ల్గనులీల
గళమున ఘర్మాంబుకణము లేమి?
కప్పుమబ్బున మరకతము లుట్టినభంగి
జడవీడి వెంద్రుకల్ జెదురుటేమి?

గీ. యనుచు విస్మయమున నహహా!యటంచుఁ
దర్జనీన్యస్త నాసికాతలము లమర

నతివిషాదభ యావృతస్వాంత లగుచు
చుట్టుచుట్టుక వెఱఁగంది చూచి చూచి ౨౪

సీ. వెడవిల్తుని ఫిరంగి వెడలు నీరనజారు
కన్నీరు పన్నీటఁ గలయఁ దుడిచి
తమి మిక్కుటంబైన తలకెక్కి సుడిఁ గొను
గఁనున్న పెన్నెఱుల్ గలయ దువ్వి
చనుజక్కవలుబెట్టు పెనుగ్రుడ్డులో యన
జిక్కుజెందిన సరు ల్చక్కఁజేసి
యహరహం బనురాగలహరి బయల్పొంగు
పగిదిజారిన కావిపైట దిద్ది

గీ జివురులవ్వట్టి మావిని జెంగలించు
సరణి జెదిరిన మణిసరు ల్సవరపఱచి
కౌఁగిట గదించి బొదవుచు గారవించి
చనువు నొనరించి తనుతాపమును హరించి. ౨౫

తే. గీ. ఫలము లలరులు కింజల్కములును గొన్ని
మించుఁబోడికి మైనురాశించి వైచి
బొమలసందున గపురంపు బూదివెట్టి
కంఠసీమను కురువేరుగట్టి యనిరి ౨౬

చం. కులుకుమిటారి గబ్బివలిగుబ్బలు గ్రాగి మెలంగనేల క్రొం
దళుకుపసిండి వన్నెల పడల్చెటి మేను గలంగనేల క
న్నుల నునుగెంపు చెంపల బెనుంగఁగనేల మెఱుంగుకప్పు వే
నల జెదరంగనేల లలనా నగుబాటిదిగాదె బోఁటికిన్ ౨౭

కం. తెలుపఁగరాదో మా కది
తెలియంగా రాదొ! తెలిసితే పనిగాదో?

తెలియుటకు మాకు వలదో!
తలఁపునకున్ రాదొ! తెలుపతగ వదిగాదో? ౨౮

ఉ. ఇమ్మెయి ముమ్మరంపు వెత నేటికి గుందెదవమ్మ యివ్వనాం
తమ్మున హంతకమ్మన పదమ్ములు నొవ్వఁ జరించెదమ్మ చొ
క్కమ్మగు నెమ్మిగమ్మ కసుగందెగదమ్మ రయమ్ము లెమ్ము మా
యమ్మ మనమ్ము నుమ్మలికనందక సమ్మతిలమ్మ కొమ్మరో? ౨౯

సీ. చండాలు లౌచు కుజససంగతి మధు
పానదుర్మత్తు లీభ్రమరకములు
పాంథభీతి ప్రదార్భటు లొనర్చుచు హరి
ప్రద్వేషులైన యీబర్హిణములు
కాలాకృతిని పలుగాకులలోఁ బుట్టి
పంచమరీతులీ పరభృతములు
ఘనవిముఖత్వంబు గని విషావాసులౌ
జాడపదంబు లీ సరసిజములు

తే. గీ పుణ్యతరులను ఫలభంగముల నొనర్చు
పక్షపాతంబులీ శుకప్రకరములకు
భావమున భీతిలేక నీవేవిధమున
ధీరమతి నుంటివమ్మ బంగారుబొమ్మ! ౩౦

చం. మదనసమానమూర్తి యభిమన్యుఁ డనన్యమనీషి యెల్లి నేఁ
డిదె నిను కూర్మి బూని వరియించగలండు నిజమ్ము నమ్ము మో
మదకలహంససమాన వినుమా! యనుమానము మాని పూలుగో
యుద మికలెమ్ము రమ్మ వని నుత్సవలీల జరింపఁగా దగున్ ౩౧

కం. అని యనుఁగుఁజెలు లావని
తను తనుతాపంబు దీర్పదగు మాటల నె
మ్మన మనుమతింప నన జ
వ్వని వనితలతోడఁ గూడి వనిలోఁ జొచ్చెన్ ౩౨

సీ. తేటకాటుకదీటు మేటికొప్పుల నీటు
తేటికూటువుల జంఝూట మణఁప
తళుక్కుక్రమము లొల్కు కల్కిపల్కుల కుల్కు
చిల్కపిల్కలకు మేసుల్కఁజూపు
సిరిప్రాఁపులను జూపు నెఱజూపు సుమచాపు
తూఁపురూపుల నేపు మాపుజేయు
నివ్వటిల్మవ్వంపు నవ్వులై యవ్వల
దవ్వుల పువ్వుల రవ్వజేయ

గీ. లతలకన్నను తనుమృదులతలు గొన్న
వనిత లందరు జొచ్చి యవ్వనితలమున
నిరతిశయమానసానందనిరతిజెంద
జూడ నొకవింత విహరింపుచుండి రంత ౩౩

సీ. దిగువరాలినపండ్లు దేరిజూడక నుండె
పతితవస్తుస్పర్శ పాప మనుచు
సుమనికుంజంబులఁ జొచ్చి మెచ్చకనుండె
చండాలులకు నివాసంబు లనుచు
చేముట్టి కుసుమముల్ జిదుమగోరక నుండె
రహ రజస్వల నంటరా దటంచు
తలిరుటాకుల పందిరులను నిల్వక నుండె
గురుమధుప్రియసక్తి గూడదనుచు

గీ. తలఁచియో లేక నాథుని వలచియో, మె
ఱుంగుబోఁడి వనక్రీడకుం గడంగ
కున్న భావం బెఱింగి యక్కన్నె లెల్ల
వనవిహారంబునకు బాళిమొనయఁ జేసి ౩౪

ఉ. తేఁటులఁ బారద్రోలి విరితేనెరుచు ల్గని గ్రోలి పూఁబొదల్
మాటికిదూరి సౌరభసమగ్రసుమమ్ముల నేరి పుప్పొడుల్

వేటులనాడి యుండొరులు వేడుకగూడి పురాళకోటిస
య్యాటలఁ గొల్చి యవ్వనవిహారము సల్పి రనల్పలీలలన్. ౩౫

చం చెలువగుడాక పందిరులచెంగటి క్రొన్నెలరాల దిన్నెప
జ్జల నెరిగుజ్జుమావిగమి చక్కనిగొజ్జఁగితేఁటనీట వా
కలదరి కుందకుంజలతికానికరంబుల నీడగుంపు గుం
పులుగొని వేడుకల్నిగుడ ప్రోడలు క్రీడయొనర్చి రవ్వనిన్ ౩౬

సీ. ఎలుఁగెత్తి యొండురు ల్గలయ దా బిల్చుచో
కలకంఠకలకంఠముల నదల్చి
మందప్రచారలై యదంద మెలఁగుచో
కాదంబకాదంబగర్వ మణఁచి
పచరింపుచో కుచపాళి పైట దొలంగ
చక్రచక్రస్ఫురచ్ఛాయ నొంచి
వాతెఱ ల్గదలవాక్చాతురుల్ జిల్కుచో
ప్రతిబింబప్రతిబింబ పటిమ నెరపి

తే.గీ. ఒక రొకరిగేరుచో పకాపకను నగవు
లలర దాళిమములబోలు నలరదాళి
కాంతలు జెలఁగ మెలఁగి రక్కాంత లధిక
యౌవనోత్సాహమునజేసి యవ్వనమున ౩౭

సీ మరుమావుపిండ్లు గ్రుమ్మరు మావిపం డ్లనే
కములు గారాపట్టి కాన్కబట్టి
గములు గానలరు పూఁగములగోసి పడంతి
భావం బెరిఁగి 'యుల్పా' లొసంగి
కేసరంబులనొప్పు కేసరంబులు కొన్ని
నాతికోరిక మెచ్చి 'నజరు' లిచ్చి
కోకిపల్లవమంట గొననిపల్లవ మంట
పంబు లెల్లనుజూపి భ్రమత రేఫి

గీ. యిదిగొ గొజ్జంగిపన్నీటి యేటితేఁట
నీట నానాట నాటుపూఁదోట మాటు
చోటులనుచును జూప నచ్చోటు వెడలి
వని జరించెను ప్రోడజవ్వనులతోడ ౩౮

కం. చలితాంఘ్రిద్వయనూపుర
కలనాదార్భటులు విమలకాసారచర
త్కలరాజహంసవితతుల
చెలిమిం గొనజేర బిలుచుచెలువు దలిర్చెన్ ౩౯

సీ. ఈచంపకద్రుమం బెక్కి పూల్గోయవే
ఖంజనేక్షణ నీకు గలదు ప్రీతి
యీదాడిమఫలంబు లెక్కి చేనందవే
శుకవాణి నీకు నించుక యుపేక్ష
యీగుజ్జులేమావి యిగురులే గోయవే
కోకిలమృదువాణి నీకు కోర్కె
యీపూవుఁబోడిదిన్నెపై పవ్వళింపవే
యలివేణి నీకు మహాదరంబు

గీ. కొమ్మ మీకోర్కెగని తెల్పు కోపమేమి
పైకెగయనేమి? ముఖ మెత్తిబార నేమి?
యిటుల కన్నుల కెంపుదయింప నేమి?
మఱి మొరయనేమి? పోరె మీ మనసుకొలఁది. ౪౦

కం. వనితామణు లేగతి య
వ్వనితాపుల నెరయు కోర్కె వాటిల్లని కుం
జనితాంతవిమలసౌరభ
జనితానందమున ప్రొద్దు జరుపుచు క్రీడన్. ౪౧

సీ. శుకవాణిమావికొమ్మకు తారసిలె బిం
బోష్ఠి నీవచ్చోట నుండకమ్మ

గజయాన విరిమ్రాఁకు గవిసెను శతపత్ర
నేత్రి నీవచ్చోట నిల్వకమ్మ
ఘనవేణి క్రీడానగము జేరెను మరాళ
యాన నీవచ్చోటి కరుగకమ్మ
భుజగరోమాళి యిప్పుడె తొగల్ గొననేఁగె
చంద్రాస్య నీవిందు జనకుమమ్మ

గీ. యనెడు సతితోడ వేరొకవనిత జూచి
మోస మికనేమి?సొంక వామోదలసమ
సింహమధ్యలు పావనచిత్రచరిత
లబ్జవదనలు వీరికేసునుచు బలికె ౪౨

సీ కొందఱు కొఁదీఁగె లందంద జలియింప
లతికావితానముల్ లాగి లాగి
కొంద ఱున్నతకు చగుచ్ఛంబులు వడంక
మంచిపూఁగుత్తులే ద్రుంచి ద్రుంచి
కొంద ఱడుంగు జిగుళ్లు తొట్రుపడంగ
కిసలయంబుల నెల్ల గిల్లి గిల్లి
కొందఱు భుజమూలగురుహేమరజ మొల్క
పుప్పొడు ల్పయలంట గుప్పి గుప్పి

గీ. పాణికిసలాధరోష్ఠబింబభుజనాళ
ముఖసరోజంబులకు తూఁగి మూఁగుపైక
శుకమరాళాళులకు భీతి జొక్కి జొక్కి
సతులు పుష్పోపచయకేళి సల్పి రపుడు ౪౩

చం. ముగుద యొకర్తు సూనశరముల్ చెఱుకువ్విలుఁ బూని బొడ్డునం
దిగురుకటారిదాలిచి యహీనశుకాలిమరాళకోటిలో
నెగురుచు నేమనోభవుఁడనే యని కామునులెల్ల భీతిజెం
దగ బెదిరించె యౌవనమదప్రమదంబున ద్రుళ్లియాడుచున్. ౪౪

చం. కురులు జడల్ బడం గలయ గూర్చి పుష్పొడిధూళి మేన న
చ్చెరువుగ దాల్చి దానఋతచిక్కనిమల్లెసరాలుబూని క
ప్పురము లలాటపట్టికను బూతిదలన్విరిగుత్తినించి నే
హరుఁడ నటంచు దానిభయమందఁగ జేసె నొకర్తు గ్రమ్మరన్ ౪౫

సీ. చరణాహతి నశోకతరువు నొక్కపడంతి
పొదిగిఁట కురవకంబును నొకర్తు
నూరువుచే సింధువారమ్ము నొకలేమ
కనుచూపులను తిలకంబు నొకతె
చేజాచి సహకారభూజంబు నొకయింతి
యుమియుచు వకుళంబు నొక్కబోఁటి
గానంబొనర్చి ప్రేంకణము నొక్కవధూటి
పకపకనగి పొన్న నొకలతాంగి

గీ. ముఖవిదీప్తిని చంపకమ్ము నొకభామ
కలికి పలుఁకులగోఁగు నొక్కపికవాణి
యలరు లెత్తించి రాయావిహారగతుల
బయలుపడనీక దోహదక్రియలు నెఱపి. ౪౬

కం. మఱి యవ్వన మెల్లను ద్రి
మ్మరి యౌవనగరిమ జెలఁగ మహిళామణు ల
వ్విరిబొదల బొదలు మహిమలు
విరిబోణికి వేరువేర వినబల్కి రొగిన్. ౪౭

సీ. మల్లికావల్లికాతల్లజమంజరి
మధుమదానందితమధుకరములు
సహకారఫలపూరసారసుధాహార
చంచద్వసీశుకసంచయములు
కాండజాతాహీనషండజాతగ్రాస
లోలమత్తమరాళబాలకములు

నవరసాంచితసుపల్లవరసాస్వాదశా
కాకలీకృతమదకోకిలములు

గీ. కృతగిరిప్రసవనిర్ఝరోద్ధుతనినాద
వనదగర్జభ్రమానటద్వనమయూర
వితతులను జూడు మంగళవిమలగాత్రి
పంకజాయతనేత్రి తాలాంకపుత్రి ౪౮

కం. మంగళము లలరు నీవా
లుంగనులకు శంబరంబులోఁబడి భీతిం
జెంగునను బఱచె చూడుమి
రంగద్గంగాతరంగ రమ్యత్రివళీ ౪౯

తే. గీ. భవదధరసీమ బింబవిభ్రాంతి దోఁచి
శుకనికాయింబులెల్ల గాఁచుకొని తిరుగు
చున్నవిక జూడుమమ్మ నీ కన్నులెత్తి
కుందకుట్మలరదన రాకేందువదన ౫౦

ఉ. కాయజుఁ డవ్వియోగులకు గల్గు రుజన్ హరియింప డాగులన్
ప్రేయనిజప్రతాపశిఖి వ్రేల్చు సలాకులలీల రక్తిమ
చ్ఛాయలపల్లవంబు లతిసాంద్రములై తరులం జనించె చూఁ
డీయెడ పద్మపత్రరుచిరేక్షణ సుందరతావిలక్షణా. ౫౧

చం. హరుఁ డలనాఁడు ద్రుంచు కుసుమాస్త్రుఁడు క్రమ్మఱఁగా జనించు సం
బరమున మన్మథుండు మును ప్రార్థన మ్రొక్కిన గండదీప మి
త్తఱి తలనెత్తెనో యనువిధంబున బుష్పితచంపకద్రుమం
బరుదుగ శోభిలెం గనుమి హల్లక బంధుజయాననాంబుజా! ౫౨

కం. ఈరీతి స్వవనమహిమలు
నారీతిలకంబునకు మనం బలర సుధా

సారాతిరీతిఁ దెల్పుచు
కోరకకుసుమాళి ద్రెంచు కోరిక యారన్ ౨౩

సీ. సుందరీమణి యోర్తు కుందమ్ములను ద్రుంచె
కలికి యొక్కతె చంపకముల డులిచె
నెలఁత యొక్కతె ఫుల్లసీరేజముల్ నేర్చె
చెలి యోర్తు ఖాండీరములను గొసియె
పొలఁతి యొక్కతె పొన్నపూవులనే గోసె
మొగిలిపూవుల నొక్కఱుగుద జిదిమె
తరుణీమణి యొకర్తు దాసనంబుల రాల్చె
లలన యొక్కతె పాటలముఁ ద్రెంచె

గీ. వనిత లట యౌవనోత్సాహమున స్వకీయ
రదన నాసాంఘ్రిభుజనాభివదన నిర్మ
లాధరాంగసుగంధమహావిభూతి
సాటిరావని నిరసించు సరణి దోప ౨౪

సీ. రసదాడిమము జేరరాకు సొంకవగంధి
కీరధ్వనుల నాలకింపవలయు
గుజ్జుమావికి జేరకుమి చంచలాలోక
విమలపికార్భటు ల్వినఁగవలయు
సుమనికుంజంబుల జొరకు చంపకగంధి
చంచరీకముల నీక్షించవలయు
కమలాకరముల వంకకురాకు ఘనవేణి
సొగసైన యంచల జూడవలయు

గీ. నంతియేగాక వాని కాహారమైన
ఫలము లలరులు విరులు తూడులును బాప

పాపమేగాని దాన లాభంబు గలదె
పోదమిక రారె మనము సమ్మోహనమునను ౨౩

వృషభగతిరగడ

వనితరో యీ వనితలంబున
ననతిదూరము జనితివే మది
ఘనతర ప్రేంఖణ తరుద్యుతి
యనితర ప్రియ వినుతియైనది

కన్నె యింతటికన్న మిన్నతి
కన్నెగేఁదగి యున్నచోటికి
క్రొన్ననలు గై కొన్నసతి దా
కొన్నదని బై కొన్నతేటికి

తమ్మలను మొత్తమ్ముగా త్రుటి
తమ్మజేయ హితమ్మ గాదని
తమ్మ పికజాతమ్మ లనవర
తమ్మ గలిసిన నమ్మరాదని

కోరికలు చేకూర కాంచన
కోరకమ్మల నేరికోయకు
సారసముల విసారముల ని
ష్ప్రారమని వేసారి ద్రోయకు.

మారుఁ డిట పలుమారు మెలఁగు సు
మారుగని యామారుకేఁ గుమి
వేరుగని నవ్వేరు నీనెల
వేరుకొని కురువేరు లాగుమి

రంగుదనర కురంగనయనల
రంగమే బహిరంగ మయ్యెను

వంగి వంగి లవంగలత నొ
వ్వంగ చేనది వంగదీయను

మించుఁ బోఁడుల మించి నీవు గ
మించి వనిని భ్రమించె దేలను
మంచితావులు మించు కొమ్మల
వంచి క్రొవ్విరి ద్రుంచు లీలను

ఇందుముఖి నీ విందువిరుల ప
యిం దురాశ మెయిం దలంపకు
కుందరద మనకుం దగిన మా
కందరసముల క్రింద నొంపకు

నేరుపున గన్నేరుఁబూవుల
నేరుకొన బూనేరు మాటికి
మీర లెటులో వేరు సారెకు
మేరమీరు సమీరుధాటికి.

కందములు మాకందములు కురు
విందములు కనువిం దొనర్చెను
తుందముల సుమరందములు సుమి
ళిందములు ప్రియమంది చేర్చెను

కాంత యీలతికాంతమున రతి
కాంతుఁ డతివల నింతి నొంచెను
సంతతంబు వసంతుఁ డీ వా
సంతిలతికా సంతసించెను.

కమ్మవిల్తుని గమ్ముకొన్న శు
కమ్ము లీబింకమ్ము మానవు
నిమ్మళముగా నిమ్మ యీ గజ
నిమ్మకొమ్మ ఫలమ్ము గానవు.

యేటికో యీ బోటుగునకై
మాటికిటు లాదాట మొందెదు
బోఁటిరో యీపాటలం బొక
ప్రేఁటు కేటికొ సూటిఁ జెందదు.

తాముదము జతనాముకొను తా
మరలు గోతాముగా యని
రామ యీ యారామము న్వీడి
రామి కింత విరామ మాయెను

మావుల నమ్మరుమావు లొకగ్గట
ప్రోవులై వాపోవు మానక
తావులుంగల తావులకు -బో
తావు మునుపటితావు గానక

కోరినట్లు చకోరనయనల
కోరకమ్ముల నేరుకొమ్మను
వారిజాక్షిరొ ! వారి దరిగని
వారి త్వరఁగను వారిరమ్మను ౫౭

మ. వనకేళీవిభవంబునం దనిసి యవ్వామాక్షు లెల్లం దనూ
జనితస్వేదకణప్రశాంతికరచంచత్సారసానూననూ
తననిష్యందమరందబిందుచయ ప్రోద్యద్బాలవాతూలశో
భనసౌరభ్యసరోవిహారవికసద్భావంబునం గుంపులై. ౫౮

సీ. విరహిణీజనచిత్తవికలీకరణశంబ
రారాతిబాణతూణీర మనఁగ
వనరమామణిమాధవప్రియార్పితమణి
ప్రకటనీరాజనపాత్ర యనఁగ
చక్రాంగయుగపంచశరకేళికాక్రీయ
కల్పితమృదుసుమతల్ప మనఁగ

నవనీసతీరాజహంసార్థవిరచిత
తతరత్నకంబళా స్తరణ మనఁగ

గీ. సరిదధీశ్వరు దభ్రనిర్ఝరిణి కొసఁగు
సకలమణిగణభరిత పేటిక యనంగ
బరగు పథికశ్రమవిమోచి బహుళవీచి
సరసిరుహరోచియగు సరోవరము జూచి. ౩౮

సీ సలిలపూరితకమండలుసమప్రతిభగా
లలితమరందోత్పలము జెలంగ
హ స్తలంబితనలినాక్షమాలిక భంగి
వనజాగ్రగతమధువ్రతము లలర
కటితటకాషాయపటము కై వడి గళ
త్తటతరుజీర్ణచ్ఛదంబు లలర
ఘనజటాపటలంబుగతి ప్రసూనపరాగ
జాలసచ్ఛన్నశైవాల మమర

గీ. తరుణినాభిగభీరతఁ దా ధరింపఁ
గోరి- తాపసవేష మిక్కొలను బూని
వని తపం బాచరించెనో యన జెలంగె
ననుచు చెలు లెల్ల విస్మయం బావహిల్ల. ౩౯

సీ. వరపద్మశంఖమకరకచ్ఛపాన్వితం
బై ధనేశ్వరుగేహ మనుకరించె
పటుశంఖచక్రవిభ్రాజితంబై రమా
పతికరద్వయిరీతి పరిఢవిల్లె
అనిమిషామృతపరివ్యా ప్తమై పాకారి
మందిరప్రతిభ నానంద మందె
సంచితఘనరాజహంససంకాశమై
తారకాపథదీ ప్తిచే రహిఁజెె

గీ. కుముదవరపుండరీకాదివిమల మగుచు
లాలితం బయ్యె దిఙ్మండలంబు కరణి
ననుచుఁ దత్సరసీతటంబునను జేరి
వసనమణిభూషణము లొకవడి సడల్చి ౬౦

ఉ. కుచ్చెలు బిగ్గగట్టి కుచకుంభయుగంబుల బంటి నీటిలోఁ
జొచ్చి యొకుమ్మడిం దరుముచుం దమలో దము నోలలాడుచు
న్వచ్చలపిడి నీదుచు నవీనవిహారవినోదలీలలం
బెచ్చుపెకింగి యొక్కొకటి జేర్కొనుచు న్విహరించి అత్తఱిన్. ౬౧

చం. ఒక గజయాన వెంటఁబడి యొక్కమృగేంద్రసుమధ్య- నీటిలో
నికి బడగ్రుంగఁదీయ గని నిత్యముఁ దానములందు భృంగకై
శిక లొకకొంద తెచ్చటికొ జేరిరి మేలున జేరువార లో
పికఁగొని యాపద ల్గలుగువేళల చెంతలకైన వత్తురే!'' ౬౨

తే. గీ. ఉవిద యొక్కతె వెతికిలనుండి యీద
గోఁటిపోటుల చనులుఁ గన్గొనఁగనయ్యె
నంకుశక్షతరేఖల నలరు మరుని
మత్తమాతంగకుంభయుగ్మంబు పగిది. ౬౩

చం. సరఁగున షట్పదావళులఁ జంపకగంధి యొకత్తు జోపఁగా
నళిముఖి యంచపోదలఘునాలక పెంపఱసేయఁగా బిసో
త్కరముల నొక్కమత్తగజగామిని ద్రుంపఁగ చక్రవాకులం
దరిమెను చంద్రబింబసమతాముఖి యొక్కతె చిత్రలీలలన్. ౬౪

మ. తమనీడ ల్సరసిం గనుంగొనినమాత్రన్ చిల్వరాకన్నెలన్
భ్రమచే కౌఁగిట చేర్పఁబోవుపగిదిన్ బాహాలత ల్జాపి- నీ
రమునం దీదుచు లోమునింగి తమి మీరన్నల్గడ ల్గాంచి-రి
త్తమతిం దేలుచు నిల్చి రట్లితరకాంతల్ కొంద ఱగ్గింపఁగన్. ౬౫

ఉ. చేత మృణాళనాళ మొక చిమ్మనగ్రోవిగఁ బూని యొక్క సం
గాతపుచేడె మీఁదబడఁగా తనపుక్కిటినీరు జిల్కి త-

దీృతిని నీటిలో మునుగవీడిన దానికచం బటంచు నా
నాతిసతుల్ హసింప నొకనాచును బట్టుకలాగె వేగమున్. ౬౬

సీ. ముఖసరోజ భ్రాంతి ముసరెడి తుమ్మెదల్
నాసికాచంపకోన్నతిని జూచి
భుజమృణాళ భ్రమ బొరయు హంసావళుల్
జలదసదృగ్వేణిచయము జూచి
ఘననాభికాసరోగతరథాంగంబులు
విమలాననేందుబింబముల జూచి
భాసురాధరబింబధీసమాగతకీర
తతి సాంకవామోదతనులు జూచి

గీ మొఱలిడుచు వెల్లనై మిన్నుముట్ట నెగసి
కనులర క్తిమ గొనుచు చికాకు చెంద
సతులు జలకేళికాసముత్సాహ లగుచు
మెలఁగు తద్వైభవము వేరె దెలుఁపనేల. ౬౭

సీ. శశిముఖీ ! పద్మలోచనతో కలహమేల
వీక్షింపు మది రాహువేణి సుమ్ము
పగయేల కలకంఠి ! పల్లవాధరితోడ
నది విమర్శింప రామాంగి సుమ్ము
గజయాన ! పద్మాక్షికడ పంతగింపకు
మిథ్యగా దది హరిమధ్య సుమ్ము
వరటియాన ! మృణాళవల్లికాభుజతోడ
కనలకు నది తటిద్గాత్రి సుమ్మి

తే గీ. యనుచు నునుజూడ్కులను మైత్రి బెనుచుకొనుచు
కలికిచిలుకల కొలుకులు గలసి మెలసి
సరసిసరసీవినోదము లరసి మురిసి
తలఁపునింపున జలకేళి సలిపి రపుడు, ౬౮

ఆ వె. చాన యొకతె యప్పులోన మునింగియు
తేలలేక సుడిని దిరుగ జూచి
పడఁతి యొకతె కొప్పుఁ బట్టుక చిగిచె నేఁ
'దప్పులందు బడిన యటులగాదె' ౬౯

చం. సరసిరుహంబుల న్మెలఁగు షట్పదకోటుల నొక్క బోఁటి స
త్వరగతి జోపి తద్వదనవారిరుహంబున వ్రాల, హస్తపం
కరుహముల న్విదిర్ప విడగాగ బెనంగెటి వాటి కొప్పునం
గరము రహించు సంపెఁగల గాటఁపుపుప్పొడి గుప్పె గుప్పునన్. ౭౦

సీ కమలాక్షి నీ గజగమన గాసియొనర్చె
సింహమధ్యమ బుద్ధిజెప్పవమ్మ
చక్రవక్షోజ నీచంద్రానన గలంచె
నహిరోమరాజి నీ వడుగవమ్మ
సుకరబింబోష్ఠి నీశుకవాణి యదలించె
శుభగసాంకవమోద చూడవమ్మ
ననఁబోణి నీపికస్వని వంచన మొనర్చె
రామాంగి నీవైన రాగదమ్మ

తే.గీ యనుచు సరసోక్తులను మేలమాడుకొనుచు
కలితకలకంఠకలరవ కలకలంబు
లాజలక్రీడగన వేడుకై జెలంగెఁ
గరము జెలువొందుఁ బంకజాకరమునందు ౭౧

తే.గీ. చిరశిలీముఖసంతతిచే మునింగి
నట్టి పద్మిని ఘనశరఘట్టనముల
భంగమొంది కలంగి శుంభద్దళముల
విరిసె నిట నుండపలదని వెడలి రపుడు. ౭౨

తే.గీ. అటుల వెలువడి కాసారతటమునందు
నిలువ కచభారముల జారు నీరుజూడ

క్రొన్నెలు ల్మేఘసంపద గొన్నకతన
లీల వర్షించెనేమొ ధారాళగతిని. ౨౩

కం. అంతట శశిరేఖామణి
నెంతయుఁ గైదండనొసఁగి యింతులు పవనా
భ్యంతరము జేర్చి యొకశశి
కాంతమణిస్థగితవేదికాస్థలమందున్ ౨౪

సీ. ఒకబోఁటి మేన్దడియొత్తె మెత్తనిచేల
తనువున విసముంటఁ దగ దటంచు
నొకసతి తడివల్వ లుంవక సడలించె
కపటముండుట మేలుగా దటంచు
నొకకాంత మేనపొందికగ పావడ దీర్చె
నప్పుదీరిన భాగ్య మొప్పు ననుచు
నొకలేమ కురులార్చి యొప్పుకొ ప్పమరించె
ఘనరసం బొదల నెనయ దనుచు

తే.గీ. నొకరొకర లిట్టు లఖిలవిధోపచార
ములను మణిభూషణంబుల నలవరించి
మంచికస్తురి కపురమ్ము మైనలంది
బొదలు నెత్తావి విరులు కొప్పునను దుఱిమి ౨౫

కం. కొమ్మా సమ్మతి మున్నుగ
నిమ్మెయి జలకేళిసలిపి తికమీదఁ న
క్కొమ్మవిలుతుఁ బూజింతము
రమ్మని దోడ్కొనుచు హర్షరస ముప్పతిలన్. ౨౬

మ. చలువల్ దేరెడి క్రొత్తగొజ్జఁగివిరుల్ జాల్కొన్న పన్నీటివా
కలభెంతం గపురంపుమ్రాఁకుల తడిం గన్నట్టి లేఁగున్నపొ
న్నలపైఁ బెన్గొనుమాధవీలతలక్రిందం పుప్పొడిం దిన్నెపై
యొలమిం గ్రొంబదనైన గస్తురిరజం బింపొందఁ బై జల్లియున్. ౨౭

గీ. కదళికాండములను నల్గడల నిలిపి
మల్లెపువుపందిరుల నుల్లసిల్ల నల్లి
కేతకీదళముల దళ్లు గీలుకొల్పి
తలిరుటాకుల తోరణమ్ములు ఘటించి. ౨౮

చం. గమకఁపు కప్పురమ్మున చొకాటఁపు ౼ముగ్గులు దీర్చి సౌరభో
త్తమలవలీదళమ్ములను దర్పకునిన్ రతినిన్ లిఖించి, యా
హిమకరముఖ్యతద్బలము లీతల నాతల వ్రాసి వేదియం
దమరిచి ధూపదీపకుసుమాక్షతలాదిగ షోడశోపచా
రము లొనరించి కాంతలు నిరంతరభక్తి నుతించి రొక్కటన్. ౨౯

సీ దండంబు కుసుమకోదండపాణికి నమ
స్కారం బదృశ్యతాకారునకును
వందనం బిదె శుకస్యందనునకును ప్ర
ణామంబు రతివధూకాముకునకు
శరణు త్రిలోకసంచరణసాహసునకుఁ
బ్రాంజలి విటవిటీభంజనునకుఁ
బ్రణుతి భృంగస్వనక్వణితానుమోదికి
నతి సమంచితపరభృతవితతికి

గీ. సకలకాముకజనమనస్సంప్రదీప్త
కీలికీలాసమిత్ప్రాయకేవలప్ర
తాపసుమచాపునకు వివిధోపచార
మనుచు నొక్కట వినుతించి యతిశయించి ౩౦

సీ. కనులెఱ్ఱఁగొనక హుంకారించు భటకోటి
మేన గాయంబు గానీని తూఁపు
మొద్దున చిగురాకు మొలిపించు సేనాని
యిందందు నింక మిన్నందు రథము
ఖండించినను వేళ్ళుగలయ మొలెచ్చెడి విల్లు
సంచరింపుచు ఝుంకరించు నారి

గంభీరఘనరసాకలితమౌ చెక్కెంబు
పండ్లుగీటుచు తోడబలుకు తేజి

తే. గి. యిట్టి సిరిపుట్టివై పుట్టినట్టి జట్టిఁ
గంటిమే మున్నుతిగకంటి కంటిమంట
నంటి పెనఁగిన తుంటవిల్బంటు వీవె
చిరవిరహిజీవనత్రాత చిత్తజాత. ౮౧

ఉ. ఇంక భవత్ప్రతాపము నుతింప దరంబె త్రిమూర్తుల న్నిరా
తంకముగాఁగ నొక్కొకరిఁ దార్కొని మేను సగం బొనర్చి ని
శ్శంకత జొమ్ము దట్టి బెలుచందగు నేర్పున నోరుగట్టి య
ప్రభంకశక్తిగన్న నిను ప్రార్థన జేసెద మో మనోభవా! ౮౨

ఉ. ఇన్ని వచింపనేల నిపు డీశశిరేఖను బార్థనందనుం
డున్నతిమీర నీపనుల నుత్సుకలీల మెలంగు సౌఖ్యసం
పన్నతగల్గనేని సులభంబుగ నీకును నీభటాళికిన్
మిన్నతిగా మహోత్సవ మమేయత జేయుదుమయ్య మన్మథా ౮౩

కం. అని వినుతింపుచు వనజా
నన నానవిల్తునకు మనం బలర ప్రియో
క్తిని వేడుకొను మటంచును
చనువున బోధించి రుచితసమ్యక్ప్రణితిన్. ౮౪

సీ. దర్శింపవమ్మ గంధవహుమహాస్యంద
నుని కప్పుకొప్పువాసనలు నిగుడ
నుతియింపవమ్మ సంతతశుకారోహిని
కుల్కుచక్కెర లొల్కు పల్కుఁజిల్క
సేవింపవమ్మ నెచ్చెలి నెలయల్లుని
కలవలనెనయు కన్గవలు నిలిపి
మ్రొక్కవమ్మా! శిలీముఖగుణధన్విని
విమలకోమలకరకమలములను

గీ నింక మీఁదట గల భవదీప్సితంబు
సఫల మొందింపు నాళీకసాయకునకు
చిత్తకమలసమర్పణ జేయవమ్మ
రేవతీపుత్రి ఫుల్లశిరీషగాత్రి ౮౫

కం ఈవందంబున కామిను
లాచరితవ్రతసకలఫలావాప్తిగ వా
గ్వైచిత్ర్యగతిని బొగడి య
థోచితగతి మెలఁగుచున్ సముత్సాహమునన్. ౮౬

చం. తొలుత వనీవిహారమున దూలి తుదిం జలకేళి దేలి య
వ్వల వలరాజుపూజ లనివారితభక్తి నొనర్చి పైపయిం
బలువగు మోహదాహ మొకపాటిగ నెమ్మది నుజ్జగించి యా
నలినముఖిన్ విహారభవనంబునకుం గొని దెచ్చు నంతటన్. ౮౭

గీ. మెలఁత విరహానలజ్వాల మిన్నుముట్టి
తనమయూఖానలోష్మంబు నెనసినపుడె
భానుమండల ముష్ణ మున్షైన శీత
ల మ్మనెడి రీతి ప్రొద్దు చల్లగను దోఁచె ౮౮

గీ. తనదు జనకుని మందేహ దనుజవరులు
దినము బొడువఁగ యమునానదీజలములు
వెంటఁబడి వాని దఱిమెడి విధము దనర
ఛాయలెల్లను బశ్చిమాశకు గమించె. ౮౯

సీ. కుముదకుట్మలముల కొనలు మెత్తగిలంగఁ
దనమది మెత్తనై దడబడంగ
కమలంబు లఱమోడ్పుగని నెవ్వగల జెందఁ
దనగన్ను లరమోడ్పుఁ గనుచు డింద
శశికాంతలుఁ గఱంగి సరగున జాల్వార
తనచిత్తము గఱంగి తాపమూర

హరిదశ్వమణికాంతు లఱవేడిమిని గ్రుంగ
తనమేను నఱవేడిమిని గలంగ

గీ. విన్నదనమును గలిగి మైవన్నె దొలఁగి
జిగిబిగి సడల్చి తనవాసి చెడు ఒదల్చి
మగని తొలఁగిన మిగులనెవ్వగలఁ బొగిలి
చంచలింపుచు వెతనొక్క చక్రవాకి. ౯౦

మ. పవలుం బుష్పిణియైన బద్మిని వరింపం బూని దా లోకబాం
ధవుఁడై సద్ద్విజకోటులం దరిమి దిక్తాపంబు జూపించె నీ
రవి యంచుం జనులాడు నిందలకు నోర్వన్ లేమికిం బశ్చిమా
ర్ణవమధ్యంబున దూకినం గువలయారాతిత్వముం దీసెనే! ౯౧

సీ. సూర్యోపలచ్ఛవి సుమధన్వి కడ జెందె
సుమధన్విజడత కోకముల బొందె
కోకసంఘముదీప్తి కువలయంబుల నొప్పె
కువలయశ్రమ కంజకోటి గప్పె
తమ్ములను చకోరతండమ్ము లన నొప్పె
నెసచకోరులకాక విటుల నొంచె
విటజనావళి మనఃకుటిల మింతులఁ జేరె
నింతుల సిగ్గు లంతంత జారె

గీ. నఖిలఖగకోటి నీరము లరసి జొచ్చె
మిన్ను లేఁసంజకెంజాయ మిగుల హెచ్చె
బలసి చీఁకట్లు చిగురించి బయలుబొంగె
జరరభానుండు పశ్చిమజలధి గ్రుంగ ౯౨

శా. ఏ నుష్ణాంశుఁడ రాజు వెందవిలె నేఁ డెట్లేఁగి యెట్లొచ్చునో
గాన న్నేనిఁట నుండనం చపరదిక్కుంధిం బ్రవేశించిన
ట్లానీరేజహితుంకు న స్తగిరిశృంగాగ్రంబునం దొప్పె నె
ట్లైనం దీక్ష్ణుఁ డనంగినం గువలయాహ్లాదంబు సంధిల్లడ ౯౩

మ. సలిలాధీశ్వరుదిక్సతీమణి నిజస్థానంబునం భానుమం
డలముం జేర బ్రియంబునం జనులనిండం గుంకుమంబూని కెం
పుల మిన్నామినుకుల్ ధరించి యరుణంపుం బట్టుపుట్టంబు మై
ని లలిం దాల్చి కనుంగొనం గతిని బూనె న్సాంధ్యరాగద్యుతుల్ ౯౪

సీ. ఇనుఁ డపరాంబుధికేగఁగా నెదురేఁగు
బడబాగ్నిశిఖి శిఖాపటల మొక్కొ?
కోకదంపతులపై కుసుమాస్త్రి దరిబోయు
నతులితాగ్నేయబాణార్చు లొక్కొ?
గగనాటవీసహకారభూజంబున
జనియించు పల్లవచ్ఛాయ లొక్కొ?
దినకరుం దరుఁగువెంటనె దిక్సతుల్ జేర్చు
ముఖముపై మేల్కామ్మ ముసుఁగు లొక్కొ?

గీ. పద్మకుముదాప్తు లిరువురపాలుఁ దెగిన
మహినహోరాత్రముల నడిమధ్యమున
బాతుపొలిమెర కెంపుఁ గంబంబు లొక్కొ
యనఁగ లేఁసంజకెంజాయ లెనసె దిశల ౯౫

ఉ. రాజగుఁగాక, సత్కళల రంజిలుగాక, బుధానుకూలుఁడై
భ్రాజిలుఁగాక, విష్ణుపదవర్తన నొందెడుగాక - మత్ప్రియుం
డాజలజాప్తుఁడే తపనుఁడైన ఘనుండను సాధ్విమాడ్కి నీ
రేజము లవ్విధంగన భరింపకనే ముకుళించె నొక్కటన్ ౯౬

మ. గగనేభేంద్రము యామినీమదముసోకం బెల్లుగా గెర్లి య
స్తగిరీంద్రంబున బొద్దు మావుతుసు ద్రోచం దత్తనూభిన్నమై
నొగలు న్నెత్తురు గ్రక్కెనో యనఁగ కన్ను ల్గోరగింపంగఁ బొ
ల్పుగ జూపట్టి దిశాచతుష్టయము దీప్తు ల్సాంధ్యరాగద్యుతిన్. ౯౭

సీ అహరంబుధిని బ్రదోషాగస్త్యముని గ్రోలఁ
బాదున గనుబట్టు పంకిలంబొ

యామినీవహ్ని యస్తాద్రి రవులొ్కన్న
　　గలిగిన దట్టంపు కాఁపొగయొ
కడలిలో తనమణి బడిపోవ వెదకఁగా
　　జగము భ్రమ్మరుచున్న గగనతలమొ
తారకారూపకందర్పశాసనలిపుల్
　　జూపట్ట నిడు మషీలేపనంబొ?

గీ. యలజరావారకామినీయౌవనాంగ
వేషసంధానకరణదివ్యౌషధంబొ
యనఁగ బెంపొందె గనుఁగొన నంతకంత
కంధకారంబు నిఖిలదిగ్బంధురంబు ౯౮

చం దినకరుఁ డస్తమింపఁగను దీనత పద్మిని కవ్వియోగవే
దన నతిశీతవాతరుజ దారొ్కన కాలభిషగ్వరుండు పో
సిన బలుమందుమాత్రలు నజీర్ణములై యుదరంబునిండెనో
యన కమలాంతరాళములయందలి బంభరడింభము ల్దగెన్. ౯౯

కం. ఈవసుధ యువజనాళికి
భావభవాహవములీ విభావరి నగునన్
భావమున దుర్నిమిత్తఁపుఁ
గావురులం గప్పి యంధకారము వొలిచెన్ ౧౦౦

సీ. పెనుచీఁకటిమొగుళ్లపెంపుచే గుంపులై
　　బడిన వర్షోపలప్రకరము లనఁ
గోకదంపతులఁ జికాకుచేయ విధుండు
　　కరనాళముల నూరు ఖండము లన
గగనాపగాతరంగముల నొండొండుదా
　　కఁగ జిందు నమృతంపుకణగణమన
జగములొక్కటిగెల్వ జనుదెంచు మగనిపై
　　రతిజల్లు పుష్పలాజతతులె యన

గీ. నరుణతరుణాతపమున నంబరవధూటి
బొగలు నెమ్మేని చెమ్మటబొట్టులె యన
తెలివి బొడసూపి చీఁకటి తెగలబాపి
చుక్కలొక్కట దిక్కుల పిక్కటిల్లె ౧౦౧

చం. అపుడు రథాంగసంచయము లా త్రిని గూయ దొడంగె మింట రా
జిపు డిదె రాగలం డని దినేందిరయుం దనజేని నీగతిం
దపనుఁ డటంచు నోరువకఁ దజ్జలరాశిని ద్రోసిరంచు వి
ష్ణుపదమునంటుచున్ వెతను కోకిలుచున్న తెఱంగు దోఁపఁగన్ ౧౦౨

చం. మఱుగులకిగ్గి సొక్కుగొను మచ్చలు జల్లి భ్రమింపజేసి లో
నెఱవివరంబుసొచ్చి కడునేర్పున యిక్కువలంపుశయ్యలన్
మఱిఁగినవేళ గాంచి ధనవంతులసొమ్ములు దోఁచుకొందు ఱి
వ్వరుసను దస్కరుల్మగులవారవిలాసిను లొక్కటం దమిన్. ౧౦౩

కం. తనరాకమేలుకథ కుము
దినులకును జకోరములకు దెలుపఁగ మునుమున్
వనజారిబనుచు నెచ్చెలి
యనఁగా తూరుపున బాండిమాకృతి బొలిచెన్ ౧౦౪

సీ. పతిరాకకును నిశాసతిప్రేమ నెదురుఁగా
నడుఁగుల మడుఁగులు విడియనేమొ
ప్రాక్సతి శశిని గర్భముదాల్ప దన్ముఖ
బింబంబుగను పాండిమంబు లేమొ !
రాజురా గని విహారమునకై సమకూర్చు
పగడంపు మణిమంటపంబులేమొ !
యంబుధీశుఁడు పుత్రాగమంబున బొంగు
తరఁగల బెరిగిన నురుఁగులేమొ

గీ. యనఁగ బ్రాగ్దిశాభ్రమము సంతలోన
కాలముని విష్ణుపదము నివ్వాళియొసఁగు

మిఱుఁకుకర్పూరహారతికళికవలెను
శ్రీకరుం డౌచు బొలిచె సుధాకరుండు ౧౦౫

సీ. అమరనాయకవధూహర్మ్యాగ్రవిలసిత
 కనకమణిప్రభాకలశ మనఁగ
ప్రాగ్దిశాకామినీఫాలభాగంబున
 పొంకమౌ ఘుసృణపంకాంక మనఁగ
దర్పకదండయాత్రాసూచకంబైన
 షకలాతుడేరా నిషాని యనఁగ
ఘననిశాకాంతాముఖప్రభాలోకనా
 ర్థము బూను మించుటద్దం బనంగ

గీ. చీఁకటు లణంగ సారసశ్రీ దొలంగ
కలశనిధి బొంగ జక్కవకవ దొలంగఁ
గోర్కె లలరంగ తూరుపుకొండమీఁద
డంబుమీరంగ నిందుబింబంబు పొడమె ౧౦౬

గీ. తపను సాహస్రకిరణసంతప్తమైన
గగనలక్ష్మికి చంద్రికాగంధ మలఁది
ప్రాక్సతీమణివీవ చేపట్టినట్టి
తాళవృంతంబుగతి సుధాధాముఁ డలరె ౧౦౭

చం. కలువలు విప్పఁ బద్మినుల కాంతులు దప్ప రథాంగదంపతీ
కులములు మోము ద్రిప్ప సురకోటులు విందుల నొప్ప వారిరా
సులు పయికుప్ప వెన్నెలలసొక్కులు దిక్కులు గప్ప వింతఁగా
చలువవెలుంగుకుప్పరుచి సాంద్రత తూరుపుతిప్ప నొప్పఁగన్. ౧౦౮

గీ. సరసమై వసుగంధప్రసక్తి బూని
శతభిషక్క్రియ మౌచు సత్సంగతి దగి
వివిధరుజ్మండలు హరించి కువలయప్ర
మోదము నొసంగె పూర్ణచంద్రోదయంబు ౧౦౯

సీ. వితతచకోరికావితతి దాహము దీఱె
జతపీడి కోకదంపతులు బారె
చిమ్మచీఁకట్లు నొక్కుమ్మడి దిగజారె
విమలాబ్జమణులలో చెమటలూరె
విరహులపై మరుం డరిదికైదువు నూరె
వివిధతస్కరకోటి వెతల బారె
కులటాంగనలకు మిక్కుటంపు ఖేదంబూరె
కుముదిని కొకవింత కొమరుమీరె

గీ. తమ్మిమొగడలతేటి మొత్తమ్ము దూరె
తరుణదంపతులకు మనస్తాప మూరె
విటవిటీజను లలుక లొక్కటనె దీరె
పండువెన్నెల జగమెల్ల నిండి బారె ౧౧౦

వ. ఇట్లఖండితప్రభావిడంబితం బగుచుండు పండువెన్నెలలు మండితపుండరీకభవాండకటాహంబున న్నిండి తండోపతండంబులుగా మెండుకొని శచీసీమంతినికాంతుచతుర్దంతదంతావళంబుతో నంతంత మంతనం బొనరింపుచు సారకర్పూరపటీరడిండీరహీరతారశారదమందారశరమరాళజాలంబుల పగిది నదభ్రశుభ్రవిభ్రాజితంబై యుదయగిరిపరిసరచరద్వరమునినికరతరణికిరణధిక్కరణసటాపాటలత్వంబును మాటిమాటికి నిమ్రుటుచు, చటులకిటిపటలవికటాహవనటనఘటనపాటవోత్కటసమయాఽన్యోన్య - కఠోరదంష్ట్రోద్ఘట్టనంబున మిట్టిపడి యిట్టట్టుజారిన కట్టాణిముత్తియంబుల విట్టలంపుకట్టల నిట్టట్టుం బొరలి చిటికొటారంబులం గ్రీడించు విటవిటీజనంబుల మదనకదనత్వరితంబునం జిక్కువడు హీరతారహారంబులం బేరజంబుఁ జేయుచు ననూనమానసానుమోదంబున నహీనసూనవిమానవితానంబులం దారోహించి యించువిల్కాని పంచశరసంచలితహృదంచితులై సంచరించు వేల్పుమించుబోణులన్ రాణించు సుమనోహరంబులగు సుమనస్సుమనఃప్రకరంబుల నదలింపుచు క్రొన్నెలవెన్నెలలకన్న మున్నుమున్ను సుపనాధులం గన్నుసన్నల న్వెన్నుకొనం బన్ని యుదులితచతురతలం బతుల నితరేతరజను లెఱుంగని మఱుం

గులుం గల వాడవాడఁ బైడిమేడగోడనీడలం గ్రీడింప వేడియల వేడుక లాడన్ సద్యోలజ్జాజనితకారణంబై యుండ్లించు న్మృగనాండ్లు కండ్లపండువులుఁగా తోడిప్రౌఢలంగూడి పాయసకలమాన్నంబు లిడుకొని ముసిముసినగవులం దిశలం బసలెసఁగ మెసఁగుకలదౌతపాత్రలం దిడియిడనిక్షీరధారాకారంబులై నిద్దంపునెలజాలం దిద్దిన గద్దియలఁ దద్దయుం బౌరలు ముద్దియల మేనులందలి యందియలందలి చందనం బనం దనటి నితాంతవనాంతలతాంతంబుల వికసింపక వికసించినతెఱం గెఱుంగఁజేయుచు రతిపతియప్రతాపంబు లెకీభవించి జగంబుల బొగడ నెగడె నన- యమునానదీసంగతగంగాతరంగంబులకు కోరికలుదీర రాకాపథంబునం జారిన క్షీరధారాపరంపరలలీల తనరాక కదలిముఖవికాసంబునం దొలంగు బద్మినిం గని సుధాకరుండు హసించెనో యను యనువునం జెలంగి యశేషశృంగారవేషవిశేషంబులకుఁ గన్నులబండువై నిండుకొనియుండె నప్పుడు ౧౧౧

ఉ. ఆసమయంబున న్మదనుఁ డాహవదిగ్విజయార్థియై సము
ల్లాసమునన్ వసంతుఁ డకళంకగతిం దనుకొల్వ బాణబా
ణాసనతూణము ల్గొని పికాళి మరాళ మయూరకీరశా-
రీ సముదాయ మార్భటుల హృద్యముగా నడచెన్ హుటాహుటిన్ ౧౧౨

సీ. డంబౌమ్మణాకనాళంబులే యిరుసులు
బలితంపుఁ దెలిదమ్మి బండికండ్లు
కొదుమగేదంగిరేకుల చిక్కని పరమ్ము
తొగతీవియల మేలిబిగువు నొగలు
మేఁటిగొజ్జఁగిపూల గాటంపుకాడియు
కప్పురంపు టనంటి చప్పరంబు
కెల్లి దూకెడి రాజకీరంబులగు జాలు
నిగ్గైనకురువేరు పగ్గములును

గీ. మలయు తనరథమును నెక్కి మత్తవిరహ
చిత్తవృత్తులు మెత్తనె తత్తరిలఁగఁ

గ్రొత్త ముత్తెఁపుఁగుత్తుల కత్తికేల
హత్తి చిత్తజుఁ డదిగొ దండెత్తి వెడలె ౧౧౩

సీ. గంధసింధురదానగంధబంధురుఁడై న
గంధవహుండు మార్గంబు జూప
సంతతకాంతవనాంతలతాం తని
శాంతవసంతుండు చెంత నడవ
కోకిలాశారికాకేకిశుకానీక
మేకీభవించి పరాకు దెల్ప
గంగాతరంగానుషంగస్వనోత్తుంగ
భృంగసంగీతప్రసంగ మెసఁగ

తే.గీ. బెండువడియుండు పాంథుల గుండెలెల్ల
భేదిలంగను డాంథమీనాద మొదవఁ
బ్రబలకందర్పబహుదురీపాదుషాహి
వెడలె రణరంగధీరాంకవీరుఁ డగుచు ౧౧౪

లయవిభాతి:—

పొంగుచును సింగముతెఱంగునను దూకి బహు
భంగుల మెలంగఁ బొదలం గలసి వేగన్
ముంగలికి వంగి కనశింజిని ఖణింగున బొ
సంగగను మీటుచు జెలంగి యతివేడ్కన్
హంగుగను మేటిగొజ్జంగిపువుతూఁపులు ని
షంగము వెడల్చుచు తరంగములలీలన్
రింగున సడల్చియును నుత్తుంగగతి నార్చుచు న
నంగుఁడు నభంగురజయంగతి నెసంగెన్ ౧౧౫

ఉ. వెన్నెలకాకకే మిగుల వేసటజెంది వియోగవేదనా
పన్నత దల్లడిల్లు బలభద్రతనూజకుచాగ్రదుర్గముల్

భిన్నము జెందునట్లు వెఱపించుచు పెంజడివానరీతిగా
గ్రొన్ననవింటిజోదు 'శలగో శలగో'యని గ్రుమ్మె నిమ్మడిన్. ౧౧౬

కం. పొంచి వెనువెంటనే మే
న్వంచి విరింగోల వింటనుంచి గుఱిం బా
టించి సవరించి పై లం
ఘించి సరాయించి తమి మొగించుక మించెన్. ౧౧౭

కం. ఆకోల యేటుపాటున
కోకిల లొక్కుమ్మడిగను 'క్రో'యని కూయన్
పైకి ధువాళింపఁగ నా
కోకిలమృదువాణి యుడ్డు గుడుచుచు బలికెన్. ౧౧౮

ఉ. అమ్మకచెల్ల! యీబలుగయాళిమరుం డతిదుండగీడు పై
గ్రుమ్మెడు నంపచిచ్చుఱకు కమ్మనితెమ్మెర బమ్మరింపు నా
కుక్కుమ్మడి జిమ్మిరేగి నెఱిహుమ్మని ఱొమ్మున నమ్ము గ్రుమ్మె దే
హమ్ము నిజమ్ముగా నిలువదమ్మ యికేమని తెల్పనావెతల్॥ ౧౧౯

సీ. తనసహోదరుఁ డంచు దలఁపక గ్రూరుఁడై
కూఁతుతో నెనయఁగా గూర్చె నితఁడు
తనకగ్రజనకుఁ డం చనక తాపససాధ్వి
పై మరుల్గొల్పిన పాపి యితఁడు
తనపుత్రకుఁ డటంచు తర్కింపక తపంబు
జెరిచి యోషాసక్తి జేర్చె నితఁడు
తన మేనమామ యౌ ననక దుర్వ్యాప్తిచే
గురుతల్పగమనాప్తిఁ గొల్పె నితఁడు
ప్రజలు లదిగాక తనదేహబాంధవులగు
వారికే రోయడీ శంబరారి యహహా!
యూరకే నన్ను బాధింపకుండగలడె
యింక దైవేచ్ఛ యెటులున్నదేమొ కాని. ౧౨౦

కం. అని తనలో తను ఝషకే
తను తనుతాపమున మిగులతహతహగొను జ
వ్వని వనితలెల్ల గవిసి వ
చనరచనాసౌహృదప్రసక్తి నెఱపుచున్. ౧౨౧

ఉ. కొమ్మ నరాత్మజుం దలఁచుకొంటివొ?మేన్పులకల్ జనించె సు
మ్మి మెమ్మయి మున్నువోలె మనసిచ్చి ప్రియమ్మున బల్కరించవే
మమ్మ,భవన్ముఖంబు విరహభ్రమ జూపె గదమ్మ,దాచనే
మమ్మ! వచింపుమమ్మ!వికచాంబుజపత్రవిశాలలోచనా! ౧౨౨

చం. చనువుగ నంచలం గనుల సైగలనైనను జేరఁ బిల్వవే
మనిశము కీరశారికలకైనను బద్యము జెప్పవేమి?పెం
చిన ఫణిభుక్కిశోరములు జేరిన చెక్కిలి గొట్టవేమి?యో
వనజదళాక్షి యిట్టు పలవంతల చింతిల నేమి హేతువో? ౧౨౩

వ అని యనేకప్రకారంబులం బలుకు నెచ్చెలులపలుకు లచ్చెలువ ప్రీడాభరం బునం బరాకు చేసికొని చిఱుచెమట గ్రమ్మిన నెమ్మొగమ్ము మరందబిందుసందోహకందళితారవిందంబు చందంబునం దనర- నిట్టూర్పులు నిగిడించుచుఁ గళవళించుచున్న సమయంబున- ౧౨౪

సీ. అంతకంతకు నుదయాద్రిపహ్ని జనించు
వేడివెన్నెలజూపి విధుఁడు జెలఁగ
నుగ్రాక్షు కనుచిచ్చునోర్చి నిగ్గునదేలు
యలరువేడిమిదూఁపు లతనుఁ దేయ
బెనుబాముకోఱల బెనఁగి కంపము సూపు
కడువిసవిత్తులే గాడ్పుసోక
పోటుజెందిన గట్టుబొటియలలో దూఱు
ఘనభీతి వెలిపుల్గుగములు బొదవ

గీ. నింతి యంతింతయనరాని వంతబూని
వలఁపువెన్నానసితోడి నెచ్చెలులతోడ

భాషణముమాని యరవిరిపాన్పుపైని
నిమ్మెయిని చెమ్మటలు గ్రమ్మ సొమ్మసిల్లె ౧౨౫

కం. అది గని బెదరినమది ప్రియ
సుదతీమణులెల్ల చుట్టుచుట్టుకొని నయం
బొదవ మదిరాక్షికౌఁగిట
బొదవుచు వెంజాఱిచి మేనుబుణుకుచుఁ బ్రీతిన్ ౧౨౬

ఉ. పిన్నతనాన మున్ను మురిపింపఁగ జూపిన మత్ప్రియుం దయా
సన్నత నేఁడు జూపుమని సన్నిహితంబున దీనవృత్తిచే
నున్నవిధంబుదోప మెయినుండిన రావులుమాని ప్రాణము
ల్కన్నియ కన్ను లన్నిలిచె గన్గొనరే యని భీతచిత్తలై. ౧౨౭

పడఁతి మనోవార్థిఁ బడి మునింగెనొ యేమొ
తతబాష్పజలబుద్బుదంబు లవిగొ,
పొలఁతి యాశాలతల్ బుష్పించెనో యేమొ
తనుఘర్మజలమరందమ్ము లవిగొ
యువిదవాంఛాధుని యుప్పొంగెనో యేమొ
మేన పాండిమఫేన మూనె నదిగొ
లలనకు విరహాకలము జనించెనొ యేమొ
నిట్టూర్పుబొగలు జూపట్టె నవిగొ

గీ. యక్కటా!యివి సామాన్యమని దలంప
వలయు నికనైన గాపాడవలయు పడఁతి
నట్టుగాకున్న కన్నె నిట్టట్టు జేయ
ధూర్తగతిజొచ్చు మన కపకీర్తివచ్చు. ౧౨౮

సీ. మధుపకోటికి బ్రణామముజేసి దెచ్చుమ
రందమ్ము మధురాధరమున జిల్కి
గంధవాహికి నమస్కరణఁజేసి గ్రహించు
పూవుగుత్తులు కుచంబుల నమర్చి
బిసభుక్తతికి దండమొసఁగి తెచ్చిన మృణా
ళంబులు బాహువల్లరులఁగూర్చి

కిసలయగ్రసనాళికిని మ్రొక్కి డిలభించు
తలిరుటాకులు పదమ్ముల ఘటించి

గీ. తరుణి యివి పంచశరదేవతాబలంబుఁ
దత్ప్రసాదంబు లీపదార్థములవలన
వెఱఁపుదీరు నటంచు గావించి రపుడు
చతురరచనల శిశిరోపచారవిధులు

సీ. అలరులు గుములు నంచని చింతపడకు వే
కలకంఠిపదములు గప్పవమ్మ
యుడుకునంచని వెతనొందకు మలివేణి
సుమములు కొప్పున జుట్టవమ్మ
వాడునంచని భీతివలవ దండజయాన
బాహులందు బిసాళి బన్నవమ్మ
కన్నులఁ జేర్పవే కమలముల్ చెడునంచు
కోక స్తనీ వంత గుందకమ్మ

గీ. వీటి నాహారమని చూడ పాటిగాదు
చెలిమికొఱ కెంతపనియైన జేయవచ్చు
గాని యిది కొంచెమౌ పనిగాని దెఱిఁగి
జేరి శైత్యోపచారముల్ జేయవలయు ౧౩౧

సీ. చందనం బలఁదవే శైలవక్షోజ క
ర్పూరం బొసంగు రంభోరుయుగళ
హిమజలం బిడవె తుహినమయూఖనిభాస్య
చిగురుటాకులు గూర్పు మిగురుఁబోణి
ముత్తియమ్ములహారములు వైచు ఘనవేణి
కాశ్మీరమును బూయగదె శుభాంగి
మకరందబిందువు ల్మయిజిల్కు పూఁబోణి
పుష్పొడుల్ జల్లు మంభోజగంధి

గీ. యనుచుఁ దమతమ కనుకూలమైనపనుల
నొకరినొక రుచ్చరింపుచు నోపినటుల
గూర్చి శశిరేఖతనుతాప మార్చుకొఱకు
సకలశిశిరోపచారము ల్సలిపి రపుడు ౧౩౧

చం. సరసిజనేత్ర లింతి యుపశాంతికినై శిశిరోపచార మీ
కరణి యొనర్పఁగా సురభిగంధముపెట్టి పరాగమై ధరం
దొరిగె జిగుళ్ల క్రొవ్విరులు తుత్తుములయ్యె బిసంబులెల్ల ఖం
గురగతి వాడె మైనినికె గొజ్జఁగినీరు మనోజవేదనన్ ౧౩౨

కం తోడిచెలు లెట్లొనర్చిన
నాడాడకు సుకుమార లందరిలో బల్
నాడెమగు చేడి యొక్కతె
నాడి పరీక్షించి గుంభనంబున బలికెన్. ౧౩౩

సీ. అంతకంతకు తాప మధికమై చెలిమోహ
ముడుగదే 'పూర్ణచంద్రోదయము'న
మఱిమఱి ప్రబలమై మది గలంచునుగదే
యింతికి 'మదన కామేశ్వరము'న
మాటిమాటికిని యారాట మొందునుగదే
రమణీమణికి 'వాతరాక్షసము'న
గడెగడెకింక వెక్కసము జెందునుగదే
సతి'నీలకంఠరసంబు'వలన

గీ. దినదినం బెక్కువగుఁగాని తీరదే'వ
సంతకుసుమాకరంబు'న సకియలార
'భూపచింతామణి'ని గాని పొలఁతి విరహ
దారుణజ్వరదోషంబు దీరదమ్మ ౧౩౪

సీ. మరువక నిక నుగ్రమంత్రము ల్బరియించి
తనుహీనభూతమ్ము దరుమరమ్మ

సత్తమోపాసనల్ సలిపి గురుద్వేషి
యగు నిశాచరపీడ నణఁపరమ్మ
వెస నహీనక్రియావిధు లొనర్చియు పెను
గాలిసోకుడుం బో గడపరమ్మ
ఘనుల ప్రార్థించి పంకప్రచారవిజాతి
గణముల కావరం బణఁపరమ్మ

తే గీ. యటులగాకున్న మదనశశాంకగంధ
వహామరాశాదులకు తాళవచ్చు నటరె
యనుచు రంభాదళోచితవ్యజనములను
బూని విసరుచు నుపచారములు ఘటింప. ౧౩౫

గీ. అప్పు డొక్కింత తడవున కవ్వధూటి
యులికిపడి లేచి పవళించి కళవళించి
కలవరించి బయల్గాంచి కౌఁగిలించి
యింతులనుగాంచి దుఃఖించి యిట్టులనియె. ౧౩౬

సీ. అలవిరు లనిజెప్పి యగ్నికణంబు లీ
వడగాడ్పులకు తోడు నిడఁగడగునె
పన్నీరటని కాచియున్న నూనియ మేని
వలకాకలకు దోడు జిలుకదగునె
గోవకప్పురమంచు క్రొత్త సున్నంబు వె
న్నెలవేడికిని తోడు నిడఁగదగునె
చిగురాకులని యంపతెగలను మరుకైదు
వులకుఁ దోడుగ నెద నిలుపఁదగునె

గీ. యకట చెలులార తొంటినెయ్యం బొకింత
దలఁప కిరీతి పగదీర్పఁ దలఁచినారొ!
గాకయుండిన వీటికీ కాకలేల
యనుచు విలపించు మదినోడి యలఘుఁబోడి. ౧౩౭

వ. అంత నయ్యింతి ఉతాంతకుంతనియంత్రితస్వాంతయై యంతింతనరాని
చింతాభరాక్రాంతంబున నంతకంతకుం దొంతరిలుచు చెంతన్మెలంగు
మంతనంపుటింతులం గనుంగొని యిట్లనియె ౧౩౮

సీ. తలదిమ్ములొసఁగు గద్దటితుమ్మెదల గొల్చి
చేయరే కనకాభిషేకమైన
కెర్లివర్లెడు రాజకీరంబులకు మ్రొక్కి
గడపరే సాంకవగంధపూజ
కలగించు జక్కవగమిని సన్నుతిజేసి
యర్చించరే నిర్మలాబ్జములను
వెఱపించు కాదంబవితతిని బ్రార్థించి
సలుపరే ఘనమహోత్సవవిభవము

గీ గా- యుండిన మదచంచరీకశౌక
కోకకలహానసౌకంబు లేకమై చి
కాకు బైకొనె మరు నంపకాక కోప
తరము గాదమ్మ దీని బోఁదరుమరమ్మ ౧౩౯

వ. అని పలికిన కలికి కలికిపలుకుల కులికి యక్కలకంరకంఠ లొక్క-
మొగి శశుకశారికాచంచరీకకేకీమలయపవనమరాళసమేతుండగు మనో
భూతు నుద్దేశించి యిట్లనిరి. ౧౪౦

సీ. గుబ్బలపై బయల్గొన్న చెమ్మట బొట్లు
పరిమళసలిలార్ఘ్యపాద్య మొసఁగి
విరహానలోగ్రసంజ్వరతా సముత్పన్న
పాండిమ శ్రీగంధపంక మలఁది
తాపాతిరేకనిద్రాహీనశోణదృ
గ్జలజాతపుష్పాంజలుల నొసంగి
మహితనిశ్శ్వాసధూమశ్రేణికాఘ్రాణ
తర్పణధూపసమర్పణ లిడి

తే గీ పూజ గావించుచున్న దీపువ్వుఁబోణి
చిత్తమున నీవుగల్గుటజేసి గాదె
మ్రొక్కఁదలఁచిన చేతులు చెక్కఁదలఁచు
సామి తాయెను నీపూజ యోమనోజ ౧౪౧

సీ. శిరముపై గేదంగివిరితురాయియె గాని
తిలకింప చంద్రమండలముగాదు
అఱుతను వలఁపుకస్తురిపట్టియే గాని
కాలకూటప్రభాగరిమ గాదు
కాయంబునను గంధకర్దమంబేగాని
పాటింప బూదిలేపనముగాదు
చెలియవీఁపునజారు సిగముడియేగాని
భయదభాస్వజ్జటాభరముగాదు

తే.గీ. కాని నీపాంథమారకక్రమము గనిన
విలయకాలోగ్రమూర్తిగా దలఁపబడియె
నకట నీకిది తగదోరి శుకవిహారి
సకలనారీమనోహారి శంబరారి. ౧౪౨

గీ. మదనభవదంబసదనసంపద నణంచు
శశిని యర్మిలి యొనరింప జనునె శాస్త్ర
రీతులను 'సర్వనాశాయ మాతుల' యని
దెలియఁగా లేదొ ! యికనైన దెలియరాదొ ! ౧౪౩

చం హరితనయాఖ్యచే హరుసహంకృతి బైకొని కాలరూపునం
గరము రహించియు న్విషమకాండనిరూఢి నఖండధర్మవి
స్తరత వహించి లోకభయదాతను వృత్తిజనవ్యథోచితా
చరణత జెందు కాలయమసామ్యుఁడవైతివి నీవు మన్మథా. ౧౪౪

సీ జనకఁ డంతకు పుణ్యజనపీడన మొనర్చు
తల్లిచాంచల్యవర్తన మెలంగు

కన్నతండ్రికి భంగకార్యం బిడెడు మామ
తెలిసి కూతురును వర్తించునన్న
ప్రజలనోటను రద్దిపాలౌ వదినగారు
సతతజాతివిరోధి సంగడీఁడు
మధుపానవివశదుర్మదులు బంటుబలంబు
పథ మెఱుంగక మండిపడియె దీవు

తే.గీ. యిట్టి నీవంగడంబు పేరెత్తియైన
పిన్నపెద్దల కిక నోటబెట్టదగునె
మానినులకెల్ల తలవంపులైన బ్రతుకు
గోరనేటికి నీరూపమార మార. ౧౪౫

చం. నెఱి విషజాతులంపగమి నీటులొ జాడలుదీయు టెక్కెమున్
మొరసెడి నారి నల్లగమిమూఁక తునింగిన మొల్చువిల్లు నాం
డొరులకు గానరాని తనువుంగొని పాంథమనోధనంబు లీ
కరణి రహించు తస్కరశిఖామణి వీవెకదా మనోభవా ! ౧౪౬

సీ. ఒకపాటివాఁడైన చికిలిబాకుధరింప
చివురుటాకునుబూన సిగ్గుగాదె
హీనుఁడైన తురంగమెక్కఁగా చిల్కత
త్తడి నీవుగొన కొంచెదనముగాదె
కొఱగానివాఁడైన కోదండము ధరింప
లలితుంటవిలుదాల్ప లజ్జలేదె ?
తనువుఁబ్రాణు లందఱికుండఁగా ననం
గుడవౌచు బ్రతుకుట కొఱతగాదె

గీ. కాన గతిలేని యభిమానహీనవృత్తిఁ
బతుల నెడబాయు సతులపై యమలగతుల
మెత్తవిరిగు త్రికత్తుల నొత్తఁదగునె
యమలితాభంగశృంగార హారికుమార ౧౪౭

సీ పిట్టనెక్కి యింత మిట్టిపడియెదవేమి
యది గుఱ్ఱమైతె మిన్నదె దేమొ!
చెఱకువిల్లోని యిన్నిచేష్టలు చేసేవు
యది చాపమైతె మాటాడవేమొ,
యిగురుకోలకె యింతయెగసిపో దలిచేవు
యది వజ్రమైతె త్రుళ్లాడెదేమొ
తనువులేకనె యింతదర్పంబు జూపేవు
యదియున్న శివమెత్తి యాడెదేమొ

గీ గాకయుండిన దుర్మదోద్రేకవృత్తిఁ
దాకి పైకొనుటిది లజ్జలేక గదర
విరహిణీమార! శంబరాసురవిదార
మథితసుకుమార!మార!కల్మషవిచార ౧౪౮

సీ తుంటలై నీ విల్లు ధూళిలోన నణంగఁ
బొలుపొందు నీ మేను బూదిగాను
నీయంపగమివిచ్చి నేలపాలై చన
మరయు నీ రథి మొక్క మూలఁ గూల
చెదుగు నీసారథి యడవిలోపలఁ జేర
నీదైన నీటెక్కె మేట గలప
నిను మ్రోసెడి తురంగమును సంకెన ల్వేయ
నీమేటి చెలికాని పాము కరవ

గీ చెట్టుకొకటూచు నీసేనలట్టె గిట్ట
నయ్యయో నీవు' పాపీ చిరాయు' వనెడి
నీతి నీరీతి విరహిణీఘాత వైతి
వింక మకరాంక చెలి నేచు టేమి శంక. ౪౧౯

తే గీ అసుమ వనజాసనలు మకోసని కిసుకను
[illegible]

జేరి యానారిగారించు నీరజారి
సారెసారెకు జలపోరి దూరఁగోరి. ౧౫౦

సీ. బుధనుతుండగు క్షీరనిధి కుమారుండవు
ఘనుఁడైన లోకబంధునకు హితుఁడ
వాదానవారి నెయ్యంబైన మఱఁదివి
శంకరస్వామి చూడాంకమణివి
దక్షునియోజకు దగిన యల్లుండవు
విబుధక్షుధలుదీర్చు వెన్నకడివి
యసమాస్త్రునకు ఘనంబగు మేనమామవు
శ్రీదేవికిని ప్రియసోదరుఁడవు

తే గీ. నట్టిసత్కులజాతుండవై దనర్చి
వరవియోగులపై వేడి బఱపదగునె
భవ్యచారిత్ర విరహిణీపాంథజైత్ర
గురుసుధామయమృదుగాత్ర కుముదమిత్ర ౧౫౧

చం. మనమున నీతిలేక గురుమానిని బొందినద్రోహి వంచు నీ
చెనఁటితనం బెఱింగి సిగజేర్చెను శంభుఁడు లింగధారివం
చనెడి హితంబుగాంచి గద హా! ధరనెట్టి దురాత్మునైన త
న్ననిశము గొల్చినంతనె మహాధికుజేయుఁ బురారి యల్పుఁడై ౧౫౨

సీ. కువలయావనకీర్తిగానినందుకు ధరిత్రి
చక్రవిద్వేషంబు సడలలేదు
విబుధానుకూలప్రవీణుండవై యుండి
మది గురుద్వేషంబు మానలేదు
ఘనవిష్ణుపదసక్తకరుఁడవైనందుకు
నీ నిశాచరవృత్తి మానలేదు
ద్విజరాజవిఖ్యాతిదీపింపుటకును స
త్సంకతి పెంపొర్చు టింతచెదు

తే.గీ. వసుధ వర్ణింప ఘనమార్గవర్తి వగుచు
రాజకాంతావళులను గలంచఁబూను
నెఱయు నీరాజశబ్దంబు నేతిబీర
కాయ గదరోరి! శశధారి! కమలవైరి! ౧౫౩

సీ. తోయధిఁ బడబాగ్నితో మొదల్జన్మించి
హాలాహలాఽన్యోన్య మగుచు బెరిగి
నిలిచి యుగ్రాక్షుని నెత్తిమీఁద నటించి
యుదయాద్రిధవశిఖి నొరసి మెఱసి
యలరాహుదంష్ట్రి విషాగ్నితోడ బెనంగి
తపసుని నెలనెల తారసిల్ల
భావింప నత్రితపోవహ్నిచే గ్రాఁగి
గురుశాపశిఖి శిఖాకులతఁ బొరలి

గీ. నట్టి చలపాదివైన నిన్నజ్ఞు లెల్ల
శీతకరుఁడని మిథ్యాప్రతీతి దనరి
బాలికామణులను నేచనేల రోరి
కామినీమానధనహారి! కమలవైరి! ౧౫౪

సీ. భగినిపుట్టించి సంపదలెల్ల బోకార్చి
పగఁబూని జనకు భంగగతు జేసి
బలిమిమేనల్లుని భస్మంబు గావించి
తలపఁ మఱందిచిత్తము గలంచి
తమ్ములపై విరోధమ్మున బెంపొంది
సత్సంతతుల పెంపు సడలఁజేసి
సరిలేనిగురుని సంసారహాని యొనర్చి
దేవుఁడౌ హరుని నెత్తిననె జేరి

గీ. చెలిమిఁ గుజనుల నభివృద్ధి జెందఁ జేసి
చావుగానని బలు నిశాచరుఁడ వీవు

బ్రతికియుండుట విరహిణీప్రాణహాని
కోకకులజైత్ర కువలయినీకళత్ర ౧౪౪

చం. నిను జెనుబాము మ్రింగ నిక నీనిలువెల్లను నీఱుగాను ని
తనువు పదాఱుతుంటలయి దారుణకార్శ్యత నీఱు నిరుగా
దిన మొక చాయ గ్రుంక సుదతీమణులం గలగించు పాపమే
గునగునకాళ్ళవ్రేళ్ళ బెనఁగుం బొలిగింపవశంబె చంద్రమా! ౧౪౫

కం. అని పలికి మదనునకు వెను
కొను మలయసమీరకేకికోకశుకపికా
ళినికాయములను గనుఁగొని
వనితామణు లనిరి రుచిరవచనరవనలన్ ౧౪౬

సీ. ఒక మహాబిలమున నుద్భవించి గిరీంద్ర
మార్గంబునను బయల్ నిర్గమించి
కాంతారభూములం దంతంతఁ జరియించి
కాఱుపూఁబొదరిండ్లు దూఱి వెడలి
సతతప్రభంజనస్థితి జీవులకు జూపి
దివము రాత్రిని సదాగతి వహించి
పాంథహృద్వేదనప్రకటకీర్తి గమించి
నవ్యమహాబలోన్నతిని మించి

గీ. భువిని సాక్షాత్కరించు బెబ్బులివి నీవు
సాధుబాధ లొనర్చు టాశ్చర్యమేమి
నిను జగత్ప్రాణుఁడని బిల్వ నీతియగునె
పాంథజనమారణోత్సాహ గంధవాహ ౧౪౭

కం పలముగొని నిన్నువిషధర
ములు మెసఁగఁగ వాసిలేశము న్వాంచింపం

దలఁపడక విషధరాఖ్యత
నలరు ఘనులఁ దరుముటకు మహాబలివి గదా! ౧౫౯

గీ మొదల నీమేనదృశ్యమై మూలబట్ట
నరసి బెనుకొండ త్రాచు నిందరిమి కరువ
నీ ప్రచారంబు ధూళియై నింగి కెగయ
తుదికి నీమేను తునియలై బొదలచూఱ. ౧౬౦

సీ. నిను సంకెలల్వేయ నిలువక మిన్నంట
నెగసిపోయెదవేమి పొగరుజిల్క
నీయిల్లు మొదలారి బోయిన కనులెఱ్ఱ
గాని చూచె దదియేమె కోకిలంబ
నీ త్రుళ్ళుగుణమునందే తూఁపులెక్కిన
ఝంకరించెదవే మదింకతేఁటి
పింఛ మఱఁగి వన్నియ చెట్టుపాలైన
* కేకలీడెదు కానబోక కేకి
తే. గీ. పాండురుగ్భారమున దాగియుండియైన
ఘనుల గననోడె దదియేమొకా మరాళ
యని నిజార్థంబు లోక కొన్ని హాస్యసరణి
బలికి యంతటబోక కోపమున గెరలి. ౧౬౧

సీ. తేఁచి యీబింబాధరిని జేరకుమికీర
కమలాక్షిసాంకవగంధి సుమ్మి
కమలాక్షియని నీవుగదియకు మధుప యీ
ననఁబోణి చంపకనాస సుమ్మి
ననఁబోణియని భ్రాంతి గొనబోకు పిక యీబి
సాంచితబాహురామాంగి సుమ్మి

---

* కోనలీడెదు కానబోక కేకి—'మూ'

యాశించి బిసబాహయని తూఁగకు మరాళి
యీభామ ధారాధరాభవేణి

గీ. గాన వచనాలకస్వరగమనములను
సాటివారలు మీరు మామాట వినక
యెగసిపోనేల ఝుంకృతు లిడఁగనేల
యొరలఁగానేల బొరె డాగియుండనేల ౧౬౨

కం. అని బిత్తళికత్తియల
మ్మనసిజశశిగంధవహసమాజమును బ్రియో
క్తిని దూరి రేవతీసుత
కనుకూలముగా వచించి యనుపమలీలన్ ౧౬౩

సీ. తనువు ఫాలాక్షనేత్రమహాగ్నిచే గ్రుంగె
తుంటలై చాపంబు మంటగలిసె
మకరధ్వజము తుంగమడుగులోన సణంగె
శరములు పురినిచ్చి ధరణిగూలె
చెట్టుచెట్టునజేరి చెదరెను నీమూఁకఁ
మొదటినుండి రథమ్ము మూలఁబడియె
చెలికాఁడు దెఁసఁజెడి జేగ కాఱడవులఁ
బక్షియై తురగంబు బయిలు బట్టె

తే గీ. నింక మరుఁడేడ మనసేడ యితనివలన
తలఁపునిలుపకుమమ్మ జెగ్గిలకుమమ్మ
నీమనోరథసిద్ధియై నెగడునమ్మ
కొమ్మ వినవమ్మ యోముద్దుగుమ్మ లెమ్మ. ౧౬౪

శా. ఈరీతిన్ శిశిరోపచారముం నయ్యేణాక్షి మోహానలా
సారంబెల్ల నణంపుచు న్హితవాక్చాతుర్యమాధుర్యముల్
మీరం బ్రొద్దులుబుచ్చుముచ్చటల పేర్మిం దెల్ప నారాత్రి నిం
డారన్ యామచతుష్టయం బరిగె నుద్యచ్చంద్రికాపూర్ణమై. ౧౬౫

ఉ. అంతటిలో కనుంగొనఁగనయ్యె రథాంగయుగీదురంత దుః
ఖాంతము, సంతతాతనుసుఖానుభవశ్రమతాస్వకాంత బా
హాంతర సుప్తికాశ్రుతిపుటాంతరదుస్సహతామ్రమాదకా
త్యంత నినాదపూరితదిగంతమునైన నిశాంత మెంతయున్. ౧౬౬

గీ. కామినీమణులతనుభోగములవలన
పతుల నుపరతులనుదేల్చు చతురతలను
గాంచి మదిమెచ్చి తలయూచుగతిన దీప
కళిక లల్లార్చుచును సికల్గదల దొణఁగె ౧౬౭

శా. మారూపంబున శక్రుఁడే మును మహామౌనీంద్రు వంచించె, క్రొం
చారాతిధ్వజమౌట మేమె స్మరవిద్యాభ్యాసిగాఁ బాణినిం
శూరుం జేసినవారు మత్కులజు లంచున్ సత్కులాస్థానముల్
దారై దెల్పెడిరీతి కుక్కుటమహాధ్వానంబులున్ రాజిలెన్ ౧౬౮

గీ. ఇనుఁడు ఘనతమిస్ర మనెడు కాటుకపుల్లు
సమితిబొదవ కిరణజాలసూత్ర
మిడగఁ దారలెల్ల నడలుచుఁ దముదామె
కళదొలంగెఁ దాము ఖగములౌట. ౧౬౯

చం. కమలములెల్ల నిక్క నుడుకాంతుని సత్కళలెల్ల స్రుక్క కో
కములకు గర్వమెక్క గృహకార్యల నిద్రలువెన్కజిక్క దుః
ఖమున జకోరదంపతులు గళ్వలమందుచుఁ జొక్క దిక్కులన్
విమలత జిక్క తూరుపున వేగురుజుక్క జనించె బొక్కమై ౧౭౦

గీ. తమిని బద్మని నిదురించి తమ్ములమున
గొనిన బుక్కిటిమృగనాభిగుళికలెల్ల
వేఁకువను లేచి యుమిసినవిధము తేఁటి
గములు నీరేజముకుళాంతరములు వెడలె ౧౭౧

సీ. కనుల నిండిందిరకజ్జలంబును దీర్చి
పైపరాగము పచ్చిపస పలంది
కుసుమమరందమ్ము ఘుసృణాంకము ఘటించి
రహిపత్రికాలంకరణ మొనర్చి
శృంగారకర్ణికాభంగసద్భూషియై
భాసురహంసికాప్రాప్తిఁ దనరి
విమలోర్మికాకంకణములను ధరియించి
డంబుగా నుదయరాగంబు దాల్చి

గీ మిసిమితరఁగల పయ్యంటముసుఁగు దాల్చి
మురిపెమొక్కింత మోమున నొఱపు నెఱప
మొదలఁ బద్మిని దనమిత్రు నెదురుగొనియె
నేటిపద్మినిజాతి కీరీతి గాదె ౧౭౨

ఉ ప్రాకటమోదనాదముల పక్షిరవంబు జెలంగునంతలో
వేఁకువబోఁటిప్రాక్శిఖరి వేడ్క మెలంగుచు దోహదక్రియం
గైకొన గొఁగుబువ్వు గొలుకం బలుకు నచియించెనో యనం
గోకతతు ల్జెలంగ తొలిగొండ నినుం డుదయించెఁ దీప్తుడై ౧౭౩

కం ఆయవసరమున శశిరే
ఖాయతలోచనను జెటికాంగనలు నాగిం
బాయక మెలఁగి రటన్నను
శ్రీయుతుఁడౌ పైలు నవలఁ జెప్ప మనుటయున్ ౧౭౪

## -:ఆశ్వాసాంతము:-

చం పురపరిపంథిమౌళిభృతపూతపదాపగభక్తమాన్యపా
సోష్ఠ్యౌ మరపరిపాలభూరమణమానవరూపతపస్థపూజ్యపా
నిహో మగమదమష్టబాంవిధుఫాలపరాత్పరపుష్టివాసవా
ష్ఠ్యాము పరమతభేదభూరిభయదారవిరామరమేశమాధవా. ౧౭౫

**మాలిని.** విమలకమలనేత్రా వీరదైతేయజైత్రా!
సుమశరసమగాత్రా! సూరిహృత్పద్మమిత్రా!
భ్రమితవిషమనేత్రా! పద్మజాతాకళత్రా!
దమితవిషమగోత్రా! తాపసస్తోత్రపాత్రా! ౧౭౬

మ. ఇదిశ్రీవాసగురుప్రమోదివృషశైలేశప్రభావాత్తసం
పదుదారస్ఫుటభావనార్యసుతదీప్యద్రాఘవార్యానుజా
భ్యుదయప్రాభవబంధనాటకకృతిప్రోద్యన్నృసింహార్యధీ
వదతాలాంకసునందినీపరిణయాశ్వాసతృతీయం బిలన్ ౧౭౭

గద్య

ఇది శ్రీమచ్ఛేషధరాధరసౌధవీథీవిహారణ వేంకటరమణ
చక్షుర్వీక్షణాక్షీణకృపాకటాక్షవీక్షణాపరిలబ్ధలక్ష్య
లక్షణానవద్య విద్యావిలాస శ్రీనివాస గురు
చరణస్మరణాభ్యాసనరసనావికాస నిస్తుల్య
కల్యాణసాకల్య మౌద్గల్యగోత్రపవిత్ర
భావనాచార్యపుత్ర పర్వత్రయకైం
కర్య విధాన వేంకటనృసింహార్యా
భిధాన ప్రణీతంబైన తాలాంక
నందినీపరిణయం బను
మహాప్రబంధంబునందు
తృతీయాశ్వాసము ౧౭౮

# తాలాంక నందినీ పరిణయము

## చతుర్థాశ్వాసము

కం. శ్రీ స్తనకుసుమ స్తబక
న్య స్తవినిస్తులిత చందనస్నిగ్ధలస
త్కస్తూరికాంక శుభవ
క్షస్థ్సలసంకాశ శేషశైలనివేశా ౧

గీ. అవధరింపుము, జనమేజయాధిపతికిఁ
బైలుఁ డనవరతాచ్యుతభక్తిలోలుఁ
డతులవాచాలుఁ డతికృపాన్వితసుశీలుఁ
డఘవిటపజాలవాతూలుఁ డనియె నిట్లు ౨

శా. ఈలీలన్ మిహిరోదయం బగుటచే నింపొందఁగా వందివై
తాళికుల్ మృదుగీతవాద్యగతిత్థా నుతానింప సత్యావధూ
లోలుం డంతట మేలుగాంచి, హితశీలు ల్వెంబడింపంగఁ ద
త్కాలప్రక్రియలెల్ల దీరిచి సభాస్థానంబునం జేరియున్ ౩

గీ హితులు భూపతులును, పురోహితులు, వార
సతులు, మంత్రిప్రతతులు. పండితులు కవివి
తతులు, గాననిరతులు, సన్నుతులు జేసి
యతుల గతులను మతుల సూరతులు దెల్ప ౪

వ మఱియు నుగ్రసేనవసుదేవబలభద్రసాత్యకిసారణకృతవర్మప్రద్యు
మ్నానిరుద్ధాదియదువృష్ణిభోజాంధక బంధుసందోహంబుల న
మస్కృతిపూర్వకంబుగా సంభావించి తత్తదుచితాసనంబుల నాసీను
లుగా నియమించి నిండుపేరోలగం బుండు సమయంబున, ౫

సీ. పటుసితాంబోజ ప్రభాభాసురత మేన
పాటలచ్ఛటసటాపం క్తి వ్రేల
హ స్తపద్మ భ్రమమాయాతబంభరడింభ
జాలవన్నలినాక్షమాల దనర
గంగాద్యనేకాపగానీరపూరమౌ
వలికేలి ఘనకమండలువు మెఱయ
స్వాంసభాగోపరిస్వరపూరమహతీ-ని
నాదంబు 'నారాయణా' యనంగ

తే.గీ. తారహీరపటీరడిండీరసౌర
వారణక్షీరకర్పూరశారదాభ్ర
చారుతరశుభ్రదివ్యశరీరుఁడైన
నారదుఁడు తారసిలె నంత శౌరిచెంత

కం. నిలిచిన మౌనీంద్రుని పద
జలజములకు సాగి మ్రొక్కి సద్వినయముగా
వలగొనుచును నిది మేలని
దలఁచి వినమ్రత నుతించెఁ దగుమధురోక్తిన్.

సీ ఫణినాధుఁడే మౌనిపాటకు ఫణులెత్తి
యాలించు కర్ణరసాయనముగ,
మున్ను వేదవ్యాసమునియే మహాత్ముని
భావంబుగని జేసె భాగవతము,
దక్షప్రజాధినేతకు నేమునీంద్రుని
చే ప్రజాపాలనస్థితి లభించె
ఘనుఁడు ప్రాచేతసుం డనఘరామాయణం
బే తపోనిధి యాజ్ఞచేత గూర్చె,

తే.గీ. సతతమోక్షార్థనోపాయచతురతఁ దగి
విదితబ్రహ్మాదులను వశంవదులఁ జేయు

నేవరర్షి యతండవు నీవకావె
సాత్త్వికాతంద్ర!నారదసంయమీంద్ర! ౮

కం. ఓ విబుధమౌని!యిటు మీ
రై వేంచేయుటకు నేకృతార్థుఁడనైతిం
గావున మీ కారుణ్యమె
భావుకకారణము లోకపాలురకెల్లన్ ౯

కం అన విని సురసంయమి యి
ట్లనియెన్,హరి నీవు మర్త్యుఁ డాడినటుల ని
ట్లనజెల్లునే పరాత్పరుఁ
డని శ్రుతులం బల్కు నించుకైన నెఱుఁగనే ౧౦

సీ సకలచరాచరాత్మకుఁడవై తగు నీకు
నెలవిందు గలదని దెలుపవశమె!
బ్రహ్మాండభాండసంభరణతగల నిన్నొ
కింతవాఁడ వటంచు నెంచవశమె!
శర్వాదులే నిరంజనుఁ డంచనెడు నీదు
రూప మిట్లని సాటుజూప వశమె!
యవని గుణాతీతుఁడవని బుధుల్ దెల్ప
నీగుణం బిదిగా గణింపవశమె!

గీ తలఁప నీవాదిమధ్యమాంతరహితుండ
వక్షరుండ వజేయుండ వవ్యయుండ
వప్రమేయుండ వాద్యుండ వచ్యుతుండ
వైన నిన్నెన్నదరమె సౌఖ్యప్రదాయి ౧౧

కం. అల వైకుంఠము విడి మీ
రిలలోకఁల నవతరించు హేతువు మాధా

కలఁబోకలందు భవదు
జ్జ్వలసేవ లభింప సుల్లభంబయ్యె హరీ! ౧౨

మ. అనుచుం గొంత నుతించి శీఘ్రగతిగా నయ్యంబుజాతాక్షు వీ
డ్కొని యంతఃపురిలో జనార్దనవధూకోటి న్విలోకింపఁగాఁ
జనవైదర్భి సుదంతిసూర్యతనయాసాత్రాజితీభద్రల
క్షణభల్లాత్మజమిత్రవిందలు సముత్సాహాన్వితస్వాంతలై ౧౩

కం చేడియసుభద్ర వారల
తోడం జనుదెంచె మెఱుపుతోడం గూడన్
జోడైన చంద్రకళవలెఁ
గోడలిశశిరేఖఁ దోడుకొని మునికడకున్. ౧౪

కం. వచ్చి ప్రణామ మొనర్పఁగ
నచ్చెలువలనెల్ల కుశలమడిగి వెసుకవి
వ్వచ్చుపడంతుక చెంగటఁ
జొచ్చి నిలిచియున్న బలునిసుతను గనుఁగొనెన్ ౧౫

కం మీకన్య మరునిచేతి శు
కీకరణిం దనతె దేనికిందగు వరుఁడే
లోకమునగలఁడొ యని శుభ
రోకనమున దెలిసి బుద్ధిలోఁ దలపోసెన్ ౧౬

ఉ ఈరమణీలలామహృదయేశ్వరుఁ డీయభిమన్యుఁ డౌట కం
భోరుహగర్భుఁడే ఘటనబూనునటంచనిదోఁచె శౌరిదాఁ
గోరినయిట్టికార్య మొనగూడదె కౌరవపక్షపాతియౌ
సీరధరుండు దీనికొకచిత్రము కల్పనజేయఁగా దగున్ ౧౭

కం. తొలుత కురుపాండవులకుం
గలవైరం బినుమడింపఁగాఁ దగు నాకుం

గలకాల మించుకైనను
కలహంబునులేనిదినము గడపఁగ నేలా ౧౮

ఉ. ఈశశిరేఖచక్కఁదన మెల్లను విన్న సుయోధనుండు దా
నై శతధాకుమారునకు నంగననిమ్మని యచ్యుతాగ్రునిం
డాసి వచింపఁగా నతఁ డొడంబడకుండునె యేతదర్థమై
కేశవుఁ డెల్లభంగులను కేవలవిఘ్న మొనర్పకుండునే ౧౯

తే గీ. దాని కొకరీతి కలహమే తారసిల్లు
నల సుయోధనకార్య మట్లడుగుబట్టు
బడలి చిందఱవందఱై చెడుటవలన
నింక మోదంబె గాని నాకేమి చింత ౨౦

మ. అని యూహించి విదర్భరాజసుత నెయ్యంబొప్ప వీడ్కొల్పఁగా
జని యా హస్తిపురీవరంబున సభాస్థానంబునం గొల్వుదీ
ర్చిన దుర్యోధనుఁజేరఁబోవ నతఁడర్థిన్ మ్రొక్కి భద్రాసనం
బున నేమించి సుగంధమాల్యముల సంపూజ్యంబు గావించినన్ ౨౧

కం కురునాథ ! కుశలమే మీ
గురుబంధుజనానుజాదికోటికిని, శుభం
కరమె నిజరాజ్యమును పరి
చరులు భవచ్ఛాసనంబు సలుపుదురు గదా ! ౨౨

చం అనిన నృపాలమౌళి దరహాసముఖంబున బల్కె దేవ మీ
ఘనకరుణారసంబున నఖండశుభోన్నతి గల్గుటెంత మీ
యనుగమనం బికెచ్చటికినై యెటనుండియొ సాదరంబుగా
వినవలతున్ భవత్కృప సవిస్తరరీతిని దెల్పఁగాఁదగున్ ౨౩

వ. అనిన రాజేంద్రునకు మునీంద్రుం డిట్లనియె- ౨౪

ఉ. ద్వారకలో యదూద్వహుఁ డుదారయశోవిభవంబులన్ జగ
ద్భారకుఁడై హలాయుధునిబాయక కంసనృశంసముఖ్య సం

హారమొనర్చి సద్బుధజనావనుఁడై చెలువొందుచున్నయా
శౌరిని గాంచి నీకొకటి చక్కనిమే లొనరింప వచ్చితిన్. ౨౫

కం మేలనఁగ నేమిదలఁచితొ
తాలాంకున కొక్కకూర్మి తనయామణి సు
శ్రీలలరు ద్వారకాపురి
బాలామణులకును మేలుబంతి యనదగున్ ౨౬

కం భామిని చక్కదనం బిక
నేమని వర్ణింతుఁ గౌరవేశ్వర! చెలి నె
మ్మోము గనుగొన్న మాత్రనె
నామము శశిరేఖయనుచు నామదిఁదోఁచెన్ ౨౭

కం. చెఱకునకు పండుపండిన
కరణిం జనియించె కన్యకామణి కెనయే
సురకిన్నెర విద్యాధర
గరుడోరగసిద్ధసాధ్యకాంతలలోనన్ ౨౮

సీ గొప్పనీలఁపుకుప్ప లప్పమోపరి తెప్ప
లప్పడంతుక కప్పు కొప్పు కొప్పు
మరువాలుఁగమిబోలు మఱివాలుగల నేలు
కళదేలు చెలివాలుఁగనుల డాలు
కంబుబింకంబు పూగంబు పొంకంబు ని
క్కంబు బింబోష్ఠి కంఠంబు డంబు
కల్కిచిల్కలకుల్కు మొల్కకప్రఁపుఁ బల్కు
కుల్కుతేనియజిల్కు జిల్కు పల్కు

తే.గీ తమ్మి లద్దమ్ములను గ్రమ్మి నెమ్మొగమ్ము
మించు క్రొమ్మించు మించు నెమ్మేనినంచుఁ
జక్కవలకెక్కు నుతికెక్కుఁ జన్నుదోయి
దాని వగజెందు సతిముందు గాన మెందు. ౨౯

సీ సతినెఱు ల్నెమిలిపింఛమురీతిని జెలంగఁ
గాలాహిని జయింప ఘనతగాదు,
పడఁతిమో మిందుబింబమురీతిని జెలంగఁ
దమ్ములనెడప చిత్రమ్ము గాదు,
సుదఁతికెంజిగిమోవి శుకతండమును బోల్పఁ
బక్వబింబము నెంచ భరముగాదు,
కలికిపెందొడ లిభకరములవలె నొప్ప
నికరంభలనుగెల్పు టెచ్చుగాదు,

గీ చనులు జక్కవలబెడం గనుకరించ
తమ్మిమొగ్గలజిదుమ చిత్రమ్ముగాదు
తనువు బలుకప్పురఁపుఁదావి నెనసినపుడె
వివిధతాపంబు లార్పుట వింతగాదు ౩౭

ఉ. ఎంతని నేనుతింతు తరళేక్షణ వక్కదనం బటుండ ని
మ్మంతటిలో భవత్సుతుఁ డహీన గుణాఢ్యుఁడు లక్ష్మణుండు న
య్యింతికి భర్తగాఁగ నొనరించితివేనియు నీకుఁ గోడతా
టింతియగాదు రాజ్యరమ కెంతయు భూషణమై జెలంగెడిన్ ౩౮

కం. ఏమో తెల్పితినని మది
వేమరు సందేహసరణి వెదకకుమ యిదే
క్షేమంకరము నిజముగా
నామదిఁ దోఁచినది యిది యొనర్చుమి వేగన్. ౩౯

కం అని చెప్పి, సురమునీంద్రుడు
తనరాక నిరీక్షసేయఁదగు చోటికి చ
య్యన నేఁగె కేశవధ్యా
ననిరూఢి ఘనంబుగా మనంబున బెనఁగన్ ౩౩

కం. అంతట దుర్యోధనుఁ డ
త్యంత ముదం బొదవ నాపులగువారల నే

కాంతమునకు బిలిచి ప్రపలం
బాంతకుపుత్రీకథాసమగ్రము దెలియన్ ౩౪

కం. మునివలన దనకుఁ దెలియుట
తనసుతుఁడగు లక్ష్మణునకు దత్కన్యక పెం
డ్లినిమిత్త మడుగఁగోరుట
వినయమునం బూసగ్రుచ్చువిధమున దెల్పెన్ ౩౫

ఉ వారలు సమ్మతింప దగువారలఁ గార్యధురంధరైకవి
స్తారుల విప్రయుగ్మము పదంపడి బిల్వఁగ బంపి మీరలా
ద్వారక కేఁగుదెంచి బలభద్రసుతన్ శశిరేఖ కన్యకం
గూరిమిమీర లక్ష్మణునకున్ సతిగా ఘటియించు టొప్పగున్ ౩౬

చం అరమరలేని చుట్టము హలాయుధుఁడు న్మనపట్ల మిత్రుఁ డం
దటివలెఁ బక్షపాత మదిఁ దల్పడు గావున మీరు తన్మనో
హరణ సమాహిత క్రియల నారసి యారసికాగ్రగణ్యుఁ డి
ప్పరిణయ కార్య మాస్తి నొడబాటుగొనన్ సమగూర్చఁగా దగున్. ౩౭

కం. కౌరవనాథుం డటువలె
గౌరవమున నానతియఁగా విప్రవరుల్
నేరుపున శీఘ్రగతిచే
ద్వారక కేతెంచి రతులితప్రమదమునన్ ౩౮

సీ మగరాల వాకిళ్ల మాణిక్యఁపు నగళ్లు
కనఁకపుదళ్ల నంగళ్ల దాటి
యలరుల ముంగిళ్ల నలరు కేలాకూళ్ల
గోపురంబుల చాళ్ల గుళ్ల గడచి
సిరిగల మగనాళ్ల సింగారమున చాళ్ల
దీరుసావళ్ల పందిళ్ల దక్ష
మగని బాయని జోళ్ల సొగసైన విటకాళ్ల
తమిమీరఁద్రుళ్ల సందళ్ల గాంచి

గీ ధీర్లు మణిహార్లు సంసార్లు తెగుపవార్లు
వీర్లు రణశూర్లు బంగారుతేర్లు తీర్లు
కలిగి తొలఁగని కలిమిచే జెలఁగుచున్న
ద్వారకాపురి గాంచి మోదమున మించి ౩౯

మ తమరాకం దగువారిచే బలునకుం దాత్పర్య మౌనట్లు యు
క్తిముగా దెల్పి తదాజ్ఞ గైకొని గృహాంతస్థానముం జేరి మో
దమునం బూజితులై ధగద్ధగితభద్రస్వర్ణపీఠంబులం
గొమరొప్ప న్నివసించి సద్వినయసూక్తు ల్మీర విప్రోత్తముల్ ౪౦

ఉ కౌరవభర్త మమ్మనుపఁగాఁ జనుదెంచితిమయ్య - మీకతం
డారయ శిష్యుఁ డాత్మహితుఁ డర్మిలి చుట్టముగాన నట్టిచో
వేరికలేమి కిప్పు డొక వియ్యముఁ గోరినవాఁడు మున్నుగా
వారును మీరు భాగ్యవిభవంబులఁ దుల్యులుగారె యన్నిఁటన్. ౪౧

కం రారాజు కౌరవేంద్రుఁడు
మీరును భగవత్ప్రకాశసమేతులగుట బం
గారమున సౌరభము చే
కూరిన గతి వియ్యమందుకొన మేల్గాదే ౪౨

చం. అతనిసుతుండు లక్ష్మణుఁడునా శుభలక్షణుఁ డొప్పు రూపని
ర్జితశతకోట్యనంగుఁడు రుచివ్రజబాలపతంగుఁ డార్యసం
స్తుత సుగుణానుషంగుఁ డతి దుష్కరవైరిచమూవిభంగుఁ డా
తత వరదానచంగుఁడు సదాకరుణాలహరీ తరంగుఁడై ౪౩

తే.గీ నట్టురే నట్టి సుగుణముల్ తెట్టెపెట్టి
నట్టి కురుపట్టభద్రుని పొట్టఁబుట్టి
నట్టి రాపట్టి దిట్ట నీపట్టి చెట్టి
బట్టి కోరికబుట్టి రాజిట్టు బనిచె ౪౪

కం నెయ్యమున మీకు వారికి
వియ్యముఁ దగుఁ గాక నెన్నివిధముల దలఁపన్
వెయ్యనఁగనేల పాలన్
నెయ్యి యొలుకురీతిగా గణించుట గాదే ౪౫

చం జగతిని గన్నియల్ వరుని చక్కదనంబె గణింతు రమ్మలుం
దగు ధనవంతు నెంచెదరు, తండ్రులు కీర్తిని గోరువారు, బం
ధుగణము సత్కులోన్నతగతుల్ గనుఁగొందు, రితేతరుల్సప
క్వగురు సుభోజ్యసంపదల గాంక్షయొనర్చెద రుద్వహంబునన్ ౪౬

కం. అదిగాన నిందఱల క
భ్యుదయమనోరథఫలాప్తి నొందఁదగు మీ
రిదె కన్యకామణిని మే
లొదవఁగ లక్ష్మణుని పెండ్లికొనఁగుటవలనన్ ౪౭

మ. చెలువం బొప్పఁగ విప్రు లిట్లను మృదుక్షేమోక్తు లాలించి యా
హలి కౌతూహలియై ముఖాబ్జమున హాసాంకూర భావంబునం
బులక ల్మేన జనింపఁగా భుజయుగంబుం బొంగ లోసమ్మతిం
దల నంతంత గదల్చి యిట్లనియె వాగ్ధాటీసుధాపేటిగాన్ ౪౮

చం తొలుతటినుండి దా భగినిలో వచియించిన సూనృతోక్తులం
దలఁపక నిట్లు బల్కె, వసుధామరులార! కురుప్రభుండు దో
ర్బలియుఁడు రాజరాజు ప్రియబంధుఁడు పౌరుషశాలి యాఘనుం
డెలమి దలంచుకార్య మిక నేవిధినైన దొలంగవచ్చునే! ౪౯

శా, మాకు న్వారల కానుపూర్వమగు ప్రేమ ల్మీరు సంబంధ మీ
లోకు ల్గాంచఁగ సుప్రసిద్ధ మిది యాలోచింపఁగానేల మే
ల్చేకూరంగ సుయోధనాత్మజునకుం జెల్వొప్ప మత్కన్యకన్
వే కల్యాణ మొనర్తు దైవకృతికిన్ వేరొండు సూహింతునే. ౫౦

తే.గీ. కన్య శశిరేఖ కింక లక్ష్మణుఁడె మగఁడు
గాన బుధులు శుభస్య శీఘ్రం బటంచుఁ
బలుక వినియుండి యెడసేయఁ బాడియగునె
యనుచు వచియించి మదిలోన నతిశయించి ౫౧

కం. తనదు పురోహితవర్గం
బును బిలిచి కురుక్షితీశ పుత్రుం డగు ల
క్ష్మణ సార్వభౌమవరునకుఁ
దనసుత శశిరేఖ నొసఁగు తలఁపుం దెలిపెన్ ౫౨

కం. వా రవ్వధూవరులకుం
దారాబల చంద్రబల హితం బగు లగ్నం
బారసి యారసికునకు మ
నోరథ ఫలసిద్ధిగాగ నుడివి వినయతన్ ౫౩

గీ. దేవ నేటికి యాఱవదివసమునకు
శుభముహూర్తంబు గన దినశుద్ధి గలిగె
జాగుసేయకఁ దత్కార్య సరణులెల్ల
సాదరస్థితి నొనరింపఁ జాటవలయు. ౫౪

మ. అనినం గౌతుకచిత్తుఁడై హలధరుం డప్పట్టణం బెల్ల చ
య్యన శృంగార మొనర్పఁ జాటెన మహాహ్లాదంబునం బౌరులం
తనె వీధుల్ విపణుల్ వితర్దు లవరోధస్థానము ల్దివ్యకాం
చనదీప్తిం ఘటియించి రంత నయనోత్సాహంబు సంధిల్లఁగన్ ౫౫

వ. మఱియుఁ గర్పూరకస్తూరికాప్రముఖబహువిధపరిమళమిళిత కర్దమ (విలేపి)త రాజమార్గప్రదేశంబును - తరణికిరణప్రకరణధిక్కరణ మణిగణస్థగితరంగద్గాంగేయశృంగశృంగారితవైమానికానీకంబును. జంభారికుంభినీకుంభబంభజ్యమానసంరంభోత్తుంగ శాతకుంభ హీర

వారస్ఫారకంఠీరవాకారవిస్తారితబహిర్ద్వారప్రదేశంబును, సకలకళాకలాప ముక్తాఫలవిచిత్రతరంగవల్లికాలంకృతఒంభిన్నీలవేదికాసముదయంబును - పురోపవన ఫలఖాదనోన్మాదసంచారిత శ్రేణీభూత శుకశుకీనికరభ్రమప్రాపితగారుత్మతతోరణాలంకృతంబును నై - సాక్షాత్కాయజారాతికాయంబు తెఱంగున సర్వమంగళాన్వితంబై - విభావసుసూనుసభాభవనంబు లీల నీలాంగదాలంకృత, సకలపరీవారంబై, సాకేతపురీ సదృశంబున రామ లక్ష్మణప్రశోభితంబై ప్రావృడాగమంబుభాతి ఘనవిచిత్రవ్యాపకంబై - నభోమండలంబు భంగి బుధగురుకవిరాజరాజితంబై యుండె నంతట ౫౬

కం. వైవాహికోత్సవమునకు
గావలయు పదార్థములు నగత్యము మీఱల్
వేవేగ గూర్చు డని బల
దేవుం డానతిడ వా రతిత్వరితమతిన్ ౫౭

సీ. తండులసూపాజ్యతైలామ్లఫలకటు
క్షారగోధుమ ముద్గచణకమాష
తిలగుడఖర్జూలఫల నారికేళక్ర
ముకహరిచూర్ణజీరకమరీచి
దధిమధుక్షీరవివిధశాకసుశలాటు
కదళీఫలద్రాక్షకందమూల
కర్పూరచందనాగురుసుగంధకచూర
యేలాలవంగతాంబూలపర్ణ

తే గీ. ముఖరవైవాహికోచిత నిఖిలవస్తు
వర్గము ఘటింపఁగా దగువారలకును
సీరి నియమింపఁ దత్తత్ప్రకారములను
మంతనంబున జతగూర్చి రంతలోన. ౫౮

కం అనవద్యహృద్యవాద్య
ధ్వని సెలఁగ వివాహవార్తతతపౌరజనుల్

వినజాటినంతలోపల
గనుఁగొని మదిలో సుభద్ర కళవళ బడుమన్ ౪౯

కం వెలవెలనబోయి తాన
వ్వలదోఁచక కొంతవడికి వినజాక్షున కీ
బలుఁ డుద్యోగించిన పెడ
తలఁపుం దెలుపంగ నతఁ డదల్పకయున్నే ౫౦

వ అని నిశ్చయించి-

చం కనుఁగవకెంపుఁ బార మది కళ్వళ మంతకు బెంపుదేర హె
చ్చిన తమి మీరఁ జెక్కుపగి చెమ్మటజార ప్రలంబవైరిపై
తన కసిసీర పట్టువిడి తాలిమిదూర సరోషభీషణా
నన మలరార నాకమలనాభునిచెంతకుఁ జేరి యిట్లనెన్ ౫౧

కం. తగునా భవదగ్రజుఁ డి
ట్లగు నాయముదప్పి కన్య నన్యులకిడ మే
లగునానేటికి మీకుం
దెగు నాపాండవులతోడ నిక బాంధవమున్ ౫౨

మ. తొలుతన్ మామగవారు మీరలతియాప్తుల్ బాంధవశ్రేష్ఠులౌ
టలు నూహించిగదా యిట నృములనుండంజేసి తామావన
స్థలి నవ్యాజమునసంచరించ జనినంతం బెద్దమాయన్న న
న్నలయింపం దనకూఁతు మత్సుతున కియ్యంగోరి నేడీగతిన్ ౫౩

కం. కలిమి గలవా రటంచని
వలఁచి సుయోధనకుమారవరునకు నొసఁగం
దలఁచె నిదితగవె మీకుం
దెలియని ధర్మములుఁ ద్రిజగతీస్థలి గలవే ౫౪

గీ. శిశువు తనకుఁబుట్టి చేటలో నిడునాడెఁ
పౌరజనులు హితులు బంధుజనులు
గాంచ మత్సుతునకుఁ గన్య నిచ్చెదనను
బలుకు బొంకఁజేసెఁ బాపమనక ౬౬

వ. అని యింతింత దురంతచింతాభరాక్రాంతసంతాపితస్వాంతయగు
నయ్యింతి న్మంతనంబున నవలోకించి రుక్మిణీకాంతుం డిట్లనియె ౬౭

ఉ. ఓవిమలాంగి నీవు వెతనొందఁగ నేటికి దైవయోగమే
యేవిధి సంభవించునొ విదేకఫలాప్తిని ద్రోయఁగా వశం
బే వివరింప నగ్రజునభీష్టము ద్రిప్పఁగ నెప్పుడోపు నై
నా వినవింతయుచ్చట వినంబడె దీనికి నేమి సేయుదున్ ౬౮

ఉ. ఖండిత మాతరా దనసి గట్టెదుటన్ సుతకున్ స్వతంత్రుఁడా
తం డదిగాక కౌరవహితప్రదుఁ డౌట మదుక్తివిన్నచో
పాండవపక్షపాతి యని బల్కిన బల్కఁగనిమ్ము నింకవే
ఱొండని నమ్మకొన్న సునయోక్తులఁ జిత్తమెఱుంగ జూచెదన్ ౬౯

కం. కానున్న కార్యమెల్లను
దానెఱిఁగి యెఱుంగనట్లు దగుమాటల న
మ్మానవతి నూఱడింపుచుఁ
దానేఁగెం బలునికడకు దత్సోదరితోన్ ౭౦

కం. పోయి హలాయుధుకడ- దం
డాయితపూర్వకముగా నతాంగుండౌ
నాయకుని లేవనిడి- బిగి
బాయని మోహమున కామపాలుం డనియెన్. ౭౧

కం. మురహర వార్తలికే మన
గరుడధ్వజుఁ డిట్లు బలికె గంభీరసుధా

ఝరపూరమధురమధుసం
భరితస్ఫురితోక్తులను సభాజనులు వినన్ ౭౨

శా. స్వామీ యెన్నఁడులేని ముచ్చట మహాశ్చర్యంబుగా వింటి నీ
భూమి న్సత్యతపోగరిష్ఠులు బుధు ల్పుణ్యార్జితు ల్దానని
ష్ఠామాహాత్మ్యులు సూనృతవ్రతులు నీషన్మాత్రమైనన్ వృథా
ప్రామాణ్యోక్తులు బల్కకుందురుగదా ! పాపాతిభీతి న్మదిన్ ౭౩

చం మొదల సహోదరీమణి- ప్రమోదమునొంద ననుంగుఁగూతుఁ న
మ్మదవతిసూనుఁడైన యభిమన్యున కిచ్చెదనంచు సూనృతా
భ్యుదయమతి న్వచించియు సుయోధనుసూతి కొసంగి- తుచ్ఛసం
పదలకు మోహమందు టిది పాపముగాదె ప్రలంబభేదనా ! ౭౪

గీ నీతికోవిదులగు బుధవ్రాత మెల్ల
'సూనృతా త్పాతకం పరం'బె నిజమని
సత్యశౌచదయాజ్ఞానశాంతరసము
లందు నిత్యము నెఱబాయకుందు రనని ౭౫

ఉ చెల్లెలు నమ్మఁబల్కి తుది చేటులెఱుంగక బొంకు జేసి- మే
నల్లుఁడు పాత్రుఁడుండ నొకఁ డన్యుఁడు కన్యకు భర్తయౌనె యీ
చెల్లనికార్యము ల్వినఁగజెల్ల దటంచని నాకు దోఁచె మీ
కెల్లవిధంబుల న్విశదమేగద నీతియనీతిధర్మముల్ ౭౬

చం అన విని తోకద్రొక్కిన మహాహివిధంబున బూత్కరింపుచున్
వనజదళాక్షుఁ జూచి యిటువంటివృథావచనంబులేల ని
వ్వనితను మున్నొసంగ సుఖవారిధి నీగతి నోలలాఁడె- నిం
కను శశిరేఖనిచ్చిన సుఖంబున కేమిట తక్కువయ్యెడిన్ ౭౭

ఉ కౌరవు లిట్టిమట్టములు గారటె నీవు కిరీటిపక్షమై
సారెకు బల్కుచుంటి కురుసంతతిపై గనలంగనేల ని

షాక్కారణభక్ష్యభోజ్యములు కై నెడ ద్రోయుచు చేదుకాయలం
గోరి భజించునట్లు లొనగూడదె పాండవ బాంధవం బిలన్. ౭౮

తే.గీ. పూర్ణసామ్రాజ్యవిభవసంపూజ్యులైన
వారినెల్లను విడచి దుర్వారగహన
వన్యశైలాగ్రచరుల కిక్కన్య నొసఁగి
వియ్య మందంగ నూహించు వెఱ్ఱి గలఁడె. ౭౯

కం. అనినం గృష్ణుఁడు తనలోఁ
దను గనలుచుఁ బలికె పాండుతనయుల యెడలం
గనికరములేక సుతనీ
కనుకూలుల కొసఁగి యూర్జితాప్తిం గనవే. ౮౦

చం. అది కనుగొందుఁ బాండుసుతు లాగ్రహులై చనుదెంచిరేని - సం
పదల మెలంగు కౌరవులపాటు లెఱుంగగవచ్చు నీకు మే
లొదవఁగ నే వచించు వినయోక్తు లెఱుంగవుగాని దైవమె
య్యది ఘటియించునో దెలియనౌనె మహాత్ములకైన నగ్రజా ౮౧

కం. అని హేతుగర్భవచనము
లనుచు సహోదరిని జూచి యమ్మా యిక నీ
తనయునకు సుత నొసంగం
డని దెలియుము దైవయోగ మది యెటుఁగలదో! ౮౨

మ. అనుచుం దిగ్గునలేచి శౌరి జనఁగా నయ్యంబుజాతాక్షి స
య్యన తాలాంకుని మోము గన్గొనుచు నన్నా నీకు మేనల్లుఁడౌ
ననిగాదా శశిరేఖ నిత్తునని యాథార్థ్యంబుగా బల్కి నె
మ్మన మాహ్లాదము మీర నిన్ని దినము లాత్మ వాడకుంటిం గదే. ౮౩

కం. నీమఱదు లడవికేఁగిన
దీమొదలుగ వారిశ్రమ సహింపుచు నైనన్
నీమన్ననలకు మురిపెము
ఛే మనితిం గొడుకుపెండ్లి జేసెద వనుచున్ ౮౪

కం. మాకుఁగల లేమి జూడకు
మా'కురుపతిసంపదలకు నచ్చెరుపడకీ
చీఁకటివెన్నెలగాదా'
లోకులసంపదలు క్షణములో జెడు పెచ్చున్ ౮౫

చం. చెలిమిని గూఁతు నిత్తునని చేతిలో చెయ్యిడి బాసజేయు నీ
పలుకు లబద్ధమైన నను పాండుకుమారులు చుల్కఁజూతురే
వలనను నీకు నీవె దయవాటిలఁగావలె గాక నొండు నీ
తలపెడలింప శక్తిగలదా శితికంఠముఖామరాళికిన్ ౮౬

కం కావున భవదనుమతి గొని
బావలమఱదులకు పతినిబాసిన గానిన్
వేవేల విధుల వాఁడొక
జీవనమని నమ్మి మిమ్ముఁ జేరితిఁ గదవే ౮౭

మ అని ప్రార్థించు సహోదరిం గని విరూపాక్షుండె బోలెన్ చల
ద్ఘనరౌద్రాకృతి సభ్యు లాబలుని నిష్కారుణ్యుడం చెన్న ని
ట్లనె నేనవ్వులకంచు బల్కుటలు యాథార్థ్యంబుగా బూని తెం
పున నన్నిట్లరిగట్టఁగాఁ దలఁచెదే పూర్ణేందుబింబాననా!

ఉ కూటికిపేదలై యొరులకుం గల బిడ్డల నాసజెందు టీ
పాటిఫలంబు - నీకుగల భాగ్యముతెల్ల భుజింప కోడలిం
కేటికి, కొంపల న్విడిచి యేకత కాఱడవుల్ జరించు మీ
బోటుల కిచ్చుకంటె తెగుబుద్ధిని నూతినిద్రోయు టొప్పగున్ ౮౮

కం నీకున్నవారె కన్నచి
కాకులఁ బడి కూడుకోఁక గానక తిరుగన్
సౌకర్యమైన కోడలు
లేకున్నం గొరఁతఁ గళపళించెదవేమో! ౯౦

మ ఇలలో పాండవు లెంతవారయిన నేమీ, కౌరవాధీశుతో
తులదూగంగల రాజు లేఁడనుచుఁ దోడ్తో వియ్యమందంగ నా
తలఁపుం బూనుట కింతగా వగవ నీధర్మంబుగాదమ్మ మున్
బలిమి న్నిన్గొనిపోవునాటి ప్రియమౌ బాంధవ్యముం జాలదే. ౯౧

కం అని కర్ణశూలములుగా
వినిపించిన రోషదుఃఖవివశతచే స
ఖ్యనికాయ మెల్ల గనుఁగొన
దనుదానె దురంతచింతితస్వాంతయునై ౯౨

సీ. కజ్జలంబు దొఱంగఁగా వెడల్కన్నీరు
పాలిండ్లకుంకుమ పదను చేయ
నుడుకుగా వెడలు నిట్టూర్పుచే నంతంతఁ
జిగురాకుమోవి బిట్టగిలి కంద
ఖిన్నతచే కళ ల్సన్ననై యున్న నె
మ్మోముదమ్మి యొకింత మురువుదప్ప
పవమాననిహత కల్పకవల్లికాభమై
నెమ్మే న్వడంకుచుఁ జెమ్మరిల్ల

తే గీ చింత నెదగూర్చి చెక్కిట చెయ్యి జేర్చి
చాల మదిరోసి బొటవ్రేల నేలరాసి
మొదటి హాలిమాటలు దలంచి మోము వంచి
బలికె నొకమాట వాక్పొందిడి బయలునాట ౯౩

మ. తలిదండ్రుదు ల్విబుధు ల్సహోదరుల చెంతన్ మున్ను నాకిచ్చు బా
సలు 'నేనవ్వలకాడినాడ'నని కోసంబోక పల్కంగ ని
చ్చలు లిన్నేడిన లాభమేమి కురురాజశ్రీకి మోహించి పే
దలు కుంతీసుతులంచుఁ బల్కుటలు మీఁదం గానఁగా నయ్యెడిన్. ౯౪

సీ ప్రియబంధువుల సంపదయు సుతించితె చాలు
నొరులలేమి కసహ్య మొందవలెనె?

దొడ్డకొంచెములెన్న దొడరెదు- నీబిడ్డ
బొడ్డున మణిగల్గి పుట్టెనేమొ?
తోఁబుట్టువని నీతిదోఁచక పరుషోక్తి
వచియింతు వీవన్నవా! తలంప
నీప్రియాన్నంబును నెఱభుజించుటకంటె
కారాకు దిని బ్రతుకంగవలదె

తే గీ నీనెనఱుజూడ నిట్లంటిగాని రాజ
కన్య లెందైన దగువారుగలరు మాకు
నిన్నిదినములు మిముఁగోరియున్నపనికి
కన్నెనీయక వర్ధిలుఁ డన్నలార! ౯౫

చం వనజభవుండు మున్ను తలవ్రాసినరీతి ఫలించు ధారుణీ
జనములకున్ శుభాశుభము, శాశ్వతమై సిరిదెచ్చుకోతలం
పునుగల నిన్ను బెక్కనుట బుద్ధియెగా దిటమీఁద నీకుఁదో
చినక్రియ వియ్యమంది సుఖచిత్తుఁడవై మనుమీ హలాయుధా, ౯౬

కం అని యిట్లగ్రజు దూఱుచుఁ
దనభవనంబునకు జనియె దరుణీమణి క
న్గొనల వెడ లుడుకునీరు న
మునిపయ్యెద దడువఁ జరణములు దొట్రువడన్ ౯౭

కం అంతన్ సాత్యకి యాహలి
నంతకమొనరింతునని మహారోషమన
స్సంతాపంబున గొందఱు
చెంతంగలవారు భీతిఁజెందఁగ బలికెన్ ౯౮

మ హరియున్ సోదరి నిన్నుబ్రార్థనలుసేయన్ వారి నుల్లంఘ్యవా
క్యరసాభాసముసేయఁ బాడియగునే కన్యామణిన్ వారికిం
గుఱిగానీయక యున్నమానె ఘనులం గోపించుటేనీతి-నీ
కురురాజు న్మది మెచ్చుచాలు నితరాక్రోశంబు నీకేటికిన్ ౯౯

కం రణపండితుఁడగు పాండవ
గుణమణులం ధిక్కరించి గొఱగాకుండం
దృణసమము జూతువే, ఘనుఁ
డణుమాత్రము నిలుచునొక్కొ యర్జును నెదుటన్ ౧౦౦

కం ఊరికడనున్న నేమీ
కారడవుల నున్ననేమి - కౌరవులను వి
స్తారశరధార గూల్చెటి
వారే వారనుచుఁ దెలియవలయు న్నీకున్ ౧౦౧

ఉ వా రిట కేఁగుదెంచి శరవర్షము నింపిననాఁడు జూడు - నీ
కౌరవకోటికన్నకడగం డ్లిపుడాడిన భంగి నాఁడు ని -
స్సారము సేయు టొప్పు లఘుసంపదలం గరివించియున్నవా
రేరణశూరులం చనెడిరీతి యెఱుంగనిమాట పాడియే ౧౦౨

కం అని కనలి పలికి కురుపతి
పనుపున పనివినిన భూసుపర్వులను గిరు
క్కున మరల చూచి వినయం
బెనయ సభాసదులు మెచ్చ నిట్లని పలికెన్. ౧౦౩

కం. సీరి స్వతంత్రుఁడు గావున
గూరిమి మీ యెడల గలిగి కూఁతురు నొసఁగం
గారణమది యట్లుండని
మీరాక విచిత్రమౌ సుమీ నామదికిన్ ౧౦౪

చం జనవరబాలు రందఱకు చక్కనివాఁ డభిమన్యుఁ డర్మిలిన్
మనుకొనియున్న మేనఱికముం గొన నల్లుఁడు బాధ్యుఁ డున్నచో
కినుకను పాండవేయులకు గీడొనరించు సుయోధనుండు దాఁ
బనిచిన మీరలైన హితపద్ధతి బుద్ధినిజెప్పు టొప్పదే ౧౦౫

ఉ. ఏసతి నేవరుండు వరియించ సృజించె విరించి హేతు వ
ట్లే సమకూరుగాక నితరేచ్ఛల దుర్మతు లెన్ని యూహలుం
జేసిన నిష్ఫలం బగుట సిద్ధ మటంచు నెఱింగి యీ వృథా
యాసము మీరు జెంద టికనైనను మీదట గాన నయ్యెడిన్ ౧౦౬

కం. ఇత్తెఱంగున సాత్యకి కరి
నోత్తరములు కొన్ని బలుకుచుండఁగ సత్రా
జిత్తనయ రుక్మిణీమణు
లత్తఱి విని వినయమెనయ నని రాతనితోన్ ౧౦౭

మ అల సౌభద్రుఁడు మీకుఁ గృష్ణునకు మేనల్లుండొ? తాలాంకున
ర్మిలి మేనల్లుడు కాడొకో? నెనరులేమి న్మీరలీ ఖండితో
క్తులు బల్కం దమకేల కన్నియకు బాధ్యుల్ తల్లిదండ్రాదులుం
గలరుం గావున వారి సమ్మతము లింకం ద్రోయ నెవ్వండగున్ ౧౦౮

చం అని యిటు లంద అన్నిగతు లాఁడుటకుం బలభద్రు డించుకై
నను తడబాటులేక కురునాయకుఁ డంపిన విప్రయుగ్మముం
గనుఁగొని గంటిరే కమలనాభుఁడు సాత్యకియుం గురుక్షితీ
శునియెడ కిన్కయు న్మనుచు జొప్పడు పాండవపక్షవాక్యముల్. ౧౦౯

ఉ వీరలు వెఱ్ఱులై పలుకువింతలు మీరుఁ దలంపనేల దు
ర్వారబలారివారమదవారణవారనివారఘోరుకం
ధీరవుఁడౌ సుయోధను గడిందిమగంటిమి నేనెఱుంగనే
మీర లతిత్వరం బ్రియము మీఱఁగ వీటికి నేఁగఁగా దగున్. ౧౧౦

కం. సుముహూర్తవేళకును భూ
రమణుని వరయుక్తముగను రావింపుడు వే
గమె యనుచు రత్నభూషణ
విమలాంబరముల నొసంగి వీడ్కొల్పటయున్, ౧౧౧

ఉ అంతకుమున్ సుభద్రసు హలాయుధుఁ డట్లు నిరాకరింప నం
తంత దురంతచింతితహృదంతరయై దివసాంతవేళ శు
ద్ధాంతముఁజేరి యొక్క కరినావని కంకటిశయ్యపైని మే
నెంతయుఁజేర్చి లోవెతల నేరికిదెల్పక కుందుచున్నెడన్ ౧౧౨

సీ తగటుగిండేదారుతలపాగ మెలచిత్తీ
ర్చిన కసీదాకోరుశిస్తుతోడ
చినుకుబూసల తురంజీచెరంగులరంగు
సీఁటుమీఁటిన వల్లెవాటుతోడ
మగరాతిపనిహొయల్ బిగిమొసల్వాకట్టు
కత్తిహత్తిన వామకరముతోడ
గౌనఁబురాచిల్క ముక్కునదీర్చు పిడిబాకు
జుట్టుతాప్తాదట్టి కట్టుతోడ

తే గీ సకలమృగయావినోదాలసతనుఁ డగుచు
ఘనహజారంబుకనె తురంగంబు డిగ్గి
వచ్చె తనతల్లియున్న నివాసమునకు
భద్రభుజబలరతుఁడు సుభద్రసుతుఁడు. ౧౧౩

కం తటుకున భవనాంగణమున
నిటునటు నల్గడలనెమకి యేకతమున కం
కటిశయ్య చటులకోపో
త్కటగతి వెతనొందు జనని గనుఁగొని బలికెన్ ౧౧౪

కం అమ్మా మమ్మరమైన భ
రమ్మున నీమేను గళ దొలంగిన గతి నా
నెమ్మదిని దోఁచుచున్నవి
ధమ్మేమో దెల్పవమ్మ దాచకుమమ్మా ౧౧౫

ఉ అయ్యల కాపద ల్గలిగినట్టు వినంబడెనో మఱేమి యిం
కెయ్యెడ నెట్టివింత జనియించెనొ మామలుఁ గూర్మితోడ రా

దియ్యక వెగ్గలించిరొ సతీమణి నా కెఱింగింపవమ్మ నే
నెయ్యము మీఱ నీకుగల నెంజిలి జూపెదనమ్మ నెచ్చెలీ ౧౧౬

కం చండప్రోద్బలబాహా
దండమహోఘండనై కతాండవకేళీ
గాండీవపండితుని తన
యుండను నేనుండియుండ నొండననేలా! ౧౧౭

కం అని వినయ మెనయ బల్కెటి
తనయుని సనయోక్తు లమృతధారలుగా నె
మ్మనమున బెనఁగొనఁగా
దనకన్నులు విప్పి గద్గదస్వర యగుచున్ ౧౧౮

కం అన్నా మీ యయ్యల కత
విన్నదనుక యున్నచటనె విను మిచ్చట నే
యెన్నెన్నొ గలవు మాపె
ద్దన్న నను నిన్నుఁ గూర్చి యన్న లఘూక్తుల్ ౧౧౯

కం. మును - దనకుఁ గూఁతుగలిగిన
దినముననే - సకలజనులు దెలియఁగ, నభిమ
న్యున కిత్తుననుచు రూఢిగ
నను నమ్మఁగ బల్కె నేఁడనాదరబుద్ధిన్ ౧౨౦

చం మనకు విపక్షుఁడైన గురుమండలవర్తి తనూభవుండు ల
క్ష్మణుఁ డను వానికిం బడునికన్నియ సేయఁగ విప్రవంశగర్వముం
బనిచిన యంతలోన బలభద్రుఁడు పెన్నిధిగన్న పేదలీ
లను మది నుబ్బి యిత్తుననె లగ్నము నిశ్చయమయ్యె పుత్రకా ౧౨౧

కం అందుకు హరియును సాత్యకి
కొందల మందుచును కొన్ని కొన్ని వినీతుల్

బొందింప నతఁడు పాండవ
నిందాస్పదమైన వాక్పణితి దొలఁకొనుటన్ ౧౨౨

ఉ. ఏ నతిదీనతన్ హలి ననేకవిధంబుల వేఁడఁబోవ స
న్మాన మెఱుంగ కిట్టు లవమానముగా కురురాజ్య సంపదల్
దానె వహించినట్లు ప్రమదంబున 'సింగఁడుబుఱ్ఱఁడైన చం
దా'నను విఱ్ఱవీగి కుపితప్రకటోక్తులు బల్కె నిర్దయన్ ౧౨౩

మ మును నేనవ్వలకంచు బల్కుటల కేమో గట్టిగాబట్టి క
న్య నొసంగం బలుమాఱు వేడుటకు నాయంబౌనె- మీవారలె
ల్లను దుర్యోధనుదాడికోడి వనులెల్లన్ సంచరింపంగ నీ
కును కోడల్ కొఱఁతాయె నంచు మది సంకోచించెదేమో యనన్. ౧౨౪

ఉ పట్టెడుకూటికి న్మొలకు బట్టకు నీడ బరుండ కొంప లే
పట్టుకలేక కౌరవులు పట్టపగల్ యిలు వెళ్లగొట్టఁగా
నట్టడవుల్ జరింపుమ ననాథలరీతి మలంగువార లీ
కొట్టుదొలంగినప్పటికిఁ గోడలు మేడలుఁ గల్గవా యనెన్ ౧౨౫

కం కొడుకు స్నిపును కూడుం
గుడుచుటయేకాక నింక కోడలు మాపై
బడియుండవలె నటంచును
గడువేడుక గల్గెనేమొకో యని బల్కెన్ ౧౨౬

మ పని బూనం ధనవంతులైన బదివే ల్బంధుప్రజంబైన నీ
యనఘుండౌ ధృతరాష్ట్రనందనుని వియ్యంబందుకంటెం ఘనుం
గన నందైనను కూటిపేదల కొసంగం బూనుట ల్మాని మె
ల్లన నూతం బడఁద్రోయ మేలని దురాలాపంబులాడెం జుమీ ౧౨౭

చం నను గినియంగనాడి కురునాయకుఁ డంపిన విప్రయుగ్మముం
గనుఁగొని నేటి కాఱవదినంబున రాత్రికి లగ్ననిశ్చయం

బని పతితోడ బల్కియు రయంబున వారలఁదోడితెం డనిం
బనిచెను నేటితోటి బలభద్రతనూజ సుభద్రకోడలా
ననెడు జనానులాపము వృధాయె నటంచు గృశింతు పుత్రకా ౧౨౮

తే.గీ సత్యకధనంబు మాని యౌద్ధత్య మూని
మనల దారిద్ర్యులని చూచి మదిని రోసి
కలిమిగల కౌరవుల మెచ్చి కన్య నిచ్చెఁ
బేదతన మిట్టిదియెగాఁ బృధ్విలోన ౧౨౯

శా చాపల్యాంకుర మార్తికారణము భాషావ్యత్యయప్రాప్తి దు
ర్వ్యాపారాశ్రయ, మాప్తదూషితము, దైన్యాలాపజన్యంబు, హృ
త్తాపోపస్మృతి, బంధుసౌహృదవిఘాతంబైన దారిద్ర్య మి
ట్లాపాదించిన మిత్రులైన నెడసేయం బూను టాశ్చర్యమె ౧౩౦

కం. ఘనులగు పాండవు లిచ్చటి
కనుమానింపకను మనల నంపెడివేళన్
వనమునకు వారితో మన
మనుగమియించక వసించు టనుచిత మయ్యెన్ ౧౩౧

కం చేటెఱుఁగని పనిజేసియు
మాటల పనియేమి - దిక్కుమాలినగతి ని
చ్చోట వసింపఁగ నేటికి
నేటగు నాయాశలన్ని నేటికి దీరెన్ ౧౩౨

కం అని జనని దెలుపతనలోఁ
దను గనలుచు సవ్యసాచితనయుఁడు రోషా
ననజనిత ఘనతరోచ్ఛ్వా
సనిరూఢసభీషణోగ్రసముదగ్రగతిన్ ౧౩౩

తే గీ దండతాడితమౌ మృగేంద్రమ్ము లీలఁ
బదహతంబైన గృష్ణసర్పంబు పగిది

ఘృతవినిక్షిప్తపావకాకృతిని గెరలి
ధీసిద్ధక్రోధజాజ్వల్యమానుఁ డగుచు ౧౩౪

శా. ఏమేమీ బలభద్రుఁ డిట్లనియెనా! హీనోక్తి - మాయయ్యలా
ధీమత్పాండుసుతప్రధానములు ఋద్ధిం దల్పలేదేమొ మ
త్సామర్థ్యం బిదె చూడు యాదవకులధ్వంసంబు గావించి - సు
త్రామాద్యష్టదిగీశు లడ్డుపడినం దర్జించి భర్జించనే ౧౩౫

కం. ధరణీతలముం గ్రుంకిన
హరిహరచతురాననాదు లడ్డంబైనం
గిరులుం బొరలిన యాదవ
విరహిత మొనరింతుఁ జూడు విశ్వం బెల్లన్ ౧౩౬

మ బలుఁడే గాదు కృతాంతుఁడైన యెదుటం బ్రాపించినన్ మద్భుజా
ర్గళ సాటోప ధనుర్విముక్త బలవత్కాండ ప్రచండానలో
జ్జ్వలకీలాహతి ద్వారకానగర శశ్వజ్జంతుసంతానమున్
శలభప్రాయముగా నొనర్చెదను మత్సామర్థ్యముం జూడవే ౧౩౭

మ భువినాతోడ నెదిర్చి బాహుబలిమిం బోరాడఁగా నోపు శూ
రవరేణ్యుం బరిమార్చి సంగరజయారంభేందిరన్ రేవతీ
ధవపుత్రీమణి నొక్కలగ్నమున నుద్వాహంబు గైకొందు - యా
దవులుం గీదవు లెందు డాగెదరొ చూతా మంచు నత్యుగ్రుఁడై. ౧౩౮

సీ. మహితరోషాగ్నిధూమముపైని సుడిగొన్న
చెలువున తన కొండెసిగ వెలుంగ
దిగ్దంతితుండప్రదీప్తదీర్ఘానర్ఘ
ఘనబాహుదండయుగంబు సెలఁగ
తతపరాక్రమదేవతాదంష్ట్రిలనకప్ప
కోరమీసముల వయ్యార మమర

నడయాడు కొండపై యడరు శృంగము లట్లు
నెగు భుజంబులు చెవుల్ దగుల నుబుక

గీ. ధనువు నెక్కించి కనుల రౌద్రంబు పెంచి
సాహసం బెంచి చివ్వున చౌకళించి
శూరతను బెంచి చన నెంచు సుతుని గాంచి
దిగ్గన సుభద్ర చింతించి దగ్గఱించి ౧౩౯

కం. అన్నా తామసి తామసి
యన్న వినీతిని దలంప వత్సాగ్రుఁడవై
యున్నన్ మాన్పగ వశమే
సన్నుతరణశూర ! సవ్యసాచికుమారా ! ౧౪౦

ఉ. కౌరవులుం దురాత్మకులు గావున వారికి వశ్యుఁడైన యీ
సీరికుమారినే సతిగ జేకొనకున్న గొఱంతయౌనె - శృం
గారగుణాభిరామ లగు కన్నియ లెందఱు లేరు తండ్రి - ని
ష్కారణవైర మేల - నుడుగందగు నింతటనైన బుత్రకా ! ౧౪౧

శా. ఏలోకంబులయందునైన గలదే యిలాంటి దుష్కృత్య మి
త్తాలోగ్రాకృతి మేనమామలపయిం దండెత్తి ఖండింప నీ
లీలం గూడదు తండ్రి కన్నియను వెల్మి న్నీకు నీకుండినన్
మేలాయెం జనదూష్యమైన పని సుమ్మీ కోపమే పాపమౌ. ౧౪౨

చం అనుచు సుభద్ర కూర్మి తనయాగ్రణి చేతులుబట్టి భీతిమై
తనువు వడంక గద్గదికత న్వచియించు వినీతి బోధనో
క్తిని నిశితాంకుశంబులగతిం దగి మత్తగజంబురీతిగా
వెనుకకు ద్రొక్కి తామసముఁవీడక నిట్లనె తల్లితోడుతన్ ౧౪౩

మ. ధరణీభోగములెల్లఁ బోవిడిచి మాతండ్రు ల్మహారణ్యసం
చరులై పోవ పిఱుంద నీవు జననిచ్ఛన్లేక మీయన్నలా

దరతం గౌరవ మెంతురం వని ప్రమోదం బంది పుట్టినింట నీ
కరణిన్ నిల్చుట చుల్కఁజూడరె మహాగర్వోన్నతుల్ యాదవుల్ ౧౪౪

కం. అమ్మా కోపము వలదని
నెమ్మదిలో నీకు దోఁచెనేని యిచటి పై
న్యమ్మనకు నోర్చి నిలువు, ము
దమ్మున నే జనెదఁ బాండుతనయులకడకున్ ౧౪౫

మ. అనినం గన్నుల బాష్పము ల్దొరుగ మాయన్నా! పతిం బాసియై
నను నిక్షేపమురీతి నిందలఁచి యిన్నాళ్లిచ్చటన్ నిల్చి తిం
కను నీవే గన రక్షణం బయిన శక్యం బౌనె నీవెంటనే
జనుదెంతు న్మది సమ్మదమ్మున ధనుర్జ్యావల్లి సల్లింపవే! ౧౪౬

కం. అని కొంత వంత దీఱఁగ
జననీమణి బల్క నతఁడు సమ్మతిగొని ద
త్క్షణ మర్ధరాత్రి వేళం
దన వెంటం దల్లినడువఁ దత్పురి వెడలెన్ ౧౪౭

కం. భూపాల యేమి జెప్పుదు
నాపార్థసుతుండు శరశరాసనయుతుఁడై
కోపాగ్నిశిఖలు వెడల వి
రూపాక్షుని రూపమున నుఱుప్రథ నణిఁగెన్ ౧౪౮

మ తనయునితో సుభద్ర వెసుదొలుచు నేఁగుచు నించుకేనియుం
జనకుని దల్ప దన్నల ప్రశంసం నెన్నదు, తల్లినైన బే
ర్కొనదు- మహాంధకారమునకున్ భయపుందదు, రాచకూతు నె
మ్మనమున వెగ్గలం బగుచు మార్కొనురోషరసం బదెట్టిదో! ౧౪౯

తే గీ ఎండకన్నును నీడక న్నెఱుఁగకుండఁ
బాదముల ముద్దరా లొత్తఁ బరగుసతికి

ఎండకన్నును నీడక న్నేకమగుచుఁ
బాదముల ముద్దఱా లొత్త పధిగమించె ౧౫౦

కం. ఈరీతి నర్ధరాత్రిని
ఘోరాటవిలోన జొచ్చి కొడుకుం దాన
య్యేఱులు పల్లేరులు న
ల్లేఱులుఁ బొదలెల్ల గడచి యెఁగెటివేళన్ ౧౫౧

గీ. సతతవంశానువర్తనోన్నతయశునకు
సతతవంశానువర్తినోన్నతి లభించె
వితతసద్విజనికరానువృత్తునకును
వితతసద్విజనికరానువృత్తి గలిగె ౧౫౨

చం చని చని కాంచె ముందట రసాల, తమాల, విశాల సాల, చం
దన, కృతమాల కౌశిక, రథద్రు, కపిత్థ, కురంట కాభయా
ర్జున, వకుళామ్ల, పీతనఖరోపసతాల, కదంబ, నింబ, కాం
చన, కరవీర, వీర, జల, జైత్ర, వట, ప్రముఖద్రుమావళుల్ ౧౫౩

ఉత్సాహ రాకుమారశేఖరుం డరణ్యభూమి గాంచె భ
ల్లూకము ల్వనౌకము ల్జలూకము ల్బలాకముల్
ఘూకము ల్మహాకులోగ్రకోకముల్ నిహాకముల్
దాకిమూఁకలై చికాకు దాకొనంగ బైకొనెన్ ౧౫౪

కం. ఈరీతి జనగ చనగా
తూరుపు తెలతెల్లవారెఁ దోయజముకుళా
గారములు వెడలె మధుపము
లారవి యుదయాద్రిశిఖర మధిరోహించెన్ ౧౫౫

చం. అపు డభిమన్యుఁ డగ్గిహసమంచిన హల్లకతల్లజస్ఫుర
ద్విపులసరోవరంబు గని వేగమె తత్తటమం దహర్ముఖా

భ్యుపచితకృత్యము ల్గడపియుం జననీమణి తానుగొంత పా
పపువిధి దూఱుచుం ద్వయితవస్యపదభ్రమణానుతాపియై ౧౫౬

చం జనకులు నుండు వొప్పెఱుఁగజాలక గాఢతరుప్రకీర్ణకా
ననగతసింహభల్లహరిణవృకశంబరశల్యముఖ్యస
త్వనికరఘూర్ణితధ్వనులు తల్లికి దల్లడమంద మామజే
సినయవమానశల్యమది చిత్తము పెక్కగెలం బెకల్పఁగన్ ౧౫౭

మ. విలునమ్ముల్ధనజోడుపీరులుగ హృద్వీథి న్మహాధైర్యని
శ్చలుఁడై కాఱుపొదల్ నదుల్ విపినముల్ శైలంబులుం దాటి య
వ్వల నొచ్చోట ఘటోత్కచాశ్రమము క్రేవన్ గండభేరుండసిం
హలులాయవృకశంబరాద్యఖిలసత్త్వార్భాటఘోరాటవిన్ ౧౫౮

మ. తనయునితో సుభద్ర జవతం గమియింపఁగలేక సుస్వరం
చని యడుగుల్ దడంబడ ముఖాబ్జము బిట్టుగలంగఁ జెమ్మటల్
బెనఁగొని దప్పిచే గళపశింపుచు-నిద్దుర మేనదూగఁగా
గని యభిమన్యుఁ డవ్యవధిగా జని యొక్కసరస్తటంబునన్ ౧౫౯

కం. చల్లనితోయంబులు తన
తల్లికి దాహంబు లిడి లతాకుంజములన్
మొల్లమగు మృదులతలమున
బల్లవము ల్విరులు పాన్పు బఱచి ప్రియమునన్ ౧౬౦

కం. పవళింపఁజేయు తనయుని
సవినయసకలోపచారసౌఖ్యంబులమై
నెవదీఱి కంటనిద్దుర
దవిలి వసింపఁగ మనోవ్యథాకలితుఁడై ౧౬౧

మ. అకటా! దైవనియోగముం గడప శక్యం బౌనె గాంచన్న నే
నొకటిం దల్ఁగ దైవ మొండొకవిధిం బూహించె తాలాంకపు

త్రికపై మోహవిదాహతం బొరలు చింతేగాని తద్భోగ మిం
చుక చేకూరని హేతువన్ జనని కిచ్చె వెచ్చనూర్పంబడెన్ ౧౬౨

కం. అహహా! యీ బలుకోనల
బహుళవ్యథ గ్రుక్కె గమనభరమున నేఁడీ
మిహిరాకరాస్య నెటువలె
గహనంబున ద్వైతవనముకడ జేర్పనగున్. ౧౬౩

తే.గీ మామ ననుజేయు యీయవమానమునకు
తామసంబున వెడలునంతనె పిఱుంద
యేటి కరుదెంచె యీమృగార్భాటములకు
మనునె యీరాత్రి సుమసుకుమారగాత్రి ౧౬౪

సీ పదములఁ గర్కశోపలము లొత్తిన వేళ
సొటసొటబోయి నెత్తుర్పరని గ్రుక్కు
మిటమిట నెండలొక్కట మిక్కుటంబైన
మిగులపెందగల నెప్పగల నొగులు
బెడిదంపు వడగాడ్పు లుడుకులై యెదురెక్క
సుడిఁబడి యక్కడ దక్కడనె నిల్చుఁ
బెల్లాకటను దల్లడిల్లి పెల్లున బేలి
బహుళమార్గాయాసభరము జెందు

గీ నిట్టి సుకుమారి నెటువలె నెట్టుకొనుచు
నడచి కౌంతేయులున్న వనంబు గాంతు
నని వితర్కించు ధైర్యంబు ననుకరించుఁ
దల్లి నెతలెంచ మదిలోన దల్లడిల్లు ౧౬౫

సీ. రమణీయమందిరారామసౌఖ్యము మాని
ఘోరాటవులను సంచార మొదవె
కేళీసరోవరక్రీడాసుఖము వీడి
పంకాలవాలవిభ్రమణ దవిలె

కమనీయతరతూలికాతల్పముల డించి
చటులశార్కరిలమాశయ్య గలిగె
కాంచనమయడోలికానిద్రలు దొలంగి
కంటకవల్లికాకషణ మొదవె

తే.గీ. శారికాపికశుకరవశ్రవణ దొలఁగి
కఠినతరఝిల్లికారవాకర్ణన దగె
నహహ విధికృత్య మింక నేమనఁగవచ్చు
మామజేసిన యపకృతి వలన మాకు ౧౬౬

మ. అనుచుం బెక్కువిధంబులం జనని మార్గాయాస మూహించి యం
తనె ధైర్యంబు ఘటించి వన్యమృగసంత్రాసప్రదోద్యద్ధను
ర్గుణరంకారమహాధ్వను ల్దిశల బెక్కు ల్మ్రోయ సన్నద్ధమా
ర్గణుఁడై తల్లికెడ న్వసించి శశిరేఖం జిత్తమం దెంచుచున్. ౧౬౭

ఉ. హా విమలాంగి! హా లలన! హా మధురాధరి! హా శతోదరీ!
హా వనజాతనేత్రి! దరహాసముఖీ! హరిమధ్య! హా సతీ!
హా విరిబోణి! హా రమణి! హాతరుణీ! శశిరేఖ-నేడు నన్
హా విడనాడితే యహహ! హా! విధి యింతగ హాని జేసెనే. ౧౬౮

ఉ. పిన్నతనాననుండి యొకపెన్నిధిగన్క సమున్నతోన్నతిం
గన్నియ నిన్ను మిన్నగొని కన్నెదనంబును వెన్నుదన్ని వై
సెన్నఁడు వచ్చునంచు మదినెన్నుచు నున్న విపన్ను నన్ను నీ
క్రొన్నన వింటిమన్నె పయిగొన్నను కన్నెడసేయ న్యాయమే! ౧౬౯

మ. మదనాయాసము తెల్ల దెల్పి చెలి నన్ మన్నించుమంచు న్మహా
పదచే మ్రొక్కఁగ నన్ను నెత్తి కుచకుంభంబు ల్వడిం గ్రుచ్చి క్రొం
బెదవిం బానక మిచ్చి నాకొఱకు నొప్పిం జెందితో నాథ!యం
చు దయాదృష్టిని మేను చేనిమిరినన్ సొక్కించు టింకెన్నఁడో ౧౭౦

ఉ. మామకహృత్ప్రభేదియగు మారునకుం గడుమిక్కుటంబులౌ
కోమలిగబ్బినిబ్బరపుఁ గుబ్బ లురమ్మున గ్రుచ్చి కౌఁగిటం

బ్రేమ ఘటించి నావగల బెం పణఁగించి సుధాధరంబు చే
వేమరు లంచమిచ్చి యరవింపదళాక్షి రమించు టెన్నఁడో ౧౩౧

సీ. చేగొనుమని బండుటాకుల మడుపుల
నధరంబుపై జూపి యాస గొలిపి
యది గ్రహించుటకు నేగదియగానీ కను
గికురించఁ బౌలయల్క గినుకనెవ్వ
గలఁ బొందు నన్ను జెక్కిలిగొట్టి బలిమిచేఁ
దమి బెనంగ జెలంగి తమఁ మిచ్చి
మొనపంట చుఱుకంట మోవినొక్కుచు గబ్బి
గుబ్బ లురమున జేర్చి గుస్తరించి

గీ. యేలరా నన్ను యీకోపమేలరా యు
టంచు మదనుని ధైర్యంబు లెంచి మించి
మమత రెట్టించి మన్నించి మడిగరంచి
యించు విలుకేళి నన్ను లాలించు టెపుడొ ! ౧౩౨

కం. మాకులమున కాద్యుం డగు
రాకాశశియే నిరాదరంబున బ్రేల్చెన్
లోకమున బలిమి జెడిన న
హా కూరిమి బంధువర్గ మహితు ల్గారే ! ౧౩౩

మ. అని చింతించిన యంత సంతటనె ధైర్యం బుంచి ప్రోద్యద్ధను
ర్గుణనాదంబున దల్లికి న్నిదుర మేల్కొనానాకో యంచు ద
వ్వున దాసిల్చి మదేభసింహశరభవ్యూహంబులం జేరనీ
కను బాణాసనబాణము ల్గొను మ జాగ్రద్భావుఁడై నిల్చినన్ ౧౩౪

ఉ. అంతట ద్వారకానగరమం దభిమన్యుసుభద్ర లిట్టు ల
త్యంతవిషాదచిత్తమున నర్ధనిశీధి నరణ్యగాములౌ
టంతయు పౌరులుం జనకుఁ డంతిపురంబన సత్యరుక్మిణీ
కాంతలు విన్నమాత్రమున గళ్వళమందుచు శోకమగ్నులై ౧౩౫

తే. గీ. అయ్యయో! మున్ను పతిబాసినప్పుడైన
వెతల నెఱుఁగని యిమ్మానవతికి నేఁడు
దుర్గమంబైన కాంతారమార్గములను
కొడుకుతోఁగూడి వెతలెట్లు గుడిచె నొక్కొ ౧౨౬

సీ. నెలఁతవాల్చూపు లేణీదృశంబు లటంచుఁ
బెబ్బులుల్ పైబడి బెనఁగెనేమొ!
కోమలిపాలిండ్లు కుంభికుంభములంచు
బెఱకి సింహములు పైకుఱికెనేమొ!
పడఁతియూరువులు రంభాస్తంభము లటంచు
వేదండములు ద్రుంచివేసెనేమొ!
లేమజంఘికలు శాలీగర్భము లటంచుఁ
గ్రోడము ల్గవిసి కోలాడెనేమొ!

తే. గీ. తోడెవరులేక పసిబిడ్డతోడ నఱిగె
నహహ గుణవతికింత ఘోరార్తి గలిగె
నేమిసేయుద మేమంద మెందు గంద
మక్కటా! యింతజేసెనే హలధరుండు ౧౨౭

వ. అని యనేక ప్రకారంబుల న్విలపించుచు సద్గుణవతియగు
రేవతిం జూచి యిట్లనిరి- ౧౨౮

చం. తగునటనమ్మ మేనఱికధర్మము లుండఁగ లౌకికంబులం
దగవు లెఱుంగనట్లు మఱద ల్నిఱుపేద యటంచు నాథునిం
దగ నెసగొల్పి యిల్వెడలుదాక గలంచితి రాడుబిడ్డ ని
ట్లగడుపడంగ ద్రోచి సుత నన్యులకీయగ కోర్కె గల్గెనో. ౧౨౯

మ. అదిగాక న్మమను గూఁతు నిత్తునని సత్యాలాపము ల్కొన్ని- మా
యెదుటం బల్కుట లింతలో మరచి నేఁడీతుచ్ఛకౌరవ్యసం-
పద కాశించి యనన్యమాన్యుఁడగు సౌభద్రుం దనర్హుండటం
చదయాక్షిన్ నడురేయి కాఱడవిపాలై ద్రోయఁగా పాడియే, ౧౩౦

చ అని తపకర్ణశూలముగ నాడెడి రుక్మిణిసత్యభామలం
గనుఁగొని రేవతీరమణి గాద్గదికన్ వచియించె నయ్యయో!
మనమున మత్కుమారి నభిమన్యున కీయక నన్యరాజనం
దనున కొసంగువార్త శతధా కలనైన నెఱుంగ నక్కటా! ౧౮౧

కం భూనభము లగ్రసాక్షిగ
నేనెన్నం డిట్టివార్త లెఱుఁగను నసుమే
ల్పోనాడి నిందసేయఁగ
మీ నో రెట్లాడెనమ్మ మెలఁతుకలారా! ౧౮౨

కం ఏ భామతోటి సాటిగ
మీబావ మదాజ్ఞమేరమీఱినడువఁ డే
మో భామలార మీమది
నాభావమెఱింగి దెప్పనగునటనమ్మా ౧౮౩

చం మదనసమానమూర్తి యభిమన్యుడె యిల్లిటపల్లుఁడంచు- నె
మ్మది ముద మందుచుండి యొకమాయనెఱుంగని నన్ను నూరకి
ట్లదయమతిం గతాగతము లన్నియెఱింగి యెఱుంగనట్లు- నా
కిది యొకలేనిపాపముల నిట్లొడిగట్టకుఁడమ్మ క్రొమ్మెక్కెదన్ ౧౮౪

కం దవిలిన బాంధవ్యము విడి
యవివేకముతోడ కన్య నన్యులకొసఁగన్
ధవుని కిటు బోధజేతునె
యువిదల పుట్టింటియాశ లొక్కటిగావే! ౧౮౫

కం అని పలికి బాష్పభరితా
ననయై శోకింపుచున్న నాతి వినిర్ధో
పనిరూఢభావముం గని
వనితలు చెలిఁగూడి వెతలువడుచున్నయెడన్. ౧౮౬

ఉ. అంతిపురంబునందు చెలులందఱు లొక్కట గుంపులై, ప్రలం
బాంతకుఁ డాకురుక్షితివరాగ్రణిపక్షముగాన కూతు న

క్కంతుసమానుఁ డల్లుఁడుకుగాదని లక్ష్మణనామధేయుఁ డ
త్యంతహితుండుగాఁ బరిణయం బొనరింపు దలంపుబూనుటన్. ౧౮౭

చం చెలియలి నిందసేయుట కృశింపుచు నాసతిపట్టితోట ని
ల్వేలువడి దుర్గమాటవులవెంట గమించుట నేటరేపటం
దలఁపడి లక్ష్మణాఖ్యునకు దన్నునొసంగెడివార్త లించుకన్
వెలఁదులచే నెఱింగి మదివేదనతో శశిరేఖ యిట్లనున్. ౧౮౮

చం ఇది యొక వింతబుట్టె బలుఁ డింతటిదాక సహోదరీసుతున్
మది నొక పెన్నిధానము సమానము జూచి మదుద్వహంబు సొం
పొదవఁగ వానికే శుభమహోన్నతి జేతునటంచు బల్కి నేఁ
డిది కడఁద్రోచి యీధనమదాంధసుయోధనసూతి కిచ్చినం
బదఁపడి ప్రాణమైన నెడబాసెద నయ్యభిమన్యు బాతునే! ౧౮౯

చం. పరమదయాళుఁడైన హరి పాండవపక్షుఁడె గాన సీరి యా
హరివచనంబు మీఱఁడు యథార్థముగా నభిమన్యుఁడే నసుం
బరిణయమంద గూర్చు ననుభావముచే నొగిబాయలేని సం
బరమున నుండు నన్ను నెడబాపునొకో విధి నేఁడు దైవమా! ౧౯౦

చం తలఁపగ పాండవేయు లతిధర్మవివర్ధకు లందులో మహా
బలుఁ డభిమన్యుఁ డంగజితపంచశరుం డదిగాక వానిపై
తలఁపువహించి యేను బ్రాఁకుదంబున నుండ బలుండు నేఁడు కే
వల మవినీతబుద్ధిఁ బెఱవారల కీయదలంచె నక్కటా! ౧౯౧

మ మతిలో కొండొకనాటనుండి యతిప్రేమ ల్మీర మాలోనమే
మతికౌతూహలవృత్తుల న్మెలఁగ తాలాంకుండు దుష్కృత్రిమా
న్వితుఁడై వానికొసంగ సమ్మతిలక న్వేరొండు నూహించె నా
బ్రతుకుం గోరి సుఖించుకంటె బలవత్ప్రాణాంతమే మేలగున్ ౧౯౨

కం మాట లిక జల్లుపొల్లులు
కోటి యసం దగదు వానికూటము విడువన్

యేటితా నీటితా త్రాటితా
నేటితా తోటిసతు లఱయ నెమ్మత నౌదున్ ౧౬౩

మ అనుచుం గన్నులుమూయు విప్పు తడబాటౌ పొన్నునం బండు లే
చును గూర్చుండు నగుం భ్రమించుఁ దలయూచుం దత్తరించుం జలం
బునలో నున్సు రటంచు బెగ్గిలు నభంబుం గౌఁగిలించున్ మనో
జనితాంతవ్యథబూని మత్తగజహస్తగ్రస్తపద్మాకృతిన్ ౧౬౪

కం అంతటిలోపల దనుము
న్నంతిపురంబునను బెంచినట్టి చిలుక య
క్కాంతవెతదీర్ప పచ్చల
బంతివలె న్వ్రాలె నంసభాగముమీఁదన్ ౧౬౫

ఉ పిన్నతనంబునుండి తనుబెంచిన ప్రేమ జెలంగఁబక్కెనో
వన్నెలచిల్క నీవిపు డవశ్యము నాయెడ కేఁగుదెంచు మే
లెన్నదరంబె దీనికొాక హేతువు నామదిలోని కోరికల్
ము న్నభిమన్యుపైఁ గలుగు ముచ్చట లిచ్చట నీ వెఱుంగవే. ౧౬౬

ఉ అందున నొక్క వింత ముసలాయుధుఁ డాకురురాజుహాతికా
సంచమునొంది నన్నతనినందను కీయఁగ కొంతసమ్మతిం
బొందుట మన్మనోహరునిపోం దెడలించుట దానజేసి పౌ
రందరసూతి చింతిలి యరణ్యము కేఁగుట వింటి కీరమా ! ౧౬౭

ఉ శైశవవేళగూడిన ప్రశంసలు మాటికి నెన్నుచున్న నా
యాశలు నేటితో విఫలమౌ తఱిగగ్గెను నేఁటికైన ప్రా
ణేశుని చెంత కీవు జని యేననినట్లు పచించి నేఁడు నా
గాసి సడల్ప్రి నావిభునిగైకొని రాగదె నీకు మ్రొక్కెదన్ ౧౬౮

ఉ ఉత్తముఁ డన్నివిద్యలఁ బ్రయోజకుఁ డుజ్జ్వలరూపశాలి లో
కోత్తరసద్గుణాఢ్యుఁడు మహోగ్రబలుం డదిగాక నాకు మే

నత్తకుమారుఁ డంచు హృదయంబున నమ్మిన నన్ను పాపపుం
జిత్తజుబారిబాపుమని చిల్క మృదూక్తుల జిల్క బల్కవే ౧౯౯

కం తానెత్తఱి జనుదెంచునా
కో నుత్తమకుసుమశయ్యా నొయ్యన దనతో
నే నత్తమిల్లి యెన్నఁడు
మేనత్తసుతుం బెనంగి మేనెత్తుదునో! ౨౦౦

సీ మదిగుట్టు జెడనీక నిదురింతమని జూడ
దడదడగుండెలో దల్లడిల్లుఁ
దల్లడం బుడుప నంతటలేచి పచరింప
నట్టె వెన్నున నెట్టి నట్టులౌను
నటులాయెనని గన్ను లఱమోడ్చి కూచున్న
తనుదానె మేన్గుదించినట్టు వడకు
వడఁకుచో మైకొంతవడికి యూరటజెంద
సివమెత్తినట్లనే చిత్త మడలు
తే గీ సడలుటయెగాని యొకవెట్టికైన గొంత
వడికిని వివేకమును మహావనధిబడిన
హాని కొక నావయును దైవవశత నొదవు
గాని నారీతి దుర్నీతి గాననైతి ౨౦౧

ఉ ఇన్ని వచింపనేల నిక నెన్ని యుపాయములైన బన్ని - నే
నన్నవిధమ్ము లన్ని దెలియ న్వరనాధుని కూర్మి రంజిలన్
విన్నప మాచరించి యతివేగమె ద్వారక జేరఁ జేర్పు - నీ
కన్న మదాప్తు లెవ్వరను గానను మాటికి మాటలేటికిన్ ౨౦౨

కం. మరు నంప చిచ్చుఱకు - నే
కరణిం బ్రాణములు నిల్పగల నీవైనం
గరుణించు మిక 'నహింసా
పరమో ధర్మ' మను శాస్త్రపద్ధతి వినవే! ౨౦౩

కం సకలోపయుక్తుల న్నా
నికి నాకొనగూర్చు నేర్పు నీవెఱుఁగవె - యిం
కొక నూరు కల్లలాడిన
నొక పెండ్లియొనర్ప ధర్మమున్నది చిలుకా! ౨౦౪

తే గీ వాని నెందేని వెదకి తేఋానితేని
ప్రేమ నీకును నీకులస్వాములకును
జానకంబును వడపప్పు పంచదార
బంతి సాగించి విం దొనరింతు చిలుక ౨౦౫

చం ఉపమగ నిట్లు బల్కి పినయోక్తుల కాపక మీయకొన్న దై
రెపరెప ఱెక్కలార్చియు పరిభ్రమణంబున గొంతసేపు న
చ్చపలమృగాక్షికిం గమనచాతురిజూపి యతిత్వరం జనెన్
విపులమహాటవిన్ గగనవీధిని నయ్యభిమన్యుపాలికిన్ ౨౦౬

చం చని యొకచో నికుంజసుమశయ్యను నిద్దురజెందు తల్లిచెం
తను ధనురంబకింబుల నుదగ్రగతిం గొని యుజ్జ్వలద్ధను
ర్గుణరవ ముగ్రసత్వముల గుండెలు వ్రక్కలుఁగా బెకల్చు - ఫ
ల్గుణసుతు నొక్కచెట్టు కొనకొమ్మననుండి గనెం బ్రియంబుగన్. ౨౦౭

గీ అంత నొక్కింత తడవు నవ్వింతచిలుక
జూచి చేజాచి యాసవ్యసాచిసుతుఁడు
పట్టి సమకట్టి మది కోర్కెలట్టెబుట్టి
పొంచి హర్షించి మించి వర్ణించఁదొడఁగె ౨౦౮

కం. ప్రతిలేని చిలుక యిది-భా
రతిచేగల శుకము లేక రతిచే శుకమో
సతతము మాశశిరేఖా
సతిచేతిశుకంబొ కాక సతిచేశుకమో! ౨౦౯

కం. అని పొంచి పొదలమాటున
తనువొంచి తదేకదృష్టి దగనుంచి జిష్ణు

క్కున చౌకళించి తనుజా
చిన వెయ్యంకించి యొడిసి చిలుకం బట్టెన్ ౨౧౦

కం పట్టుబడి జాతిచేష్టల
నిట్టట్టుం గొట్టులాడి యెట్టనకను రా
పట్టు పనిదిట్ట పలపఁగ
బట్టిన గుట్టునను మనుజభాషల ననియెన్ ౨౧౧

కం పక్షులవంటి మముం గృప
రక్షింపుమటన్న నృపులు రక్షింపరె - నే
సాక్షాత్పక్షిని గద - నీ
వక్షమమతి బట్టుకొన ననర్హముగాదే ౨౧౨

సీ సర్వకాలం 'బహింసా పరమో ధర్మ'
మని బల్కు శాస్త్రంబు లవియు వినవె
నిరతంబు 'పాపాయ పరపీడన' మటంచు
తెలివి జెప్పుటలు బుద్ధిని దలఁపవె
సతతమ్ము 'నాత్మవ త్సర్వభూతాని' యన్
ధర్మవర్తనల పద్ధతులు గనవె
సుప్రసిద్ధిగ 'నధర్మః ప్రళయం యాతి'
యని నీతికోవిదు లన నెఱుఁగవె

గీ. హింస కుభయుంబుఁ బరపోవ చేచ్చు - భూత
సమత ధర్మానుకూల నాసక్తి గలుగు
నీవు నను బట్టినట్టి దుర్భావమేమి
ధన్య యభిమన్య సకలరాజన్యమాన్య ౨౧౩

కం, అని వినయ మెనయ బలికెటి
తనచేతిశుకంబు మేను దగ నిమిరి చురు
క్కని మనము గిలఁగి యిట్లను
దనదు వచోనిచయమమృతధారలు గాఁగన్ ౨౧౪

కం నీ పుట్టు మొదలు దెలియక
జేపట్టితి నింతెగాని చిలుకా యికనే
నేపట్టిన నీపట్టున
పాపం బించుక దలంచి పట్టుటగాదే! ౨౧౫

తే గీ ప్రేమచే వ్యాసనందన పేరు మోసి
యాదిలక్ష్మీ సుతునకు వాహనమ వగుచు
ఘనతరులఁ గూడి ఫలలాభమున జెలంగు
శుకవతంసమ నిను హింసఁ జొనుపఁ దగునె ౨౧౬

చం. అన విని యాదరోక్తు లిటులాడెడు నయ్యభిమన్యుతో శుకం
బనియె- నృపాగ్రణీ భవదుదంచితబుద్ధికి సంతసించి- నీ
మన మరయంగ నేననెడి మాటలమాత్రమెగాని నీప్రియాం
గన శశిరేఖ బెంచిన శుకంబను నిన్గన నేఁగుదెంచితిన్ ౨౧౭

తే.గీ. ఇంతి యంతంత కుంది లతాంతకుంత
తాంతసంతాపచింతితస్వాంత యగుట
లింత గానక యిటుల నేతెంతురయ్య
యింతవాఁడవు తగుదువీ వెంతకైన ౨౧౮

కం బెండంతపనికి నీవాక
కొండంత న్మదినిబెంచుకొని వచ్చినచో
చెండాడకున్నె మరుఁ డతి
చండాలులతో మెలంగు సాహసిగాడే! ౨౧౯

కం. నరవర నిను మది దలఁచిన
తరుణికి రణమయ్యె పరభృతధ్వనులు- నిశా
చరుఁ డయ్యె కుముదమిత్రుఁడు
మఱిమఱి పెనుసోఁకుఁ డయ్యె మరుదంకురముల్ ౨౨౦

సీ ఒకవేళ మరుశరాళికి భీతిని వడంకు
నొకవేళ శశిదీప్తి కుడ్డుగుడుచు
నొకవేళ తనుదానె యున్స్మరించని స్రుక్కు
నొకవేళ సఖుల జీరక నదల్చు
నొకవేళ భవదాకృతికి చిత్తమున మెచ్చు
నొకవేళ తనుసుఖాప్తికిని రోయు
నొకవేళ ప్రాణముల్ బెకిలించ నూహించు
నొకవేళ జనకు నూరక శపించు

గీ నొక్కవేళను తనమేడ నెక్కి నిక్కి
నిక్కి నీరాకగోరి నల్దిక్కు లరయుఁ
బిన్నతనమున మీరున్న పన్నెలెన్ని
కన్నెతమి గొన్న చిన్నె లెన్నెన్నొ గలవు ౨౨౧

చం ఎవరికి దెల్పరా దనుచు నింతి మనోవ్యధచే గలంగు- నిం
కెవరికి దెల్పకున్న గతి మట్లని చింతిలు- తెల్పవారు వా
రెవరి కెఱుంగజేసెదరొ యిట్టి వినిష్ఫలితప్రచింతనల్
విపర మెఱుంగరంచు ధృతివీడును యెప్పుడు వేడు దైవమున్ ౨౨౨

గీ. అతివ తపియించు విరహాగ్ని కౌషధంబు
నిదు ముఖబింబపూర్ణచంద్రోదయంబు
నీకుగల్గు వియోగరుఙ్నిచయ మణఁప
తరుణిమధురాధరంబె చింతామణియును. ౨౨౩

ఉ అంగన నిన్ను చిత్రపటమందు లిఖించు- లిఖించి కోర్కెలు
పొంగఁగ జూచుఁ జూచి పలఁపుంగొని మెచ్చును- మెచ్చి నీపరి
ష్వంగమె గోరు- కోరి పలవంతలఁ జింతిలు- చింతిల న్మన
స్సంగతి నూర్చు- నూర్చి సరసంబు విసంబుగ దా గనుంగొనున్ ౨౨౪

ఉ. ఇంతి భవద్వియోగదశ కే పిఁపింపఁగ నంతకన్న న
త్యంతవిషాదసంజనకమైనదిగాదె- సుయోధనాత్మజుం

డింతటిలో వరింపఁగలఁ జెల్లి వివాహ మటంచు వార్త వి
న్నంతనెగాన నీవు క్షణమాలసింపక హితంబుగా వెకన్. ౨౨౫

కం. కౌరవవారము నీశర
ధారాసారమున బాఱదరిమి యశోవి
స్తారమున రేవతీసుత
సారసలోచనను రాక్షసమున గొనఁదగున్ ౨౨౬

చం. అని సకలంబుఁ దేటపడ నాడు శుకంబును జూచి బల్కె- నో
వనజశరాశ్వరత్నమ ? భవత్కరుణన్ శశిరేఖ సేమమున్
వినఁబడె నింక నా హృదయవేదన నేమని చెల్ప నేఁటికై
నను నినుగాంచు కారణమునంపను నిల్చిన చింతె మేలగున్ ౨౨౭

ఉ. ఎన్నడు రాణివాసమున నింతి వసించెనొ- నాఁటనుండె య
త్యున్నతమోహవేదనల నొంద సుయోధనసూతి కింతలో
కన్నియ నియ్యఁగా దలఁచు కర్ణకఠోరపుదుష్టవార్త నే
విన్నదిగా మొదల్ హృదయవేదన నేమనిజెప్ప కీరమా ! ౨౨౮

మ. మును నాకున్ శశిరేఖ నిత్తునని రాముం డర్థి సత్యోక్తి మ
జ్జననీరత్నము నమ్మ బల్కియుపు డాచందంబు పాధోవిలే
ఖనముం జేసి సుయోధనాత్మజునకుం గన్యామణిన్ బెండ్లిసే
యను యూహించిన వార్త విన్నక్షణమైనా నిల్తునే కీరమా ! ౨౨౯

ఉ. కావున నింకమీఁదట నఖండబలోన్నతులైన పాండుపు
త్రావలిలోన నేగలసిసంతట చూడుము యెల్లి నేఁడు దు
ర్భావులఁ గౌరవాన్వయుల భర్జనజేసి యదువ్రజంబులన్
వావిరి నొంచి రాక్షసవివాహమునన్ వరియింతుఁ గన్యకన్ ౨౩౦

చం తను నెడబాసి వచ్చిన మొదల్మరుసంపఁ కాక, కేకికా
గణముల కేక, కోకిలశుకభ్రమరంబు- ఘాక, మోషదీ

షని బలురాకి తెమ్మెరలు సోక, తదేకవిలోకనైకజృం
భణమున నున్నవాఁడ ననుమా యనుమానములేక కీరమా! ౨౩౧

చం కనకగిరీంద్ర మిట్టటులుఁగా చలియించఁగ భూనభంబులం
తనుదను దాసె దాకినను తారలు ఝల్లన నేల వ్రాలినన్
వననిధు లింకినన్ జలజవల్లభుఁ డస్తగిరిం జనించినం
దన నిక నేవరించు టిది తథ్య మటంచు వచించు కీరమా! ౨౩౨

కం ఒంగరుచిలుకా నీవలె
నింగితము లెఱుంగు జాణ లెవ్వరు నీవా
క్సంగతుల నేర్పు దనర - కు
రంగాక్షికి దెల్పు పోయిరమ్మని బనుపన్ ౨౩౩

కం. రివ్వనను యగసి చని చని
యవ్వనజాతాక్షి సౌధమందు నడిగినన్
నెవ్వగల బొగలు నచ్చెలి
నవ్వుచు చేసాచి యెదురునడచి ప్రియమునన్ ౨౩౪

కం ఓయి శుకరాజ వచ్చితి
వా! యెచ్చట గంటి వర్జునాత్మజు - నీవుం
బోయిన కార్యం బెల్లను
కాయో పండో వచింపఁగాదగు వేడ్కన్ ౨౩౫

కం. కంటివె మత్ప్రాణేశ్వరు
వింటివె తన్మధురతరసవినోక్తులు — నీ
వంటివె నేననినట్టుల
నంటివె తద్భావమరసియని కొంతపడిన్ ౨౩౬

చం అనిన శుకంబు బల్కె - భవదాజ్ఞను నాతలఁదాల్చి - భూరికా
ననము లతిక్రమించి విజనస్థలమైన ఘటోత్కచాశ్రమం

బున సుమశయ్యపై నిదురఁబోయెడి తల్లికడ న్వసించు - న
మ్మనసిజదృక్కరీరు నభిమన్యకుమారునిగంటి నక్కరో! ౨౩౭

కం కని యానతనై - నేనా
తనితో సతినీతిననిన తద్ధానే - న
న్నెనలేని నెనరుగను మన
మున గనుఁగొని యనియె వినయమును బెనఁగొనన్ ౨౩౮

చం. నిను మది సంస్మరించుకను నిద్దురలేక తపించు - తాళలే
నని భ్రమియించు - సౌఖ్యముల నన్ని త్యజించు - వియోగసాగరం
బున బడి తల్లడించు నినుబోలు సతిం గననంచు నీరు నిం
చిన కను లప్పళించు నిక జెప్పెటిదేమి కురంగలోచనా! ౨౩౯

మ ఇదిగో నేఁడె వివాహలగ్న మనఁగా నేతెంతుఁ గౌరవ్యదు
ర్మదహంకార మడంచి యాదవుల సంరంభంబు బోకార్చియ
భ్యుదయాప్తిం జయలక్ష్మితో నెనసి నిన్నుద్వాహముం జెంద - నె
మ్మది నుద్యుక్తతనున్నవాఁడ సనెనమ్మా! నమ్మవమ్మా సఖీ! ౨౪౦

కం క్రిందటినుండియు దను-నా
యందుం దనయందు నేచు నలరెడి ప్రియముల్
డెందమున మరపవలదని
పొందికగా జెప్పిరమ్మ పొమ్మని బలికెన్ ౨౪౧

ఉ కావున నీవు గోరినటుగా ఫలకాలము సంభవించె న
మ్మా విను మింక నిన్ను నభిమన్యుని యాపరమేష్ఠి దంపతీ
భావమునం సృజించుట ధ్రువంబు భవచ్ఛుభలగ్నవేళ యం
దేవిధినైన వాని వరియింతువు గాంతువు నిక్క మింతయున్. ౨౪౨

కం అని సత్కమింటయిగా - పో
యినపని వివరింప సుతుక మెసఁగగ బిలుకం

గని ముద్దుగొని ప్రియంబున
వనజాయతనేత్రి హర్షవార్ధిని దేలెన్ ౨౯౩

చం. ఇట నటవిం ధనుర్గుణమహారవమభ్రధరాతలంబు లు
త్కటముగ నిండి మ్రోయ దనతల్లికి దన్వసియించు భూపధూ
ర్జటి నభిమన్యు దత్పరిసరస్థనిజాశ్రమదుర్గమార్గప
ర్యటన మొనర్చుచుం గనె భయంకరమైన ఘటోత్కచుం డొగిన్ ౨౯౪

చం. పెటపెట పండ్లు గీటి యతిభీమపరాక్రమకంఠకాహళా
ర్భటి దశదిక్తటుల్ బెటిల బ్రద్దలుగాఁగ హుటాహుటిస్వదో
స్తటపటుధాటన ల్సెలఁగ దర్జనభర్జనజూపుచు న్నటన్
నిటలతటాక్షునిం బలెనె నిర్భయుఁడై చనుదెంచి యిట్లనెన్ ౨౯౫

ఉ. ఎవ్వఁడ వీవు నిర్భయత నిట్లడవిం బటుక్రూరసత్త్వముల్
నెవ్వగ జెంద చాపగుణ నిస్వనము ల్ప్రకటించుకొంచు క్రొం
గ్రొవ్వున నిల్చినాఁడ వెఱకున్ మదిలేక యనన్యభాజనం
బివ్వనవాటి నీవెఱుఁగవేమొ ఘటోత్కచు నాశ్రమంబుగన్ ౨౯౬

కం. నీమదిని మీఁదెఱుంగ వి
దేమొ, మదాశ్రమముజొచ్చి యెవ్వఁడు మును సు
త్రామముఖరామరాళులు
మామకబాణానలార్చి మ్రగ్గక జగతిన్ ౨౯౭

కం. తులలేని గర్వమున నొక
విలునమ్ములు బూని పెద్దపీరునిపలె నే
పొలమెల్లఁ దిమ్మరిలె దిదె
గలిగెను కాలంబు డింభకా నిను మ్రింగన్ ౨౯౮

ఉ కావున దైవయత్నమున గల్గెను నేఁడు నరామిషంబు మ
ద్భావము సంతసించెఁ బలుపల్కు లికేటికి నేఁటికూటికే

నీవనవాటి దాటి జననిత్తునె నిల్వు మటంచు బల్కనం
గేవల రోషభీషణదృగిముఖుఁ డౌచు బిరాన లేచియున్ ౨౪౯

సీ. ముఖబహిర్గతకోపశిఖిశిఖాతతు లట్లు
జతఁగొను పల్లమీసములవాని
కెరలిన ప్రళయాగ్నికిరణజాలము భంగి
రహి నించు దంష్ట్రాంకురములవాని
విలయమృత్యుంజయ వీక్షణద్యుతిమాడ్కి
మిడిగ్రుడ్ల మిరుమిట్లు మెఱయువానిఁ
గల్పాంతకాలభాస్కర పరిధి క్రియ
వికట భ్రుకుటితటాలకంబువాని
తే గీ క్రొవ్వి నడయాడు కాటుక కొండ పగిది
మేన నల్లనిఛాయలు మించువాని
భుజగమునుబోలు నొకవిల్లుబూనువాని
జూచి యిట్లనిబల్కె నారాచపట్టి ౨౫౦

శా ఏరా యెవ్వఁడవీవు మద్భుజబలాఽహీన ప్రతాపంబు నిం
దారం గానక దుర్మదప్రథితదుష్టాలాపముల్ బల్కె దే
శూరు ల్మెత్తు రనం జయించి జయముం జూపించితే చాలదే
వేరే నీవు నుతించుకోవలెనె దోర్వీరప్రతాపోన్నతుల్ ౨౫౧

మ. అనినం దైత్యుఁ డహంకృతిం గెరలి సైరా ! వీనివాగ్దైన్యమే
మనఁగావచ్చు మదీయగర్జనల కింతైనం భయంబందఁ డీ
ఘనగర్వం బరిమార్చి వీనితనువుం ఖండించి మద్భాసనం
బున వర్తించెటి భూతకోటి కితనిం బూర్ణాహుతిం జేసెదన్ ౨౫౨

వ అని తలంచి విజృంభించి యభిమన్యుం గాంచి యిట్లనియె. ౨౫౩

ఉ వేళకు కూరలేక పలవించెటివానికి వంటయింటికుం
దెలును గాంచి నట్లుబుఁగుదెంచితి వీవు మదాశ్రమంబునన్

వ్రాలిన నెవ్వఁడేని సమవర్తిపురిం దనుదానె జేరు నా
భీల ఘటోత్కచం డనెటిపేరు వినం జగముల్ వడంకవే! ౨౫౪

తే గీ. నిదురబోయెటిసింగము న్గదిమినట్టు
లట్టి నినుజూచి కోపంబు బుట్టె నాకు
నింకవిలునమ్ములును గొని బింకమునను
బ్రేలఁగానేల రమ్మని బిలువ నతఁడు ౨౫౫

కం. దనుజుండను పరుషోక్తికిఁ
గనలుచుఁ గోపంబు రూపుఁగైకొనిన ట్లం
ధనురంబకతూణీరము
లను సవరింపుచును నిట్టుల న్వచియించెన్. ౨౫౬

కం. డింభకుఁడని జూడకు నను
దంభోళి యదెంత ? భూమిధర మెంత?జయా
రంభహరి యెంత—మదన
త్తుంభీంద్ర మదెంతదొడ్డు కొంచెముగలదే! ౨౫౭

చం సమరచణుండవై నిఖిలశక్తులు గల్గినవాఁడవైన స
త్క్రమమున నీపరాక్రమముఁ గన్నులజూపుటె సాక్షిగాక-తు
చ్ఛములగు వాక్ప్రచారములు సజ్జనసమ్మత మౌనె సంగరా
ధములగు వార లీగతి వృథావచనంబులు బల్కుచొప్పగున్. ౨౫౮

మ అనినన్ రోషకషాయితాక్షుఁ డగుచున్ హైడింబు డుద్యద్ధను
ర్గుణరంకార మొనర్చి యార్చి దిశలుం ఘూర్ణిల్ల- కోలాహలం
బున నాశీవిషతుల్యశల్యముల నామూపాలువక్షఃస్థలం
బున నాటం గురిజూచి యేసె వినయంబుం బెంపు శోభిల్లఁగన్. ౨౫౯

కం. అంత నృకాంతుఁడు విలయకృ
తాంతునిగతి గెరలి పటుతరాంబకమున న

ధ్వాంతచరు నిశితబాణము
లింతింత న్శకలములుగ నిరిచియు కినుకన్ ౨౬౦

మ పటునారాచము వింటనెక్కిడి నభోభాగంబు గంపింప ది
క్తటముల్ మ్రోయ శిలోచ్చయంబుల ప్రతిధ్వానంబు గల్పింప నె
క్కట నాకర్ణతలాంతమంద గొని వీఁకన్ వ్రేయ హైడింబు హృ
త్పుటము న్నాటె మహేంద్రుఁ డద్రినిడుదంభోళిప్రభాభాసమై ౨౬౧

ఉ. దానికి భీమనందనుఁడు దల్లడమంది మహాశనీసమం
బైన శరత్రయంబు విజయాత్మజు రొమ్మున నాటనేయ రో
షానలదీప్తుఁడై బదియు నైదుశరమ్ముల నొక్కపెట్టు సం
ధానముజేసి వ్రేయ నవి దాకె ఘటోత్కచు కీలుకీలునన్ ౨౬౨

కం అందున దానవుఁ డలిగి పు
రందర పౌత్రుని భుజాంతరాళంబున - నం
చంద ఖరశరపరంపర
కొందల మందంగ నుడ్డు గుడువఁగ నేసెన్ ౨౬౩

మ అపు డామార్గణజాలముల్ తృటిని మాయంజేసి సౌభద్రుఁ డ
స్రపబాహాయుగ ముగ్రబాణముల లక్ష్యం బుంచి హుంకించి దో
ర్నిపుణత్వంబు సెలంగ నవ్యవధిగా నిర్భీతి నేసెం ద్రివి
ష్టప సంచారులు మిట్టిపాటున నఖండధ్యానము ల్సేయగన్ ౨౬౪

కం ఈకరణి నొకరి కొకరు - చి
కాకు పడ న్వేయు చండకాండ ప్రహతిం
బై కొన్న మేనిగాయఁపు
మూఁకలు జల్లెడను రంధ్రముల గతి నొప్పెన్ ౨౬౫

ఈరసము ల్దొలంగక నహీనగతిం దము దాము బోరు త
ద్ఘోరశరానలార్చి గనుఁగొన్న బగల్వలె నొప్పె రాత్రి యా

హూరులమేన నెత్తురులు జొత్తిరె నత్తజి కాననంబునన్
భూరి వసంతకాలమున బూచిన మోదుగులట్ల చిత్రమై ౨౬౬

కం. కరభుజగళచుబుకములన్
ధర గండభ్రూలలాటతల నాభికం
ధరజానుజంఘివక్షో
దరముల నిరువురకు బాణతతి నిండుకొనెన్. ౨౬౭

శా. ఆవీరప్రబలాట్టహాసములు నాయాశింజినీ నాదముల్
దేవవ్యూహజయధ్వనుల్ వినిన భీతిన్నింద్రలో కంపితం
బై వామాక్షి సుభద్ర మేల్కాని - సుతుం డాభీలకల్పాంతవీ
రావేశ ప్రమథాధినాయకునిఛాయం బోరుట ల్గాంచినన్ ౨౬౮

కం. తనుజుఁడు దనుజుం డీగతి
ననిలో ననిలోపమానులుగ తీక్షణులై
పెనుఁగు పెనుగాయములు దను
గనుఁగొని కనుఁగొనల బాష్పకణగణగతయై. ౨౬౯

కం. కట్టా యీపసిబిడ్డం
డిట్టుల సంగ్రామరంగ మెన్నఁ డెఱుఁగ డీ
పట్టుననె దాకసిలె నిఱు
కెట్టుల గానున్నదో రమేశ్వరు నాజ్ఞన్ ౨౭౦

కం ఏలా హలిపై నలిగితి
నేలా వికటాటవులకు నేతెంచితి నిం
కేలాగు బ్రతుకు నీపసి
బాలుం డాలమున భీమబలదనుజులతోన్ ౨౭౧

సీ తామసం బెవరికి దగదంచు దెలిపి మా
యన్న కూఁతురును నేనడుగుటేమి?

కూఁతును దారాజుకొడుకు కీయఁగ వెట్టి
తెలియఁగున మగుడ బ్రార్థించు టేమి?
ప్రార్థించితే నన్ను బలుఁడు తూలాడంగ
కూడుగ్గఁబట్టి నేగునియనేమి?
గునిసి నాలోననే గుములుచు నుండక
తెలియనిసుతునకు దెలుపుటేమి?

తే.గీ తెలుప కోపించి యాతఁ డేతెంచుటేమి ?
తడయ కీతనివెంట నేదవులుటేమి?
దవుల నన్యాయధౌర్త్యవాదం బిదేమి
బాపురే దీనికింక నుపాయమేమి? ౨౭౨

కం. బలుని యెడ కినుకచే నే
నిలు వెలువడి కొడుకుతోడ నేతెంచుటచేఁ
బలునోటం బలుమాటలు
బలుకరెఁ గయ్యాళియీసుభద్ర యటంచున్. ౨౭౩

చం తగుప్రాపెవ్వఁడులేక నొక్కరుఁడు కాంతారంబునం దుండఁగా
పగదీఱం గురురాజు మత్సుతుని జంపం బంపెనో వీని యీ
జగదుత్పాతమహాహవంబు గన నాశ్చర్యంబుగా నున్న దె
ట్లగునో గాని నిశాచరాధముఁ మాయల్ మబ్బుచాయల్గదా! ౨౭౪

కం హితు లెవరులేని తఱి ని
ర్జితశత్రుండైన తండ్రి చేరువనున్నన్
సుతునిపయి నీఁగ బొరయునె
యతిభీకరదనుజు లెంచ అడ్డంబైనన్ ౨౭౫

కం. కనురెప్ప లిడక బెగ్గిలి
తనయునిబలవిక్రమప్రథం గనుచుండెం
దనయుఁడు జగదద్భుతముగ
నని సేయుచు నుండఁ దల్లి హర్షత గనియెన్, ౨౭౬

చం. ఆపుడు హిడింబి పార్థతనయప్రకటాహవధైర్యధుర్యదో
ర్నిపుణత గాంచి యాత్మసుతునిన్ రణకేళినితం డకారణం
బిపుడు వధించునం చనెటిహేతువు నామటి దోఁచుచున్నదీ
యపరిమితోగ్రమూర్తి విలయాంతకుఁ డాకృతిబూని వచ్చెనో ? ౨౪౭

కం మును దైవనిర్ణయం బి
ట్లనుకూలంబై లభించె నదిగాకను నా
తనయుండు గెల్వనేర్చునె
యని పెక్కుగతు ల్గణించి యడలెడువేళన్ ౨౪౮

మ దనుజుం డంతటఁటోక భీకరధనుర్ధ్వానంబు గావించి- ది
గ్గన రోషానలమెల్ల వక్త్రమున గ్రక్కన్ సింహనాదార్భటిం
గినుకం బాడబతుల్యజాజ్వలన మాగ్నేయాస్త్ర మెక్కించి- గ్ర
క్కున పౌభద్రునివేసె భూనభము లాక్రోశింప రౌద్రాకృతిన్ ౨౪౯

ఉ ఏసిన భగ్గుభగ్గున నహీనతరాగ్నికణంబు లొల్క ఘో
రాశనిరీతి రా గని రయంబున నవ్విజయాత్మజుండు దోః
కౌశల మొప్ప దాని శతఖండములై చన కాలదండసం
కాశితవారుణాస్త్రము సఖండగతిం గుఱిజూచి యేసెఁన్ ౨౫౦

కం ధారాళమైన సలిలా
సారములఁ దదస్త్రజనితసంతాపము- చ
ల్లారిచియు బీమసేనకు
మారుఁడు దుడుకుదువసంబుమయము గ జేసెన్ ౨౫౧

ఉ అంత ఘటోత్కచుండు వరుణాస్త్రజబాధ లణంచుకొంచు క
ల్పాంతకృతాంతునిం బలె మహోగ్రహుఁడై భుజగాస్త్రమెత్తి- క
ర్ణాంతముగా ఘటించి విజయాత్మజు రొమ్మున గ్రుమ్మ దానన
త్యంతవిషాహిజాలకసహస్రములై తనువెల్ల గ్రుమ్మెనన్. ౨౫౨

కం తమి నభిమన్యుఁడు గరుడా
స్త్రము నభిమంత్రించి వేయుతఱిని శతసహ
స్రములైన పన్నగాశన
సముదయ ముదయించె చిత్రసంకాశముగాన్. ౨౭౩

కం. కొన్నింటి జించి పదహతిఁ
గొన్నిఁటి విదళించి తుండకులిశాగ్రమునం
గొన్నిఁటి జించి భుజంగాల్
ఛిన్నాభిన్నములుగాఁగ జేసి మెఱసినన్ ౨౭౪

కం అది గనుఁగొని హైడింబుం
డదయమతిన్ రాక్షసాస్త్ర మరిబోసి భయా
స్పదసింహనాదముల పె
ల్లొదరుచు హుంకించి మించి యురువడినేసెన్ ౨౮౫

సీ. ఆశస్త్ర మసురమాయామోహితం బౌట
శరభసింహవ్యాఘ్రశల్యభుజగ
పరశుతోమరశరప్రాసఖడ్గస్థూ౦
పాషాణముఖభయాస్పదము లెల్లఁ
గురియింపుచుంట గన్గొని సుభద్రసుతుండు
తదుపసంహతచికిత్సానిరూఢి
తడవు యోచించి గంధర్వాస్త్ర మరిబోసి
విధివిధాయకమున వ్రేయ నదియుఁ

తే గీ వెక్కుగతులను ద్రిజగదాభీః మగుచుఁ
బ్రళయకాలానలజ్వాల బగిదిదోప
మింటమంటను మంట లొక్కంట నంటి
దనుజమాయామయోద్ధతుల నణఁచె ౨౭౬

కం పోరి పోరి బెబ్బులు లట్టుల
నిరువుర బలములను దక్కు వెక్కువలేకన్

కరి కరియుం గిరి గిరియున్
హరి హరియుం బెనఁగినట్టు లాహవ మయ్యెన్ ౨౮౭

కం అంతం దెలదెల వేగుట
లెంతయు గని దనుజుఁ డలిగి యిదిగో నిను ఖం
డింతునని యార్భటింపుచు
పంతంబున నెక్కుబెట్టె బ్రహ్మాస్త్రంబున్ ౨౮౮

ఉ ఆమహదస్త్ర మెక్కిడుట నర్జునసూనుఁడు జూచి యుగ్రుఁడై
ధీమతి వజ్రఖండమును ద్రెంపఁగ వజ్రమెగాన దీనిను
ద్దామ మణంపఁగా నదియె దక్క మఱొండు శరంబులే దటం
చామితధైర్యధుర్యతఁ దదస్త్రము నెక్కిడు నంతలోపలన్. ౨౮౯

కం ఆబ్రహ్మాస్త్రము లిరువురు
చేఁబూనిన దిశలు చిట్లు చీఁకట్లమయం
బై బడబవహ్నికీలల
నాబహుశతరాగ్నికణము లవనిన్ రాలెన్ ౨౯౦

చం ధరణితలంబు దద్దఱిలె తారలు రాలె నభంబు దిర్దిరం
దిరిగె సుధాంశుభాస్కరుల దీధితి క్రుంగెను బ్రద్దలై దిశల్
దెరిచెను పచ్చిగోడలగతిం జతురంబుధు లింకె నద్రులున్
మొఱసె నభంబునన్ సురసమూహము లార్చె విమానపంక్తి త
త్తరమున దుల్లె వాయువు ధ్రువంబ ఱఁగెం బ్రళయాంతసూచనన్. ౨౯౧

ఉ ఆసమయంబునన్ మునికులాగ్రణి నారదమౌని యాగమో
ల్లాసుఁడు కోటిభాస్కరవిలాసుఁడు మాధవసత్కథాసుధా
భ్యాసుఁ డనారతాంచదుపవాసుఁడు వారలముందటం దయా
భాసురమూర్తియై నిలిచి బల్కె ననాగతవేది గావునన్ ౨౯౨

శా ఓహో విక్రమధుర్యులార తగు నుద్యోగంబు బాటిల్లె ని
స్సాహాయ్యంబున నన్నదమ్ము లిటులన్ సంగ్రామముం జేయుని

రోమహర్షప్రక్రియ లెంచుగాకముగదా ! మూర్ఖాళిసంభావ్య మీ
యూహా ల్జాలుడు గుందు వైరము మదీయోక్తు ల్విన న్మేలగున్. ౨౯౩

కం మీరలు భీమార్జునుల కు
మారులు-రణరంగజితకుమారులు మీలో
మీరు కలహింప దుర్జయు
లీరసములు మాని యుపశమింపుడు శరముల్ ౨౯౪

కం భవదగ్రజనకుఁడై దగు
పవమానసుతుండు దనుజభామహిడింబిం
దవిలి చరింపఁగ తద్ద్యుతి
భువిని ఘటోత్కచుఁ డనంగ బుట్టె నితండున్ ౨౯౫

కం నీవర్జునువలన గుణ
ప్రావీణ్యత దనరు కృష్ణభగిని సుభద్రా
దేవి జఠరాంతరంబున
నావిర్భవమొంది నాడవౌ నభిమన్యా! ౨౯౬

కం మీ దన్నదమ్ములై యీ
ఘోరాహవమునను బోరఁగూడ దటొండెన్
ధీరులు రణశూరులు-దో
స్సారుల నొకరొకరిఁ-గెలువ శక్యం బగునే ౨౯౭

మ అనుచు న్వారలవారువు లవ్వరుస లిట్లన్యోన్యసౌహార్దసం
జనితప్రక్రియ దేటఁగాఁ దెలిపి స్వేచ్ఛాగామియై వల్లకీ
ధ్వని నారాయణశబ్దయుక్తం గొలువ నంతర్ధానముం జెంది నం
తన నిర్విణ్ణమనోగతిం బడపు చైతన్యక్రియాహీనులై ౨౯౮

కం మును దెలిపిన వచనం ..
దనుతాపముఁ జెంది శరశరాసనములు స

యన నేల వైచి యాలిం
గనమొనరిచి కనుల బాష్పకణగణ మెనయన్ ౨౯౯

ఉ. అన్నవు నాకు నీవు దనుజాగ్రణి నేననుజుండ నయ్యయో
మున్నిటు నేనెఱుంగమిని మోసమువచ్చెను నీతిమార్గమం
చెన్నక నీపయిం దొడరి తింతటిలో సురసంయమీంద్రుఁ డా
పన్నశరణ్యుఁడై తగవుఁబాపి నిను న్నను బ్రోచె నర్మిలిన్ ౩౦౦

కం అనిన ఘటోత్కచుఁడుం గు
బ్బున గౌఁగిటఁ జేర్చి విజయపుత్రుని మేనం
గను గ్రొత్త గాయములు చే
బునుకుచుఁ గనుగొనల నీరు పొటపొట దొరఁగన్ ౩౦౧

కం మాయన్న దీన నీకు న
పాయము నిసుమంతయైన బ్రాపించిన- నా
కాయం బికేల- ధీరో
పాయం బికనేల ధర్మపద్ధతు లేలా! ౩౦౩

శా తంద్రుల్ కౌరవకైతవప్రబలబాధాబద్ధులై యున్నచో
వేంద్రదంబైన మనోవ్యథం బొరలు నీవీరప్రతాపంబులం
దీంద్రింపం దిననీక నిష్క్రియత వర్తింపంగ నేనూరకే
తంద్రీ నేడొక కీడుజేసితిగదా ధర్మేతరాచారినై. ౩౦౩

కం పావనుఁడౌ సురముని- మన
లావు లెఱింగించి దుష్టవార ముడిపి స
ద్భావమున శరణ మయ్యెం
గావున మన మిపుడు బ్రతుకు గంటి మవరజా ౨౦౪

వం అనుచు ఘటోత్కచుండు నెనరాముకొన న్వచియించు నంతఁ ద
జ్జనని హిడింబి- నారదవచస్స్మరణిం దనతోటికోడలా

ననుచు సుభద్రనుం దెలిసి యాదరవృత్తి పయంటకొంగునం
గనుఁగవ నీరు బోఁదుడిచి గాద్గదికధ్వనితోడ నిట్లనున్ ౩౦౩

చం. చెలియల నీమది న్వేతల జింతిలనేలఁ దనూజు లీగతిం
దలువని తల్పుఁ బోరుటలు దైవకృతంబగు విత్ర మీగతిం
దలఁపడ దీనికి న్వగప ధర్మమె నాకదుఁ డన్నదమ్ములన్
పొలుపుగ దెల్పఁగా మరలబుట్టినచందము లిద్ద ఱిద్ధరన్ ౩౦౬

చం ఇరువుర లింకఁ బోరిన మరేమగునో దలపోయ నెన్నిఁడన్
సురమునివంటి బాంధవుని జూడము మేలిదె చెలుఁ జాలు- కీ
డెఱుఁగక నాసుతుండు మిము నిట్లొనరించె నటన్న నేరముల్
మరువుము తల్లి వీరల శమం బొనరింపుడి సీతి యన్నిఁడన్ ౩౦౭

కం అని యిట్టు లూరడిల్లఁగ
ననుకూలనసూక్తి దెలిపి యతిపయు దానున్
మన మలర మెలఁగుతఱి న
ర్దనుజుండు సుభద్ర గని పదంబుల కొఱిగెన్ ౩౦౮

మ. జననీ యెన్నఁడు రానిదాన విటు లాశ్చర్యంబుగా నేఁడు- నీ
తనయుం దోడ్కొని రాగ మత్కలుష చిత్తప్రక్రియన్ సోదరుం
డని యూహింపక నేనెదిర్చినవిధం బాధర్మరాజాది మ
జ్జనకు ల్విన్న నిసీ! ఘటోత్కచుఁడు దౌర్జన్యం డటం చెన్నరే ౩౦౯

కం కావున తమ్ముం డితఁడని
భావమునం దెఱుకలేని పనిజేసితి - నీ
వేవలననైన నేరము
గావు మటం చతఁడు మ్రొక్కఁగా నిట్లనియెన్ ౩౧౦

శా ఆన్నా నీపదలంగ నేమిటికి దైవాయత్త మిట్లయ్యె - ము
న్నెన్నం డెతఁడు నిన్ను నివితని మున్నీక్షించి మీలోన మీ

రన్నల్దమ్ములుగా నెఱుంగమిని యిట్లన్యాయవైరంబు లా
సన్నంబై మునిరాట్కృపామతి పునర్జన్మంబు నొందె న్సుతా ౩౧౧

శా సీవి ట్లజ్ఞనిరీతిగా బొగలఁగా సీతమ్ము డత్యంత దుః
ఖావాప్తిన్ పగవం దొణంగె నిక శూరాగ్రేసరు ల్లోకమం
దేవేశన్ వెతనొందఁగాదగునె తండ్రీ నేఁటికైన న్మహా
భావజ్ఞుండగు మౌనికీర్తెలిపి మీ ప్రాణప్రదుం డాయెఁగా. ౩౧౨

కం అని పెక్కు విధము లాసతి
తను నూఱడిలంగఁ బల్కి దనుజాగ్రణి నె
మ్మనమునను కలఁతవిడి - త
మ్ముని కౌఁగిటఁజేర్చి మోదమును బెనఁగొనఁగన్ ౩౧౩

కం కడువేడ్కి వార లిద్దఱు
కొడుకు లగుట - తాము తోడికోడం డ్రగుటల్
జడదారివలన గని మది
నెడలేని ప్రియంబు జేసి ఓంపెసఁగారన్ ౩౧౪

చం అపుడు ఘటోత్కచుం డనుజు నజ్జననిం దనయాశ్రమంబునం
దపరిమితద్యుతి ప్రచురమౌ నొకశైలగుహాంతరంబునన్
విపులచిరత్నరత్నమయవేదిక యందున జేర్చి సందియం
బుపశమనం బొనర్చుచు నయోక్తుల నిట్లనియెన్ సుభద్రతోన్ ౩౧౫

కం ఓ తల్లి మున్ను వింటిని
ద్వైతవనంబునను ధర్మతనయుఁడు దెల్పన్
నీ తనయునితో ద్వారక
కేతెంచుట - సీదుకుశల మిఁట మీఁదెఱుఁగన్ ౩౧౬

కం. ఇదియేమి వింతకార్యం
బొదవెనో! నడిరేయివేళ నుగ్రాటవిలో
జెడు రెదురులేక సి గతి -
సుదతీ విచ్చేయఁదగునె సుతుఁడు న్నీవున్ ! ౩౧౭

చం. చెలు లిలుబాసి వచ్చుటల శీలముగాదె ముకుందుఁ డీసడిం
దెలిసిన మిమ్ము నట్టడవి ద్రిమ్మఱనిమ్మనె యిట్టి సాహసం
బులు దలపోయ నేమి పనిబుట్టెనొ దాచక దెల్పవమ్మ ను
మ్మలికలకేల నేను నభిమన్యుఁడు నీసుతు లుండియుండఁగన్ ౩౧౮

మ. అన నిట్టూర్పులు నుచ్చుచుం గనుల బాష్పాసారము ల్దొల్క నా
ననము న్వెల్వెల బార చెమ్మటలు మేనం గ్రమ్మ దైన్యంబు సి
గ్గును రోషంబు జనింప గాద్గదిక నెల్గుం దోప కెమ్మోవియ
ల్లన గంపింపఁగ మోము వంచి విగతోల్లాసంబుగా నిట్లనె ౩౧౯

కం. వినుమన్నా! మాకతలే
మని తెల్పం బిడియ మగును నలరారు భవ
జ్జనకు లనుపంగ ద్వారక
కును నేఁగుట నీవుఁదెలిసికొన్నవియగదా! ౩౨౦

సీ. ఆద్వారవతిలో మదగ్రజుఁ డైనట్టి
హలికిని శశిరేఖ యనఁగ నొక్క
కూఁతురు త్రిభువనాతీతసౌందర్యవి
ఖ్యాతిచేఁ దనరు నక్కన్యనతఁడు
మన యభిమన్యునకు నొసంగెద నంచు
నెమ్మి నాతో మున్ను నమ్మబలికె
జను లెల్ల విని మహోత్సాహంబునను జెంద
నంతఃపురీకాంత లతిశయింప

తే. గీ. సుదతి నాట్నుండి యభిమన్యు సొమ్మటంచుఁ
గోరి యాబాలగోపాలకులు వచింప
నది మొదలొక్కని నాకోడ లౌనటంచుఁ
బ్రేమ నానాట ముప్పొటఁ బెంచుచుంటి ౩౨౧

17)

కం ఆలోపల కురుపతి యా
బాలామణి నాత్మసుతుని బరిణయమునకై
తాలాంకుని యడుగుటకు దు
రాలోచనజేసి బసిచె నవనీసురుఁన్ ౩౨౨

ఉ అందుకు కన్య నిచ్చుటకునై హలి మిన్నఁచేతనొడ్డి న
ట్లెందున లేని మోదము వహించెను- లగ్నము నేఁట రేపటం
బొందెను- దానికై యనువిభుఁడును సాత్యకి గూడదంచు- కా
ళిందివిభేదను న్మదిజనింపఁగ జేయగలేక యుండినన్ ౩౨౩

కం నేయేమి కీడెఱుంగక-
మాయన్నగదా యటంచు మఱి నేవేడం
బోయిన నామది లోఁబగ
బాయని పరుషోక్తు లాఁడె పాండవులయెడన్ ౩౨౪

కం ధృతరాష్ట్రసుతుఁడు సముపా
ర్జితయశుఁ డతివైభవుం డజేయుం డతూ్యు
ర్జితవిహితబంధుఁ డాతని
సుతునకు మత్కన్యనొసఁగ శుభముంగాదే ౩౨౫

కం. ధనవంతుఁడు కురుపతినిం
బొనఱ జయించెదరె పాండవులు గిండవులుం
గనుఁగొనఁగ వెన్నముద్దకు
మునుకోఁలువచ్చి దూలములు గంకునొకో. ౩౨౬

చం. అతఁ డిలువెళ్ళగొట్టఁగ మహాటవులం జరియించి కూటికిం
గతి జెడి యాలుబిడ్డలును గానక వర్రిలువారితోడ నే
హితమతి వియ్యమంది సుఖియించుటకిన్నను పెద్దనూతిలోఁ
జతికిలఁ ద్రోయ మేలని విషప్రచురోక్తులఁ బల్కెఁ బుత్రకా! ౩౨౭

కం అడవుల కారాకులు దిను
బడుగులు పాండవులతోటి బాంధవ్యము నీ

కొడుకు స్నీవును గూటికి
బడియుండఁగ కోడ లొకతి పైఁబడపఁ సెన్ ౩౨౭

మ అని యిట్లాడినవాక్యముల్ హృదయశల్యప్రాయమై నిల్వ లే
కను నేనయ్యభిమన్యుతో దెలుపఁగా కంఠీరవాకారభీ
షణరోషంబున నర్ధరాత్రి జను లీషన్మాత్రముం గానకుం
డను సం దోడ్కొనివచ్చె నికరణి వేంద్రంబైన ఘోరాటవిన్ ౩౨౮

చం. నిలయమునుండి వెల్వడియు నేఁటికి నాల్గుదినంబు లాయె- ని
నెలవున నీవనంబునకు నిన్నటిరాతిరివచ్చి నిద్రనే
నొలసి పరున్నవేళ ననుజుండును నీవు మహాహవంబునన్
మెలఁగెడి భీకరధ్వనుల మేల్కొని లేచితి- చూచి తింతయున్ ౩౩౦

కం అకటా సురసంయమి నై
జకటాక్షమువలన మఱలజనియించిన యి
ట్లుక మిమ్ము జూడఁబడె నిం
తకుమించిన మేలుగలదె దనుజవరేణ్యా ౩౩౧

సీ ఇఁక నీసహోదరుం డెపరిప్రా పెఱుఁగక
మగువపై చూపన్నుఁ డగుచు నుండి
యల యెండమావుల నాశించు మృగ మట్లు
మామచే సుతుఁ డవమాన మొందె
కోమలి కురురాజు కోడలై పోయె మా
యన్న మాటలు శూలమగుచు దవిలె
నన్న! నిన్నెఱిఁగిన యప్పాటనుండి నా
తలఁపు నొక్కింత చింతలు దొలంగె

తే గీ. నీదినంబున కిట్టిమే లింతె చాలుఁ
దలఁచి వేదన బడనేల దైవవిధికిఁ
వడ వికేటికి నడవి మీతండ్రులున్న
పథము జూపించి మము వేఁగ మనుపుమయ్య. ౩౩౨

కం. అని బాష్పనిష్పతితలో
చన యగు సుభద్ర తనవిచారము దెలుపన్
విని రోషభీషణాకృతిఁ
గనలుచు హైడింబు డంతకప్రతినిధియై. ౩౩౩

సీ. మొదల కౌరవుల రాముఁడు మెచ్చె నన్నచో
రవరవ రోషాగ్ని రవులుకొనియె
నాతి నయ్యభిమన్యునకు నీయఁ డన్నచో
వేడి పొగ లెమ్మెన వెడలదొడఁగెఁ
దుది పాండుపుత్రుల దూషించె ననినచో
కణుకునిప్పులు నోట గ్రక్కఁబడియెఁ
గన్య లక్ష్మణున కింక నొసంగు నన్నచో
చటులాస్య నిర్గతజ్వాల లెసఁగె

తే గీ. నంతకంతకు నిశ్వాస మధిక మగుచుఁ
బ్రళయకాలకృతాంతుని బగిదిఁ గెఱలి
పటపటన పండ్లు గీఱి దర్పంబు సూపి
పలికె నిట్లని యతఁడు సుభద్రతోడ ౩౩౪

కం. ఏమేమీ బలభద్రుఁడు
నీమహి నొవ్వంగ బలికెనే హైడింబుం
డీ మహిని యున్న దెఱుఁగడు
గామోలు కురుక్షితిపగర్వబలమునన్ ౩౩౫

సీ. మత్క్రోపదావాగ్నిమహిమ విశ్వంబెల్ల
దర్పించి భస్మం బొనర్పజాలు
ఘనతరమన్ముష్టిఘాతాశనిపాత
కులగిరుల్ భిన్నమై కూల్పజాలు

మత్సత్త్వ మఖిలమహామండలం బాపక్ర
వాళాద్రి సహిత మార్పంగజాలు
మత్పాదఘట్టన మహితహేమాచల
శృంగభంగంబు సేయంగజాలు

గీ దేవతిర్యఙ్మనుష్యాదిజీవతతికి
నుద్దు గుడిపించఁజాలు నాయోగమాయ
నిట్టి నను కన్నుగానక హీనుఁడైన
కౌరవాధము నుతియించెఁగా బలుండు ౩౩౬

కం. తనతనయను గైకొన నా
యనుజుండేగాక యితరుఁ డగువే కుంతీ
తనయులను గినిసి బలికిన
యనుభవ మికదోడుతోడ నగుపడు హలికిన్ ౩౩౭

మ. మనకు న్యాదవకోటికిన్ బెనయు దుర్మంత్రాంగముం జేయు దు
ర్గుణు దుర్యోధను ద్రుంచి, సైంధవుని గర్ణుం ద్రోణు దుశ్శాసనుం
ఘనముష్టిప్రహతిన్ వధించి బలుఁ డాకంపింప కౌరవ్యయో
ధనికాయంబుల నొక్కపెట్టుననె మూర్ధంబుల్ దెగం గోసెదన్ ౩౩౮

శా మాతంగ్రడుల్ బహుళవ్యథ ల్గాని వనీమార్గంబులన్ మెల్గ వీఁ
దే తాదృగ్విభవంబునం దరణి దానేలంగ నెట్లోర్తు మ
ద్ఘాతప్రక్రియచే గిరుల్ శకలము ల్గావించి లోకత్రయిం
ఘాతిం జేతు బలుండు దీనముఖుఁడై బోలించి నం జూడఁగన్ ౩౩౯

శా తల్లీ నీకు ఘటోత్కచుం డనెటి పుత్రగ్రామణిం గల్గ నీ
యుల్లంబు న్వెతనొంద నేమిటికి మాయోపాయము ల్పెన్ని నేఁ
డెల్లిం గన్నియ నిందు జేర్చి భవదీయేచ్ఛాగతిం బెండ్లి శో
భిల్లం జేసెద నీతనూజునకు సంప్రీతి న్విలోకింపవే! ౩౪౦

మ కొడుకుం గోడలు నిన్ను దోడుకొని యాకుంతీతనూజాతు లుం
డెడుచోట న్నిన్ను డించెదం జనని నేఁడే చూడనౌ రేవతీ
శుఁడు కన్యామణి నెట్లు లక్ష్మణున కిచ్చుం దానివైనంబు నే
పొడసూడం దగు నాకు సెల్వొసఁగు మంభోజాతపత్రేక్షణా. ౩౪౧

ఉ. పౌరులు బాంధవుల్ వినఁగ బల్కినబల్కు లబద్ధ మిప్పుడే
తీరున నౌనొ చూడు సుదతిం గొని నేనిటఁ దెచ్చు నంతకున్
మీరు సుఖాప్తి నిందు శయనించుఁ డటంచు వచించి కోపహుం
కారసమగ్రుఁ డౌచు చనఁగా సమకట్టు సుభద్ర యిట్లనెన్. ౩౪౨

కం. అసురేంద్ర కోపమేటికి
వసుధను దానంబు దాతృవశమన వినమే
ముసలాయుధుండు కన్యక
నొసఁగని హేతువున వెతలనొందఁగనేలా! ౧౪౩

ఉ. కౌరవకోటి పాండవు లగాధబలోన్నతచండబాహువి
స్ఫారధనుర్విముక్తపటుబాణపరంపరగూర్పఁగా జగ
ద్వీరప్రతిజ్ఞసేయుటకు వేగిరపాటున నీవు గూల్చితే
శూరులు పాండవోత్తముల చుల్కనగా గణియింపరే ధరన్. ౩౪౪

ఉ కావున వారిగర్వ ముడుప న్నదుపాయ మొనర్చి కన్యనేఁ
డే విధినైన తమ్మునికి కహీనతఁ బెండ్లి యొనర్పు నేర్పు నీ
భావమునం దలంచు టిది బాగని దోఁచె మఱొండుహేతువన్
నీవిట నాలసింపకుమి నేఁటికి మూడవనాఁడు లగ్నమౌ ౩౪౫

చం అది గనుకన్ ముహూర్తసమయంబున కచ్చటి కేఁగుటొప్పు గా
కిదిసమయంబుగా దచటి హేతు వెటేఁగి యెఁకొచ్చునో! ముదం
బొదవఁగ నంతదాకను సహోదరుగూడి యిట న్వసింపు మం
చొదివిన కూర్మితో బలుకుచున్న సుభద్ర కతండు నమ్రుఁడై ౩౪౬

మ. జననీ నీనియమప్రకారమున రోషంబెల్ల బోకార్చి యొం
దనక న్నీకడ నిల్చి లగ్నసమయం బందేఁగి తాలాంకనం
దన నిచ్చోటికి జేర్చి నీమదికి మోదంబందఁగా జేసి దో-
ర్దనె కౌరవ్యుల కార్యము ల్జెరచి మీదాపుం బ్రవేశించెదన్ ౩౪౭

చం. అనుచు సుభద్ర సమ్మతిలునట్లు వచించి సహోదరుండు తా
నును జననీమణు ల్గనకనూత్నమణిద్యుతి నొప్పు కందరం
మ్మున వసియించి కందఫలమూలరసాదుల దృప్తిజేసి యి
చ్చను శశిరేఖ పెండ్లిదివసంబునకై కనుబెట్టి యుండగన్ ౩౪౮

కం. గతకాలవార్త లెన్నుచు
హితగోష్ఠి న్మెలఁగుచుండి రిట, పిదటి సం
గతి దెల్పుమని ధరణీ
పతిఁ గనుగొని పైలుఁ డమృతభాషల ననియెన్ ౩ ౯

## -:ఆశ్వాసాంతము:-

కం. సురుచిరశరరుహచరణా
దరదరకరభరణదురితహరణాజిచణా
స్ఫురదరినికరవిదారణ
గిరిధరకరిశరణశేషగిరివరశరణా ౩౫౦

కవి కరుణాసేచన! కంజపలోచన!
రాజ కలుషవిమోచన! గానహితా!
విరాజి సురరిపునిగ్రహ! సుందరవిగ్రహ!
తము శుభసదనుగ్రహ! సూరినుతా!
గురుజనపోషణ! కోమలభాషణ!
కుమతవిభీషణ! గోపసుతా!
తరణివిలోచన! తత్త్వవివేచన!
తాపససూచన! భక్తిరతా! ౩౫౧

సోష్ఠ్యా మాపామాభామాపా
త్ర్యక్షర మాపై పైభ్రామబామ మాపుమి ప్రాపై
కందము మీప్రేమబాపమీపై
మాపాపపుమోపుబాపుమా మాబాపూ. ౩౫౨

మ. ఇది శ్రీశేషకుభృచ్చిరస్తటకుటీ
రేచ్ఛానువర్తిప్రథా
మృదుశ్రీవాసగురుప్రసాదకలనా
మేయార్థమౌద్గల్యవం
శ్యదయాసంయుతభావనార్యజని
శశ్వచ్ఛ్రీనృసింహార్యమో
హదతాలాంకసునందనోద్వహ
చతుర్థాశ్వాస మొప్పు న్భువిన్ ౩౫౩

గద్య

ఇది శ్రీమచ్ఛేషధరాధర సౌధవీథీవిహరణ చతు
ర్వ్రలక్షణాక్షీణకృపాకటాక్షవీక్షణాపరిలబ్ధలక్ష్యలక్ష
ణానవద్య విద్యావిలాస శ్రీనివాస గురు
చరణస్మరణాభ్యాసనరసనావికాస నిస్తుల్య
మౌద్గల్య గోత్రపవిత్రభావనాచార్య
పుత్ర పర్వత్రయకైంకర్య విధాన
వేంకటనృసింహార్యాభిధానప్రణీ
తంబైన తాలాంకనందినీ
పరిణయంబను మహా
ప్రబంధంబునందు
చతురాశ్వాసము ౧౫౪

—, ० —

# తాలాంక నందినీ పరిణయము

## పంచమాశ్వాసము

కం. శ్రీమత్కౌస్తుభమణిసుష
మామయ వక్షోవిశాల మంటపసాక్షా
చ్ఛ్రీమంగాంగన నయన
క్షేమంకరరూప శేషగిరిమణిదీపా! ౧

తే.గీ. చిత్తగింపుము జనమేజయోత్తమునకు
పైలుఁ డిట్లని బల్కె - శుంభత్ప్రతాపుఁ
డౌ ఘటోత్కచుఁ డచలగృహాంతరమున
నుండి గనిపెట్టియుండె ముహూర్తమునకు ౨

ఉ అచ్చట ద్వారకానగరమందు కురుక్షితినాథుఁ డంపఁగా
వచ్చిన విప్రయుగ్మము వివాహముహూర్తము నిశ్చయించి వా
క్రుచ్చిన రేవతీరమణుకోరిక వీడ్కొని రాజరాజు కీ
ముచ్చట దెల్ప హస్తిపురముం దగజేరి కుతూహలోన్నతిన్ ౩

ఉ. స్వామి భవన్ముఖప్రథితశాసనముం దలదాల్చి ద్వారకా
నామక రాజధానికి జనన్ బలభద్రుఁడు కూర్మి జేసి మీ
క్షేమము మాటిమాటికి వచింపఁగ కౌతుకమందువో కుమా
రీమణి లక్ష్మణాఖ్యుఁడు వరింపఁగగోరు ప్రశంసజేసినన్ ౪

కం స్వామీ యేమని దెల్పను
ప్రేమన్ బెన్నిధినిగన్న పేద తెఱఁగునన్
రాముండు సంతసించెను
మీమీయనురక్తులందు మేలెట్టిదొకో! ౫

కం. సతి దొసఁగవలయునని- తన
మత నతికౌతుకమునంది మంత్రిహితపురో
హితతతిని బిలిచి సుతఁ గురు
పతిసుతున కొసంగు తనదుభావము దెలిపెన్ ౬

కం వశుఁడగుచు రౌహిణేయుఁడు
నిశితబలోపేతుఁడైన నీతనయునకున్
శశిరేఖ నొసఁగ రేపటి
దశమికిని ముహూర్తనిశ్చితం బయ్యె నృపా. ౭

ఉ దానికి కొన్నివిఘ్నములు దానవవైరి సుభద్రసాత్యకుల్
బూని వచింప దత్సరణి బుద్ధి దలంపక సీరపాణి మా
తోననె వీరి వీరి మదిఁదోచినయట్లు వచింప నిమ్మ యె-
ట్లైన కురుక్షితీశతనయాగ్రణికిన్ శశిరేఖ నిచ్చెదన్ ౮

కం ఇప్పగిది నీతిరీతుల
చొప్పెఱుఁగక నెంచబె ట్లనూయతపడినం
దప్పదు నాపలు కితరులుఁ
దెప్పిన వగపేమి యలిగితే భయమేమీ ! ౯

ఉ కావున లగ్నకాల మనకాశము లే దటుగాన-కౌరవ
క్ష్మావరుబంధుసంయుతసుగాఁ జనుదేర నొనర్పు మన్నచో
దేవరచెంత కేమరుగుదెంచితి మీదశమి న్ముహూర్తమౌ
వావిరి మంగళార్ధరసవర్గములున్ సమకూర్పఁగా దగున్ ౧౦

చం అన దురోధనుఁ డంతరంగమున నాహ్లాదింప - దుశ్శాసనా
ద్యనుజన్మ ల్విన బల్కె సీరధరుతో నత్యంతబాంధవ్యమి
ట్లనుకూలించుట - యాదవు ల్మనసహాయంబైనచో పాండునం
దనులున్ ఔక్కులులేని పక్షులపలెన్ దైన్యంబు పాటించరే ! ౧౧

కం యాదవులున్ మన మొక్కటి
గా దొరకొని నపుడె దీనగతి నడవులలో

ఖేదమున నడలఁగా నట
మీఁదఁట నిరసింపజేయమే పాండవులన్ ౧౨

కం కావున నాలస్యం బిక
గావింపఁ బనేమి బంధుగణములనెల్లన్
రావించి పుర మలంకృతి
గావింతము త త్తదుచితకార్యానుగతిన్. ౧౩

కం అని దుశ్శాసనుఁ డన్నకు
వినయమునం దెల్ప నగరవీధుల నెల్లం
బనిబడి శృంగారింపఁగ
జనులకు విశదంబుగాఁగఁ జాటించుటయున్ ౧౪

కం వేడుకతోడుత నారా
జేఁడిగతిసాట తత్పురీజనులెల్లన్
వాడల మేడల గోడల
తోడ నలంకృతులుఁ జేయఁ దొడగిరి ప్రీతిన్ ౧౫

కం సకలపదార్థము లెల్లను
శకటానడ్వాహకలభసముదయముల - ది
క్ప్రకరముల కనచి గూఱిచె
నొకనిమిషములోన సముచితోత్సాహుండై ౧౬

కం ధరణీసురులను సన్ముని
వరులను హితబాంధవప్రవరులను ధాత్రీ
వరులను హితవరులను నుతి
పరులను బిలిపించెఁ బ్రమదభావముపీఁఅన్ ౧౭

సీ అపుడు భీష్మద్రోణు లది గనుంగొని సుయో
ధన యాత్రప్రయోజనం బనుచితంబు

కన్యకామణి కభిమన్యుఁడే పతియంచుఁ
బుట్టినపుడే పేరు బెట్టియుండె
నది గాక మాధవుం డచట పాండవపక్షి
బలుఁ డొక్కఁడుఁడె మనపట్టు గలగి
నిలిచి యీశపథంబు నిర్వహింపగలండె
హరికోపమే కార్యహాని యగును

తే గీ నందు నభిమన్యుఁ డధికశౌర్యాన్వితుండు
చర్చసేయక నిదిజూచి యోర్చగలఁడె
గాన మనలక్ష్మణునకు నిక్కన్య నొసఁగు
టుడిఁగి యొండొకసతిఁ గూర్చు టుచితమయ్య ౧౮

ఉ. నావిని ప్రేటునాటు మృగనాధుని రీతి పృషద్భృతోజ్జ్వల
త్పావక మూర్తియై యదిరిపాటునలేచి వచించె పాండుపు
త్రావళి పక్షపాతమతులౌట యెఱుంగనె మిమ్ము మున్నె, మేల్
దీవన లచ్చటం - గెంలి తిట్టుట లిచ్చట సంతతంబు మీ
జీవము లచ్చటం జెలిమి సేయుట లచ్చట మీరు నై జ౯ుల్ ౧౯

కం నేనేది దలంచినవో
దానికి విఘ్నములు సేయఁగలపడు ఓంతే
గాని - కురువృద్ధు లగుటకుఁ
బూని మదీయానుగతిని బొందఁగవలదా ! ౨౦

కం పొం దనిన బోయి రడవికి
పాండుతనూజాతు లిట్లు పట్టుకపడిరే
కొండాటములకు మీరే
పండితులై యుంటి రరులపక్షముబలుకన్ ౨౧

కం మాటికి మాటికి నిటువలె
పోటరిబంటులకు పిఱికిబుట్టించెడు మీ

మాట లికేటికి పాండవ
కోటికి సాటికిని మేమగుదుమే దలఁపన్ ౨౨

చం బలియులు కర్ణసౌబలులుఁ బల్కరె మీవలెనెన్నఁడైన దు
ర్బలవచనంబు లిట్లు యదువర్గము మాహితులైన పాండవా
వళి యననేమి యా త్రిపురవైరియు నేమి - బిడౌజుఁ డేమి - మ
త్కులిశగదాప్రఘాతమునకుం బొడరంగలరే కనుంగొనన్ ౨౩

చం పలుమఱు లేని పేర్మలు బల్కకు, డింతట మామనంబు రం
జిల కనకాభిషేకములు జేసినయట్లు భవత్ప్రియోక్తులం
జెలిమిని చెవ్వియొగ్గిన పచింపుడు పెండిలిమేలుఁ జూడకో
ర్కులు గలవేని రండు యిది కీడనిదోవిన రాకుఁ డింతటన్ ౨౪

కం పలుఁ బల్కు లనఁగ నేటికి
బలరాముం డొకఁడు మాకు పట్టైయున్నం
బలియులగు పాండవేయుల
దల నెత్తఁగనిక బాఱ దఱుమఁగలేమే ౨౫

కం □ అని యుల్లసోక్తు లాడఁగ
విని భీష్మద్రోణు లపరివిభునకని రయో
జననాథ ! కోపమేటికిఁ
గనియెదుగా కింక కార్యగతఫలసిద్ధిన్ ౨౬

ఉ కాలము దేశముం దెలియకన్ పచియించెటి వారినెల్ల - మే
ల్మలని మెచ్చె దీవిపుడు మీరటు హానిదలంప నీమతిం
బేలరొ ! పాండవోత్తము లహీను లటంచు దలంచె దింమకన్
తాలిమిలేక నీవు తలఁదాకిన నాటి కెఱుంగ నయ్యెడిన్ ౨౭

---

□ ఈ పద్యము తరువాత పంక్తి 'ము పం. క వాఖము -' అను పద్యము
వరుస 'లి' లో పూర్తిగా లేదు 'తా' లో అసమగ్రముగా గలదు.

ఉ. ఇక్కరణిన్ వచించి దమయిండ్లకు నేగెటి ద్రోణభీష్మలం
దక్కఁగ దక్కు కౌరవహితప్రదులెల్లఁ దదాజ్ఞఁబూని దా
మొక్కమొగిన్ వివాహసమయోచితకృత్యపరతంత్రులౌచు న
ల్దిక్కులధారుణీశుల సుధీజనులం బిలిపించి వేడుకన్ ౨౮

చం. పురము నలంకరించుటయు భూసురభూపవణిగ్జనాదు ల
ప్పరిణయదర్శనప్రమదభావమునం జనుదెంచుటన్ శుభం
కరవరభేరికాముర జకాహళనాదము లుగ్గడించుటల్
కర మనురక్తితోడ గని - కౌరవనాథుఁ డతిప్రమోదుఁడై. ౨౯

కం సాధుమతి సకల భూసుర
యూథమునకు భక్ష్యభోజ్యయుక్తముగ - సమా
రాధనముజేసి పూర్వాని
శీధిని పైనమున కాజ్ఞఁజేసిన యంతన్ ౩౦

వ. అప్పు డప్పురంబున గలుసౌజన్యామాన్యులగు రాజన్యా కన్యలును కరుణాగభీరసింధువులగు - బంధువులును - బంధుసమాదరులగు సోదరులును - వినిర్జితక్రోధు లగు యోధులును నిఖిలకార్యానుగతస్వతంత్రులగు మంత్రులును - శరీర సుకుమారేందిరాకుమారులగు రాకుమారులును మంగళభాజనంబులు నగుపుణ్యాంగనాజనంబులును - వినిర్జితవిటమాన ధనంబులనగు విలాసినీజనంబులును, శర్మతరకర్మ ధర్మాచరణభాసురులగుభూసురులును, శిబికాందోళికాకరితురగరథారూఢు లై దన్నుఁ బరివేష్టించి కొలువ పురంబు వెడలె-నంత ౩౧

సీ కృపవివింశతి యజ్ఞకేతుసుషేణులు
బలసి ముందర బరాబరులు సేయ
తపనసంభవ జయద్రథ వాహ్లికాదులు
విచ్చుకత్తులుబూని వెన్క నడవ

శకునిదుశ్శాసనాశ్వత్థామముఖ్యులు
        జాగ్రదుద్వృత్తి పార్శ్వముల నేఁగ
నైరావణోన్నతస్ఫార ద్విరదమెక్కి
కడఁగి మధ్యమున లక్ష్మణుఁడు సెలఁగ
తాను మణిగణకాంచనస్థగితరథము
నెక్కి తనయునిచేరువ ప్రక్క నిలిచి
వారివారికి ప్రియమైన వాహనముల
నెక్కివచ్చుటఁ జూచుచు వెడలె పురిని

సీ. దంతావళంబు లంతస్థిశైలంబులై
        యుద్యత్తురంగంబు లూర్ములయ్యె
హాటకద్యుతినొప్పు నరదము ల్దీవులై
        చటులభటుల్ నక్రచయము లయ్యె
తత హేతిసంతతిప్రతతిమీనంబులై
        చక్రముల్ జలచక్రజాలమయ్యె
కరఖేటకంబులు ఘనకచ్ఛపంబులై
        భటహుంకృతులు జలార్భటము లయ్యె

చంద్రవంశజ రాజరాజేంద్రురాక
కలరి చతురంగ సైన్యమహార్ణవంబు
యదుజనామరనిధి తన్ను నెదురుకొనఁగ
సరసశరజాలములతోడఁ బరఁగె నడచె

కం వందిజనుల్ వైతాళిక
బృందములుం బొగడ దుందుభితూర్యములం
దందడి మ్రోయ రాజపు
రందరుఁ డాద్వారకాపురముకడ విడచెన్ ౩౮

మ బలభద్రుండు నృపాలురాక విని సద్బంధుప్రయుక్తంబుగా
విలసత్కాహళతూర్యనాదములు వేవే లొక్కయ నుద్వృత్తుగా

హాలుఁడై తోడను బుణ్యభామినులు డాయంగా నెదుర్కొంచు-వే
డ్కలచే పుష్పాలచప్పరంబు విడి దిండ్లం జేర్చె వేవేగమున్. ౩౫

కం. వారల కనుభవయోగ్యం
బౌరసి రసనిఖిలసత్పదార్థంబులు వి
స్తారగతి నొసఁగి దత్త
త్ప్రారంభవిజృంభమాణభావుకమతియై ౩౬

కం. ఆమీఁదటఁ బుణ్యాంగన
లామోదముమీఱ లక్ష్మణాభిఖ్యానృప
గ్రామణికిని పరిణయదీ
క్షామంగళమజ్జనంబు గావించి రొగిన్ ౩౭

సీ. నీటైన గొజ్జంగినీట జలకము లార్చి
కురులుగోరున గీరి కొండె దీర్చి
ఘనకిరీటము మస్తకమున శృంగారించి
సముచితవస్త్రభూషణము లొసఁగి
మృగనాభినామంబు నగుమొగంబున దీర్చి
వన్నెపావడ వల్లెవా టొనర్చి
కటకాంగుళీయముల్ కరముల గీలించి
యుఱుతారహారంబు లఱుత వైచి

తే. గీ. విపులమణిమయసింహాసనమునఁ జేర్చి
నవ్యమంగళనీరాజనం బొసంగి
విధివిధాయకమున ధర్మవేద్యు లెల్ల
వెనసమావర్తనాదికవిధులఁ దీర్చి ౩౮

మ. బలభద్రుండు ధరామరప్రతతికిన్ భక్ష్యాజ్యసూపప్రధా
నలసద్భోజనభాజనక్రియల సన్మానించి మాల్యాంబరం
బుల సత్ప్రత్నవిభూషణంబులఁ బ్రియంబు ల్మీఱ నర్పించి యు
వ్వీల పుత్రీమణిఁ బెండ్లికూఁతు నొనరింపంగా నియోగించెనన్. ౩౯

చం  మును శుకరాజము౯ దెలుపు ముప్పుటి సమ్మెగ హస్తవేశ్రి
క్కున నభిమన్యుఁ గాంతునకు కోరిక నిరిక లెత్తె చేటికా
జనులకు దెల్పకన్ గుసుమశయ్యను నిద్దురఁ జెందు బాలికా
మణిని బ్రియాంగన ల్గలిసి మాటికి బుజ్జగించుచు లేపియున్ ౯౦

సీ  కలిక యొక్కతె జిత ముక్తాలిపీట యమర్చె
కోమ యొకర్తు గంధతైలము తలంటె
రమణి యొక్కతె కప్పురము మేన నలుఁగిడె
సకి యొకర్తు గంధాంబులక మలందె
మగువ యొక్కతె శిరోమజ్జనం బొనరించె
పొలఁతి యొక్కతె తడిఁబోవఁ దుడిచె
చేడె యొక్కతె వల్వజిలుఁగు పావడ దీర్చె
వరవర్ణి యొకతె పెన్నెఱుల నార్చె
తే గీ  నగరుధూపంబు లొకయింతి నునువుపఱచెఁ
గురులు జడఁదీర్చె యొకలేమ విరుల జుట్టె
చెక్కుటద్దాల నిడె నొక చిగురుఁబోణి
రతనముల కంచుకం బొకరమణి దొడఁగె ౯౧

ఉ  పాపెటబిందియల్ పసిఁడిపాపిడ లందియలు న్మెఱుంగు ని
ద్దాపవడంపుఁ జికిలికడియంబులు బాజుబందు లు
ద్దీపితతారహారములు తేఁజగుకమ్మలు వావిలీలు మి
న్నాపని మేల్బులాకి రతనంబులు వేసరి దీర్చి రెంతయున్. ౯౨

ఉ  కన్నుల కజ్జలం బునిచి కస్తురినామము గోట నీటుగా
నెన్నొసటం ఘటించి రసవజ్జిలిమృగీమదచందిరంబులం
జన్నుల చెక్కుల న్మకరసంజ్ఞల పత్రికరేఖ లుంచి య
త్యున్నతహేమపీఠమున నుంచిరి లోకవిమోహనాకృతిన్ ౯౩

కం కన్నియ నిటు వయ్యారముఁ
జెన్నారఁగ బెండ్లికూతుఁ జేసిరి పడతుల్
గన్నులఁ గన కన్నుల వి
ల్మన్నెవతంసుని హుమావునకు సూరొడ్డుగతిన్ ౪౪

చం పరిణయవేళ వచ్చెనని బంధుజను ల్పరిచారకుల్ హితుల్
పరిమళవస్తువు ల్గొనుచు బర్విడుచందములోన దాము వే
గిరిపడుచుండు చెల్లఁ బరికించి సదిన్ శశిరేఖ సాధ్వసా
తరళితచిత్తయై శుకవతంసపచస్స్మరణం దలంచియున్ ౪౫

కం. చిలుక మును కొన్ని వార్తలుఁ
దెలిపిన నిజమనుచు నమ్మితిం గాని విభు
డెలమి నికయేల వచ్చును
కలిబోసిన యుట్లవంక గనుఁగొననేలా ౪౬

కం. ఇది యెదురుకోలునకు గా
గదలుచు నున్నా రరణ్యగతులకు నేని
ట్లెదిరెదిరి చూడఁబడు నా
మది వెట్టితనంబునకు విమర్శలు గలవే ౪౭

ఉ. ఎక్కడి లక్ష్మణుండు,వరియించుట లెక్కడ జేకురున్ వృథా
వెక్కురు సౌఖ్యమే నసుభవించుట లెక్కడ పార్థనందనుం
దక్కు వెనంగ కోరిక వెతావెతలై చనె నింక మీద వే
రొక్కని బొందుకంటె మెయినుండిన జీవమడంప మేలగున్ ౪౮

కం. కలకాలము ఘనతరులన్
ఫలభంగ మొనర్చు పక్షపాతములగు యీ
చిలుకల మెలఁకువ లెటిఁగి వి
మలమతినౌ మదవివేకమతి ననవలెగా ౪౯

సీ. స్వప్నలబ్ధములైన సౌఖ్యసంపద లట్లు
 [1] జలముపై వ్రాయు నక్షరములవలె
చిత్తరుప్రతిమల సింగారములభాతి
 త్యాగభాగవిహీనధనము భంగి
విపినంబులను నిండువెన్నెల పోలిక
 [2] వెలివానిపై మోహవేదనగతి
చిరకృతఘ్నునకు జేసిన యుపకృతిచాడ్పు
 దారిద్ర్యుని మనోరథము తెఱఁగు

తే గీ. చౌటభూమిని జల్లు బీజములవిధము
పథమెఱుంగని మన్మనోరథములెల్ల
నిష్ఫలమెగాక తథ్యమై నెగడ గలవె
వానితో పొందు నావంటిదాని కెందు ౫౦

చం. అని తలపోసి దుఃఖవివశాకులచిత్తముతోడుతన్ దివా
లున వెసలేచి యాపెరటిలో నొక కుందనికుంజమందిరం
బున బవడంపుమంచమున పువ్వులసెజ్జను బవ్వళించి నె
మ్మనమున మాటిమాటి కభిమన్యుని చింతనజేయు చున్నెడన్ ౫౧

ఉ. అంత ఘటోత్కచుం డడవియందుననుండియు ద్వారకన్ ప్రలం
బాంతకునింట లగ్నసమయంబును దాకొనఁగా నహస్కరుం
డంతట గ్రుంకుటం గని లయాంతకునిం బలె దోషవహ్నియం
తంత జెలంగఁ దమ్మనకు నమ్మలకుం దెలియంగ జెప్పియున్ ౫౨

కం. గగనతలమునకు చివ్వన
నెగసి ఘటోత్కచుఁడు యదుకులేశ్వరుభవనం

---

1. లిఖియించు జలముపై లిపులమాడ్కి
2. వెలయాలిపై మోహవేదనగతి. 'మూ'

బగు ద్వారకాపురముకడ
డిగి మెల్లన సందెచీకటిం బురిసొచ్చెన్ ౬౩

చం ఎలమిని దా పదృశ్యత వహించి పురంబును జొచ్చి వీధివీ
థులు బరికించి కాహళికదుందుభిపూర్యము లాలకించి యా
బలుని నిశాంతముం జొరంగ బాటె వివాహమహోత్సవత్వరన్
మెలంగెడువారి సందడు మేయికృధారసదృష్టి గన్గొనన్ ౬౪

సీ కవగొన్న మణిదీపకళికలకవ వెల్చి
యెలిమి నొండొరు లుండ మెన్నువారి
మొనసి పన్నీటిపెంబులు నింపి విచ్యంపు
టిరుగడదొరల కందిప్పువారి
సుమగుళుచ్ఛములు కస్తూరికరాటముల్
బూని హర్షమున సుపొంపువారి
నెమ్మిసంపెంగనూనియబుడ్ల నబుడించి
సొమ్ముల నాణెముల్ జూచువారి

తే.గీ. వచ్చిరదె పెండ్లివారు సవారి జూడ
పదుపదుండని తోదోపు లాడుగువారిఁ
గినిసి గని పండ్లు పటపట గీటుకొనుచు
రాక్షసేశ్వరుఁ డంతఃపురమున వెదకి. ౬౫

మ ఒకచోటం దనతోటిచేడియల సంయోగంబు వర్జించి నా
యక చింతావివశాత్మయై కుసుమశయ్యం జెందు తాలాంకపు
త్రిక నీక్షించి సుభద్ర మున్ను తన కర్థిం దెల్పురీతిం దొలం
గక చూడన్ శుభలక్షణంపు శశిరేఖాకన్యగా నెంచియున్ ౬౬

కం. తరుణీమణి నా తమ్ముడు
వరియింపఁగ నిట్టు లుండవలదేయని సం
బరమొంది నైజరూపా
పరవశమున నిడుకొనుచు నుపాయమొనర్చెన్ ౬౭

చం  మఱదలి ముట్టఁగూడదని మంచముతోడనె లేపనెత్తి తాం
బరవరశక్తిచే దివి సుపర్వులు సాక్షిగ వ్యోమమార్గ సం
సరణి వినిర్గమించి యనుజన్ముఁడు కల్గులు విస్మయంబుచే
నరయఁగ మంచముం బొలఁతి నగ్గిరిసీమను డించి యిట్లనెన్ ౫౮

ఉ  కాంచనగాత్రి నిచ్చటికి గైకొని దెచ్చుట పెద్దగాదు - క్రో
ధాంచితగర్వులై పరిణయత్వరసుండిన కౌరవావళిం
జించి చికాకుజేసి నృపశేఖరులెల్ల గమింగొనంగ నా
క్కించుక దుర్దశం బఱప కింతట నూరకయుంటఁ బాడియే ౫౯

చం  నరపతులెల్ల గొల్వ కురునాథుఁ డవారితగర్వధుర్యుఁడై
పరిణయలోలతన్ మిడిసిపాటున నుండినవాఁడు గాన-నే
కరణి సహింతు - నేను దపోగ్రపు మజ్జనకాళి సౌఖ్యముం
దెఱలఁగ జేయు నాటివగఁదీర్పక నేవితనాడవమ్మునే ! ౬౦

చం  అనుచు సుయోధనోన్నతుల నవ్వ వచింప ధనంజయాత్మజుం
డనలములో ఘృతం బిడినయట్లుగ జర్లున లేచి యచ్చటం
దను నిలువంగనోపక సతంద్రశరాసనబాణపాణియై
దనుజుని జూచి యిట్లనె మదద్విరదప్రతిబృంహితధ్వనిన్ ౬౧

కం  మనమిరువుర మొక్కటియై
జనకుల పగఁదీర్ప నిదియె సమయం బయ్యెన్
నను డించిపోవఁగా నీ
యనువున నొదిగుందుననటనె యాడుదిబోలెన్ ౬౨

కం  కౌరవపతి గర్వసమా
చారము విన్నపుడె మానసం బఱిమినం
బూరకను నిలువనొల్ల - నె
కేరీతిని నైన నత్తునే నీ వెంటన్ ౬౩

కం  భీమార్జును లెనసినగతి
గా, మనపిరపురము గలిసి కౌరవులను సం

గ్రామమున మద మణంచి - మ
హామహిమ న్సతిని బెండ్లియాడుట యొప్పున్ ౬౪

చం. అనిన ఘటోత్కచుం డతని హస్తతలంబులుబట్టి పల్కె ని
ట్లనిన బనియేమి కౌరవులహుంకృతి మాన్పఁగ నేనొకండ జా
లును, నతఁ డాజి మద్బలము లోగొనలేఁ డదిగాక వారి గీ
టణపఁగ వల్దటంచు భవదంబనియామక మున్నదే గదా! ౬౫

కం ఇంతన నేటికి వారల
గంతులు వేయించి తికమక న్గడుపగనే
డింతియెగాని తదీయుల
నంతము నొందింప దలఁప నది యట్లుండెన్ ౬౬

తే గీ నీవు మేనల్లుఁడవు, రౌహిణేయుమీదఁ
గత్తిగట్టుట న్యాయంబుగాదు తండ్రి,
పోయి కురురాజు నిరకటంబునను ద్రోయ
జాలుదునుగాని నీపైన మేలనయ్య ౬౭

కం. అదిగాక కాననంబున
ముదితలనికి క్రూరసమరమున కిరుపురమున్
గదియుట లధర్మమని నీ
మది నెఱుఁగవె రాజనీతిమర్మము లెల్లన్ ౬౮

కం. అని యనుఞ నూఅడించుచు
దనుబట్టిన కేలు విడిచి దనుజేంద్రుఁడు గ్ర
క్కున బొబ్బ లిడుచు చివ్వున
వినువీధికి నెగసె సురలు విస్మయమందన్. ౬౯

గీ. అపుడు శశిరేఖ దనుజమాయాసుషుప్తి
నెదలి కన్నులువిచ్చి నల్గడలఁ జూచి

గగనపరిచుంబితద్రుమాకలితగహన
వాటిపొదసూడ యబ్బురపాటుతోడ ౨౦

కం బలభద్రతనయ యెదుటం
బలవిక్రమరుచిసమాజు పార్థతనూజుం
దిలకించి విస్మయము బా
టిలఁగ సుభద్రాసతిన్ హిడింబిని గనియెన్ ౨౧

ఉ ఎక్కడిద్వారకాపురము, నెక్కడియీవిపినంబు కన్నుగూ
ర్కెక్కడ నిద్ర మేలుకొనుటెక్కడ, దవ్వననుండు మత్ప్రియుం
డెక్కడ, నేఁడు నేను గను టెక్కడ, మున్ను శుకంబుపల్కెన
మ్మక్క ముహూర్తవేళ నభిమన్యుని జూచెదవంచు నిక్కముల్ ౨౨

గీ అనుచు డిగ్గనలేచి మేనత్తపాద
ములకు మ్రొక్క ననుంగుకోడలిని దిగిచి
శిరము మూర్కొని కౌఁగిటఁ జేర్చుకొనుచు
హితవచోరూఢి నలయించి యిట్టు లనియె ౨౩

మ మును మాయన్న యనాదరోక్తులను నిర్మోహంబుచే వన్యభూ
మిని నేనీయభిమన్యుతోడఁ జనగా మీబావ మాబావకుం
దనయుండైన ఘటోత్కచుం డిచటి కాంతారాశ్రమంబందు నుం
డిన నన్సోదరు నాదరింపఁ బొడగంటి న్నిన్ను చంద్రాననా! ౨౪

కం అనుజునికొఱకై గాదే
నిను మాయానిద్ర బుచ్చినేఁడిట దెచ్చెన్
వనితా నీ తలిదండ్రుల
గనియెద విక నేఁటినాలుగవనాటి కొగిన్ ౨౫

చం అని శశిరేఖ సమ్మతిల నయ్యభిమన్యు నపాంగదృష్టిచే
గని యనురాగ మగ్గలముగా గనురెప్పల నప్పళించుచున్

మును దనునోఁచినట్టి వ్రతము ల్ఫలియించె నటంచు నెంచుచుం
దనతలిఁదంౘ్రులన్ హితులఁ దల్పకయుండె తదేకమోహియై ౨౬

చం అపు డభిమన్యుఁ డ త్తరుణియంగవిలాసముఁ జూచి చూచి మో
హపరవశంబునన్ మనసిజాస్త్రవికంపితుఁడై ఘటోత్కచుం
డెపు డరుదెంచునో యని నిరీక్షణ సేయుచు మన్మనోరథం
బిపుడు ఫలించెనేమొ తరళేక్షణ గంటినటంచు మెచ్చఁగన్ ౨౭

చం అవల ఘటోత్కచుండు గగనాధ్వమునం బటుసాహసప్రభా
జవమున నిర్గమించుచుఁ గుశస్థలి జేరి సురద్విషోచిత
ప్రవిమలశక్తిచే నొకయుపాయముఁ బన్ని బలాత్మజాకృతిం
భవనము జొచ్చి యొక్కెడల బంగరుమంచమునం బరుండియున్ ౨౮

చం వెలవక దైత్యమాయ నెఱవిద్యను తచ్ఛశిరేఖరీతిగా
కరము లురంబు గండములు కన్నులు చన్నులు మోము కంఠమున్
శిరము పదంబులు న్నడుము చెక్కులు ముక్కులు మాల్యభూషణాం
బరము లనన్యభూజనవిభాసితమై గనుపింపనున్నెడన్. ౨౯

తే గీ కన్నుగూర్కినట్లు కడుభీతి గొనినట్లు
చిన్నఁబోయినట్లు జలఁగినట్లు
దవిలియున్న సిగ్గు తలకెక్క నటుగా
మోము వంచియుండె ముగ్ధ పగిది ౩౦

కం బలభద్రుండు ముహూర్తము
దెలిసి సుయోధనునికడకుఁ దెలియుటకై వి
ప్రులఁ బంప వారలతిముద
మలరఁగ భూషణవిభూషితాంగులు నగుచున్ ౩౧

సీ ఘనమురజాదిమంగళమహావాద్యముల్
కకుబంతములు నింపి పికిలపాటి
కొనల ముత్తెఁపుజంపు గొడుగుల పడగల
తుదలభ్రములను తోదోపులాడ

బాణతూణకృపాణపాణులౌ భటకోటి
పదఘట్టనల దిగిభములు మ్రొగ్గ
వేణువీణానాదవిభవముల్ రంభాది
నిర్జరాంగనలు నిర్ణిద్ర గొలువ

తే గీ క్రమదంతావళమున లక్ష్మణుని నునిచి
ఘనరథారూఢుఁడై దాను కౌరవేంద్రుఁ
డాత్మతనయునిముందట ననుగమించె
వసుధదిగివచ్చు జంభారివైభవమున ౮౨

సీ. కర్ణాదియోధనికాయంబు లొకవంక
కర్ణోత్సవంబుగ గదిసి పలుక
గాయకవందిమాగధసూతు లొకవంకఁ
బద్యగద్యాములఁ బ్రస్తుతింప
ధరణీసురశ్రేణి,తాపసు లొకవంక
జయజయస్వస్తివాచన మొనర్ప
ప్రజ లద్భుతం బంద-నిజకాంత లొకవంక
ఘనవాహనము లెక్కి కదిలి చనఁగ

గీ తనుజు లనుజులు బంధువుల్ దవిలి నడువ
భటులు దౌవారికులు వేత్రపాణు లగుచు
పటుతరార్భటులను బరాబరులు సేయ
నడచె రారాజు పురవీధి కొడుకుతోడ ౮౩

కం కరదీపికాసహస్రము
లరుదుగ శోభిలఁగ వేశ్య లాటల నాశం
బురవీధి కెదురుకోలున
కరుదేరన్ రౌహిణేయుఁ డంతటిలోనన్ ౮౪

చం. పరిణయవస్తువుల్ కనకపాత్రములం దొనగూర్చి పుణ్యసుం
ధరులు పిఱుంద కొందఱు జనన్ వసుధామరు లాగమధ్వనుల్

నెఱిముఱిగా వచింప ధరణీవరకన్యలఁగూడి రేవతీ
తరుణియు వెంటరా నడిచెఁ దత్కురురాజు నెదుర్కొనన్మతిన్ ౮౫

గీ సారణానిరుద్ధసాంబోద్ధవాక్రూర
చారుదేష్ణముఖ్యు లీరసములు
మదిన దగి విలంబమందక పోరామి
వలన పెండ్లిజూడవచ్చి రపుడు ౮౬

కం హరి సాత్యకియుం దక్కఁగ
పురమునగలసకలయాదవులతోగూడన్
బురికొల్పి రౌహిణేయుఁడు
కురురాజుకుమారు నెదురుకొనఁగా నేఁగెన్ ౮౭

చం అనఘుఁడు రేవతీరమణుఁ డంతిపురం బటు నిర్గమించి- వా
ద్యనినదముల్ జెలంగఁ గలశాంబుధిఁ బొంగినయట్లు సంభ్రమం
బున నృపపుంగవుల్ బుధులపూర్వహితుల్ దగ వారి వారి వా
హనముల నెక్కిరాఁ గదను హాటకదీప్తరథాధిరూఢుఁడై ౮౮

మ దివిటీల్ వెన్నెలపంతియల్ మెఱుపుబత్తీ ల్కాగడా లారతుల్
భువనద్యోతులు మంచుబుడ్లు బిరుసు లోక్రంబత్తు లొకొక్కచా
లు వెయిల్వెల్గ సుయోధనుం డెదురుకో ల్కూడంగ నేతెంచె బం
ధువితానంబులు విప్రసంఘములు దోడ్తో వెంట నేతేరఁగన్ ౮౯

కం. యమునానదీప్రవాహం
బమరనదీపూర మెనసినట్లు పరీవా
రము దాను నెదుర్కొను కురు
సముదయమున్ వాహనములపరను నడిగియున్ ౯౦

తే గీ విరులు గంధవళ్లు విమలశుభాక్షత
లొకరికొకరుఁ జల్లుచుండునంతఁ

దత్పరాగముననుఁ ధరణీతలం బెల్ల
చిత్రలేఖనావిచిత్రమయ్యె ౯౧

మ. పునుఁగుం గస్తురి క్రొవ్విరుల్ సురభి కర్పూరంబు జవ్వాదిప్రే
మను నొండొర్ల కలంకరించుకొని సన్మానంబుగా నాదర
ప్రణతాశీర్వచనానులాపముల సంభావింపుచున్ వారివా
రిని యాలింగన మాచరించి వినయప్రీతిన్ సుఖాసీనులై ౯౨

కం. అపుడు కృతవర్మముఖ్యులు
కృపసైంధవకర్ణశకునిగురునందనులన్
విపులమతిఁ బూజజేసిరి
కుపితమతిం బ్రజలు మెచ్చుకొఱకు నరేంద్రా! ౯౩

ఉ. యాదవకౌరవప్రమద లందలముల్ డిగి యొండొరు ల్మహా
హ్లాదము మీఱ చందనసుమాక్షతలుం బ్రియమొప్ప నిచ్చుచో
మేదురనర్మగర్భరసమేళనసూక్తులు సఖ్యతాసము
త్పాదనగా వచింపుచు హితక్రియఁ బూజ లొనర్చి రెంతయున్ ౯౪

ఉ. ఆయెడ రేవతీరమణి యర్జునసూనున కాత్మపుత్రికం
బాయక నిత్తు నన్పలు కబద్ధము నొటకు నెమ్మదిం బగిం
బాయని చింతతోడ నిజభర్తనియోగమునం గురుక్షితీ
నాయక పత్నినిం గలిసి నవ్వుచుఁ బూజ లొనర్చె నర్మిలిన్ ౯౫

చం. ఇరుదెసవారలుం గవిసి యీగతి మంగళతూర్యనాదముల్
మొఱయఁగఁ బుణ్యభామినులు ముందట నాట్యము సల్ప వేత్రసం
భరణభటావళుల్ పథము బాపి బరాబరిజేయ సీరి మం
దిరమునకుం గమించిరి మదించి,గజేంద్రము లట్లు మెల్లగాన్ ౯౬

కం. ఇరువు రల భాగ్యవైఖరి
పురజను లీక్షించి తాము బుద్ధిని తర్కిం

చిరి హలికి తగునె యీడు
ష్కరకౌరవనందనునకు కన్యక నొసఁగన్ ౯౭

సీ తనసహోదరితోడ తగ నమ్మబల్కిన
మాటనేఁటికి నేఁట నేటఁ గలిసె
హరిసాత్త్వికులసీతు లెల్లఁ బడఁద్రోసి
యిల్లుని జెల్లెలి నడవి కనిచె
మనుఁ దర్జునునియెడ కసిఁ బెంచి తలిదండ్రు
లెల్లవంగులఁ జెప్ప నీసడించె,
దారిద్ర్యులని పాండుతనయుల నిందించి
బలుఁడౌ సుయోధను కలిమి వలచె

తే గీ కోరి యపకీర్తి వెలఁబెట్టి కొనఁగదలఁచె
గాని, కలకాల మొకరీతిఁ గనవె సిరులు
ధర్మవిదులైన పాండునందనుల వలన
జెలిమి చవిఁ జెంచె నిదియేమి చేటు హలికి ౯౮

కం అని గుంపుగుంపులై పు
జను లచ్చట నిచ్చటం బ్రశంసలు సేయన్
మనుజాదినాథుఁడుం దా
నును కౌరవభోజయదుజనులతో నడచెన్ ౯౯

ఉ లీలను లక్ష్మణాహ్వయనశిందధరాతలమందు - మత్తశుం
డాలము డించి, ద్వారనికటంబులఁ జిత్రితశాలలం సము
త్తాలగదుత్మదోపలవితాన సమంచితతోరణంబులన్
వేల నతిక్రమించి శుభవేదికయందున జేర్చి తూర్ణతన్ ౧౦౦

చం. తరతమభావరీతులను దామును వారును చిత్రకంబళా
స్తరణముల న్వసింప వసుధాదివిషజ్జను లాగమోచితా
చరణశుభక్రియ ల్సలుప సంభ్రమతం గరదీపికాసహ
స్రరుచిరమై జెలంగు శుభసద్మము కన్నులపండువై దగెన్ ౧౦౧

చం సరసిజలోచనుం డపుడు సాత్యకియుం దను గొల్చిరాఁగ - ద
త్పరిణయమంటపంబునకు దానయి దా నరుదెంచి యొక్కచో
స్థిరమణిపీఠియందు నివసించి కిసుంగొనుచుండె - సందుకొం
దరు విదురప్రవృద్ధులుం దదుచితస్థితు లారసి మున్పువాదఁగన్ ౧౦౨

చం అపుడు సుయోధనుండు దనుజాంతకుఁ డున్నతెఱం గెఱింగి - త
త్తపనతనూభవాదిముఖ్యప్రధానుల గన్గొని గంటిరే హరి
న్నిపుణత పాండవాత్మజుల నిందవనొనర్పు బ్రపలంబవైరిపైఁ
గుపితమనస్కుఁ డౌచు పగగొన్నదెటుంగునె నున్నవాఁ డిటన్ ౧౦౩

కం. తన పూనిక దప్పెనటం
చని మనలం జూడనోడె నిటుగాకున్నన్
తనుదానె పెక్కుఁబోకల
పనులుం గొని విఱ్ఱవీఁగి దాల్పకయున్నె ౧౦౪

కం ఇతఁడే ప్రాపని కుంతీ
సుతు లతులితగర్వమతిని జూపుచునున్నా
రితరములు మాని పసమ
ద్భుతగతి దరుమంగతేమె పొలిమెరదాటన్ ౧౦౫

మ తనతో మంచితనంబు జేయుటకునై వహారాష్ట్రి సున్నాఁడు నే
కను సైగం బిలువంగవచ్చు గరిగా గన్పట్టె నేనేల నీ
తని బిల్వం బనియేమి రాగిలపనుల్ దప్పింప నెంచుండు సం
జనితాక్రోశమున నరించిప విని యా సైనేయుఁ డత్యుగ్రతన్ ౧౦౬

కం కురుపతిని దద్బలంబును
బరిమార్చెద నంచు కోపపరితుఁ డునన్ నీ
కరమూర్తియగును నిచిన
హరి గనుఁగొని యుపశమంబునగునటు బల్కెన్ ౧౦౭

ఉ కాగలకార్యముల్ కనుచాంపక నిండియికోక [illegible]
వేగిరపాటు [illegible]

లాగువచించు నందు కవిలంబముగా ననుభావ్యకాల మె
ట్లాగతమౌనొ దాని నఱయందగుఁ దాల్మి వహింపఁగాదగున్ ౧౦౮

గీ తడవులేదిక నీసుయోధనముఖులకు
డాయు పడుబాట్లు నీవె చూడంగలావు
కార్యము తెఱంగు గానక గర్వమునను
ద్రుళ్లెదరు వీరు దుష్టబాంధవులుగాన ౧౦౯

కం హరి యీలాగున సాత్యకి
కెఱిఁగించిన తాల్మిచే గ్రహించి పరిణయాం
తరభావికార్య మరయుచు
పెఱిగిన రోషానలంబు పెల్లడఁగించెన్ ౧౧౦

కం అంతన్ రాజపురోహితు
లెంతయు లక్ష్మణుని సుమణిహితపీఠమునన్
వింత ల్గులుకఁగ నునిచి య
నంతరనియతోపకరణనయమార్గవిధిన్. ౧౧౧

చం రయమున నాచరించుచు విరామములేదు ముహూర్త మంతరా
లయముననున్న కన్య నవిలంబముగా గొనిదెం డటన్న ద
త్ప్రియమతి చేటికల్ కపటవేషమునం బవళించుబోఁటి ని
శ్చయశశిరేఖగా గని హసన్ముఖలై వచియించి రర్మిలిన్. ౧౧౨

కం నీ వత్తింటికి జన బల
దేవుఁడును మేము నిన్నతిప్రేమగనన్
వేవేగ వచ్చుచుందుము
మావలని దయాప్తి నెట్లు మనచెదొ తరుణీ ౧౧౩

ఉ. వీని వరించితేని యరవిందదళేక్షణ రాజరాజు స
న్మానముసేయు నిన్ను, కురుమండలికిం దొరసాని వౌదు భా

గ్యానుభవంబులం గొఱఁతలందని సౌఖ్యములందె దింక - నీ
యానవివాహమంటపమునందు వసించెను చూడు లక్ష్మణున్ ౧౧౪

కం ఈలాగున కాలోచిత
లాలనలం బలుకు చేడెలం గని - మాయా
బాలామణి కుపితానుగ
తాలాపముల న్వచించె నందఱితోడన్ ౧౧౫

తే.గీ. ధీరుఁ డభిమన్యుఁ డడవి కేతెంచినపుడె
గుండుకట్టుక నొకనూత గూలనైతి
నింక నామేలుజోలి మీకేలనమ్మ
నన్ను నిద్దురమేల్కొల్పకున్న జాలు ౧౧౬

చం మగఁడిక లక్ష్మణాహ్వయుఁడు, మామ కురుక్షితినాథుఁడైన యీ
మగువలతోడ నాకు మొగమాట మికేమి ప్రియుండు నాయెడం
దగునెనరంటె నేని హలధారియె గాని విధాతగాని - నే
వగలకునైన నింటితలవాకిలి ద్రొక్కఁగ నిత్తునే యిఁకన్ ౧౧౭

కం మాయింటికోడలే యని
మాయత్తయు మామ నాకు మాటాడినచో
వాయెత్త నీక నొకయెడ
నేయొత్తిగిలంగఁ ద్రోయనే యడుగంటన్ ౧౧౮

కం అనినన్ మాయాకన్యక
యని దెలియకఁ దత్సతీచయము వెల్వెలనై
కనురెప్ప లార్చుచుం దమ
కనుకూలముగా వచించి రచ్చెరువగుచున్ ౧౧౯

చం. అలుక లికేల నీవనినయ ట్లొనరించెదగాని లెమ్ము లె
మ్మలికులవేణి నీవిపట నాలసియింపకు లగ్నకాలమ

వ్వల నిదెదాకొనెం దడవుపల్లిక నిన్గానెదె మ్మటంచు - న
బ్బలు డిటి బంపె మాకు పలుబల్కులికేటి కటంచు లేపినన్. ౧౨౦

తే గీ బిట్టు పెనుపాతములు మిమ్ము బట్టినట్లుఁ
పరుల బరువెల్ల మీనెత్తిఁ బడినయట్లు
వచ్చి పలువురు పలునోళ్ల వదరఁదగునె
యెవరికోపంబు నాకేమి కింతులార ౧౨౧

కం అంగన లందఱు నీగతి
గొంగటిలో రాళ్లవైచి గ్రుద్దినగతి పల్
భంగులఁ బల్కుచు దంభకు
రంగేక్షణ లేచె ముఖదరస్మితమొప్పన్ ౧౨౨

కం మగవారి కెన్నడుం దా
నగపడని తెఱంగుదోఁప నతిభీతి మెయిన్
మొగమవని వ్రాల్చి మదమే
నుఁగ నడక నలరఁగ మేడనుండి దిగి వచ్చెన్ ౧౨౩

ఉ కౌను జలింప నెమ్మొగము కాంతి వహింప ప్రపాతభీతిమై
యానము మందగింప సమనాబ్జములు న్మొకుళింప నూపుర
ధ్వాన మడంప తోటినెలఁతల్ తనమట్టును సందడింప నె
మ్మేను జెమర్ప నింపుజెలిమి న్పచెంప గమింపఁగాఁ దగెన్ ౧౨౪

తే గీ ఇట్లు జనుదెంచు దంభకుంభీంద్రగమన
నగ్రజన్ములు విధివిధాయకవిరూఢి
తత్తదుచితక్రియలు పథాధవు కపుడు
ప్రేమ నొనరించి పరిణయపీఠికుంచి ౧౨౫

కం ఇరువురకు బ్రాఙ్ముఖతఁ
హరిదభిముఖముగ నిలిపి యంతటిలో సన్

నెఱిపట్టు పుట్టమున నొక
తెరపట్టుగ బట్టఁగా విధించిరి విధిగన్ ౧౨౬

చం. మురజమృదంగదుందుభులు మ్రోయ శుభోన్నతితోడ వృద్ధభూ
సురవరు లాగమప్రథితసూక్తుల దీవనలీయ వారసుం
దరులును బుణ్యకాంతలు యథావిధి మంగళము ల్వచింప ద
త్కురుకులరాట్కుమారుని వధూమణినిం దెలవాటు నిల్పినన్ ౧౨౭

కం. మెప్పుగ లక్ష్మణుఁ డాప్తులు
జెప్పఁగ మునువిన్నకతన చేడియనిక నే
నెప్పుడు జూతు నటంచని
రెప్పలనిడకం దదైకదృష్టిఁ గనుగొనెన్ ౧౨౮

చం. తదుచితగోత్రనామములు తజ్జనకప్రపితామహాదిసాం
ప్రదముల నుచ్చరింప నరపాలురు పౌరులు గుంపుగుంపులై
పొదవుచు వేడ్కఁ జూడ రవిపుత్రజయద్రథసైంధవాదు లిం
పొదవఁగ నవ్వధూవరమహోత్సవము ల్గనుగొంచు నుండఁగన్ ౧౨౯

కం. జీరకగుడముల నిరువురు
కోరిక శిరములను నుంచుకొని తెరనెత్తం
గారాబుబలునిపట్టిని
యారాజకుమారుఁ డధికహర్షత జూడెన్ ౧౩౦

కం కుందనపుబొమ్మవలె జను
లందఱకుం గానుపించి యాలక్ష్మణుఁ డిం
పొంద పొడసూడఁగా నొక
కుందేలై ముసుఁగులోన గునగుననెగిరెన్ ౧౩౧

సీ. ఇదియేమొ నేడప్పు డీక్షించితి నటంచు
గనుఁగొన నొక పిల్లి గతిఁ జనచ్చె

వెండి యతం డాత్మ వెఱఁగంది మాడఁగా
కోఁతియై తనమ్రోల కొక్కిరించె
భ్రమసితి నంచుఁ దప్పక నిరీక్షింపఁగా
భీకరాకృతిని భల్లూకమయ్యె
నిది యద్భుతం బేమి హేతువో యనిదల్ప
బలుకొండ ముచ్చు రూపంబు జూపె

తే గీ తొలుత బంగారు బొమ్మగాఁ దోఁచినట్టి
కలికిమాటికి నొకవింత గానఁబడియె
భ్రాంతియో లేక వలరాజు వలుపతనమొ
సిగ్గు మదిమాని యెవరికి జెప్పరాని
కార్య మొదవె నిదేమంచు గళవళించు ౧౩౨

ఉ ఈతరుణీలలామను మునీంద్రుఁడు మున్నభివర్ణనీయవా
క్చాతురిమీఱఁ బల్కుట నిజంబని నమ్మితిఁ గాని నేటికీ
రీతి ననేకరూపవిపరీతములై గనుపించె సిక్కమౌ
నాతి యిదేని నాకిటు గనంబడనౌనె వికారరూపముల్ ౧౩౩

కం ఐనా మన్మదనాతుర
తానిరతిం జూడచూపుఁదట్టె నిదేమో
కానియని కనులుదుప్పటి
చేనొత్తుచు మగుడ తెలివిజేకొని చూడన్ ౧౩౪

చం గరళము గ్రక్కుచున్ ఫణవికాసము జూపుచు క్రూరదంష్ట్రవి
స్ఫురితకరాళవక్త్రమున ఫూత్కృతులు న్వెడలింపుచు న్విభా
స్వరరసనాగ్రముల్ వెలికిఁ జూపుచు క్రూరభుజంగ మాకృతిం
దెరిగి పయిం బయిం బడిన బెగ్గిలి పండ్లిగిలించి మూర్ఛిలెన్ ౧౩౫

చం అది గని రాజకాంతలు ధరాధిపులుం ద్విజేంద్రు మాయగా
మదిఁ గనలేక లక్ష్మణకుమారుని నష్టవికారచేష్టలం

గడియుట వింతలై పెఁ పిక న్నగఁగా మది సిగ్గుజెంది స
ట్లు దలనువంచె నక్కవఖలోలవిలోచన మోహనాకృతిన్ ౧౩౬

తే. గీ. లక్ష్మణునకనుమాత్ర మీలాగు దోఁచ
నితరజనులకు భువనమోహినితెఱఁగున
గానఁగానయ్యె నింతటిలోన నతఁడు
తెలివినొందిన మతితోడ దేసిఁజూడ ౧౩౭

చం. మునుపటి ఊపులంద ననుమోసమువుచ్చిన భీతిచే గనుం
గొన నొక బెబ్బులింబలెనె కోఱలుగీటుచు భీమహుంకృత
ధ్వనులెసఁగం గరాళతరవక్త్రిముజూపి చివాలునం బయిం
బెనుగొని దూకినట్లయిన బీతిలి పెద్దయెలుంగుతో ననెన్ ౧౩౮

ఉ. పాపఁపు గబ్బిబెబ్బులిని ఒత్నియటంచని బెండ్లిజేసి నా
రూపణఁగించ నేటికి మొరొ మొరొ పెండిలికూతుగాదయో
యీపగిది వ్యదుబ్రవజము లిండ్లమెలింగెడి పెద్దదేవరం
జూపి వివాహమంచు పెనుసోకుడుపాల్ ననుజేతు రయ్యయో ౧౩౯

కం కలమేన బ్రాణముండిన
బలుసాకుఁ న్మెసఁగియైన బ్రతికెద నిక స
న్నిలుజేర్చుము తంబ్రీ- నా
తలపై పదివేలయేండ్లు ధరణిన్ మనవే ౧౪౦

ఉ ఎక్కడిపెండ్లికూఁతు రికయెక్కడ సుద్వహ మింతలోన నం
బ్రొక్కి వధింపదే యడుగు దొల్లగనిచ్చునె మేనబ్రాణముల్
దక్కినజాలు రాజ్యసుఖదంబులు కామినులేల మీకునే
మ్రొక్కెద నన్నలార పులిముందఱ బ్రోయక పోవనీయరే ౧౪౧

గీ తొలుతఁ గన్నులబండుపై దోఁచి తుదకు
కోఁతికొండెంగ కుందేలు గుడ్డివెలుగు

పెద్దవుఇంట్ల యాదవుల్ బెంచియున్న
దయ్యములజూపి నను జంపదలఁచిరేమొ ౧౪౨

కం నే మొత్తోయని వఱలఁగ
పాముల గాములను దెచ్చి బలవంతముగా
కామినియని జూపెద రది
సేమమె నాపెద్దపెండ్లి జేసెదరేమోఁ ! ౧౪౩

కం ఆన్నారమపచనంబులు
విన్నదిగా మొదలు ప్రీతి వెస మజ్జనకుం
డిన్నాళ్లు నన్ను బెంచి మ
హోన్నతశార్దూలభుక్తి కొసఁగు నిజముగన్ ౧౪౪

కం. అని వావఱచెటి కురురా
ట్తనయుని గని జనము లద్భుతమున సమీపం
బున కేఁగి వెన్ను జఱచుచు
సనయత మాయాబలాత్మజాతం జూడన్ ౧౪౫

చం. పలుచని మోవితో మెఱుఁగుబంగరు మేనితొ సోగముక్కుతో
తెలినగుమోముతో కనులదీర్చినకాటుకనిగ్గుతో తళ
త్తళరుచివేణితో మృదుపదంబులతో చిఱునవ్వుతోడ సి
గ్గొలయఁగ జూచువారి నయనోత్సవమై గనిపించె నత్తఱిన్ ౧౪౬

చం అది గని యచ్చటం గల జనావళి యచ్చెరువంది పల్కె రీ
సుదతి మనోహరాకృతిని జూడఁగనోడి మనోజవేదనన్
గుదిగొని వెఱ్ఱివానివలెఁ గూయచొదంగెను యిట్టి దుర్దశా
స్పదునకు సుందరాంగిని యొసంగఁగ నెట్లు విధాత గూర్చెనో ! ౧౪౭

తే.గీ కాంచనమునకు మణి యలంకారమైన
మాడ్కి శశిరేఖ కయ్యభిమన్యుఁ డుండ
వీఁ డనుభవింపఁగోరుట వెఱ్ఱిగాదె
లక్ష్మణుఁడు గాడు వీఁ డపలక్షణుండు ౧౪౮

ఉ అందుకుఁ గర్ణముఖ్యులు మహాద్భుతమంచును బల్కి రిట్లు-మే
ల్కాందనఁపున్ సలాకు ఏగ గుబ్బెడు కన్యను జూచి లోపు లా
నందముఁ జెంద నీవు మదనత్వర నున్మదివై దురూక్తులన్
నింద యొనర్ప నీకు దగునే యిటు చక్కని రాజకూఁతురిన్. ౧౪౯

కం పెనుభూతము నిను సోకెనా
కనులం గనుఁగొనవా కన్యకామణి రూపుం
గని కళవళించె దోపులి
యని యెలుఁగని భూతమని మహార్భటు లేలా ౧౫౦

కం చెలు లెల్లఁ జూచి రోయం
బలభద్రుని మనసు నొవ్వ బంధులు నొవ్వన్
గలవార లిట్లు పదఱుట
తలవంపులుగావె నీకు తలిదండ్రులకున్ ౧౫౧

కం నిను చుట్టుముట్టి మేమీ
యనువున గాపాడుచుండు నంతటిలోనన్
మినుతూఁటు బుచ్చుకొని వ
చ్చెనె బెబ్బులి వినఁ గన న్విచిత్రముగాదే ! ౧౫౨

కం ఐనా యింకొకసారి - ని
దానింపుచుఁ జూడు మనుచు తరుణీమణికై
వాని మరల్చి కనుంగవ
చే నీరును నొత్తి బుద్ధిఁ జెప్పిన నతఁడున్ ౧౫౩

తే గీ బంధుజను లిట్లు దెల్పి నిర్బంధ మునను
గడుభయంబున మూసిన కనులు దెఱచి
గడగడ వడంకి పెదవులు దడపుకొనుచు
గ్రమ్మఱను జూడ దనుజుఁ డుగ్రగతితోడ ౧౫౪

కం మిడిగ్రుడ్లుం బెదకోఱలు
కడువిపులశిరంబు తొట్టికడుపు న్నిడుపుం

జడలుం బిగియొడలుం గల
బెడిదఁపుభూత మయి పయిఁ గభీలున దూకెన్ ౧౫౫

చం. కనుఁగవ విస్ఫులింగములు గ్రక్కుచు శూలము కేల ద్రిప్పుచుం
గినుకను నోట నెత్తు రొలకింపుచు కోఱలు గీటుచు న్మహా
ధ్వనుల భయావహంబుగ నదల్చుచుఁ బైనొకమాత్రమై - చివా
ల్నను బడిదూకిన ట్లయిన లక్ష్మణుఁ డార్చుచు భీతచిత్తుఁడై. ౧౫౬

తే:గీ. మేన తలగుడ్డ మొలగుడ్డ మాని పుడమిఁ
బడుచు గిజగిజ కొండొక తడవుఁ బొరలి
లేచి వడఁకుచు చేతులు జాచి నిఖిల
బంధుతతి జూడ నిట్లనె భయముతోడ ౧౫౭

చం పొలతియె గాదుగాదు పెనుభూతమె గాని మదీయమృత్యువై
దలఁపడు టింత గానక హితప్రతతిం బలె గుంపుగుంపులై
పలుమఱు చుట్టుముట్టి నను బాధలు బెట్టఁగనేల నయ్యయో
నెలకొని మేన బ్రాణములు నిల్చిన జాలిక పోవనీయరే ! ౧౫౮

తే గీ. చెలిమె నీరు ద్రావి చెట్లాకు దుంపలు
మెక్కి మౌనిమాట నిక్క మనుచు
నమ్మి పెండ్లిజేయ నాతండ్రి సమకట్టె
నిచట నాదుప్రాణ మేగవలసి ౧౫౯

చం. అని శుభవేది డిగ్గి జను లందఱు త న్వెరగంది జూడ స
య్యన నొక గుంపులోఁబడి దిగంబరుఁడై వడిఁ బాఱ వెంటనే
దనుజుఁడు భూతమౌచు వెనుదొలుకనార్వఁగ భీతమానసం
బున దలిదండ్రులన్ హితుల భోరున బిల్చుచు కంపితాంగుఁడై ౧౬౦

చం. అసురుఁడు భీతభూతభయదాకృతి నీగతి వెంటనంటఁగా
ఢిసమొల గంతులేయుచును దీటత కొండటికాళ్ళ(వేళ) మా

తెసఁగ వెనంగుమన్ మఱుఁగుటిండ్లను దూఱుచు వెల్కి బాఱుచుం
బుసబుస రోజుచుం ధరణిఁ బొర్లుచు లేచుచుఁ బాఱుచు న్నెదన్ ౧౬౧

గీ. ఆయసురమౌళి తన మహామాయవలన
విషభుజంగమతతుల వేవే లొనర్ప
నవి భయంకరఫూత్కార మడర వెడలి
విప్రతతి వెంటఁబడ వారు వెఱచి పఱచి ౧౬౨

చం. పరువడి వార లొండొరుల పైఁబయి ప్రాలుచు లేచి పొరులం
దరుగని దల్లడిల్లఁగ బదంబులు తొట్రిల గంతులేయుచున్
నెఱి సిగముళ్ళు వీడగను నెవ్వగ మేనులుఁ జెమ్మరింప దు
ర్భరత మొరో మొరో యనుచు బాఱిరి క్రూరభుజంగభీతులై ౧౬౩

కం. అంతట మాయాదనుజుం
డంతంతకు చిత్రగతుల నాశీవిషముల్
వింతలగు వృశ్చికాదిమ
జంతువుల సృజించె సకలజనభయదముగన్ ౧౬౪

కం. కాకోదరవృశ్చికతతు
లీకరణిం బొడమి ప్రజల నిట్టట్టుగ చీ
కాకుపడ వెంతనంచె మ
హాకులమతి కామపాలుఁ డచ్చెరువందన్ ౧౬౫

తే. గీ. శకునిబాహ్లీకకర్ణదుశ్శాసనాది
యోధు లాసర్పవృశ్చికబాధలకును
దిగులుపడి జాలి వెడలఁగా తెఱవుమాలి
నిలిచి నిశ్చేష్టితాకృతుల్ బొలచి రపుడు ౧౬౬

కం. ఆయెడ దానవమాయో
ఛాయ బనన్ ప్రకటతరక్షుభల్లంబులనే

కాయుత సంఖ్యలు బొదమఁగ
మాయాశశిరేఖ మాయమాయె గృహమునన్ ౧౯౬

గీ ఆవికారమృగావళి నఖిలజనులు
జూడ లక్ష్మణువంత మాసురుల చింత
బలుసిధావంత మార్తులౌ ప్రజయలంత
నొగిలె నంతంత ద్వారకానగరమంత ౧౯౭

ఉ పాములు తేళ్లు జెఱ్ఱులును భల్లము లుగ్రతరక్షుజాల మీ
హామృగము ల్సహస్రములునై జనియించియు వృద్ధిబొంది గో
త్రామరరాజపౌరజనతాపరిపీడన జేయ భీతిమై
వేమరు రామునిం గవిసి వేమరులై పెడబొబ్బ లేయుచున్. ౧౯౮

సీ. కాళ్లచేతుల నుగ్రకాలాహులు బెనంగ
వదిలించుకొనలేక వణకువారు
కఱకుతేళ్లను మంత్రగబ్బ లంటించిన
విదలించుకొనలేక వెదుకువారు
బొబ్బలేయుచు కాఱుబెబ్బులు ల్గవిసిన
వలువలు పీడంగ వఱలువారు
తమకెదుర్పడు రాజతరుణులతో నైన
మెడ కౌఁగిలించుక మిడుకువారు

తే గీ. భల్లవృకముల గనుగొని భయము జెంది
యురుకుచో నొక్క రొకరిపై నొఱుగువారు
మోటుమెకముల గని యాటబోఁటిఁమ్ముల
చింగులమరుంగులోన నణంగువారు ౧౯౯

చం. కఱకుమెకంబులుం గదియఁగా గని భీతిని విప్రు లన్యసుం
దరుల స్వభార్యలే యనుచు దాపునకేఁగి పయంట లిగ్గుచున్
వెఱవకుఁ డంచు వెంజఱచి వేరొకవాడల గోదమాటుకుం
బొరిబొరి వారి నీడ్చుకొనిపోవుచు నుండు దురాత్మవిస్మృతిన్. ౨౦౦

సీ. ఒడలెఱుఁగనిభీతి నొండొరు ల్దాకుచో
నడియాసమును గ్రుద్దులాడువారు
మెసలనీక భుజంగవిసరము ల్గవయుచో
పందిటికంబముల్ ప్రాకువారు
తొడిబడి క్రూరజంతువు లడ్డుపడినచో
ఎదలు మోదుకొని బిట్టేడ్చువారు
నెట్టిహీనుఁడు తమ కెదురేఁగుచున్నచో
రక్షింపుమనుచు బోరగిలువారు

తే.గీ. మఱదు లత్తలు మామలు మగలుజూడ
వెలఁదు లాత్రిని గంతులువేయువారు
క్రూరదానవమాయాప్రచారములకు
బీరముల మాని బొరియల దూఱువారు ౧౭౧

ఉ. కౌరవయాదవావళి చికాకున మేనులు ద్రిమ్మరింప వి
స్తారభయాకులత్వమున దల్లడ మందుచు గుంపుగుంపులై
బాఱిరి యందులో నొకఁడు పాండవపక్షముగాన మాధవుం
డూరక జూచుచుండె దనుజోజ్జ్వలమాయ లడంపజాలియున్. ౧౭౨

కం. దనుజుం డీగతి జననీ
మణి నెవ్వగ మదిఁ దలంచి మాయోపాయం
బున చిందఱవందఱలై
జన నందర గర్వభంగసరణి నడంచెన్ ౧౭౩

చం. అపుడు కురుక్షితీశుఁ డరుణాత్మజ సైంధవశల్యముఖ్య ధీ
నిపుణుల గాంచి యిట్లనియె నెమ్మని మీర లఖండధైర్యని
శ్చపలత గల్గి భీరువులచాడ్పున నిట్ల చికాకుజెందుటల్
నృపతికి లౌకికంబున కనీతియు లాఘవముం ఘటింపదే. ౧౭౪

మ. ఎవఁడో పాండవపక్షపాతమతి నేఁడీలాగు దుర్వృత్తికిం
దవులంబోలు నటించుఁ దోఁచె మనమీ ధైర్యంబు బోకార్చుచే

యవమానం బటుగాన సీరిభవనం బందుండి సాధింపఁగా
నవశంబౌ పురినుండి వెల్వడిన బాహాబాహి పోరందగున్. ౧౭౫

చం. అని పురికొల్పినన్ సమరధాతిరథాదులు శస్త్రపాణులై
మొన లొనగూర్చి సద్భటసమూహముతో శరచాపఖడ్గసా
ధనములఁ బూని బాహుబలదర్ప మెలర్ప నహంకరింపుచుం
గనుగొనుమంత చండరవికైవడి కౌరవభర్త వెల్వడెన్ ౧౭౬

చం. అటువలె రాజరాజు బలునంతిపురంబు వినిర్గమించి యు
త్కటభటవాజిసింధురరథప్రచయంబు స్వపక్షరాజరా
ట్పటల మొకుమ్మడిన్ నభము బద్దలువాయ వికారపటంకృతా
ర్భటు లెసఁగన్ బురంబు నలుప్రక్కల గ్రమ్మి రనేకభంగులన్ ౧౭౭

ఉ ఆయెడ భీమసూనుఁ డతియాగ్రహుఁడై దివి నంటి నైజమా
యామయితశక్తితోడ బ్రళయాంబుదమున్ సృజియింప నల్గడల్
బాయక చిమ్మచీఁకటులఁ బర్వి మహాధ్వని మింట గర్జనల్
జేయుచు చిమ్మిరేగె జనచిత్తభయంకరణైకహేతువన్ ౧౭౮

చం మెఱుపులు గ్రమ్మి చూడ్కి మిఱుమిట్లు గొనంగ తళత్తళచ్ఛ్వతిం
బెరిగెను నీరదంబు లతభీమగతిం దశదిక్తటంబులం
దురిమె మహాశనిప్రచయ ముగ్రగతిం ధరఁగూలె చేటతో
జెఱగినరీతిమై నురిలె శీతజలాశ్మనికాయ ముద్ధతిన్ ౧౭౯

సీ బలువిడి గుడ్లగూబలు కూత లిడినట్లు
వలగొన్న నక్కలు వఱలినట్లు
కఱకుటాఁబోతు లొక్కట రంకె లిడినట్లు
చెలరేఁగి పులులు ఘోషించినట్లు
గండుఁబిల్లులు గూడి కొట్లాడుచున్నట్లు
సింగంబు లార్భటుల్ జేసినట్లు
ఘోరభల్లూకముల్ గ్రుద్దులాడినయట్లు
మొగి సారమేయముల్ మొఱిగినట్లు

తే గీ. గుంటలో గాం(డ్రుకప్పలు గూసినట్లు
ధరణి జనులెల్ల గుండెలు తల్లడిల్ల
హల్లకల్లోలముల మింటనెల్ల కదల
దవిలి చెలరేగి ఘోషించె దనుజవరుఁడు ౧౮౦

చ॰ సురుచిరగీతవాద్యములు సుస్వరభాస్వరవేదశాస్త్రవి
స్ఫురితనినాదముల్ ద్విరదఫూత్కృతబృంహితముల్ తురంగహేషిం
కరణములున్ ఖరార్భటవికారములుం దివినుండి యొక్కమై
మొరసె దిగిభకర్ణపుటముల్ బధిరీకృతభావ మేర్పడన్ ౧౮౧

సీ తొలుదొల్త నుఱిమి నెత్తురువాన లొల్కెనం
తట వర్షపాషాణతతులు గూలె
ఫెళఫెళధ్వనులచే పిడుగు లిమ్మడిఁదొల్తె
చలితేళ్ళమూఁక జల్ జలున రాలె
గండశిలాది(ప్రచండపాతము దోఁచె
కణకణచటులాగ్నికణము లురిలె
ముసలముద్గరముఖామోఘసాధనలచే
భటశిరస్తాడనార్భటు లెసంగె

తే గీ దనుజుఁ డుద్దండగతి నిట్లు తాండవింప
నపుడు గంధర్వకిన్నరయక్షసాధ్య
గణము లుత్సాహలీల నాకాశవీధి
నుండి కయ్యంబు గనుఁగొనుచుండి రంత ౧౮౨

గీ అపుడు నారదమౌనీం(ద్రుఁ డతి(ప్రయత్న
మల్లనాట్నుండి తాఁజేయునట్టి పనికి
నేఁడు ఫలకాల మిట్లు చేకూరె ననుచు
మానసంబున సంతోషియై నటించె ౧౮౩

కం. ఈరీతి దనుజవరుఁ డతి
ఘోరవ్యూహఁ జెంద-జేయ కురుబల మొకచో

తారసిలి శింజినీరం
కారంబు లొనర్చి రౌద్రగతి గర్జిలుచున్ ౧౮౪

గీ. కర్ణసైంధవశల్యవికర్ణశకుని
గురుతనూభవకృపముఖ్యకురుబలంబు
లార్చి పేర్చి నభంబున కభిముఖముగ
మొనసి నిష్ఠురశస్త్రాస్త్రములను బఱప ౧౮౫

మ దనుజుం డాగ్రహవిగ్రహుం డగుచుఁ దత్తన్మార్గణశ్రేణి తు
త్తునియల్ గా శరఖడ్గతోమరముఖాస్త్రోకాయుధానీక మ
ల్లన వర్షింపుచు శాంబరీమహిమలీలన్ వారణస్యందనా
శ్వనికాయంబు భటవ్రజం బతులితాశ్చర్యంబుగా బన్నినన్. ౧౮౬

సీ దివినుండి వెడలు దంతివ్రజంబులు- కురు
క్షితినాథు దంతి సంతతిని దురిమె
బోరిబోరి నాకసంబుననుండి బొడమిన
హరులు కౌరవరాజు హరులదరిమె
మించి మింటను సంభవించిన రధపంక్తి
రారాజురధరధ్యరభస మణఁచె
పిడుగులవలె నింగిబొడమిన భటకోటి
ధార్తరాష్ట్రుల భటోద్ధతులగూల్చె

తే.గీ నంత విసువక దానవుం డంతకంత
కోలభల్లూకశరభశార్దూలములను
భయదగతి శత్రుసైన్యంబుపైన గఱప
నుఱికి కోలాడ వెండాడుచుండె నపుడు ౧౮౭

మ ఉరగద్రోణలులాయసింహశరభవ్యూహంబు లొక్కొక్కవేల్
కురురాట్సైన్యములం దలంపడుచు మక్కుల్ డొక్కలం జెక్కులున్
శిరముల్ మైనరముల్ కరంబు లురముల్ చెండాడి తూలించి తు
త్తురుముంజేసి హరించె కాల్బలము తోడ్తోడం జికాకొందఁగన్ ౧౮౮

ఉ ఈగతి మాయనొందిన మదేభరథాశ్వభటాదు లొక్కటన్
మూగిన రాజసైన్యములు మ్రొగ్గె తురంగము లార్చుచుం ధరం
దోగె మదేభసంఘములు దుత్తుము రయ్యె రథంబు లుర్వి వే
వేగ దొఱంగె వాసవపవిప్రహతాద్రుల భంగి భంగమై ౧౮౯

సీ భల్లపంక్తులు చిత్రజల్లులై వర్షింప
తల్లడిల్లుచు నేల దొర్లువారు
మిన్ను జూడఁగ బోవ మెఱుఁగుటమ్ములు నాఁట
కనుగ్రుడ్లు లూడి బెగ్గటిలువారు
తలమీద పిడుగు లుద్ధతిగూల తనువులు
నుగ్గునుగ్గుగ నేల మ్రగ్గువారు
ఖడ్గముల్ బూని లంఘనసేయ గమకింప
కులిశపాతంబున గూలువారు

తే.గీ దుష్టజంతుతతుల్ పైకి దూఁకినపుడె
గుండె లవియఁగ నార్చుచు గుబులు గుబుల
కండలును నెత్తురుల్ నోట గ్రక్కువార
లైరి యీరీతి దనుజమాయాతిభీతి. ౧౯౦

తే గీ పఱచువారలఁ దముగని పఱచువారు
నఱకువారలఁ గూడి వాచఱచువారు
సోలువారలపై దాము సోలువారు
వ్రాలువారలపై దాము వ్రాలువారు ౧౯౧

చం హరిహరి మాయచే దివిని బుట్టిన తద్రథసద్భటాశ్వకుం
జరములు శల్యఖడ్గవృక సైరిభముల్ కురురాజసేనలం
గరచి బెసంగి డొక్కలును కంఠములుం వెకిలించి చించి దో
శ్శిరము లురంబులు న్నమిలి చిందఁవఁదఁ జేసె రౌద్రతన్ ౧౯౨

సీ బలితంపుపిడుగు పైఁబడ ముంచెదింపుమ
నెలమీఁద నౌఱుగు గంధేభములును

పటుకురాఠ్రాతపాతఘాతకు మేను
లవసి ప్రోగైన తీవ్రాశ్వములును
ముసలముల్ దివినుండి మ్రోయుచు పైఁబడ
సమసిన భటవీరసముదయములు
గండశిలావినిర్గళితఘాతాహతి
చిందఱలౌ మణిస్యందనములు

తే గీ నగు రణక్షోణిజనభయం బావహిల్లఁ
గ్రూరదనుజుండు వీరాంకవీరుఁ డగుచు
దివిని నటియించె దుష్టకౌరవబలంబుఁ
బొలయఁగా జేసి యంతటఁ బోక గవిసి ౧౬౩

సీ. శతసహస్రవ్యాఘ్రచయములు విడిబడి
కడిమి నొక్కొకతురంగమును గ్రుమ్మె
లక్షలకొలఁది హర్యక్షంబు లుదయించి
యొక్కొక్కదంతిపై యురికి బెఱికె
శరభంబు లొకకోట్ల సంఖ్యలు జనియించి
తీరుగా నొక్కొకతేరు డుళిచె
బహుళార్బుదముల దుస్సహజంతుసంతతి
బరదెంచి యొక్కొకభటుని బొదవె

తే గీ రణితచటులాశనీనికరం బసంఖ్య
బొడమి యితరజనంబులఁ బొలయఁజేసి
చెలఁగి దానవుఁ డిట్లు గర్జిలుచు మింట
వివిధగతులను మెలఁగె భూవిభులు బెగడ ౧౬౪

కం. మలమూత్రశోణితమ్ములు
పలలోపలములు - కచీషపటలంబులు, గ్నుల్
ఝులున గురిపించె కౌరవ
బలములు వెస నుడ్డుగుడిచి బాఱ కడంకన్ ౧౬౫

కం మగధత్రిగర్తమాళవ
ఖగదత్తవిరాటమత్స్యపాండ్యాదినృపుల్
నొగిలి నిరాయుధు లగుచును
దగుబీరము లుడిగి చనిరి తమతమపురికిన్ ౧౯౬

చం. అపుడు వివాహకార్యమునకై బఱతెంచిన కౌరవాప్తులౌ
నృపవరులం బురీపమున నింపి మృగేంద్రలులూయభల్లుక
ద్వీపినముఖాగ్రజంతువితతిం బురికొల్పి రథాశ్వసద్భట
ద్వీపములనెల్ల ద్రుంప నతిదీనతఁ గొందలమంది కొందఱున్ ౧౯౭

కం. విచ్చలవిడి దానవుఁడు- వి
యచ్చరమార్గమున నిలిచి హతమొనరింపన్
విచ్చిరి నొచ్చిరి చచ్చిరి
మచ్చరమున జనులు మారి మసలినభంగిన్ ౧౯౮

చం పరువడి భీమసత్వములు బైకొన కౌరవసేన నల్గడల్
బఱచెడువారు- శస్త్రతతిఁ బాఱగవైచి దిగంబరాంగులై
మొఱలిడువారు - రక్తమలమూత్రపురీషనిపాతభీతిమై
మఱుగులఁ దూఱువా రగుచు మ్రాన్పడి రంద రనేకభంగులన్ ౧౯౯

సీ వెండి యతం డభ్రమండలమ్మున నుండి
తండోపతండప్రకాండకాండ
తండంబు లొండొంట గండభేరుండముల్
పుండరీకములు డిండిమంతలముల
కుంభినీకృతమై ప్రచండాప్తి నిండియు
ఖండశోణితకాండమండలంబు
మెండుగా గురిసి బ్రహ్మాండభాండము నిండ
సండపిండాండముల్ గుండె లవిసి

తే గి. బెండుపడియుండె కెంపులుకొండలుపడె
దంతదఱిగినగతి మెండు నిండినపుడె

ఖండనంబున కెదిరింపఁ బెండుపడుచు
నొండుదోఁచక భటకోటిగం డడంగె ౨౦౦

గీ. విరథులును వీతవాహనుల్ వికృతతనులు
విరహితాస్త్రులు విస్వరుల్ విగతమతులు
వికలితాసులు విధ్వస్తవివిధయత్ను
లగుచు బఱచిరి కురుపక్షమైన నృపులు ౨౦౧

కం. గండశిలాఘాతముల న
ఖండాశనిపాతముల వృకద్వీపముఖరో
ద్దండమృగపీడనంబుల
వండం దఱిగినటు సైన్యవర్గము మడసెన్ ౨౦౨

వ. ఇవ్విధంబున నంబరాడంబరుండై హైడింబుండు యుగనిగమనారంభ విజృంభమాణ ఝంఝత్సంరంభసంవర్తనాంభోధరగంభీరరవంబులను విలయసమయసముదితశంకరహుంకారశంకాసంపాదితంబుగా సురాసుర విసరమథితమహార్ణవోదీర్ణఘూర్ణాయమాననినాదంబున కనువాదంబుగా ఘల్లుఘల్లున గర్జిల్లుచు కుంతతోమరప్రాసశక్తిశూలాద్యనేకాయుధంబుల నిగుడించుచు నగ్నికణంబుల నశనిపాతంబుల నస్త్రాసారంబుల నఖండగండశిలాపాతంబుల నతివర్షోపలంబుల నమేధ్యంబుల నశ్రాంత మూత్రధారాపాతితంబుల ప్రతిపక్షబలంబులు బడలుపడ న్నిగుడింప నబ్బలంబు లబ్బురంబైన రథంబుల న్నిబ్బరంబుగా బఱపుచు లాఘవ లక్ష్యదృఢత్వంబులు మెఱయ రయంబున నంపఱపరంపరలపెంపున కోదండపాండిత్యంబు నెఱపు తత్ప్రహరణంబులు కృతఘ్నోపకృతిం భాతి నిరర్థకంబుగా బొరయ నతం డంతకంతకుం గోపంబు తాపం బుకం గదుర నభోమండలంబునందుండి యాఖండలాదిదిక్పతిమండ లంబులుం బెండువడియుండ, మార్తాండప్రభాడంబరవిడంబనుండై సురాసురవిసరదుర్నిరీక్ష్యంబుగా మాయామేఘమండలంబునం దణంగ మష్టోరగశిలాసత్వంబులం బ్రయోగింపఁ దదీయసైనికానీకంబున తుండంబులు ఖండంబులై పీనుంగులైన యేనుంగులును, కాయంబులు

గాయంబులై రుధిరధారాతరంగంబులైన తురంగంబులును - రథ్యంబులు వధ్యంబులై హతాంగంబులైన శతాంగంబులును, కిహాలంబులు విహాలంబులై గదాహతులైన పదాతులును, రదంబులు పదంబులు పగిలి బెరిగెలయ్యెను, పాణులు కృపాణులు తునిసి తుత్తుమురయ్యెను, ఉరంబులు శిరంబులు ఏలి విద్రుపలయ్యెను, మర్మంబులు చర్మంబులు వీడి వికలంబు లయ్యెను, వెన్నులు చన్నులు వ్రేం దూలియును, ప్రక్కలు డొక్కలు కూలి వ్రాలియును, వీనులు జానులు నొచ్చి నొగిలియును, నేత్రంబులు గాత్రంబులు కుమిలి కమిలియును, ఫాలంబులు కపోలంబులు తునిసి సునిసియును, తొడలు మెడలు విరిగి యొరిగియును, వ్రేళ్లు గోళ్లు మడసి గెడసియును, అపరిమితరక్త ధారాసిక్తంబైన సంగరాంగణం బతిఘోరంబై యుండె నప్పుడు ౨౦౩

సీ. మూర్ఛితకేశవిస్తీర్ణశైవాలంబు
ఖండితాననకలసత్కమలచయము
పతితభుజాదండపాఠీననికరంబు
పుంఖీభవత్కంఠశంఖచయము
శిథిలితభూషణసికతామయస్థలి
ద్విరదకళేబరద్వీపయుతము,
భీకరదుందుభిభేకసంకీర్ణంబు
ఘనతురంగాంగనక్రప్రచయము

తే గీ మాంసమస్తిష్కఘనకర్దమప్రయుతము
నగుచు నెత్తురుచేరులై యవనిబొరల
దనుజు డీభంగి సింగి ఘూర్ణత జెలంగ
కౌరవావలి నెల్ల చికాకుపఱచె ౨౦౪

ఉ. అంతట జోక భూతవికృతాకృతి బూని తదీయసైనికా
భ్యంతరమందు జొచ్చి ముసలాగ్రగదాహతిచే శిరంబు లిం

తింతగ ప్రక్కలించి యితరేతరకోటి కదృశ్యరూపుఁడై
యంత వియత్పథంబునకు నాగ్రహుఁడై చనుదెంచి క్రమ్మఱన్. ౨౦౫

సీ. మరల కర్ణునిశిరోమధ్యంబున నిగిడ్చె
సునిశితాస్త్రంబుల శూలములను
పాషాణశతుల దుర్భరగదాహతుల చే
ద్రుడజేసె నంత సౌబలునిబలము
సముదగ్రలీల దుశ్శాసను తనువెల్ల
పరశుఘాతంబుల బగల నణఁచె
చటులాశనీ మహోర్భటనిపాతంబుల
రారాజురథ్యసారథుల దునిమె,

తే. గీ. సైంధవుని కత్తళము ద్రుంచె సకలయోధ
తతిని భూరిశ్రవుని ద్రోణతనయు నొకట
ఘోరతాడనముల మూర్ఛగొన నడంచె
ఘనతచే మించె నభ్రవీధిని నటించె ౨౦౬

చం. మును తనతో సుభద్ర కురుముఖ్యుల జంపకు మంచు బల్కుటల్
మనమున నెంచి వారివధ మాత్రము మాని తదీయసైనికా
జనముల నొక్కయుద్ధవిడి జంపి పురీషకరీషమాత్రమ
జ్జనమున నమ్మహారథుల శక్తి నణంచె ననేకభంగులన్. ౨౦౭

కం. ఈరీతి న్మాయాకృత
ధారాధరములను డాగి తత్కురుబలముల్
భీరుపడ భంగపఱచుచు
రారాజుం గూర్చి భీమరవమున బలికెన్ ౨౦౮

చం. జనకు లరణ్యభూమి ననిశంబు బరింపఁగ బంపినాఁడ నం
చని మదగర్వహుంకృతిని నయ బిమన్యుఁడు గోరియున్న క
న్యను గొఱగాని లక్ష్మణున కర్థిని గైకొనబూని పాండునం
దనుల పరాక్రమంబు మదిదల్పని దత్ఫలమబ్బె నేటికిన్ ౨౦౯

చం. నిను మది నమ్మి వచ్చు ధరణీతలనాథులు మచ్ఛుజావలి
పనఘనబాణజాలచవపావకకీలల గ్రుగ్గి మగ్గి రిం
తను మునుమాయజూదమున ధర్మజు రాజ్యము గెల్చి నీకొసం
గినఘనశూరు సౌబలుని గీటణఁగించెద చూడు మింతటన్ ౨౧౦

గీ ధర్మజాదిమపాండునందనుల కీవు
కీడొనర్చిన ఫలము చేకూరె నేఁడు
శకునిభానుజసైంధవసహితముగను
నిన్ను జంపకమాన నాకన్నులాన ౨౧౧

చం అని యతఁ డట్టహాసమున నార్చి నిశాతశరాశ్మవజ్రపా
తనిహతిచే మహారథుల దర్పము లార్పఁగ డస్సి సైనికుల్
జను లతిభీతి బర్వ నిల శక్యము గాక కృపుండు ద్రోణుఁ డ
జ్జనపతితోడ కార్యసువిచారనయోక్తుల బల్కి రొక్కటన్ ౨౧౨

కం. కురునాథ! యిట్టి సీవె
క్కుఱు మంత్రాంగమున నింతగూడెను మనతో
దరుదెంచు నృపులు దిశలం
బఱచిరి హతశేషు లగుచు బ్రతికినవారల్ ౨౧౩

గీ మాయగజములచే గ్రుగ్గె మనగజములు
మాయహయములచే గూలె మనహయములు
మాయరథములచే డుల్లె మనరథములు
మాయసేనచె మనసేన మాయమాయె ౨౧౪

మ మొదల న్పాండవపక్షపాతి హరి యేమో వింత గావించె ని
ట్లదిగాకం బురుహూతముఖ్యసుర లత్యంతాప్తులుం గాన నె
య్యది సాహాయ్య మొనర్చిరో తెలియరా దీమాయ లీలాయలి
ట్లాదవెం గావున దీనికై ప్రతిక్రియం బూహింపఁగా దోచదే ౨౧౫

మ మును భీష్మాదులు హితమ్ముకోఱకై మున్మూరు బోధించి యు
ప్పని సేయం దగ దంచు బల్కిరి మదిం బాటించఁగా లేక స

త్యనయోపేతుల పాండుసూతులకు దుష్టాలాపము ల్పల్కి చే
సిన తప్పుల్ తఁ దాకినప్పుడుగదా చింతింపఁగా నయ్యెడిన్ ౨౧౬

కం. నీవుం గర్ణముఖాదిమ
హావీరవరేణ్యు లేకమై మదిఁ గసకం
గోవిందుని నిందించితి
రే వికృతికి మూల మాతఁడే సుమి జూడన్ ౨౧౭

కం. హరిఁ గొలిచి ధర్మజాదులు
నిరుపమసత్కీర్తిపూర్తి నెగడిరి నీవా
క్కరుఁడ వహితుండ వగుటకు
కౌఱవిం గొని నెత్తి గోకుకొనుగతి గాదే ౨౧౮

కం. తలమీఁద వాలు పిడుగులు
నిలమీదం దేళ్లుఁ బాము లేకం భగుమన్
నిలనీక దిరిగె మేనులు
మలమూత్రకరీషరుధిరమయ మయ్యె నృపా! ౨౧౯

కం. ఒకయెడ సింహనికాయం
బొకయెడ భయదాహిజాల మొకచో శరభ
ప్రకరంబు లొకట మదగజ
నికరము లొకదిశ తరక్షునిచయము గవిసెన్ ౨౨౦

కం. అకటా రథరథ్యాయుధ
వికలులమై ప్రాణ ముండుఁ వేదక్క బలం
బొకటి గనలేక నూరక
సికయేటి రణంబొ దీన నేటి జయంబో! ౨౨౧

మ. అదిగాక న్మనసేనలో నొకఁ డధర్మవ్యాకారుఁడై జొచ్చి పెన్
గుదెనే నంగలు మోదఁగా దొణఁగె నాక్రోశంబుసన్ వానినె

ద్దిదిటింప న్వశమౌ బహునబయలం దెబ్బంగి జీవింప దో
చదు మున్నెప్పటితావు కేగుట విశేషం బంచు దోచె న్మదిన్ ౨౨౨

ఉ. నావిని కర్ణశల్యకురునాథు లధైర్యమనీషులై భయం
బావహిలన్ హలాయుధు శుభాలయము న్వేసజొచ్చి కంపితాం
గావయవంబులం జెమట లాముకొనం గళసీతజీవులై
లావు దొలంగి యొక్కెడ నిలంబడు టల్గని సీరపాణియున్. ౨౨౩

మ. శశిరేఖామణి మాయమౌట విషదుర్జంతువ్రజంబు ల్సహ
స్రశతంబుల్ జనియించుటల్ కురుకులక్ష్మానాథసైన్యంబు దు
ర్దశలం జెందుట లక్ష్మణుండు భయదాక్రందధ్వనిం బాఱుటల్
కుశిగుంపుల్గొని యాదవు ల్పురజనుల్ ఘోషించుట ల్గాంచియున్. ౨౨౪

చం హలముసలంబుల న్నిజభుజార్గళపీఠి నమర్చియు న్మహో
జ్జ్వలవిలయాంతకాకృతి నవారితభీషణరోషదీప్తుడై
బలువిడి శోణనాంగణ మభంగురలీల వినిర్గమించి ది
క్కులు బఱికించి దివ్యభిముఖుం డగుచున్ ముసలంబు ద్రిప్పినన్. ౨౨౫

కం. అప్పుడు దనుజుం డార్చుచు
తెప్పలుగా పులులు ఫణులు తేళ్లును డాలున్
నిప్పుల కుప్పలు గుప్పున
గుప్పెం బలభద్రుం డుద్దు గడువంగ మింటన్ ౨౨౬

చం. పిడుగుల పెల్లుగూల్చి వెనువెంబడె ఖడ్గగదాస్త్రశస్త్రము
ల్దడబడ చిత్రజల్లులవిధంబున పైనిగిడింప నబ్బలుం
డడలుచు లాంగలంబు ముసలాయుధము న్వడి ద్రిప్పి వానిపె
ల్లడంపగ కాలుండై నిమున మూర్పంగలేక చలించి ఖిన్నుండై. ౨౨౭

మ. ఇదియేమో బలువింత బుట్టె విమతుం డెవ్వండొ దౌర్జన్యుండై
యెదురున్ లేక నభంబున న్నిలిచి నేడీలాగు మాయార్ణవం

బొదవింప న్సమకట్టెఁ దత్ప్రతికృతం బూహింపఁగా బుద్ధిదో
చ దటంచుం దిగులొంది శ్రీహరినివాసం బార్తుఁడై చేరియున్ ౨౨౮

కం. పెదవులు దడపుచు నాగఁటి
గుదెరోకలికోల గోడకునై్వచి భయం
బొదవ మధుసూదనుని క
ట్టెదుట నిలిచి గాద్గదోక్తి నిట్లని బలికెన్. ౨౨౯

శా. శ్రీకృష్ణా యిది యేమొ వింత జనియించెం గాక యీరాత్రి చీ
కాకై లోకులకూత లార్భటులు భూకంపంబుగా దోఁచె ని
శ్శీకంబై శశిరేఖ గేహమున వీక్షింపగలేదయ్యె నేఁ
డీకృత్యం బతిఘోరకర్ముఁ డెవఁడో హీనుం డొనర్పెందగున్ ౨౩౦

కం. మొదటన్ లక్ష్మణుఁ డారాత్రిని
బెదఱుచు మొలచీరసడలి భీమార్భటిఁ బె
ల్లదిఱి చనునపుడె పెండిలి
తుదిముట్టదటంచు నాకు దోఁచె నిజముగాన్ ౨౩౧

మ. పులులున్ సింహములున్ వృకంబులు మహాభూతంబులు న్నల్గడల్
గలయం బర్వగ భూపతు ల్గజతురంగశ్రేణితో వానితో
జలపోర న్సమకట్టి దోర్భలవినిస్సారాంగులై మ్రగ్గిరే
వలన న్నిల్వవశంబులే దిఁకను దైవప్రేరితం బెట్టిదో ! ౨౩౨

కం. పెండ్లిం జూడఁగ వచ్చిన
వాండ్లెల్ల మహాశనీనిపాతంబులచే
పండ్లీలగఱచి కొందఱు
గుండ్లపయిం దొఱఁగి నేలఁ గూలి రనేకుల్ ౨౩౩

చం. విరిగె రథవ్రజం బఖిలవీరభటావలి గూలె భీకర
ద్విరదము లొక్కుట న్మడిసె, తీవ్రహయంబులు దుల్లెరాజశే

ఖరులు వధూజనంబులు చికాకున దిగ్వసనాంగులై వడిం
బఱచిరి భూమి నెత్తురులు బాఱెఁ బ్రవాహము లౌచు నెల్లెడన్. ౨౩౪

కం. చీఁకటులు గవిసె మింట న
నేకబాహకనికాయ మెఁసగి రుధిరధా
రాకలిత మగుచు పిడుగుల
మూఁకలు లోకులు చికాకుమూకొన దాకెన్. ౨౩౫

కం. ఏనంతట కయ్యంబున
కై నేగి నభంబుజూడ నతిరౌద్రతర
ధ్వానములు జేయుచుం బ్రళ
యానలకణగణము రాల్ప నవశం బయ్యేన్ ౨౩౬

కం. కౌరవరాజు వినిర్గత
శూరుండై మేను నొచ్చి శుద్ధాంతమునం
జేరి తడఁబడుచు నున్నాఁ
డారయ తలవంపులయ్యె నచ్యుత నాకున్ ౨౩౭

మ. ఇక నేమంచు వచింప క్రూరదనుజుం డెవ్వండొ మాయాబలా
హకపంక్తిం దగ చాటు చేసికొని హాహాకారరోషోగ్రుఁడై
యొకచో గంతులు వేయు నొక్కయెడ నత్యుత్సాహుఁడై గేరు వే
రొకమూలం దిరుగున్ హసించు నొకచో నొక్కొక్కచో నేడుచున్.

కం ఉఱుములు మెఱుపులు పటుభీ
కరగండశిలాశనీనికాయంబు మహో
ద్ధురగతిని బఱప నిల్వఁగ
వెఱచిట జనుదెంచితిన్ భవిష్యతి దెలియన్. ౨౩౯

ఉ. నీవఖిలార్థవేద్యుఁడవు నేతవు దాతవు నన్ను భ్రాతగా
భావమునం దలంచుట ప్రపంచవిలోకవిడంబనార్థమే

గావున నీవెఱుంగనిది గల్గునె లోకమునందు నెందు నేఁ
డీవిధ మెట్టిదో తెలుపవే మధుసూదన వైరిభేదనా ! ౨౪౦

చం. అనిన జనార్దనుండు దరహాసముఖంబున నన్నతోడ ని
ట్లనియె మదగ్రజుండ విటు లాడఁగనేల యెఱింగి మున్ను చే
సినపని నింతలో మఱచి చింతిల నేటికి నీవె సోదరిం
గనిసి పరాభవించుటకు కేవల మిట్లొనగూడు టబ్రమే. ౨౪౧

మ. తొలుత న్నీవు పరాభవించుటకు పుత్రు న్వెంట దోడ్కొంచు కే
వలగాఢాంధతమంబునన్ వెడలిపోవం దుర్గమార్గాటనో
జ్జ్వలబాహాబలుఁడౌ ఘటోత్కచుఁ డట న్సాహాయ్యమై వారివ
బ్బలుకోనన్ నిలజేసి నిశ్చలసుహృద్భావంబుఁ బాటించినన్ ౨౪౨

తే గీ. వానితోడుత నీవన్న వార్త లెల్లఁ
దెలుప దానవుఁ డతిరోషదీప్తుఁ డగుచుఁ
దల్లికిని దమ్మునకుఁ బ్రియం బుల్లసిల్ల
పొలఁతి నింతకుమున్నె గొంపోయె నటకు. ౨౪౩

కం అతఁ డతుల దనుజమాయా
చతురతలన్ విభ్రమించి శశిరేఖాయో
షితరూపము గైకొని భవ
దతులితభవనమున మోహనాకృతి నిలిచెన్. ౨౪౪

కం. వనితామణి నితరజనుల్
గనుఁగొన శశిరేఖవలెనె గాన్పించుచు ల
క్ష్మణున కతి వికృతరూపము
లను జూపెం దనుజమాయలన్ వివిధగతిన్ ౨౪౫

చం జనకులదుఃఖముల్ హృదయశల్యములై మదినాటియుంటచే
దనుజుఁడు లక్ష్మణుం గెలచెఁ దత్కురురాడ్బలమెల్ల నార్చి తెం

పునమున జేయు కర్మములు భుక్తము గాక దొలంగుటెట్లు స
జ్జనులగు పాండవాత్మజుల శౌర్యము నేఁ డెఱుగంగనయ్యెనే ౨౪౬

మ. అని దామోదరుఁ డాసభాసదుల కత్యాశ్చర్యమై దోఁచ నే
ర్పున బల్కన్ పటురోషభీషణవిదీప్తుండై హరిం జూచి యి
ట్లనియెన్ సోదరిపుట్టినింటికి విరోధాపాదియై యీగతిన్
మనయం దీర్ష్యయు బెంప ద్రుంప నిది ధర్మంబౌనె దర్కింపఁగన్

తే.గీ మనసుగలసినచోటికి మగువ నొసఁగ
జనులకెల్లను నిది సుప్రశస్తమయ్యె
కొడుకుతో కొన్ని కొండెముల్ నొడివి నన్ను
భూభుజుల నిట్లు బెదరింపఁబూనతగవె. ౨౪౮

కం మానిని సాహసగుణముం
బూనుటయేగాని యికను బుత్రీమణి నె
ట్లైన నొసంగుదునే తన
సూనునకుం దనుజుఁ డనికి జొచ్చినమాత్రన్ ౨౪౯

చం వనిత నొసంగ నంచని ధ్రువంబుగ బల్కితిగాని వెళ్లిపో
మ్మని దన నెవ్వఁడైనను బ్రయాసల బెట్టెనె నన్ను రద్దిపా
లొనరఁగజేయ నిట్టి చెడునూహలు జేసిన జేయనిమ్ము నా
తనయ నరణ్యమం దెచటదాచిన నేక్షణమందు దెచ్చెదన్ ౨౫౦

చం నరపతులెల్ల నన్ను కని నవ్వఁగ నిట్లవమానమొందఁడి యే
కరణి సహించవచ్చు నడెగాక మదాత్మజ నాహరించు దు
ష్కరుని దదీయకింకరనికాయముతోడ వధించి సూనృత
స్ఫురితవచోక్తి నిల్పి కురుసూనున కింగననిత్తు రూఢిగాన్ ౨౫౧

మ ఇపుడే రక్కసుకోన కేఁగి సకలోర్వీశుల్ నిరీక్షింప పా
పపుదైత్యాధము దుర్మదం బణఁచి శుంభచ్ఛౌర్యధుర్యుండనై

చాపలాక్షిం గొనిదెత్తు నం చని యలక్ష్యం బొప్ప భాషించు ధీ
నిపుణున్ రాముని జూచి శౌరి నగుచున్ నేర్పొప్పఁగా నిట్లనెన్. ౨౫౨

కం. రామా నీవచనంబుల
కేమనగలవాఁడ విహిత మెంచక చెలియ
ల్వేమాఱు వేడ లఘుగతి
గా మునువిదళింప మేలుకలుగునె మనకున్ ౨౫౩

సీ. మునుమున్నె నీకూర్మిపుత్త్రి నిత్తు నటంచు
భగినితో నమ్మికల్ బలుకుటేమి?
యింతలో కురురాజు హీనసంపదగోరి
వాని కాత్మజ నీయఁ బూనుటేమి?
చెలియతిండికి పంచ జేరియున్న దటంచు
కర్ణకఠోరముల్ గడవుటేమి?
తతపరాక్రమపాండుతనయుల నిందించి
పరుషోక్తు లాకకొన్ని బలుకుటేమి?

తే.గీ. తలఁపులో కోర్కెలీభంగి దప్పెననుచు
డెందమున గుంది కొందలం బందుటేమి
యఖిలవిధముల దైవప్రయత్నముఁనను
జెడిన కార్యంబునకు జింత సేయుటేమి? ౨౫౪

మ. వనితనొసంగకన్ బరుషవాక్యము లీవు వచించుటల్ నికే
తనమును వెళ్ళద్రోయుటగదా! మఱి వేఱవమాన మున్నదే
యని తనయుండు దాను వికటాటవులం జరియింప దానవుం
దనుజునకున్ సహాయగతియయ్యె నతం డవిజేయుఁ డౌటచేన్. ౨౫౫

గీ. రావణునకన్న మాయాధురంధరుండు
వాని నిర్జించెద నటంచుఁ బూనె దీవు
మనలనందఱ మాఱ్కొని మడియజేయ
కింక నీమేర నిలిచిన నింతె చాలు. ౨౫౬

చం సతి వెత జెందుటల్ సుతు విషణ్ణతయు న్వినెనేని యర్జునుం
దతులితరోషభీషణలయాంతకునింబలె కౌరవాన్వయ
ప్రతతి నొకుమ్మడిం గవిసి భండనగాండివముక్తకాండఖం
డితులను జేసి మీకిక కడిందిమగంటిమి జూపకుండునే ౨౫౮

కం. ఒంటరిగ నిలిచి మును ము
క్కంటిని యెదిఱించి యుగ్రకాండము గొని బల్
బంటుతన మెనయు విజయుని
కంటికి కౌరవులు మశకగతిగారె గనన్

కం. ఒకఁడె ఘటోత్కచుఁ డీగతి
తికమక నొందించె కురుపతిన్ భీమసహా
యకుఁ దగుచు ననికి దొరకొన
నిక విజయున కెదుటనిల్వ నెవ్వం డోపున్. ౨౫౯

కం. నీవు ఘటోత్కచు నాశ్రమ
మేవిధమున జొచ్చి వాని కెదిరింపఁదరం
బీవేళ వానిమాయలు
బోవిడిపించుకొని సాగిపోవ వశంబే ౨౬౦

ఉ వాని నెదిర్పఁగా విధిశివప్రముఖుల్ దగ రన్నచో చలం
బూని కులాధముండగు సుయోధనుపై మరులొంది యార్యస
న్మానుల పాండుసూనుల నమర్షణబుద్ధి పరాభవించు టె
ట్లైన ననర్హమంచు మతియందు దలంపకనుంటఁ బాడియే ౨౬౧

మ. మృగధూర్తంబుల గాంచి సింగములు బల్మిన్ వంచనల్ జేయు న
ట్లుగ నీవిట్టి దురాత్మకౌరవుల మేలుంగోరి పాండవ్యులం
బగచే వంచనజేసి సూనృతము తప్పందోఁచుటంగాదె యి
ప్పగిది న్యాదవసత్తముం దగని యాపద్భ్రాంతులై పాఱుటల్ ౨౬౨

చం. పలికినమాట బొంకపడు పాతకమున్ మనయందుగల్గి యా
చెలియలి నేరమెంచుటకు జెల్లునె దోర్జయశీలు లాత్మజుల్

గలిగిన వీరపత్ని తనుగావున నిట్లొనరించె దానవుం
డలఘుపరాక్రముండు భవదాశయ మించుక సాగనిచ్చునే ౨౬౩

తే గీ. దానవుఁడు బూను మాయావిధానములకు
ప్రస్తుతోద్యుక్తసత్కారఫణితి నెఱిఁగి
యుపమచే సంధి గావించు టుచిత మనుచుఁ
బలుకు హరితోడ హలి మాఱుపలుకకుండె. ౨౬౪

మ. అవుగా దంచని మాఱుబల్కని ప్రలంబారాతిభావంబు దై
త్యవరేణ్యుండు మదిం గ్రహించి హరిసత్యాలాపముల్ మెచ్చి కౌ
రవనిశ్శేష మొనర్పకున్న హలిసంరంభంబు బోవీడ దం
చు వియన్మార్గమునం దదృశ్యగతుఁడై శుంభత్ప్రతాపంబునన్ ౨౬౫

మ పునరుత్పాత మొనర్ప దైత్యుఁడు నభోభూగర్భము ల్నిండ చి
ట్లున చీఁక ట్లొనరించి యార్చి భువనాటోపంబు దీపింప ధా
రుణి యక్కమ్మ 'సొరెరీతి పలుమాఱుం దిర్దిరం ద్రిమ్మరం
గనులంజూడ భయంకరాకృతిని ఘూకంపంబు గల్పించియున్ ౨౬౬

మ దివి యొక్కమ్మడి గ్రుంగి పైఁబడినరీతిం జంద్రమాదిత్యు లం
వ్యవధిం తారలతో ధరన్మెఱుఁగుఛాయన్ సప్తసింధుప్రజం
బవియం జొచ్చినభంగి నాజ్వలితకీలాభీ-దావానల
ప్రపకల్పాంతములీల నొప్పె సుర లాశ్చర్యంబుగా జూడఁగాన్ ౨౬౭

చం కినుకను దక్షణంబె నిజకింకరకోటిని బిల్వ వారలు
గ్రనిశతి రోషభీషణముఖంబుల నచ్చుతశూలధారులై
జనవరసేనలం గవిసి సాహసబాహుసమగ్రశక్తిబె
కొని పడినార్చి బేర్చి 'శలగోశలగో' యని గ్రుమ్మి రొక్కటన్ ౨౭౦

గీ దపిలి బలకృష్ణు లిరువురు దక్క నిఖిల
కరితురంగమరథసైనికానికాయ

సహితముగ రాజవరులను వక్కడంచి
దనుజభటు లిట్లు బీభత్స మొనర జేసి ౧౬౯

చం పురమున దైత్యకింకరులు బోరన జొచ్చి శుభాలయంబునం
బరగు సమస్తవస్తువులు బల్మి పయోనిధి బాలువైచి యు
ద్ధురగతి పౌరులం దఱిమి దోర్బలదుర్జయులై గదాహతిం
దురగరథేభసైన్యముల ద్రుంచి చికాకొనరించి రెంతయున్. ౨౭౦

సీ ఒకచోట సైంధవు సిక చేనొడిసిపట్టి
లోపోటులను గ్రుద్ది యేపుమాపె
నొకచోట సౌబలు ముఖము క్రిందుగదీసి
కొప్పుబట్టీడ్చి చీకొట్టి విడిచె
నొకచోట భూరిశ్రవుకరమ్ములు బిగబట్టి
బఱద్రోసి చెంపలు బగలవైచె
నొకట బాహ్లీకు కుత్తుకబట్టి గెట్టించి
మెదలనీకుండ మేన్ జిదిమి మెదిపె

గీ నొక్కచోటను గురుసూను నొడిసిపట్టి
కదలనీకను ఱాళ్ళ మోకాళ్ళ బొడిచె
నొక్కయెడ కర్ణు కర్ణంబు లూతజేసి
మెడలపైకి ధువాళించి మేను జించె. ౨౭౧

చం మును ద్రుపదాత్మజన్ నృపసమూహము జూడగ మానభంగ మీ
వొనఱుచు పాపజాతి విడిగో ప్రతికారము ప్రాణభంగ మే
నొనరుతు నంచు దైత్యభటుం డొక్కరుం డుగ్రత దుస్ససేను తో
బెనగుచు ప్రాణ ముడ్డుకొన భీకరముష్టి నడంచె జొమ్ముసన్ ౨౭౨

చం బలువున మాయజూదమని బన్ని యుధిష్ఠిరు సర్వసంపదల్
గెలిచి కురుక్షితీశునకు కేవల మాప్తత వెండ్లిపెద్దవై
నిలిచితివే యటంచు నకుసింగని యొక్కసురారి కింకిరుం
డలఘుతరాశనీతులితమౌ కరముష్టి నడంచె సుగ్రుడై ౨౭౩

మ. అమరద్వేషి యొకండు ద్రోణుని కృపాచార్యు న్విలోకించి హీ
నమతిం బెండ్లి గనుంగొనందలఁచి యానందంబున న్వచ్చి క
ష్టములం బొంది కులాభిమానములు నాశంబొంద హైడింబుచే
సమయం దుస్సమయంబు చేకూఱెగదా సౌజన్యులౌ మీకిఁటన్ ౨౭౪

చం. ముదిమికి ముప్పువచ్చె పెనుమూర్ఖు సుయోధను మైత్రి నెమ్మది
న్వదలక పొట్టకూటికిని వానికడ న్వసియించుటింక మీ
కిది తగదంచు బల్కి యొకయిట్టి కళాసము ఫెళ్ళుఫెళ్ళునన్
విదిలిచి పెంటపైబఱచి వేవసియింపుఁ డటంచు బల్కియున్ ౨౭౫

చం. ఒకయెడ డాగియుండిన సుయోధనసూనుని బట్టితెచ్చి యో
వికలితచిత్త పెండ్లిగొనువేడుక వచ్చినవాఁడ వీగతిన్
మొకమిటు నేలవైచికొని మూల్గెదు నీ కడుపాఱ కూటికిం
బొకబొకబొక్కి నీకు పువుఁబోణుల సౌఖ్యము తక్కువాయెనే! ౨౭౬

చం ప్రియమున గోరితెచ్చుకొను పెండ్లికుమారుఁడ వేమొ నీ వనా
శ్రయగతి నిట్లు దుఃఖవివశంబున బ్రేలుటకంటె చచ్చుటే
నయమని తోచెడిం బ్రతికి నల్గురిలో తలనెత్తి యేగతిం
బ్రియమతిఁ జూడనోపెదవు పెండ్లిపెటాకులుజేసి లక్ష్మణా ౨౭౭

కం ఈపగిది విలయకాల వి
రూపాక్షునివలె ననేకరూపముల మహా
టోపమును జూప బలుఁడు భ
యాపాదితుఁ డగుచు హరిగృహంబున కరిగెన్. ౨౭౮

మ చని నిశ్చేష్టితుఁడై నిలంబడిన యాసంకర్షణుం జూచి చ
య్యన దామోదరుఁ డంజలీకరతలుండై స్వామి విచ్చేయు కా
రణ మేమంచు వచింపగాఁ విగతసంరంభంబునం గద్గద
ధ్వని నిట్టూర్పులు బుచ్చుచుం బలికె చింతాక్రాంతచేతోగతిన్ ౨౭౯

ఉ కూతురు మాఁచుమయ్యో జ[illegible] దిగంతము నిండె వజ్రని
ర్ఘాతశిలాతిపాతముల కౌరవసైన్యము మ్రొగ్గి మగ్గె నీ

రాతిరి తెల్లవారుట దురత్యజమై మదిఁ దోఁచె దీని నే
రీతి శమింపజేసెదో హరీ! నీవుగాక మఱెవ్వ రీధరన్ ౨౮౦

చం. చెలిమిని మున్ను దాస్యములు చేకొనలేదె ఫణీశ్వరాకృతిం
గలిగిన నాతొ రెండవయుగంబున శ్రీరఘురామమూర్తివై
యలరి సహోదర ప్రియము లన్ని విధింపవె నేఁటి కగ్రజా
ఖ్య లభితమయ్యెనంచు భవదాజ్ఞ మరల్ప స్వతంత్రమున్నదే! ౨౮౧

చం. అవని నశక్తునిం భుజబలాధికు జేయఁగ దోర్బలాఢ్యు ని
ర్జవగతుఁగా నొనర్ప నతిజాడ్యుని పూజ్యునిజేయ బూజ్యునిం
భవమతిగా నొనర్పఁగ భవన్మహిమ ల్గణుతింప నీరజో
ద్భవభవశక్రముఖ్యుల కభావ్యముగాదె సరోజలోచనా! ౨౮౨

కం. ఇది యేమొ తెల్పినానని
మది సంశయమిడక మత్కుమారీమణి నిం
పొదవ నగుపఱచి యీదు
ర్మదదనుజాటోప మణఁచి మనుప దలఁపవే! ౨౮౩

మ. అనుచుం దీనముఖాబ్జుఁడై పలుకు తాలాంకు న్విలోకించి - యి
ట్లనియెన్ స్వామిటులాడనేల భవదీయాజ్ఞం దలందాల్చి తో
చినరీతి న్వినిపింతు - దేవర లుపేక్షింపంగ నూహింప కి
ట్లనుకూలించితిరేని సర్వజనతాహ్లాదంబు ప్రాపింపదే. ౨౮౪

మ మొదల న్నేవినిపించు నీతములనేమో చిత్తమం దన్యథా
స్పదమై తోఁచి కురుక్షితీశ్వరుని సంపన్మోహవై సత్కళా
భ్యుదయుం పద్మాక్షుఁ డెవ్వడని కోపోద్వృత్తిచే సోదరి
న్విదళింపం జెడుబుద్ధి నీకొదవె భావిశ్రీయశోహానికిన్ ౨౮౫

ఉ. దానికి పార్థనందనుఁడు దల్లిని దోడ్కొని పోవ కావున -
స్థానమునం ఘటోత్కచుఁడు దారసిలం భవదుల్లసోక్తుం

మ్మానిని దెల్పఁగా నతఁడమర్షత నీర్ష్యనుబూని యభ్రపం
ధానముజేరి కౌరవులహుంకృతి బాపె సదృశ్యరూపుఁడై ౨౮౬

ఉ తల్లియు తమ్ముడు న్వెతలఁ దల్లడమందుటచే ఘటోత్కచుం
డుల్లమునన్ సహింపక శుభోత్సవభంగ మొనర్చె కూతు మే
నల్లున కిత్తునంచు నికనైన దృఢస్థితి నీవు బల్కితే
నుల్లసితాత్ముఁడై దనుజుఁ డుర్విని దిగ్గి శమించు నింతయున్ ౨౮౭

చం సలలితమౌ మదుక్తికి బ్రసన్నుఁడవై యెలుఁగెత్తి దానవుం
బిలచి తదాశయం బెఱిఁగి ప్రీతి సమస్తజనానుకూలని
ర్మలమతి నాత్మపుత్రి నభిమన్యునకుం భగినీమ కోరథం
బలవడ పెండ్లిసేయుట నయం బభయంబు ప్రియం బికెన్నిఁటన్ ౨౮౮

ఉ వ్యర్థమనీషుఁ డా కురుగులాత్మజు నర్థి వరించుకంటె - ని
ప్పార్థతనూజుఁడే మనకు బాధ్యుఁడు సాధ్యుఁడు నేఁటికైన యీ
యర్థము మీఱ లియ్యకొని యవ్యవధి న్సమకూర్చుటే మహా
సార్థకమంచు దోఁచె మది సంశయమేల ప్రలంబభేదనా ౨౮౯

మ అనుచున్ శౌరి వచించు సజ్జనహితంబౌ నీతివాక్యంబులన్
విని డోలాయితబుద్ధి కొంతతడవు న్వీక్షించి - గోవింద నీ
కనుకూలం బెటుగల్గునో యట జయం బౌ టబ్రమే లోకవ
ర్తనవైశద్యవిభాగనిర్ణయకళాధారుంత వీవౌటచేన్ ౨౯౦

కం ఈవిధమున ననుకూలుం
డై వచియింపుమ నిజానుజాసుమతి - సుహృ
ద్భావమున నాఘటోత్కచు
నావాహనజేయ నిట్టులని యెలుఁగెత్తెన్ ౨౯౧

ఉ ఓయి ఘటోత్కచా! దివి మహోగ్రపరాక్రమశాలివై జయం
బీయెడజెంది తీవు తమి నింకిటమీఁద శమించు— నియమ

ప్రాయమదెట్టిదో ! తెలియఁబల్కితివేని ఫలింప దీన నే
మో యనఁ బోకు నీకు మదిమోద మొసఁగ్చెద నమ్ము నమ్మికన్ ౨౯౨

ఉ. దానికి దానవుం డతిముదంబున రాముఁడు చేతఁ జిక్కె నె
ట్లైన మదీప్సితంబు ఫలియించె నటంచు గణించి పల్కె నో
హానలినాక్ష ! యో హలి ! మదుత్కటరోషము నెన్న నేల దు
ర్మాని కురుక్షితీశు నవమానము జేయదలంచి తింతియే
గాని జగద్ధితాత్ము లవికారులు మీకొకకీడు కూర్తునే ౨౯౩

శా. ఐనా నామది నొక్కకోర్కె గల దెట్లంటేని నేఁడీ కురు
క్ష్మానాథున్ హతశేష సేనలను పీకం ద్వారకాప్రాంత మెం
దేని న్నిల్వఁగనీక బోఁదఱిమితే యేనై భవత్సన్నిధిం
ధ్యానప్రీతిని విన్నవింతు నపరాధక్షాళనార్థోక్తులన్ ౨౯౪

చం. అనుచు నదభ్రవిభ్రమమహాభ్రరవభ్ర మనభ్రవీధి బో
రున వడిమ్రోయఁగా విని- కురుక్షితినాధముఖావనీశు లా
ర్తిని హతశేషసైన్యవితతిన్ విడనాడి వినిర్గతావలే
పనపతిఁ దామొకం డొకనిబట్టుక నేగిరి హస్తినాపురిన్ ౨౯౫

మ. విరథు ల్వీత నిజాశయుల్ విగతదోర్వీర్యు ల్విహీనాయుధుల్
విరసోద్యోగులు విప్రయత్నమతులై వేపాటుభూపాలి నం
బరమందుండి ఘటోత్కచుండు గని కోపంబెల్ల బోకార్చి గ
హ్వరికిం డిగ్గి హరిన్ హలాయుధుని డాయన్వచ్చి నమ్రాస్యుఁడై. ౨౯౬

మ. నిటలన్యస్తకరాంబుజుం డగుచు సాన్నిధ్యంబు నంజేరి ని
ష్కుటిలప్రీతి పునఃపునఃప్రణమితాంగుండై సభక్తిస్ఫుర
ద్ఘటనం బల్కె నిజాపరాధములు సాకల్యంబు బోకార్ప ధూ
ర్జటిజూటాసటదభ్రసిర్ఝరచరఝ్ఝంకారవాచార్భటిన్ ౨౯౭

శా. వందే సుందర మిందుబింబవదనం వందారుబృందావనా
నందస్యందిమరందతుందజలజస్పందాక్షవీక్షాంచితమ్
కందాభం దరకుందకంధరరదం నందాదిమందారకం
మందోద్భాసితమందహాస మిహ గోవిందం ముకుందం పరమ్. ౨౯౮

సీ. జయయదుకులదీప జయపరాత్పరరూప
జయధర్మసంస్థాప జయరమాప
జయరుక్మిణీలోల జయజగత్త్రయపాల
జయచంద్రమయచేల జయసుశీల
జయపాతకవిభంగ జయసత్కృపాపాంగ
జయపతంగతురంగ జయశుభాంగ
జయపుండరీకాక్ష జయదానవవిపక్ష
జయభక్తజనరక్ష జయకటాక్ష

గీ. జయకుశేశయనయన భుజంగశయన
జయపురంజయమిత్ర శశ్వచ్చరిత్ర
జయశయాంచితచక్ర చక్రహతనక్ర
జయవిజయశీల గోపాల సరసఖేల. ౨౯౯

కం. పరుఁ డవ్యయుండ వాదిమ
పురుషుండవ చిచ్చిదాత్మభూతాంతర్భా
సురుఁ డవతర్క్యుఁడ వజుఁడవు
పరమేశుఁడ వైన నిన్ను బ్రణుతింతు హరీ ౩౦౦

సీ. ధర్మార్థకామసంతతివివర్ధనుఁడవు
వివిధరాగద్వేషవిరహితుఁడవు,
కైవల్యసంధానకారణభూతుండ
వారూఢతత్త్వనియామకుఁడవు
నఖిలసముండ వాద్యంతశూన్యుండవు
నిరతప్రియాప్రియవిరహితుఁడవు

నతినిగ్రహానుగ్రహసమర్థుడవు మహా
మహుఁడ వాశ్రితదృశ్యమానమూర్తి

తే గీ వట్టి నీకు బ్రణామంబు లాచరింతు
త్రిభువనక్షేమశతశతాదిత్యధామ!
రూపజితకామ! నిత్యకారుణ్యసీమ!
సద్గుణస్తోమ! యాదవసార్వభౌమ!

సీ తాపత్రయాభీలదావాగ్ని జల్లారు
నే దేవు గుణరసాస్వాదనమున
సలలితసకలార్థఫలలాభము లొసంగు
నెవని శుభాంగసమీక్షణమున
తాత్త్వికభువనోన్నతిత్వంబు నొందించు
నేశౌరి చరణసేవేచ్ఛవలన
కౌటిల్యతనుబంధనంబుల విడజేయు
నేఘనునామోక్తహితమువలన

తే గీ. నట్టి నీకేను వందనం బాచరింతు
శ్రీమనోహారి! పోషితాశ్రితవిసారి!
దనుజకులహారి! గరుడవాహనవిహారి!
దోషసంహారి! సుందరవేషధారి! ३०౨

వ అని యివ్విధంబున నవ్వృకోదరనందనుం డమందానందకందళిత మంద స్మితముఖారవిందంబున-మరందబిందుబృందమ్ములు జిందుచందంబున-వీనులవిందుగా నందనందను నభినందించి ముందటం జెన్నొందు కాళిందీ భేదను సుందరపదారవిందంబుల కందంద వందనం బాచరించి యిట్లనియె ३०३

సీ మొదల శ్రీమదనంతమూర్తివై దీపించి
పిదప రామానుజాభిధత గాంచి

యిఁట రౌహిణేయప్రకటనామము వహించి
ముసలహలాయుధముల గ్రహించి
వితతకాళిందినీభేదన మొనరించి
కపటప్రలంబాదిఖలుల ద్రుంచి
యకళంకగతి నచ్యుతాగ్రజాఖ్య రహించి
రేవతీసతిని వరించి మించి

తే.గీ. నిత్యకరుణామయుండవౌ నిను గుఱించి
ప్రాంజలి యొనర్తు నన్ను నిప్పాటనుంచి
దయ నిరీక్షించి మదపరాధము లణంచి
కావవే నన్ను నీవానిగా గ్రహించి ౩౦౪

చం. తెలుపఁగనేల వేఱె భవదీయశమక్షమమందు లోకని
ర్మల తరకీర్తిశాలి యభిమన్యుఁడు మీకతిబాధ్యుఁ డాతనిం
దొలగఁగ ద్రోఁచి కౌరవసుతు న్వరియించుటచే ననర్థ మి
ట్లలవడె నింకనైన భవదాత్మజ నల్లున కిచ్చు టొప్పగున్. ౩౦౫

గీ. ప్రీతి నీరీతి వినుతించు భీమసూతి
సద్వినయ మెల్ల మది నిండి సంతసిల్లి
కార్య మూహించి వానిహృద్ధైర్య మెంచి
బలికె నొకమాట తనదు వాక్ప్రౌఢినాట. ౩౦౬

మ. దనుజాధీశ్వర నీమనోరథమె సిద్ధంబయ్యెగాదే! సుయో
ధనముఖ్యుల్ భవదాచరత్ప్రబలబాధాబద్ధులై ఘూకపలా
యనులై రింతటనైన సంభరితశాంతాత్ముండవై కన్యకా
మణి నెచ్చోటను డించిరో! తెలిపి నైర్మల్యాత్ములం జేయవే! ౩౦౭

చం. మఱి నివుగోరినట్టు లభిమన్యునకిచ్చుట తెచ్చుకోలు చు
ట్టఱితముగాదె సందియపడం బనిలే దది దైవయత్న మి

త్తెఱఁగున సంభవించె నిక దీర్పఁగ నేరితరంబు భావిని-
ప్పరిణయ మీవొనర్పఁదగు భావమునం దనురాగ మేర్పడన్. ౩౦౮

తే.గీ. అన్న! యభిమన్యుఁ డెచ్చట నున్నవాఁడొ?
యువిద శశిరేఖ నెట దాచియుంచినావొ?
వార లిటువచ్చుతెఱఁగు భావమున దలఁచి
నీయభిప్రాయమున బెండ్లి సేయవయ్య. ౩౦౯

చం. అని బలభద్రుఁ డాడెటి ప్రియాదరణోక్తుల నాదరించి య
ద్దనుజవరేణ్యు డిట్టులనె తావకపుత్రిక నీక సోదరిం
గినిసి నిరాకరించుటకు కేవలదైన్యవిషణ్ణచిత్తయై
తనయునితో మహాటవిపథంబున నేగ మదాశ్రమంబునన్. ౩౧౦

చం. కనుఁగొన మత్సహోదరుఁడుగా సురసంయమి తేటజేయ, నే
విని భవదుల్లసోక్తులు సవిస్తర మంబ వచించుట ల్మనం
బున సహియింపలేక పువుఁబోణి నదృశ్యత నర్ధరాత్రిగై
కొని జవత న్సుభద్రకడకుం జని కోడలి నప్పగించితిన్. ౩౧౧

కం. అంతట విసుగక కౌరవ
సంతతి నీగతి మహేంద్రజాలసుశక్తిం
గంతులు వేయించుట కీ
వింతలు గల్పించితిం దివిం భువి బెగడన్. ౩౧౨

కం నీమేనల్లుఁ డతండగు
మామలు మీరగుదు రతని మాన్యతజేయన్
మీమీరలేకకృతి గౌన
మామావ్యాపారములు సమర్థములగునే! ౩౧౪

తే.గీ సకలవిధబాధ్యులైన మీసముఖమునను
మేము విజ్ఞాపనముజేయ నేమిఫలము

కడకు నూనియ నూవు లేకంబెకాని
గాంఢ్లవాఁ డొక్కరుఁడె తేఱగాఁడుకాడె ౩౧౪

కం. పంచాస్యభోగ్యవస్తువు
కొంచెపు శునకము భుజింపఁగోరినగతి గా
మించి యభిమన్యుపత్ని న
కించనుఁడగు లక్ష్మణుఁడు సుఖించఁగవశమే! ౩౧౫

కం. నీమేనల్లుఁడు సుత భగి
నీమణి యీమువ్వు రెనసి నిరుపమకుతుక
శ్రీమీర మదాశ్రమమున
సేమంబున నున్నవారు చింతిలనేలా

మ. భవదుత్సాహముమీఱఁ బౌరజనసద్బంధుప్రయుక్తంబువై
భవలీలం ఘనతూర్యనాదములు మ్రోవన్ వే-మదీయాశ్రమా
టవి కేతెంచి సహోదరీమణికి వేడ్కం జెంద కల్యాణ మ
వ్యవధిం జేయఁగ దోడితె మ్మఖిలలోకానందసంధాయివై. ౩౧౭

తే.గీ. తవ కనన్యుఁడు ఫల్గుణాత్మజుఁడు గాన
వేఱే మాబోఁటులిది విన్నవింపవలెనె
తలపెఱుంగక నేజేయు ధౌర్త్యములకు
ముదపరాధసహస్రముల్ మాన్పవలయు ౩౧౮

చం. అని వినయంబునం దనుజుఁ డాడిన మాటల కచ్యుతాగ్రజుం
డనుమతిఁ బల్కె నీయభిమతార్థము మా కనుకూలమయ్యెఁ గా
వున నిక మాసుభద్ర కిది బోధపడ న్వినిపించి కౌతుకం
బెనయఁగ జేయు కార్యకృతహేతుసమర్థుఁడ వీవె గావునన్. ౩

ఉ. భీమతనూజ యీజగదభేద్య సుయోధనుశక్తి నీదుమా
యామహిమం జయించి విజయం బిట జెందితి వింకమీఁద సు

త్రామతనూభవాత్మజు యథాశుభసత్కృతి నిందుఁ దోడితే
నేమఱుదెంతు మీవచటికేగు విలంబము మాని జాగ్రతన్. ౩౨౦

మ అని పేడ్కొల్పిన వందనం బిడి నిలింపారాతి కౌతూహలం
బున నభ్రంబున కుగ్గశించి దిశ లబ్ధుల్ మ్రోయ కోలాహల
ధ్వని గావించి యఱక్షణంబున నిజస్థానంబునం జేరి చే
సిన గార్యంబు సవిస్తరం బెఱుఁగజేసెం దల్లికిం దోడుకున్. ౩౨౧

సీ శశిరేఖ నిటఁ బ్రవేశముజేసి తాదృశ
రూపంబు బలునింట జూపుటయును
తుది ఘోరవికృతాకృతులు బిన్ని లక్ష్మణు
నగ్నాంగమున బాఱనడుపుటయును
దదుపరి కన్య నంతర్ధాన మొనరించ
నచ్యుతాగ్రజముఖ్యు లడలుటయును
దాఁజేయు మాయాకదనమున కతిరథ
సమరథసైన్యము ల్సమయుటయును

తే.గీ. నార్తి బలభద్రుఁ డాహరి నడుగుటయును
దెలిసి యతఁ డియ్యకొనఁగ బోధించుటయును
బూసగ్రుచ్చినరీతి నద్భుతముగాను
సర్వ మెఱిఁగించుచున్నట్టి సమయముననను ౩౨౨

చం. తెలతెలవాఱ తారకల దీప్తులు రాలె - రథాంగకోటి నె
వ్వలు మదిలోన దూఱె, కృకవాజ్నినదంబులు మీఱె, సారసం
బుల ముద మారె, చీఁకటులు భూధరగహ్వములందు దూఱె - క
ల్వలయెడ నిద్ర జేరె, రవి ప్రాక్శిఖరిన్ రుచిదేరె తోరమై ౩౨౩

మ. హిమభానుం డుదయంబునంది విధియయ్యె న్మున్ సువర్ణద్యుతి
న్విమలుండై - యటమీఁద సోముఁ డనఁగా వెల్గొందె శుభ్రప్రభం
గ్రమమొప్పన్ హరిగాన నైల్యరుచి సంకాశించె మూర్తిత్రయా
ఖ్యమహా న్సత్యము సత్యమంచు కృకవాకధ్వానము ల్మ్రోయఁగన్. ౩౨౪

కం. సతతము సుస్నేహాంచిత
గతిని దమంబెల్ల నడఁచి కలితనిజతపః
స్థితిచే సాత్త్విక మెనసిన
గతిగా ధవళిమను దీపకళికలు దోఁచెన్ ౩౨౫

చం. గుఱుతుగ తమ్మిపూవనెడు కుందెనలో సుమనోరజంబునే
పరిమళరాజనంబులు ప్రభాకరదీధితికాంత లుంచి – సం
బరమున ఝుంకృతిధ్వనుల పాటలు పాడుచు దంచుచున్న బం
ధురముసలప్రభాగరిమ దోఁచె తదుత్థితబంభరధ్వనుల్. ౩౨౬

కం. సంతతదోషాకరుఁడు – న
నంతమహారాజ్యపదవి నతిమత్తుండై
యంత నధోగతి డిగె, రా
జ్యాంతే నరకం ధ్రువం బటన్న విధమునన్ ౩౨౭

కం. రాజీవాక్షుఁడు బలుఁడే
యోజను బరిణయ మొనర్చిరో యనుచుఁ దపో
భ్రాజిష్ణుఁ బైలునిం, జన
మేజయుఁ డవ్వలి కథాప్రమేయ మడుగుటన్. ౩౨౮

## –:ఆశ్వాసాంతము:–

కం. లక్ష్మీపదలాక్షారస
సాక్షాచ్ఛ్రీవత్సవక్ష సరసిరుహాక్షా
రక్షోగణశిక్షాచణ
ధక్షితఫాలాక్షఖలమురప్రతిపక్షా. ౩౨౯

## సుమగుళుచ్ఛబంధము



సారాచారా సౌరాధారా
మారాకారా పరాత్పరా
పారావారా గారాశూరా
హీరాహారా ధరాధరా ! (ద్వి-౩౩౦)

సుమగుచ్ఛ బంధము—

సారాచారా ! సౌరాధారా !
మారాకారా ! పరాత్పరా !
పారావారా ! గారాశూరా !
హీరాహారా ! ధరాధరా ! ౩౩౦

మాలిని కుమతకులవినాశా ! కోటిసూర్యప్రకాశా
శమదమగుణకోశా ! సాధుచేతోనివేశా !
రమితతతపలాశా ! దానవారాత్యధీశా !
విమలిననిజదేశా ! [1]వృషగిరిశ్రీరమేశా ! ౩౩౧

మ ఇదిశ్రీశేషధరోపమానసుషమే
ఖేంద్రారిహృత్సర్వబో
ధదశ్రీమత్కనగంటిగోపవిభు - బ
ద్ధశ్రీమజింగంటికో
విదశ్రీరాఘవవర్యసోదరసుధీ
విద్వన్నృసింహార్యశం
వదతాలాంకసునందినీపరిణయా
శ్వాసంబు పంచాఖ్యమై. ౩౩౨

గద్య

ఇది శ్రీమచ్ఛేషధరాధర సౌధవీధీవిహరణ వేంకటరమణ
చక్షుర్విలక్షణాక్షీణకృపాకటాక్షవీక్షణాపరిలబ్ధలక్ష్యల
క్షణానవద్యవిద్యావిలాస శ్రీనివాసగురు
చరణస్మరణాభ్యసనరసనావికాస నిస్తుల్య
కల్యాణసాకల్యమౌద్గల్యగోత్ర పవిత్ర
భావనాచార్యపుత్ర పర్వత్రయకైం
కర్యవిధాన వేంకటనృసింహాభి
ధానప్రణీతంబైన తాలాంక
నందినీ పరిణయం బను
మహాప్రబంధంబునందు
పంచమాశ్వాసము. ౩౩౩

1 ఈ భాగమున గణభంగము. 'విస్తృతాద్రీంద్రవాసా' అనిన సరిపడును.

# తాలాంక నందినీ పరిణయము

## షష్ఠాశ్వాసము

కం. శ్రీ తరుణీతరుణోరో
జాతాలయనీతపూతచందనవక్ష
స్స్రుతశరజాతజాతసు
గీతప్రియచేతశేషగిరిమృగపోతా ౧

కం చిత్తావధాన పైలుం
డత్తఱి జనమేజయున కనంతకథ వా
గ్వృత్తమది దెలియఁబలికె వి
యత్తటినీవీచికామహత్తరఫణితిన్. ౨

చం అపు డరుణోదయం బగుట నంతకుమున్నె ప్రభాతగీతివా
ఙ్నిపుణసునాదమోదితమనీషులునై బలకృష్ణు లా సుషు
ప్తి పరవశంబులం గలఁక దేఱి సమంచితకాల్యకృత్యముల్
విపులమతి న్సభక్తి నెరవేర్చి సభాభవనంబుఁ జేరియున్ ౩

తే గీ. వన్నెలజిలుంగు తాప్తాతివాసిపైన
సొన్నమఖమల్‌గలీబపై బన్నియున్న
దక్కియలనాని కొలువుండి రక్కజముగ
హితపురోహితసుతమిత్రతతులు గొలువ ౪

సీ. ఒకచోట నృత్యగాయకకూట మనురక్తి
కాలతాలక్రియాగతి నటింప,
నొకవంక విద్వాంసు లకళంకగతి నహం
పూర్వ మహంపూర్వముగ వచింప

నొకక్రేవ సంతతోత్సుకభావపౌరాణ
కధకులు చిత్రవైఖరులు దెలుప
నొకయోర మాగధాదికవార మతిభక్తి
జయవిజయాభవచ్ఛాయఁ బొగడ

గీ మేలిమికడాని నిండుపేరోలగమున
శౌరితోఁ జేరి కొలువుండి సీరపాణి
సుమధుమధురసుధారసస్ఫూర్తి రహరిఁ
దోలుచిట్లని సాత్యకితోడ బలికె ౫

చం మునుపటినుండి నీకు యదుముఖ్యులకుం బ్రియమైనరీతిగా-
మనశశిరేఖ నిప్పు డభిమన్యున కీయఁగ మన్మనోరథం
బెనసె ఘటోత్కచాశ్రమముకేగి వధూవరయుక్త మిందు స
గొయ్యన గొనివచ్చి యిప్పరిణయం బొనరింత మనన్యభావనన్. ౬

క జాగేల పురి నలంకృతి
గాఁ గయిచేయుటకు జాటఁగా వలయును వే
వేగమున నిఖిలబంధుస
మాగత మొనరింపు నీవనన్యమనీషన్. ౭

గీ కానిపో నిదొకటి కళ్యాణమని మున్ను
పుర మలంకరింప బొసఁగ నిట్లు
రక్తజలపురీషసిక్తమౌట పునఃప్ర
యత్న మొనరుటొప్పు నూత్నరుచిని. ౮

కం. అని యుక్తరీతి దెలిపిన
సనయోక్తుల నాలకించి సాత్యకి మదిలో
ననురక్తినీయఁ గొని దా
పునరుక్తి వచింపకం బ్రమోదహృదయుఁడై. ౯

చం. పురజనకోటికిం దెలియ భూరితర్పాటదుందుభిధ్వనుల్
మెఱయఁగజేసి పట్టణ మమోఘశుభాప్తి నలంకరించుఁ డీ

త్తఱి (మన) బాలభద్రికి హితంబుగ నయ్యభిమన్యశౌరికిం
బరిణయమెల్ల దాకొనియె పౌరజను ల్వినఁగా దగుం జుమీ ౧౦

తే గీ. అవిన పౌరులు కర్ణరసాయనముగ
విని యఖర్వముదంబు హృద్వీథి బర్వ
కోటలను పౌధపంక్తులఁ గ్రొత్తడముల
విపణివీథుల శృంగారవిధు లొనర్చి ౧౧

మ. భవనములన్ వితర్దుల సభాస్థలుల న్విపణివ్రజంబుల
న్నవఘనసారసిక్తమృగనాభిజలంబుల జిల్కి మేలిక్రొం
బవడఁపు గుజ్జుఁగంబములఁ బచ్చలతోరణముల్ ఘటించి సాం
కవరసకుంకుమాగురుసుగంధిలధూపము లుంచి రెత్తయున్. ౧౨

సీ. సాంకవపాటీరపంక మేళనమైన
కాశ్మీరచూర్ణంబు గలియ నలికి
పన్నీటము త్రెంపుసన్నంపు సున్నంపు-
టలుకుచిలుకులు రంగుదొలుక జిలికి
కమనీయకస్తూరికాకర్దమము నిండు
సాదుపట్టెల సాలు సంఘటించి
కర్పూరచందనకలితమౌ గొజ్జంగి
పూవునీటను కలాపులను జల్లి

తే.గీ. ముంగిట బయళ్ల ముత్యాలముగ్గు దీర్చి
బంగరుజిలుంగుటనఁటిగంబముల నిలిపి
తళుకుమరకతతోరణముల నమర్చి
యపు డలంకృతి గావించి రప్పురంబు ౧౩

గీ పురుషు లతివ లఖిలభూషణవస్త్రమా
ల్యానులేపనముల నలరి వివిధ
హృద్యవాద్యతతు లపద్యామై మ్రోయు మ
హోత్సవమున పురము నొప్పె కరము

ఉ. పుర మిబ్భంగి నలంకరింప బలదేవుం డచ్యుతుం డర్థి భూ
సురసంఘంబుల గాంచి యిట్లనిరి పూజ్యు ల్మాకు మీరౌట—మ
ద్వరపుత్రీమణి నర్జునాత్మజున కీయన్ బుద్ధి దోచెన్ శుభ
స్థిరమౌహూర్తికలగ్న మవ్యవధి యోచింపందగు న్సత్కృపన్. ౧౫

కం. అనిన హలి నిజమృదూక్తుల
కనురాగమునొంది విప్రులందఱు లిది మే
ల్పని యని యనుకొని - మునుకొని
కనుగొని యనుఁగెనయ వినయగతి బల్కి రొగిన్ ౧౬

చం తరుణికి పంకజప్రియహితంబు పదంబులయందు, తారకా
వరవరమైత్రియు న్నఖరపంక్తిని, మంగళశాలిదీప్తి-వి
స్ఫురతరజంఘల, ప్రుచిరవేణిని రాహుహితంబు చన్గవ
న్గురుసుకరావలోకనము గూడె నిదే సుముహూర్త మెల్లియున్ ౧౭

చం అనుటకు సంతసింపుచు నృపాధ్యులకున్ శుభలేఖ లంపు మే
ల్కనకపుఁ గాగితంబులను కస్తురిసారపునిగ్గు శాయిచే
సనయతగా లిఖించి తనచక్రమునన్ మొహరొత్తిపంపె న
వ్వనజదళాక్షుఁ డాత్మజవివాహసమాగతసూచనార్థమై ౧౮

కం ఆశుభలేఖల భటు లవ
నీశుల కెల్లెడలవారి కిచ్చిన హరి ని
ర్దేశమని హర్షమానసు
లై శీర్షములం ధరించి యతివేగమునన్. ౧౯

మ. హలికన్యాప్రదుఁ డర్జునాత్మజుఁడు మేనల్లుండు బాధ్యుండు ద
త్ఫలసంధాయకుఁ డౌ చతుర్భుజుఁడుగా భావించి యీమేలువా
ర్తలు విన్నంతఁ గుతూహలం బెనయఁ దత్తద్దేశభూపాలమం
డలి విచ్చేసిన బంగరంపు విడిదిండ్ల న్నింపె సైనేయుఁడున్ ౨౦

చం మును పరుదెంచినట్లు మునిముఖ్యులు రాజులు విప్రులుండ ద
క్కినసకలావనీజనులు కేవల మీయభిమన్యుపెండిలిం

గను(గొను కోరిక ల్నిగుడ(గా జనుదెంచిన వారలం గన
త్కనకగృహంబుల న్విడిదిగా నియమించి బహూకరింపుచున్ ౨౧

చం మన యదువృష్ణిభోజకులమండలితోడ ఘటోత్కచాశ్రమం
బున కరుదెంచి వేగ బలపుత్రిక నయ్యభిమన్యుని న్సుభ
ద్రను గొనితేఅగావలయు దంతిరథాశ్వభటాంగముఖ్యసా
ధనము లలంకరించుమని దానవభేదను( డానతీయ(గన్ ౨౨

గీ. పతి నియోగింప సాత్యకిప్రముఖు లెల్ల
వేణువీణామృదంగనిస్సాణతూర్య
దుందుభీనాదములు మింట నంది మ్రోయ
తత్క్షణమునందె కట్టాయితం బొనర్చి ౨౩

సీ. పటురథాంచితచిత్రపటపటపటరవం
బటఘంటికామహోర్భటుల నెస(గ
భటపటలీసముత్కటహుంటాహుంటిధాటి
పటహతమ్మటలజంఝుటల నొదుగ
చండవేదండప్రకాండఘీంకరణ మా
ర్తాండమండలమెల్ల నిండియుండ
వరతురంగమఖరఖరఘర్షణధ్వని
భీషణహేషాతిఘోష నెనయ

తే గీ చలితచతురంగబలమహాకలకలముల
నిలకులాచలజాలముల్ దొలకిపొరల(
గేశవుండు ప్రలంబవినాశనుండు
పయనమౌచున్నతఱిని జూపట్టె( బురిని ౨౪

చం హితులు పురోహితు ల్వసుమతీసులు మౌనితతు ల్విలాసినీ
వతులు చిరంటికాసతులు వందిభటప్రతతుల్ నిజాహితుల్
వితతనుతుల్ మహోన్నతు లవీరత దీరత హారతావివా
గతులితరీతి( దెల్ప(గ( బ్రయాణములై బలకృష్ణు లప్పుతన్. ౨౫

గీ సాంబకృతవర్మసాత్యకిప్రసారణప్ర
ముఖుల కుచి కాశ్వగజాహమ్ముల నొసంగి
నడుమ వసుదేవు నుగ్రసేనప్రముఖులఁ
గలసి తామొక శతాంగమున నెక్కి ౨౬

సీ. భటకోటికహకహారావములచే సన్నద్ధ
శస్త్రులై యుభయపార్శ్వముల నడవ
గద్యపద్యముల మాగధు లుగ్గడింపుచు
రమణీయమణిచామరములు వీవ
ఢాంఢమీఢక్కాహుంఢక్కాడివాద్యాని
నాదంబు దశదిశల్ భేదిలంగఁ
బుణ్యాంగనాముఖుల్ పణ్యాంగనాజనుల్
గంధపుష్పాక్షత లాకనక లొసఁగ

తే-గీ. గిరుల నిరులను బోల్మత్తకరులు హరులు
సురలు మరులొందు సంగీతపరులు వేత్ర
ధరులు భూవరు లనుఁగులపరులుఁ దాము
నడచి రాసీరిశౌరికాననము దారి ౨౭

చం. చని పురతస్థలిం గనిరి సాలతమాల కపిత్థవంజులా
ర్జునవకుళామ్ర నీపవటరోచకపాటల నాగరంగచం
దనకృతమాలతిందుక రథద్రుమనింబలవంగలుంగ కాం
చనకరవీరముఖ్యతరుషండ వినిర్గమదుర్గమార్గమున్ ౨౮

మ తురగస్యందనకుంభిసీతతికి దోడ్తోడై వడిన్ మ్రోసె శం
బరకంఠీరవఖడ్గకోలచమరీభల్లూకశార్దూలకా
సరశల్యవృకముఖ్యసత్వముల పర్జన్యధ్వనిన్ రోకదు
ర్భరమాయామహుఁడా ఘటోత్కచుని జేకంబోవు మార్గంబునన్. ౨౯

సీ ఇదిగో పరులయంచి మదిగోపికాబృందఁ
మెడగోలుజెంప పెల్లొదరుచుండ

తండోపతండవేదండప్రకాండ ము
ద్దండమై యిక్కొండనిండ నుండ
నల్లదే భయభూతభల్లకపల్లిక వ్రాత
హల్లధ్వనులఁ దల్లడిల్లఁజేయు
నాలంబుననుబోరి జాలంబులై దూరి
కోలంబు లీదారి గోలలాడ

తే గీ గాన యీకాన కెనయఁగా గానమనియ
నూనతామానసాను మోదానుగతిని
సానువులమంజుకుంజవితానములను
గడచి కతిపయదినశీఘ్రగతుల నడచి ౩౦

చం అని యిటుల న్నుతించి వికటాటవి మీఁచి గమించి మించి భీమనం
దనునిగుఱించి చిత్రఘటితక్రియ లెల్ల దలంచి విస్మయం
బున మది నుత్సహించి నిజపుత్రిఁ గనుంగొను వాంఛ నుంచి య
ల్లన జనుదెంచి తద్ఘనబిలస్థలి గాంచి రుచంచితంబుగాన్ ౩౧

ఉ అంతకుమున్ ఘటోత్కచుఁ డహార్యగుహాంతరసీమఁ జేరి దా
నెంతయుఁ బోయివచ్చు తెఱఁగెల్ల సుభద్రకు దెల్పుచుం బ్రలం
బాంతకుఁ డచ్యుతుండు సుత నల్లుని దోడ్కొనిపోయి పెండిలి
త్యంతముదంబునన్ సలుప నర్థిని వే జనుదెంతు రెల్లియున్ ౩౨

మ అని యాద్యంతము దెల్పుచో హృదయమం దయ్యర్జునుం డెట్టు లీ
తని కల్యాణమహోత్సవంబు గనుసందర్భంబు బాటించునో!
యని యాఖండలుతో సుధర్మసభయం దర్ధాసనాసీనుఁడై
యునికిం గాంచి యుపాయ మొక్కగతి దా నూహించె నుత్సాహియై ౩౩

శా శ్రేయోభూతముగాఁగ ప్రహస్తకృతి దేశికల్ వ్రాసి నా
వాయువ్యాస్త్రము కంటగట్టి దివికి న్వాటించి నేసూటిగా

ప్రేయన్ వాసవవాసవీప్రముఖుల న్వీక్షించి వేగం బిటం
డాయె న్స్వేచ్ఛద జింతకన్న మదిజూడన్ శే దుపాయం బికన్ ౩౪

చం. మది నిది నిశ్చయించి యభిమన్యుసుభద్రల కి త్తెఱంగు స
మ్మద మొనరించి యుద్వహసుమంగళపత్రికయున్ లిఖించి నె
మ్మది ననిలాస్త్రమం దనుపమానముగా ఘటియించివేసె నా
త్రిదశసభన్ బిడౌజముఖదేవగణం బతిచిత్ర మందఁగన్ ౩౫

ఉ. ఆమహదస్త్రరాజ మపు డర్జునుఁడున్ శతమన్యుఁ డున్న చిం
తామణిభద్రపీఠిని ద్రుతంబున వ్రాలిననంతలోన సు
త్రామముఖామరాళి ప్రమదంబున గన్గొని తన్నిబద్ధమై
ప్రేమ నలంకరించు శుభలేఖను గై కొని వేవచింపఁగన్. ౩౬

ఉ. "శ్రీకరసర్వదిగ్వివశీకరబాహుబలప్రతాపుఁ డౌ
పాకవిభేదిసన్నిధికి ప్రాంజలుఁ డౌచు ఘటోత్కచుం డనే
కైకనమస్కృతోక్తి లిఖియించిన విన్నపపత్రిక న్మదిం
గై కొని మన్మనోరథ మఖండగతి న్నెరవేర్చ వేడెదన్ ౩౭

చం. మది ముదమందగా నిపుడు మాయభిమన్యుని పెండ్లికై సమ
స్తదివిజులున్ బృహస్పతికృశానుముఖాఖిలదిగ్వరు ల్ప్రియం
బొదవఁగ నర్జును న్నుతమహోత్సవలగ్నవిలోకనార్థమై
సదయత బోధఁజేసి కామసన్నిధితోడుకరాదగుం జుమీ" ౩౮

కం. ఈరీతిం జదివి సునా
సీరుం డర్జునుఁడు వెఱగుజెందెటి వేళన్
ద్వారావతినుండి మహో
దారుఁడు నారదుఁడు తనకుఁతాఁ జనుదెంచెన్ ౩౯

ఉ. వచ్చిన సంయమీంద్రునకు వజ్రిశచీసతితోడ గూడి వి
వ్వచ్చుఁడు దానెదుర్కొని సువర్ణమణిస్థగితాసనంబునన్

మెచ్చ వసింపఁజేసి మతిమించిన భక్తి నుతించి కూర్మిమై
నచ్చపడ న్ముఖాంచితకరాంజలుఁడై వచియించె నమ్రతన్ ౪౦

ఉ. దేవర లెందునుండి చనుదెంచితిరో! గత మేమొ! పాండుపు
త్రావలి సంపద ల్గొని యహంకృతితోడ సుయోధనుండు స
ద్భావుకుఁడై సుఖించునెగదా! విజయుం డిట నున్నవాఁడు యిం
కీవల చిత్రమేమొ వచియింపఁగదే సురసంయమీశ్వరా! ౪౧

చం. మఱి యిదిగాక నిప్పు డభిమన్యుని బెండ్లి లటంచు దానవే
శ్వరుఁడు ఘటోత్కచుండు త్రిదశప్రయుతంబుగ నన్ను నర్జునున్
బరువడి రమ్మటంచు శుభపత్రిక వ్రాసినవాఁడు నేఁడు యి
త్తెఱఁ గెటువంటిదో! మదికి తేఁటపడన్ వివరింపవే దయన్ ౪౨

ఉ ఎక్కడివార్తయో దనుజుఁ డేగతి నీశుభకార్య మెన్న దే
దిక్కున నాచరించునొ సతీమణి యెవ్వరికూఁతు రెట్టులీ
చక్కి బొసంగునో యనుచు సందియమొందుచు సవ్యసాచి నే
నెక్కడ దోఁచకంగలగ నింతటిలో మిముగంటి మున్నతిన్ ౪౩

కం. ఇది వినినప్పుడె మోదా
స్పద మయ్యెంగాని దీని సాకల్యముగా
మది దెలియకున్న త్రిజగ
ద్విదితాత్ములు మీకు విన్నవింపఁగవలసెన్ ౪౪

చం. అనిన సురర్షి యిట్లనియె నద్రినిసూదన కౌరవేశ్వరుం
డనుపమభోగవైభవము లందెను దాని నటుండనిమ్ము సొం
పెనయ ఘటోత్కచుండు లిఖియించిన యీశుభలేఖ భావమే
పనిబడి నీకు పార్థునకు బాల్పడి తెల్పఁగ నేఁగుదెంచితిన్ ౪౫

సీ ఆద్వారకను సుభద్రాభిమన్యులు నుండ
బలునకు శశిరేఖ గలుగుటయును
దానిమేనల్లున కే నొసఁగెద నంచు
భగినీమణికి నమ్మబలుకుటయును

తఱువాత కురురాజతనయునకును కన్య
        నీయఁగా నొకలగ్న మిడుటయును
నందుకు తల్లి దా నర్ధరాత్రిని లేచి
యభిమన్యుఁ దడవుల కరుగుటయును

గీ. నట ఘటోత్కచుఁ డనుకూలుఁడైన పిదప
దానవుఁడు ధౌర్త్యమాయావిధానములను
తరలివచ్చిన కౌరవతతుల నెల్ల
వెతలఁబెట్టుటఁ దెల్పెద విను బిడౌజ ౪౬

తే.గీ. అన్న యన్నమాట కర్ధరాత్రమునందు
కొడుకుతో సుభద్ర యడవికఱుఁగ
విల్లునమ్ము లరసి వీరుఁ డంచని పార్థ
సుతునితో ఘటోత్కచుండు గవిసె ౪౭

ఉ. ఆయభిమన్యుఁడుం దనుఁ జూఁ డన్నలు దమ్ములు నౌ టెఱుంగమిం
బాయని రోషభీషణత బాహుబలంబులఁ బోరునంత నే
నాయెడ కేగుదెంచి యుభయత్రల చుట్టఱికంబు దెల్పఁగా
నాయువుదక్కి వారికి ప్రియంబున సౌహృదభావ మేర్పడెన్. ౪౮

మ. తనయుండైన ఘటోత్కచుం గని సుభద్రాదేవి యాసీరి త
న్నును నిర్మానుషవాక్యము ల్దెలుప నుగ్రాకారుఁడై తత్క్షణం
బున ద్వారావతికేగి యాహలిగృహంబున్ మాయచే జొచ్చి క
న్య నదృశ్యాకృతి తోడిదెచ్చి యభిమన్యస్వామి కొప్పించియున్ ౪౯

కం. ఆకన్యకాకృతిం దా
గైకొని లక్ష్మణుని లగ్నకాలంబున చు
ర్భీకరరూపముజూపి చి
కాకునవా డదఱిపాఱఁగా వడి దఱిమెన్ ౫౦

కం. మాయాకన్యక నంతట
మాయము గావించి యభ్రమండలమున దు

ర్జేయగతి నిలిచి నిఖిలో
పాయములం గౌరవుల విభంగ మొనర్చెన్ ౨౧

సీ. శరభసింహాలులాయ శార్దూలముఖదుష్ట
జంతుసంతతు లార్చుఁ గొంత సేపు
భటరథద్విరదాశ్వపటలమహార్భాట
మంతంత గల్పించుఁ గొంత సేపు
గండశిలాశనీకరకానలాసార
ఘోరకృత్యము జూపి కొంత సేపు
మాంసమస్తిష్కాస్రమలమూత్రకర్దమా
క్రాంతంబుగ నొనర్చి కొంత సేపు

తే గీ. కురుబలంబుల నిట్లు గగ్గోలుపఱచు
నట్టి వార్తలు మననోట బెట్టరాదు
తెలిసికొమ్మిక నొకమాట బలికెద విను
యమపురంబున లేదంత శ్రమకరంబు ౨౨

చం. కురుబల మీగతిం జెడుటకున్ భయమంది జనంబు హస్తినా
పురమునకున్ పలాయనము జెందుటచే బలభద్రునిన్ రమా
వరుఁ డొడబాటుజేసి వరవర్ణిని నయ్యభిమన్యుశౌరికిం
బరిణయ మాచరింప మతిబాల్పడి రెల్లి ముహూర్త మయ్యెడిన్. ౨౩

మ. తనయ న్సోదరి నల్లునిం బురికి మోదం బొప్ప దోడ్తే జనా
ర్దన తార్క్ష్యధ్వజసాత్యకిప్రముఖు లుత్సాహంబునం ద్వారకా
జన మాబాలయదుప్రయుక్తముగ భాస్వన్మంగళాచారవా
ద్యనినాదంబులు మ్రోయ నేఁ దఱిగి రాస్తన్ బంధుయుక్తంబుగన్. ౨౪

చం. కనుక ఘటోత్కచుండు కుతుకం బెనయన్ శుభపత్రికాముఖం
బున దెలియంగజేయఁ దనపుత్రుని పెండ్లికి నర్జునుండు ని
న్గాని తనురాగలం దనెడి కోరికనుండినవాఁడు నీవు నీ
యనుచరు లర్జునుండు క్షణ మాళసియింపఁగ నేగఁగా దగున్. ౨౫

కం. తడవాయె నిన్నినాళ్ళకు
కొడుకు వివాహంబు జూడకోరికచే క
వ్వడి వచ్చి నాకుఁ గన్నులఁ
బడునేమో యని సుభద్ర ప్రలపించుసుమీ! ౫౬

చం. దివిజమునీంద్రుఁ డిప్పగిది తేటపడ న్వచియించి స్వేచ్ఛ న
వ్యవధి ముకుందకీర్తనలు బాడుచు నాడుచు నేగి నంత వా
సవధిషణార్జునాదిదివిషజ్జను లిట్టి ఘటోత్కచుండు కౌ
రవబల మాహరించిన ధురంధరవృత్తికి సంతసింపుచున్. ౫౭

సీ. చెలి నెత్తుకొనిపోయి చెలిరూపు తానయ్యె
నన్న విస్మయరసం బావహించె
నాలక్ష్మణుండు దిగంబరుండై పాఱె
ననిన హాస్యరసంబు ననుకరించె
రౌద్రజంతువులు కౌరవులఁ బ్రేల్చెనటన్న
సరణి భీభత్సరసంబు వొడమె
తమను కర్ణుండు నిందలు వచించె నటన్న
బెలుచ వీరరసంబు బిక్కటిల్లె

గీ. తుదకు రాముఁడు కన్యనిత్తునని బల్కె
నన్న శాంతరసంబు మైచెన్ను మిగిలె
పెండ్లికి సుభద్ర నినుజూడ బ్రేమఁగోరె
ననిన శృంగారరస మంతకంత జెలఁగె. ౫౮

చం. హరిహయుఁ డర్జునుండు పరమాద్భుత మందుచు దైత్యుఁ డా వృకో
దరసుతుఁ డౌటకుం దగినధైర్యము శౌర్య మయారె యంచు న
త్తఱి నభిమన్యు బెండ్లిగను దత్పరతం దిగధీశకోటి న
ప్సరసల నమర్త్యులన్ భటుల వైనమొనర్చెటి యంతలోపలన్. ౫౯

మ. పదిరెండేడు లరణ్యవాసనియతిం బార్థుండు చింతించి నె
మ్మది నూరం జొఱ సూనృతంబునకు ధర్మం బౌనె కీర్తిక్షయా

స్పదముం గాదె మదగ్రజుండు వినితాపం బందఁడే మాద నా
కిది లోకత్రయదూషితం బనిన దేవేంద్రుండు దానిట్లనెన్ ౬౦

శా ఏమీ ఫల్గుణ వెఱ్ఱివై పలికె దీ పీలాగు నీపుత్రుఁ డ
త్యామోదంబున బెండ్లియాద నెనఱింతైన న్మదిన్‌లేక నే
మేమో న్యాయము లెంచి రాననుచు నూహించేవు నీముచ్చటల్
మామా! చా లిటువంటి సంగతుల కేమాయె న్వితర్కింపగన్. ౬౧

చం. ధరణికి డిగ్గకేను సతతంబు నభశ్చరవృత్తినుండి యీ
పరిణయలోకనభ్రమను బాల్పడి యేగఁగ నాఁడు వెంట నీ
వఱుఁగుటచే యశోనియతహాని యటంచు దలంచనేల శ్రీ
హరిగలఁ డచ్చట న్మనలకన్నిట నెన్న శుభప్రదాయియై ౬౨

చం హరి యఖిలార్థవేద్యుఁ డగు టంతియెగా కతఁడున్న భూమియే
పరమపదం బనన్యజనభాజన మవ్యయ మద్భుతంబు నా
దెఱిఁగి తదంఘ్రిసేవనము కేగిననేమి కొఱంత యిప్పుడీ
సురపురిఁ జేరఁ దత్పురము జొచ్చుట ధర్మవిరుద్ధ మాయెనే. ౬౩

చం పదఁపడి తత్పదాంబుజప్రపత్తి యొనర్చుటచే ప్రతిజ్ఞలె
ల్లఁ దిరముగా నొనర్చినఫలంబు లభించదె ద్వారకాపురం
బదియొక పుణ్యభూమి యది యక్షయమోక్షనిధాన మంచు నా
రదసనకాదిమౌనులు తిరంబుగ వచ్చుచుఁ బోవుచుండరే ౬౪

కం. హరిసేవ కఱుఁగ దనయుని
బరిణయ మొనగూడ చూడప్రాప్తంబగు ని
త్తెఱఁగెల్ల మాని ఠమ్మని
నరుఁ డియ్యకొనంగ నాకనాథుం డలరెన్. ౬౫

ఉ. ఆవిధిగా నొడంబఱచి హారకిరీటవిభూషియై శచీ
దేవియుఁ దాను ఫల్గుణుఁ డతిత్వర దంతచతుష్టయాభ్రదం

తావళమెక్కి వెంట విబుధప్రతతుల్ త్రిదశత్రికోటి సం
భావనసేయ స్వర్గ మతిభాసురవైభవలీల వెల్వడెన్ ౬౬

కం. సురలోకభోగ్యమై దగు
పరిమళవస్తుప్రచయము బరిచారులు బం
గరుపళ్లెరముల గొని తే
నరుదుగ నియమించె వృత్రహరుఁ డతిప్రీతిన్. ౬౭

సీ. శక్రుఁ డప్సరవధూసంగీతసంస్తుతి
నిగమస్వరానందనియది వహ్ని
సకలధర్మప్రశంసధ్వని శమనుండు
పుణ్యజనస్తవంబుల పలాశి
వరుణుండు వాహినీవరమహారవముల
లలితవేణుస్వరంబుల ననిలుఁడు
కిన్నరీగానసంకీర్తన రారాజు
డమరుకారవములఁ బ్రమథరాజు

తే.గీ. నొక్క మొగిమించి నడవఁగా నుత్సహించి
హితవరుల గాంచి దగు పను లేర్పఱించి
పృథులదంభోళి ఝళిపించి బీర మెంచి
శౌరి నెదనుంచి భీమజాశ్రమముఁ గాంచి ౬౮

కం హాటకగర్భుఁ డొనర్చిన
సూటికి చిత్రము ఘటోత్కచుం డున్న పసి
వాటికి నబ్జలసూదను
వీటికి సూత్ర మిడినట్లు వెసఁ జని రమరుల్ ౬౯

చం కతిపయదూరమందె సురకాంతుని గాంచి ఘటోత్కచుండు హృ
ద్గతపరితోషియై యెదుఱుఁగా జని తోడుకవచ్చి సన్మణి
ప్రతతవిభావిభాసురప్రపాతమునన్ విడియించి గౌరవ
స్థితిఫలమూలభాజనవిశేషములం బరితృప్తు జేసినన్. ౭౦

చం మరుదధినాథుఁ డర్జునుఁడు మక్కువతో నభిమన్యుఁ డున్న ద
ద్గిరిగుహ కేగఁగా నతఁడు గేవలభక్తి నమస్కరించినం
గరముల లేవనెత్తి చుబుకంబు బుణుంకుచు హర్షబాష్పముల్
దొఱయఁగ కౌఁగిలించి దయ దొట్రిల నంకములందు జేర్చియున్. ౨౧

శా అన్నా నీవిటు మామపై నలిగి ఘోరారణ్యమార్గమ్ములం
దెన్నం డొందని బాధలం బొరయ నేఁడిచ్చోట హైడింబుఁ డా
సన్నంబై యనుజప్రియాప్తి నలయించ న్నీవు నీ తల్లియున్
మన్నారింతయె చాలు తండ్రి యిది సేమంబయ్యె నీనాఁటికిన్ ౨౨

చం అని ప్రియభాషలం బలికి యవ్వల నాశశిరేఖనున్ సుభ
ద్రను గనుగొంచుఁ దత్తదుచితస్థితు లేర్పడ నాదరించి యం
తనె దనుజేంద్రునిం బొగడి దద్దయు వారును వారు మైత్రినె
మ్మన మలరన్ సుగంధసుమమంజులకుంజముల న్వసింపఁగన్ ౨౩

చం అదె బలకృష్ణసాత్యకులు హస్తిరథాశ్వభటార్భటీజగ
ద్విదితము గాగ బంధుపరివేష్టితులై కలశాబ్ధివీచికా
భ్యుదయగతి న్వధూవరుల నొయ్యన దోడ్కొని పోవ వచ్చిరం
చు దనుజకింకరు ల్దెలుప శూరవరుండు ఘటోత్కచుం డొగిన్. ౨౪

చం సురలను హెచ్చరించి బలసూదను లెమ్మని విన్నవించి ఖ
ద్విరద మలంకరించి దిగధిప్రముఖులం గని తీవరించి వా
ద్యరవము లుగ్గడించి పినతండ్రి కిరీటిని కౌఁగిలించి స
త్వరగతి మించి సీరిహలధారి నెదుర్కొనఁగా దలంచియున్ ౨౫

సీ. పాండురవేదండహిండదున్నతపీఠి
గాండీవియాఖండలుండు జెలఁగ
మేషాదిసత్వరోన్మేషవాహము లెక్కి
హుతభుజప్రముఖదిక్పతులు నడవ
చటులాశనీసముత్కటహుటాహుటినట
త్పటుభటార్భటులు దిక్తటము లొరయ

గద్యపద్యాదివై శద్యవాద్యనిరూఢి
సాధ్యవిద్యాధర స్తవము లెసఁగ

తే గీ ధరణి యీవిధగతి సురాసురబలములు
శ్రీరమణునకు నారేవతీరమణున
కెదుఱు నడచి మనోమైత్రి కుదుకుపఱచి
తోడుకొనివచ్చి నిఖిలసంస్తుతు లొనర్చి ౭౬

ఉ ఉన్న యెడన్ బలుండు హరియున్ శశిరేఖను జేరనేగి యో
కన్నులకల్కి రమ్మనుచుఁ గౌఁగిటజేర్చి నిజాంకసీమయం
దున్నతినుంచి కన్గవలినొప్పెడు హర్షజలంబులన్ శిరం
బు న్నెనరంట మూర్కొనుచు బుజ్జగిల న్వచియించి రర్మిలిన్. ౭౭

శా. తల్లీ తల్లులఁబాసి యేపగిది సంతాపించితో దైత్యుఁ డు
ద్యల్లీల న్నడిరేయినిన్ గగనపంథానంబునం దెచ్చి యీ
ఝల్లోలూకభయంకరాటవిని జేర్ప న్నీవు భీతి న్మనః
కల్లోలంబున నెంతతల్లడిలితో కంజాతపత్రేక్షణా ౭౮

కం. ఐనా వగపేటికి నీ
మేనత్తకడ న్వసించి మెలఁగుటచే ని
త్యానందమైన ద్వారక
లోనున్నటులగాదె లోలలోచన నీకున్. ౭౯

మ. శరజాతాంబకరూపశాలియగు నీజంభారిపౌత్రుండు ని
న్వరియింపంగలఁ డర్జునుం డతులితవ్యామోహతం గోడలం
చు రహిన్వంతస మందఁగా కొఱత లిచ్చో గల్గునే నీకు ని
త్తఱి గల్యాణ మొనర్పఁగా దలఁచి మాతల్లీ యిట న్వచ్చితిన్. ౮౦

చం సుత నిటు లూరడించి నిజసోదరి నల్లుని గాంచి మీమన
శ్శ్రితహితకార్య మిప్పటికిఁ జేకురె మత్కృతవాక్ప్రచారసం

గతుల దలంపకన్ బ్రకృతకార్య మెఱుంగుట నన్యబంధుసం
తతి కిదియే హితం బఖిలధర్మము లార్యులు జెప్ప గానమే. ౮౧

ఉ. అంతట నర్జునుండును సుభాగ్రణియు న్బలభద్రరుక్మిణీ
కాంతలకుం బ్రదక్షిణముగాగ నమస్కృతు లాచరింప వా
రెంతయు సంతసించి హితహేతునయోక్తుల నాదరించి ధీ
మంతు ఘటోత్కచుం బొగడి మాటికి మాటికి నుత్సహింపుచున్. ౮౨

కం. కురురాట్కుమారునిఁ దా
నరలేకం గోరితెచ్చినందుకు నసితాం
బరుఁ డించుక సంకోచం
బఱిముఱిగొని మగుడ మఱచినట్టుల నుండెన్ ౮౩

చం వనజదళాక్షుఁ డర్జునుజవల్లభు గాంచి మహాద్భుతంబు నీ
వొనరిచినట్టికార్య మొహొహో బలవిక్రమశాలి వీవు పె
క్కన జనియేమి తల్లివెత లన్నియుఁ బాపి బలాత్మజాతఁ ద
మ్మున కొనగూర్చఁ బూనితి వమోఘయశోనిధివౌ ఘటోత్కచా ౮౪

కం. నీవలన పాండవులకుం
గేవలసత్కీర్తియు న్నిఖిలధనవిభవం
బీవేళ గలిగె మామా
భావంబులు జెలఁగె నీప్రభావమువలనన్ ౮౫

కం తమ్మునివైవాహికము హి
తమ్మున నొనరింపఁగా ముదమ్మున భటబృం
దమ్ములతో సమ్మతితో
రమ్మ భరమ్మనక సత్వరమ్మున నెమ్మిన్ ౮౬

చం హరి యిటు లానతీయ దనుజాగ్రణి చేతులు మోడ్చి స్వామికిం
కరుఁడ ననుం ఘనుం డనుట కారణమేమి భవత్కటాక్ష మె

వ్వరియెడ గల్గఁగా నతఁ డవార్యపరాక్రముఁ డౌచు నెట్టిదు
స్తరమదవైరినైన బలదర్ప మడంచి వధించు టక్రమే ! ౭౭

ఉ. పాండుసుతు ల్భవచ్చరణపద్మములే నెఱనమ్మి గాదె స
త్పాండురకీర్తిసంపదల భాసిలి రట్లభిమన్యశౌరికిం
బెండి లొనర్పఁగా భవదభిప్రియమైనను నేనొకండ రా
కుండిన నేగొఱంతయగునో ! మధుసూదన వైరిభేదనా ! ౭౮

గీ. అనుట యభిమన్యుఁ డన్నగాఁ డనుటదెలిసి
విన్ననైయున్న యాసన్న వెన్నుఁ డెఱిఁగి
దనుజనికరమ్ము తనకరమ్మునను బట్టి
బలికె నిట్లని కపురంపుఁ బలుకు లొలుక. ౭౯

మ. తనకల్యాణము కీవు రావనెడి చింత న్సోదరుం డున్నవాఁ
డెనయ న్నీవిటు దల్ప తమ్మునకు ప ట్టైవ్వండగుం దంద్రుల
వ్వనిలో నుండఁగ నీవొకండ వనుకంపన్ వచ్చితే వారలె
ల్లను విచ్చేసినరీతి మామదిని నుల్లాసంబు సంధిల్లెడిన్ ౮౦

కం. అడుగో చూడుమి నీత
మ్ము డు నీవటరానిభావముం గని మదిలో
నడలుచును మౌనమున ధృతి
జెడి చింతిలు వానికేమిజెప్పెదు హితవుల్ ౮౧

చం. అనిన సురద్విషాగ్రణి నిజానుజుఁ డున్నతెఱం గెఱింగి యి
ట్లనె నభిమన్య నే నురకనాడితిగాని భవద్వియోగముం
క్షణము సహింతునే జనకసంతతి నీకడలేనివేళ వే
రణమున కేనురాక మదిరంజిల నిచ్చట నుండనేర్తునే ! ౮౨

కం. జనకులగు ధర్మముఖ్యులు
గనకుండుట మన యభాగ్యకర్మంబునకే
మనవచ్చు ననుచు నాలిం
గన మొనరింపుచును బ్రమోదకలితుం జేయన్. ౮౩

చం రమణి సుభద్ర బావలు మఱందులు లేని సుతోద్వహంబు - వి
క్రమముగ జేయఁగావలసెగా యని గన్నుల నీరునింప శ్రీ ।
రమణుఁడు సోదరిం గని దరస్మితుఁ డౌచు వచించె పాండవుల్
సమయప్రతిజ్ఞనుండి యవశంబున రామికి చింతఁ జేతురే. ౯౪

కం ఎప్పటిమే లప్పుడె దగు
చొప్పెఱుఁగక చింతజేసి శుభకార్యవిధిం
దప్పింప నెవరివశమగు
నప్పాట 'శుభస్య శీఘ్ర'మని యన వినవే! ౯౫

ఉ కాననసీమ వెల్వడి సుఖంబుగ పాండవు లేగుదెంచి న
ట్లైనను కోడలిం గొడుకు నారసి వేడుక జెందరాదె మే
లైన ప్రయోజనంబునకు నౌనని మీఁదట మెత్తు రింతియే
గాని నిజాప్తబాంధవులు గారటె యాదవులెల్ల సోదరీ ౯౬

కం. అనుచు సుభద్రామణి న
వ్వనజోదరుఁ డూరడించి వాసవముఖదే
వనికాయ మెల్ల సత్వర
మున పైనమొనర్ప దేవముఖ్యుం డంతన్. ౯౭

చం. అనుజుని బెండ్లికై దగు నిజానువరు ల్మణిపాత్రలం గన
త్కనకవిభూషణాంబరనికాయము చాపినరీతి కానుక
ల్గొని తనవెంటరాగ సురకోటులు కద్భుతముల్ ఘటింపఁగాఁ
దనవిపులోన్నతాకృతిని దాలిచి సత్వరితప్రయాణుఁడై. 98

ఉ అందఱు లిత్తెఱంగున బ్రియంబు నయం బెనయంగ గోపికా
నందను నాజ్ఞబూని పయనంబునకున్ సమకట్టి వారలున్
స్యందనమోటకప్రముఖశోభిదలంకృతవాహనంబులం
బొంద ఘటించి శీఘ్రగమనోద్యములై రతులప్రమోదతన్ ౯౯

మ చతురంగంబుల [illegible] తో
నతివేడంబున [illegible] స్ఫూర్తి [illegible]

ద్యుతిఁ దీండ్రించు రథంబున న్బలుఁ డుపేంద్రుం డర్జునుం డెక్కి ధీ
హితు సౌభద్రుని చెంత నుంచుక ప్రమోదైకాగ్రచిత్తాబ్జులై. ౧౦౦

తే.గీ. అల ఘటోత్కచుజననితో నాసుభద్ర
పెద్దముత్తైదువలు మీరు పెండ్లిజూడ
రావలయునంచుఁ గేల్బాని లేవనెత్తి
ఘనతరాందోళికల నెక్కి కదలి రపుడు. ౧౦౧

గీ ప్రమదదంతావళంబులపై దనర్చు
డాంఢములు మ్రోసె కమలజాండంబు నిండ
సకలదిగ్భాగముల వర్షసమయమునను
గర్జనలు సేయు కాలమేఘములకరణి ౧౦౨

సీ ఘణఘణాత్ప్రుతఘంటికాసహస్రాంచిత
కుంజర పుంజంబులుం జెలంగ
చెంగున గుప్పించి చిందులాడెడి తురం
గంబు లాచరమభాగమున దనర
సైనికాంభోధిమధ్యేనటన్మందరా
గమమూర్తులై శతాంగంబు లొప్ప
ఘనవజ్రశకలసంకాశులై కహకహా
ర్భటసురాసురయదుభటులు నడవ

గీ డమరుడిండమతమ్మటడాంఢమీహు
ఢుక్కఢక్కాదివాద్యము ల్బిక్కటిల్ల
పాలమున్నీటితరఁగ లేర్పడినయట్లు
నిర్గమించిరి ద్వారకామార్గమునను ౧౦౩

సీ. ఘనసుస్వరానంద గంధస్రగానంబు
ఘనసుస్వరానంద కళితమయ్యె

హితసముత్తాల శోభితమృదంగధ్వనుల్
హితసముత్తాల శోభితములయ్యె
లలితాప్సరోనర్తనలు గోచరములౌట
నవిగోచరంబులై యతిశయిల్లె
భాషావిలాసశోభనదేవసంతతుల్
భాషావిలాస సంభరితమయ్యెఁ

తే గీ. జూడచిత్రంబుగా జనులాడుకొనఁగ
శంఖకాహళపటహనిస్సాణరవము
లొక్కమొగి దిక్కులకు నెక్కి పిక్కటిల్లఁ
బురికి నేతెంచి రవ్వధూవరులతోడ. ౧౦౪

చం. పురవరకాంత లుజ్జ్వలితభూషణముల్ ధరియించి సౌధముల్
బరువడినెక్కి హస్తతలభాస్వరకంకణకింకిణీధ్వనుల్
మెఱయఁగ లాజలుం గుసుమము ల్వెదజల్లిరి యాత్మదృక్పరం
దరమణియుక్తమౌక్తికసుదామము లాస్తినొసంగుకైవడిన్ ౧౦౫

చం అతివ యొకర్తు మంజులసహస్రదళాబ్జము కేల ద్రిప్పుచుం
ద్రుతగతితోడ జూడ నఱుదెంచిన గానఁగనయ్యె యిట్టిదం
పతులను గాంచ నిక్కమలపత్రములం బలె వేయిగన్ను లా
శతధృతి నాకొసంగినను జాలవటంచని జూపుకైవడిన్ ౧౦౬

చం తిలకము దిద్దుచో నొకసతీమణి యద్దము కేలఁ బూని వా
రలఁ గన నేగుదెంచె ముకురం బిదె జూడుడి మన్ముఖద్యుతుల్
దలపడి దా హరించుటకు తస్కరవృత్తిని జొచ్చె దీనినే
ర్పలర విమర్శసేయఁదగుసం చని పట్టుకవచ్చినట్లుగాన్ ౧౦౭

ఉ ఆననసీరజాతరుచిరాధరబింబఫలాంఘ్రిపల్లవా
శానిరతి న్మదాళిశుకశారిపికావలి వెంటనంటిరా
చాన యొకర్తు వారిఁ గన సయ్యన వచ్చె మరుంతు బంపఁగా
దాసయి దాను దద్భలహితంబుగ వచ్చెడి మోహినిక్రియన్ ౧౦౮

సీ ఎంతవింతను ఘటియించెనో ధాత యీ
భానుతేజునకు నిపద్మనయన,
యేరీతిఁ జేసెనో భారతీనాథుఁ డీ
విమలేందుముఖున కీకుముదనేత్రి
యేలీలఁ గూర్చెనో నాళీకగర్భుఁడీ
ఘనచూడునకు నీశిఖండిగమన
నేవిధి గావించె నీ విధి ప్రౌఢ యీ
కమలాంఘ్రునకు నీమధుకరసువేణి

తే గీ. యహహ దాంపత్య మిట్లుంట సహజమంద్రు
గాని కానిది కొనసాగ సౌనె యనుచుఁ
బురవరారోహలెల్ల సంబరము మీఱఁ
గూడి యాడాడ ముచ్చట లాడుకొనఁగ ౧౦౯

చం మగకులమం దితం డనుపమాన శరీరునిగాగ యీసతి
న్మగువలలో గణింప నసమానముగా రుచిరాంగ సంపద
ల్దగునటు సృష్టిఁజేసి ప్రమదంబున గూర్చు విధాత కింక కే
ల్మొగిచి తదున్నతక్రియకు మ్రొక్కఁగవచ్చు నటంచు నెన్నుచున్ ౧౧౦

సీ ధవళచతుర్దంతదంతావళము పైన
వనితయుఁ దానున్నవాఁడు జూడు
జాతరూపకతాళకేతనమణిమయ
వరరథారూఢుఁడౌ వాని జూడు
గారుడధ్వజశతాంగంబుపై నిక్కి పా
వనమూర్తియై వచ్చువాని జూడు
రాజుమదాంకస్యందనారోహణ మొనర్చు
పూనిక బలితెంపు వాని జూడు

గీ మసిగౌ 'హిక్కా సీరి యొరాళిసురాక్షి
నా ముకుందామనోహారి యొసుచు నొకరి

కొఁకరు కేళ్లాపి జూపుమ యువతులెల్ల
సంతసించిరి హేమసౌధాంతరముల ౧౧౧

వ. ఇవ్విధంబున నయ్యమ్రితిదశదనుజసముదయంబు రయంబున సంబరం బంబరం బంద నవధూవరంబుగా నూరేగు జూచెం బొరయు సమయంబున తాదృశశ్రీకరమహోత్సవాలోకనానేకబలాహకానీకంబుల కైవడి మవ్వంపుజవ్వను లివ్వలవ్వలం జివ్వుజివ్వున నెవ్వరుస్వచ్ఛవమన పుచ్ఛంబు లవిచ్ఛిన్నంబులై మెఱయ, స్నేహకులప్రదీపకుం డయ్యభిమన్యుం డని తదీయకల్యాణవిలోకనకుతూహలసమాగతుండగు హిమాంశుకిరణప్రకరంబుకరణి చంద్రజ్యోతు లిరుగడల మెఱుంగుబఱుంగఁ దదనుచరగ్రహగణప్రముఖతారకానికరంబు సాక్షాత్కరించినచందంబున చిరంటికాకదంబంబు లిరుగడల న్నిలచి మణిగణవ్యంజనంబులన్ వీవ సారసౌరభాపూరకర్పూరగంధసారకాశ్మీరకస్తూరికాది విస్తారసమస్తవస్తుస్తోమంబులు విమలమణిమయ *భూషణంబులు వివిధ చిత్రాంబరంబులు పసిండిపళ్లెంబుల నిడుకొని కొంద ఱిందువదనలానంద కందళిత హృదయారవిందలై యందంద సందడింప శ్రీకృష్ణుని మనోరథం బిప్పుడు ఫలించెనని తదీయాస్త్రరాజంబగు సుదర్శనం బనేకరూపంబుల నతికుతూహలంబున నెదుట నటించిన భంగి భీక్ష్ణబాణంబు లందంబులై వెలుంగ నచ్చెర మచ్చుకంటు లచ్చటచ్చట నృత్యచ్చటదీజఁ బచ్చవిల్తుని మచ్చరంపుఁ బను లుచ్చరింపుచుం జెచ్చెఁ జెఱిగి, యుచ్చమెచ్చుం గ్రమ్ములాడు వసంతగంధసారసారంబుల నామూలసార్ద్రీకంబులై వికసించు కనకలతాసుమంబుల సమంబులై మెఱయుబిరుసు లఱుదు పఱప నెడనెడల జావళగమన లతిమధురషడ్జ స్వరానులాపంబులఁ గర్పూరనీరాజనంబులఁ బాటలుం బాటిల శంఖకాహళపటహడిండిమనిస్సాణజర్ఝరవేణువీణానినాదం బను మోదంబున సంపాదింప మహావిభవంబునం జని కురంగట నుత్తుంగ మంగళాలంకృతప్రతిగృహప్రాంగణంబును ప్రవర్ధమాననిఖిలానవద్యగీతవిద్యావైశద్యహృద్యవాద్యనాటకాభినయశోభితంబును పరిణయమహోత్సవసమాగతసౌజన్యమాన్యరాజన్యమూర్ధన్యచండవేదండశుండా

* [illegible]

దండపదమండలీవిగళన్మదధారాసారపరిషిక్తరథ్యాసము దయంబును, శుభసూచనాలంకృతరంభాస్తంభశాతకుంభవిజృంభమాణమండపసౌరభసంరంభకుంకుమపటీరమృగీమద కర్పూరాగరుధూపదీపాదిపరివేష్టితంబును అసమసుసరసకుసుమకిసలయవసనవిసరమణిగణతోరణవిరాజితవివిధవితర్దికాకవాటగేహళీప్రకోష్ఠవలభీవిటంకప్రముఖంబును, విచిత్రపటకేతనాలంకృతరథసౌధాట్టాలకంబు నగుపురంబుఁ బ్రవేశించి, బహిర్ద్వారంబునం గళహాయాందోళికస్యందనావతరణం బొనర్చి, కక్ష్యాంతరంబులుఁ గడచి, యభ్యంతరమందిరంబునం బ్రవేశించి యప్పుడు ౧౧౨

చం. హరిహయముఖ్యనిర్జరుల కర్థములొ విడిదిండ్ల నిర్మలా
స్తరణలు తారతమ్యనియతంబు లెఱింగి బహూకరింపఁ ద
త్పరిణయశాల నిండి ప్రమదంబు జెలంగ వసించియుండు న
త్తఱిఁ గనయ్యె నచ్చటను ధర్మసభాసమభాసమానమై ౧౧౩

ఉ. కూరిమితో సుభద్ర తనకోడలిఁ దోడ్కొని తల్లిదండ్రులం
జేరి నమస్కరింప దయజిల్కఁగ లేవఁగనెత్తి కౌఁగిటం
జేరిచి నేత్రబాష్పములు జిప్పిల కూతురు నూరడించి వే
మారు మనోగతవ్యథను మాన్పఁగ నిట్లని బల్కె రన్నతిన్. ౧౧౪

శా. తల్లీ నీవిటు లన్నపై యలిగి సంతాపించుచుం బట్టితో
ఫల్లోలూకభయంకరాటవి గమింపన్ భీతిమై నెట్టు లీ
కల్లోలంబు సహించితో యక మనఃకౌటిల్యముం బాసి హృ ౧౧౫
త్సల్లాపంబున రాము నెగ్గులనక స్సంతోషివై యుండుమా

కం ము న్నెన్ని మీరలెట్లను
కున్నను వేరున్నదటవె యూహింపఁగ మీ
యన్నగు సీరాయుధు డీ
వెన్నిట సోదరి వపోహ యేటికి తనయా! ౧౧౬

చం అని సుత నూఱడించుతఱి నర్జునభీమతనూజు రాత్రి మ్రొ
క్కిన గని దీవనోక్తు లిడి కేవలమైత్రిని తండ్రి మిమ్ములన్
గనుఁగొన నేటికిం గలిఁగెఁ గాయనకన్నుల హర్షబాష్పముల్
బెనఁగ శిరంబు మూర్కొనుచు బిగ్గన కౌఁగిటఁ జేర్చె నర్మిలిన్ ౧౧౭

చం అనఘుఁడు రేవతీరమణుఁ డంతట పుత్రిని పెండ్లికూతుఁగా
నొనరుప నాజ్ఞసేయ వివిధోన్నతశంఖమృదంగభేరికా
ధ్వనులు సెలంగ విప్రవనితామణు లాశశిరేఖనున్ గన
త్కనకవితర్దికామణుల గద్దియపై ఎసియింపఁజేసియున్ ! ౧౧౮

కం 'మంగళనీరాజనము లొ
సంగి సుమాక్షతలు వాఁడఁ జల్లుచుఁ బ్రియమొ
ప్పం గౌరీకల్యాణమ
నం గడువేడుకను దీవనల సిడిపి దగన్ ౧౧౯

ఉ వ్రేలెడుతారహారములు వెన్కకు వ్రాల్చి వడంకుకొనుకుం
గీలుజడం బిగించి దులకించు చనుంగవ గెంటనీక పై
మేలిపయంట చేలఁ బిగిమెల్చి మెఱుంగుచెఱుంగు బొడ్డునం
గ్రాలఁగ జెక్కి యొక్కకలకంఠి తలంటెను వాలుగంటికిన్ ౧౨౦

చం. చను లొరయంగ నూర్పులు బొసంగ మొగమ్మున గ్రమ్మ చెమ్మటల్
మినమిన బొంగ మధ్యగతి మేఖలఘంటల రంతెసంగ హా
రనిచయము ల్దొలంగ మణిరంజితకంకణముల్ ఝుళంఝుళ
ధ్వని మెఱయంగ గంధఫలితైలమునన్ శిరసంటె బోఁటికిన్. ౧౨౧

చం. ఒక తనుమధ్య సన్మణిగణోజ్జ్వలపీఠిని దా వసించి యిం
చుక నిరుప్రక్కలం దొడలు సోకఁగ హత్తిలఁజేసి వెన్నుచూ
చుకముల నాని పెన్నెఱులు చుల్కన ఎక్కులు వీడదీసి-నా
తికి ఘనసారతైలమున తిన్నఁగ దువ్వె ఘటించె క్రొమ్ముడిన్ ౧౨౨

గీ సప్తతాళభేదనాప్తిసదంబక
రమ్య మగుచు రాగరసము నెఱపి

సుదతి శిరమునంటె సుగ్రీవమైత్రిని
గనుగొనంగ రామకథ యనంగ ౧౨౩

చం. హితకరరాగసంభృత మహీనసుఖాంచితపారవశ్యసం
గతముకుళీకృతాంబకయుగంబు, గళచ్చలకేశబంధ మా
తతపులకీకృతాంగక ముదంచితనిశ్వసనావిలాసమౌ
రతిసుఖతుల్యమై దగె శిరంబున సంపెఁగతైల మంటఁగన్ ౧౨౪

గీ. కమ్మతేనె వెడలఁగ్రక్కు భృంగము లట్లు
సురభితైలమంట కురులు దనరెఁ
బుష్పధూళిదొఱయు పూవుటమ్మన బచ్చి
పసపుటటక లిడఁగ బడతి దనరె ౧౨౫

కం. కుటిలాలకకును గందపు
టటకలు పన్నీరు కురులయందు జిలుకుచుం
గిటగిటను నులిమె కరయుగ
కటకరటఝ్ఝళఁఝళత్ప్రకటరవ మెసఁగన్. ౧౨౬

మ. సమశీతోష్ణసుగంధజీవనములం జల్లింపుచుం గొంద ఱిం
దుముఖు ల్గోరులఁ జిక్కువాపుచు లసద్ద్యోవాహినీవారికుం
భములం బంగరుచెంబుసుంచుచు లసత్ప్రౌఢస్థితిన్ రేవతీ
రమణీపుత్రికి జల్కమార్చిరి శుభారంభక్రియాలోలలై. ౧౨౭

సీ. ఆననేందుద్యుతి నలమి దృగ్జలజముల్
దెప్పజిల్లఁగనీక గప్పి గవిసి
భాసురతాటంకభాస్కరదీధితుల్
ధారాళకీలాలధార ముంచి
బుడ్డిచెంబులు ముంచు బుడబుదాత్కారముల్
ఘనగర్జితధ్వను ల్గలయఁ బర్వి
బాహుమూలప్రభాబహులచకచ్చకల్
మెఱుపులై పక్షోజగిరుల గ్రమ్మి

తే గీ. తరళదృశపెన్నెఱుల కప్పు టిరుల గెరలి
తేట గాటంపు గొజ్జంగి నీటివాన
గురియుచో నంగదేశంబు నెరయ గ్రమ్మి
బొడ్డుబొడ్డైన బావి యుప్పొంగి పొరలె ౧౨౮

కం అత్తటి నొకబిత్తటి తడి
యొత్తుచు పావడ సడల్చె నొయ్యన తనలో
హత్తిన క్రొత్తని సిగ్గున
జిత్తము తత్తఱిలుచున్న సీమంతినికిన్ ౧౨౯

తే.గీ జలరుహానన కీకితి జలకమార్చి
చలువవలువల తడినొత్తి సంభ్రమింపఁ
బ్రేమ సౌవర్ణమణిమయపీఠమునను
జల గడిగినట్టి ముత్తెఁపువలెనె నిలిచె ౧౩౦

కం. తలనీరార్చుచు కురులం
జెలు వలరఁగ దువ్వి జారు సికవేసిన న
క్కలకంఠకంఠి మధులి
ట్కలితలలితకిసలయానుగతలతవోలెన్. ౧౩౧

కం. ఒక నీరజాక్షి నవచం
పకదామము సికను ముడిచి బాటింప చక
చ్చకితతటిదావృతబలా
హకమాలికభంగి రమ్యమై భాసిల్లెన్. ౧౩౨

సీ. ఈపద్మలోచన హితమెఱింగి యొసంగు
కలికిరో యుదయరాగంపుచీర
యీ మానినీరత్న మామోద మొనట్లు
హేమభూషణములు నిడవె తరుణి
యీసైకతశ్రోణి కిష్టమైయున్నట్టి
గురుహంసతతు లొసంగుమి శుభాంగి

యీకల్వపూబెమ్మ కిచ్చుజెందిన చంద్ర
కావి యొసంగు మో కమలనయన
గ్రందు ముత్యాలపందిరిక్రింద నిందు
**మా**నినీమణి నీలతకూన నునిచి
చి**లు**క**పి**లుకలు బింబోష్ఠిఁ జేరకుండ
**కా**వ**లి**గనుండు సాంకవగంధి నీవు ౧౩౨

సీ. ఒకకాంతచెంతఁ బాయఁక పువ్వు సురఁటిన
పెన్నెలు ల్దడియార్పఁ బ్రేమ విసరె
నొకమత్తగజయాన చికురము ల్మెల్లన
కొనగోళ్లగీఁటి చిక్కులు సడల్చె
నొకలేమ దంతంపు చికిలిదువ్వెన బూని
కుటిలాలకలు తక్కుమనఁగ దిద్దె
నొకమానినీమణి చకచకత్కచపాళి
నగరు సాంబ్రాణి క్రొంబొగలఁ జొనిపె

గీ **కు**రులజడబడఁగను నల్లికొండె దీర్చె
కొప్పు సవరించె నొప్పులకుప్ప యొకతె
**తా**ళుతాళుమటంచుఁ బూదండ దురిమి
మించుటద్దంబు నెదుట జూపించె నొకతె ౧౩౪

చం. **ఘనత** ననంటికంబఁపు చొకాటములైన మిటారిపెందొడ
ల్గనుపడనీక చందిరపు కావిమెఱుంగుల వల్వగట్టి బి
గ్గన వలిగబ్బిగుబ్బలను కంచుక ముంచి పయంట దిద్ది నే
ర్పున విరిదమ్మికై వడి మెఱుంగులచెంగుల కుచ్చు దీర్చినన్. ౧౩౫

గీ. రమణి కవ్వేళ నుదయరాగంపు చీర
**చెం**గు లొనరించి కనుఁగొన రంగెసంగె
బాలలేఁదొడ లనఁటికంబంబు లగుట
కలరుభూసిన మొగ్గలో యనెడి గతిని, ౧౩౬

సీ. తళుకుల మగఱాల గిలుకు మట్టియలకు
పదనఖాగ్రద్యుతు లొ్కాదువదీర్ప
చొక్కమౌ కెంపులముక్కు ముంగరకాంతి
నధరారుణచ్ఛవి నడ్డగింప
నలరుపాపట( జేరి హరినీలములదీప్తి
కుప్పించ నొప్పు ముంగురులు మెఱయ
తాటంకమౌక్తికధళధళ ద్రుచులను
మందస్మితచ్ఛాయ మాటు సేయ

తే.గీ. బహుళపుటపాకకాంచనాభరణములకు
నిగ్గునెమ్మేనికాంతి వన్నెల నొసంగ
భూషణములకు( దనమేను భూషణంబు
గా రహింపుచు నుండె సక్కెరవాణి ౧౩౭

వ. ఇవ్విధంబున సర్వభూతిలకంబునకు న్మవ్వంపుపువ్వు(బోణు లభంగ మంగళానుషంగశృంగారతరంగంబులుం బొసంగు సింగారంబుం దొంగిలింప, నుద్దామసౌదామినీధామస్తోమప్రతిమంబుగా కోమలసువమాదంబర విడంబితంబై ముఖహిమకరకబళనాయాతవేణీవిధుంతుదవదనాంతనిర్యాంతసారసుధారసధారాయితంబై, యసమకుసుమవిసరమాలికాజాలంబులు ద్రవేల సీమంతినీలలామంబున కంతంత దురంతమోహచింతాభరధ్వాంతంబుం దలకెక్కి పుంభవింపన తెఱంగున న్మెఱుంగుదొఱంగుకచభరంబునం బ్రమరంబై, కాశ్మీరసౌరభ్యసమ్మిళితసీమంతముక్తాహారంబులానవేందుబింబంబునం దొఱయ దొఱకొను నుడుగణంబుల వడువుననడరు చేర్పుక్షకుం బ్రక్షల గ్రొక్కారు నన్నిక్షు శక్రధనుర్లతాగతిం జతురత నతిశయిల్లు భ్రూవల్లికల తుదలం దుల్లసిల్లు నఖముఖాలిఖితమకరికాపత్రంబులచే నిద్దంబులైన వెక్కుటద్దంబులం దద్దయుం బ్రతిఫలించు తాటంకంబులచే నలంకృతంబై, శ్రీకారంబుల న్మొకారించు నుదీర్ణకర్ణంబుల నవతీర్ణం బొనర్చుచాడ్పున ధగద్ధగితంబులైన కజ్జలాంచద్దృగంచలకనీనికాతళత్తళలచంద్రికాసందర్భంబున నిందుబింబంబునం బొందు రోహిణీసుందరీఛందంబునం బఱంగు మెఱుంగుముంగరంగల గ్రొత్తముత్తియంపు

నెమ్మెలం జిమ్మ్మకెమ్మోవి కమ్మదనంబునకుం దీటూటకు న్మెలంగి యలిగి యలిగి యధోగతంబగు బెల్లంపు టచ్చు బిళ్లయుంబోలి హెచ్చున న్మెచ్చందగు చుబుకంబునం దవిలి విరళపరిమళచందనచర్చితసుందర తరానుకారంబై నిజవర్తులతాస్నిగ్ధగంభీరరవంబుల దరమునదర దబు ముచు రేఖాత్రయశాసనప్రసిద్ధప్రకటం (బు) బిరుదుగట్టినచందంబున నందంబుగా బిత్తరంపుముత్తియంబుల సరంబులచే కరంబు తిరంబై మాటునం జటిముత్తియంపుల అవికకుట్లుం జిట్లున బికిలించు సిబ్బెంపు గబ్బిగుబ్బలం గుబ్బతిలు సాంకపకుంకుమామోదంబునం బాదుకొను బాహుమూలముకురంబులకు న్మెఱుంగులొసంగు కేయూరపద్మరాగమణి గణఘృణు లకుంరితపద్మరాగానురాగఝుంకారితనిష్కలంకకంకణకింకిణీ మంజుశింజారవాంచచ్చంచరీకసమంచితనాదంబులం బోలయు బాహుబిస షండమండితమనస్సరోవరంబునం తానం బొనర్చి యనూనసూనప్రధాన బాణుండు వళిత్రయసోపానపంథానంబునం గట్టిగా తడియార గట్టిన నీలి పట్టు సికచుట్టుత్రాడు పోడిమినమీఱు సూగారుకారుచీమలబారుం జేరు బొడ్డుపుట్టం గొట్టిమెట్టాడు వయోవేదండశుండాదండంబుల న్మండితం బగు దృష్టిదండంబు డంబువిడంబించు చంచద్ఘంటికాసమంచితకాంచీ గుణ మరకతతోరణం బమరించు మీనకేతననికేతననికర్షణభూతలంబున నూత నంబగు శుంభదూరుయుగశాతకుంభరంభరంభాస్తంభంబుల బైపొఱలు నెఱయు తెఱంగునం బరంగు రంగుచలువచెంగావిదువ్వలువ చింగులుం బొసంగ పదాంగుళంబులం దరహసనపరిభవితహిమకరకిరణంబులు శర ణం బని చరణంబుల నెఱుంగ భంగిం గరంబు సుకరంబగు నఖముఖం బులం దనఱి యిక్షుధనుస్సాక్షాత్కృతజగన్మోహనమంత్రాధిదేవతయుం బోలి మవ్వంపుజవ్వను లివ్వాలవ్వలం గైదండ యొసంగ వేణీశ్రోణీభారం బున మందగింప నొక్క మణిగణవేదికాస్థలంబునకుం దోడ్కొని వచ్చి అంత- ౧౩౮

సీ॥ గౌరవర్ణవరాంగఘననితంబచ్ఛాయ
ధవళాంశుకచ్ఛాయ నవఘుళింప
గజ్జెలుమ్రోయఁ దిగ్గనలేచి నడచుచో
గబ్బిసిబ్బెంపు గుబ్బ లుబ్బి పొరలఁ

దననుబిల్వఁగ గిరుక్కున మోము మరలింపు
బెళుకులేఁజూపు ముద్దులు నటింప
వలపలవంక చెల్వలరఁ దిద్దిన కొప్పు
విరిసరు ల్భుజమున వ్రేలిదూల

తే గీ తావిచెంగావివిడెఁపుఁ గెమ్మోవిరీవి
శారికాకీరపంక్తి నోరూఱఁ జేయు
తొయ్యలు ల్మెల్లమెల్లన దోడితెచ్చి
విమలమణిమయసింహాసనమున జేర్చి ౧౩౯

ఉ. మానిను లిత్తెఱంగు నభిమన్యుని బెండ్లికుమారుఁ జేయఁగా
బూని యవద్యవాద్యములు బోరుగలంగ చిరత్నరత్నసం
ధానిత హేమపీఠిని ముదం బలరంగను జేర్చి గౌరి క
ల్యాణ మటంచుఁ బాడుచు శుభాక్షత లిచ్చి రతిప్రమోదలై ౧౪౦

సీ కటకకంకణఝుణత్కారానుకారమై
కిరకంజములు నృత్యగతి నటింప
కరకంజములు నృత్యగతి మేళవింపఁగా
గబ్బిసిబ్బెఁపుగుబ్బ లుబ్బి యాడ
గబ్బిసిబ్బెఁపుగుబ్బ లుబ్బ నిబ్బరమునఁ
గ్రొత్తముత్తెఁపుసరుల్ బిత్తఱింపఁ
గ్రొత్తముత్తెఁపుసరుల్ బిత్తఱింపఁగ నోప
లేక లేఁగౌను మెల్లన వడంక

తే.గీ. శతమఖోపలరుచి చకచ్చకితములగు
సోగకురులకు చాంపేయసురభితైల
మలఁది యుత్సాహమున నొక్కవెలఁది యెదట
నంటి యభిమన్యునకు శిరసంట దొణఁగె ౧౪౧

చం సురచిరకేతకీచ్ఛదవిశుద్ధములైన నఖాగ్రపంక్తిచే
కురులను బాయ గీఱి మెఱుఁగు ల్గొనచిక్కులు దీసి హస్తపం

కరుహరుఝళంఝుళాకలితకంకణనాదము లుల్లసిల్ల బం
ధురతర సౌరభామలకతోయమునం బలిమెన్ శిరోజముల్ ౧౪౨

చం. కనకపుభద్రపీఠిని నృకాంతుని జేరిచి జారుపయ్యెదన్
వెనుకకుఁ జెక్కి చన్గవలు నిక్కఁగ మోము జెమర్ప కాంచికా
గుణరవముం జెలంగ నొకకోమలి నవ్వుచు బాహుమూలసం
జనితచకచ్చక ల్వెలయ సయ్యన మజ్జనమార్చె వానికిన్. ౧౪౩

సీ. ఒకలేమ తడియాఱ నొత్తె కుంతలములు
వలిపెంపు చలువ దువ్వలుచఁ బొదవి
యొకకాంత చిక్కఁబో జికురము ల్సవరించెఁ
బచ్చికస్తురినూనె పదనునంటి
యొకబోఁటి సొగసుతీరికె కొండె సికవేసి
మల్మలీజిలుఁగు రుమాలుఁజుట్టె
నొకవధూటి మెఱుంగు చికిలి బంగరురంగు
పట్టుపుట్టము మేన గట్ట నొసఁగె

తే గీ నొక్కసతి వజ్రముల ముద్దుటుంగరాలు
మేలుమగఱాల దండకడేలు సరిపి
ణీలు పోంచీలు బన్నసరాలు కుండ
లాలు హారాలు వాని కలంకరించె ౧౪౪

కం. విమలార్ధచంద్రఫాలము
న మృగీమదతిలక మిడియె నరపుత్రున కా
సుమశరునిధనుర్దండము
నమఱుచు నీలోత్పలాస్త్రమన రుచి బొసఁగెన్ ౧౪౫

చం రమణి యొకర్తు మిన్నమగఱాలను జెక్కిన తాళిబిళ్లతో
నమరిన మౌక్తికప్రథితహార మలంకరణం బొనర్పఁగా
విమలభుజాంతరాళమున వేడుక జూడఁగనయ్యెఁ దారకా
సముదయమధ్యవర్తియగు చంద్రునిభంగి బొసంగి సంగతిన్. ౧౪౬

ఉ. లాలితరత్నకుండలములన్ మకరస్థితినేత్రయుగ్మమున్
లీల మహోత్పలప్రతిభ లేమొగ మైందవమైత్రి కైశికా
జాలవినీలిమచ్ఛటలు చంచమదంచితకంకణప్రభల్
గ్రాలుపయోధి నిట్టిగుణరత్ననిధిన్ మరులొందు టబ్రమే! ౧౪౨

చం. అతివ యొకర్తు దర్పణగృహంబున రాసుతుఁడున్న హస్తసం
భృతసితచామరంబునను వీవఁగ దద్రుచిరాంగలోకనా
న్వితవివశంబు నొంది ప్రతిబింబితవిగ్రహమున్ భ్రమించి యం
చితగతిఁవీవ చేడెలు హసించిరి దానికి సిగ్గుదోఁపఁగన్ ౧౪౩

సీ. వృత్తనితంబ నీవిత్తఱి గురుప్రీతి
మన్నించి యుత్పలమాల నొసఁగు
ముత్పలప్రియముఖీ సత్పథంబు గ్రహించి
లలిఁ జేయు మంబరాలంకృతంబు
నంబరతులితమధ్యా ఘనురాలవా
సారంబుఁగని ఘనసార మొసఁగు
ఘనసారగంధి చక్కనిదాన వొదువు
రణితానుకూలకంకణము లొసఁగు

తే గీ. మనుచు నర్మప్రయుక్తరసానుకూల
వచనరచనాచమత్కృియాభ్యుచితగతుల
సూనశరమూర్తియౌ రాజసూనునకును
లలి నొనర్చిరి పరిణయాలంకృతంబు. ౧౪౪

ఉ. తోయజగంధు లీగతి వధూవరుల న్సదలంకృతాప్తిఁ గై
సేయఁగ సేరి యానకుశేశయము న్వికసింపఁ బ్రోల్లస
త్కాయజసుందరాంగుఁ డగు కవ్వడిపట్టిని ధౌమ్యముఖ్యసు
శ్రీయుతవిప్రవర్యులు హసింపుచుఁ దోడుకవచ్చి యచ్చటన్ ౧౪౫

సీ. అతిచిత్రవస్త్రసమావృతకాంచన
మణిమయస్తంభతోరణకాలితము

సకళంకమౌక్తికప్రకర సూనానూన
దీప్రకాంచనఝల్లరీప్రయుతము
లలితపలాశపల్లవసుశాల్యక్షత
ప్రకటకాంచనపాత్రభాస్వరితము
కుళలాజగోఘృతకుసుమప్రముఖదివ్య
సౌరభ్యవస్తువిస్తారహితము

గీ భవ్యసమిదగ్నికుంభ విభ్రాజితంబు
బహుళకళకళ విప్రసంభాషితంబు
నైన కల్యాణవేదికాస్థానమునకు
జేర్చి మణిమయపీఠికాసీను జేసి ౧౫౧

గీ. అనఘ ధౌమ్యప్రముఖ విప్రాననాబ్జ
సుకరనిగమప్రసిద్ధవచోమరంద
బృందసానందజనదృగిందిందిరముల
సుందరంబయ్యెఁ గల్యాణమందిరంబు ౧౫౨

కం. సురసరణివిమానము లన
గరికరమరుదైన హర్మ్యగణములయందు
న్వరమతి సురతతిపురసతు
లురుతరగురుతరత గురిసిరాగి విరులజడిన్. ౧౫౩

కం. సూరిజనసమ్మతమున శు
భారంభహితోపవిధుల నలతిచి నిగమా
చారకృత హోమకర్మము
లారూఢి నొనర్చెఁ బూని రభ్యుదయమునన్. ౧౫౪

కం. ఆవేళ విప్రవర్యులు
'దేవీం వాచ మజనయన్త దేవా' యనుచు
న్వేవేగ నుచ్చరించి య
థావిధి శుభకార్యధుర్యతత్పరు లగుచున్. ౧౫౫

కం భూసురపుణ్యాహధ్వని
భాసురవీణామృదంగపటహధ్వనియా
రాసుతుల కంకణధ్వని
భూసురవర్త్మములు నిండి భోరున మ్రోసెన్ ౧౫౬

చం సరఁగున లగ్నకాల మదె సన్నిహితించె నటంచు నద్ధరా
మరులు వచింప రాముఁ డభిమన్యునకు న్విధియుక్తిగా మహా
భరణసుఖాసనార్ఘ్యమధుపర్కసుగంధసుమాక్షతాదిస
త్పరిణయమంగళార్థహితపద్ధతిఁ బూజ లొనర్చి యంతటన్ ౧౫౭

ఉ తోడనె పెండ్లికూఁతు నిట దోడ్కొనిరమ్మని యాజ్ఞసేయఁగా
చేడియలెల్ల కౌతుకముచే శశిరేఖను జేరి కూర్మి యా
మ్రేడితమై జిలుంగలరు మేలిముసుంగు ఘటించి యారతు
ల్వేడుక బాడుచు న్మణివేదికకుం గొనితెచ్చు నంతటన్. ౧౫౮

చం. వలపుమెఱుంగు క్రొన్నెఱుల వన్నెలచె న్నలరారు నెన్నొస
ల్తిలకము రంగెసంగ మయిదేఁట మిటారఁపుఁ గప్పురంపు మే
ల్కలపము తావి ఘుమ్ఘుమ రసఁగా సరిగంచుల పట్టుపల్లె చిం
గులు దొలకింపఁగా బలునికూఁతును దోడుకవచ్చి రంతయున్ ౧౫౯

సీ నూత్నకాంచనదీప్తి రత్నభూషణకు నె
మ్మేనికాంతి వన్నియల నొసఁగ
కందర్పసాయకాకారనేత్రద్యుతు
ల్గండద్వయంబులఁ గాంతి నింప
తరళకాంతిస్ఫురత్తారహారమ్ములు
గుబ్బచన్నులఁ జెలంగుచు నటింపఁ
బదసరోజన్మాసపద్మపస్పి
ధాత్రి లాక్షారసచిత్ర మెసఁగ

తే. గీ. బంగరుమెఱుంగుచేల ముసుంగువైచి
యిరుగడల నిల్చి బోటు లెచ్చరిక దెలుప
నతులితవ్రీడ తనమందగతులఁ బెనఁగ
కొమరు దళుకొత్తవచ్చె నా భ్రామరవేణి ౧౬౦

గీ. ఒకరి కొకరి ప్రేమ లుత్కటం బగుటకు
మొనసి దృష్టిదోష మెనయు ననుచు
మాటినట్టు వారిమధ్యన నొకతెర
పట్టు పుట్టమునను బట్టి రపుడు ౧౬౧

ఉ. మానిను లిట్లు దంపతుల మధ్యను బంగరువన్నెపుట్టముం
బూని తెర న్ఘటింపఁగ మనోగతరాగరసంబునిండి మో
పై నిగుడించి రెండుదెసలందు వెలుంగుచు దూఱి పాఱె నా
సూనశరుం డట న్ముఖముజూడని చుట్టఱికం బొనర్పఁగన్ ౧౬౨

కం. సరఁగున తెరయెత్తిన న
వ్వరవర్ణిని ముఖవిదీప్తిఁ బాటించినచో
శరదభ్రము విడి వెలువడు
పరిపూర్ణశశాంకబింబభాస్వర మయ్యెన్ ౧౬౩

గీ. పెండ్లికూఁతురువలన సప్పెండ్లికొడుకు
పెండ్లికొమరునివలన నప్పెండ్లికూఁతు
విమలమణిబంధముల మనఃకమలములను
ఘనత ధరియించిరో కౌతుకద్వయంబు ౧౬౪

చం. సరఁగున లగ్నకాల మదె సన్నిహితించె నటంచు మున్ను ము
న్శిరములయం దొకళ్లొకరు జీరగుడంబు లిడ న్ద్విధిజ్ఞభూ
సురవరు లాగమప్రథితసూక్తుల తత్తదవశ్యమంగళా
చరణవిధు ల్ఘటింపుచు నొసంగిరి తన్మధుపర్క మయ్యెడన్. ౧౬౫

కం. కమలాస్త్రుని రణజయశం
ఖము గెలచెడికొరకు బిరుదుగట్టిన గతి నా

రమణీమణి గళమున ను
త్తమమంగళసూత్రమును హితంబున గట్టెన్ ౧౯౬

చం	చెలియపదంబు రాజకులశేఖరుఁ డాత్మకరాంబుజంబున
న్నెలకువబూని సన్నెకలు మీఁదను సప్తపదంబు లుంచఁగా
నలఘుగతి న్నడంపె పొలయన్కల దీర్చెడినాటి కిట్లనే
యలవడునంచు వావిగఁ యంగనలెల్ల హసించి పల్కఁగాన్ ౧౯౭

మ.	ధరణీదేవసువాసిను ల్ధవళగీతధ్యానము ల్సేయువో
కరకంజంబుల నాణిముత్తెముల[1] చొక్కంబౌ తలంబ్రాల ప
ళ్లెరముం బూనుక నీవలావల గుబాళింపంగ దోయిళ్లనిం
పి రయం బొప్ప తెర న్సడల్చి ఫలితప్రీతి న్విలోకింపఁగన్ ౧౯౮

చం	సలలితబాహుమూలరుచి జగ్గులు నిగ్గులుదేర గబ్బి గు
బ్బలపొగరుబ్బి గుబ్బతిల భామ యొకించుక నిక్కి నిక్కి క
న్గలువల సిగ్గు వెగ్గలముగా పతిపై తలఁబ్రాలు వోసె మం
జులకరకంకణక్వణవిశుద్ధవినాదవినోదలీలలన్ ౧౯౯

గీ.	ఆణిముత్యాల తలఁబ్రాల నతివమౌళిఁ
బ్రియుఁడు దోయిట ముంచి కుప్పించి నించె
భ్రమరములు దొల్చు కుందకుట్మముల భాతి
మెఱుఁగుఁగ్రొమ్ముడి దొఱఁగుట లెఱుకపఱప ౨౦౦

కం.	వైవాహికమౌహూర్తిక
మీవిధి నెరవేర్చి ధౌమ్యహితగతి విప్రుల్
దీవింపుచు శుభవేది వ
ధూవరులం జేర్చి రఖిలతూర్యము లొలయన్ ౨౦౧

---

1. చొక్కాటంపు తల్బ్రాలు 'తా'

మ. గురురత్నంబులఁగూర్చి దంపతుల కొంగు ల్మూళ్ల బంధించి భూ
సురకాంత ల్కఱపూరపు టారతులచే సొంపొంద వీణారవ
స్ఫురణ న్మంగళ మంచు బ్రీడ నగుమోము న్వంచి దీవించి పా
డిరి హస్తాంబుజకంకణక్వణనిరూఢిం దాళమానంబుగన్ ౧౭౨

తే. గీ దినచతుష్టయ మిట్లు విధిప్రయుక్తి
వివిధమంత్రాహుతుల వ్రేల్వ వీతిహోత్రుఁ
డతులగతి దక్షిణావర్తనార్చి యగుచు
వెలిఁగె నుద్వాహసమ్మోదకలితుఁ డగుచు ౧౭౩

సీ నేత్రము ల్మెయినిండ నిండిజూచె బలారి
యగ్ని తేజోమయుండై జెలంగె
కాలుఁ డుద్దండసంకాశుఁడై హర్షించె
యాతుధానుఁడు తమిం బ్రీతినొందె
భువనోన్నతవిభూతి బొందె నవ్వరుణుండు
ప్రవిమలామోదుఁడై పవనుఁ డలరె
కిన్నరేశ్వరుఁ డుబ్బె పెన్నిధి గనుమాడ్కి
భవుఁ డుత్సవమున తాండవ మొనర్చె

తే గీ. నమరస మిుదయ మెల్ల మిన్నంది పొంగె
నిలువుగన్నుల నప్సరోనివహ మరసె
మానభోంతరములఁ నసమాన మగుచు
ఘనత జెలువొందుఁ బరిణయకాలమంను ౧౭౪

గీ వరుస నిట్లుంగి లౌకికవైదిక ప
ధానసహోమాదికర్మకము ల్దగ నొనర్చి
హితపురోహిత ... ప్రతతికళత్ర
సహితముగ భోజనోత్సవాసక్తు లగుచు ౧౭౫

మ సరసాన్నంబులు సూపముల్ ఘృతములు న్సౌరభ్యశాకంబులుం
బరమాన్నంబులు పిండివంటలు సపూపంబు ల్దధిక్షీరముల్
వరలేహ్యంబులు చోష్యము ల్మధుఫలవ్రాతంబులు న్మీగడ
ల్పరిపూర్ణప్రియత న్భుజించి రపుడా బాలాదు లామోదులై ౧౭౬

సీ ఇదె తృష్ణదీర్ప నీయెదగల్గియున్న నిం
పునఁ బయోధరకుంభమును నొసంగు
మదభిలాష లెఱింగి మన్నింపఁ దలఁచితే
వలి సుధారసఫలంబుల నొసంగు
నచ్చెఱువయ్యె నాయిచ్చరో నీయెడఁ
గల రతిరసరుచి తెలిసికొనఁగఁ
దగినట్టులున్నది తలఁచి మావితిసుమా
కారంబు నెచ్చట గానమిట్టు

గీ లనుచు నిజభాగ్యగర్భోక్తు లిమ్ముడెంచి
భుక్తిగొను వార లలర నర్మోక్తు లొసఁగి
సకలజనులకు భక్ష్యభోజ్యములఁ దృప్తి
గాగ వడ్డించి రాబోనకత్తె లపుడు ౧౭౭

మ పరిమోదంబున బండుటాకు మడుపు ల్బాగాలు పచ్చాకు న
త్తరుపన్నీరును జాపురా న్సుమగంధంబు న్మృగనాభి క
ప్పురము న్మేలగు సారసౌరభములు న్భూషాంబరంబు ల్ధరా
మరరాజోరుజశూద్రకోటికి బహుమానంబుగా నిచ్చియున్ ౧౭౮

గీ. మితదినాంతరమున తద్ధితపుణితిని
యిష్టకులదేవతాపూజలెల్లఁ దీర్చి
ప్రతిసరంబును విడి నిజబంధువృద్ధ
వితతికి నమస్కరించి దీవెనలు గాంచి ౧౭౯

ఉ. దేవవిభుండు దిక్పతు లతిప్రమదంబున సీరితోడ సం
భావితులై జనార్దనుని బ్రస్తుతిఁ జేసి ధనంజయాత్మజుం
దీవెనలిచ్చి యప్సరసతీజనసంయుతుఁ డౌచు నర్జును
న్వే వెనువెంటఁ దోడ్కొని త్రివిష్టపము న్వెసజేరె నున్నతిన్. ౧౦౯

కం. [1] లౌకికవైదికకర్మల
నీకరణిం దీర్చి ప్రౌఢలెల్లను గుములై
యాకాంతాకాంతులకు ని
షేకోత్సవముం ఘటింపఁ జెలఁగుచు పేర్మిన్ ౧౯౧

సీ. పవడంబు సకి నెలపట్టె మంచము దోమ
తెర గలీఫా పట్టుదిండ్లు హంస
తూలికాతల్పంబుఁ దూఁగుటుయ్యేల రత్న
దీప ముల్వాట ప్రేళ్ళతేఁట సురటి
కపురంపుఁ బరణి బంగారుముక్కాలిపీట
నిలువుటద్దంబు పన్నీటిగిండి
చిలుకపంజరము మేల్చిటిచాప దువ్వెన
గందమ్ము కుడుక బాగాలడబ్బి

గీ. పునుఁగుజవ్వాది చందువ ల్పూలబంతు
లగరు సాంబ్రాణి ధూపంపుఁ బొగలుపసిడి
గిలుకపావాలు వీణె రంజిలుచుఁ జూడ
నందమౌ నొక్క కేళికామందిరమున. ౧౯౨

ఉ. అంతకుమున్నె గొందఱుఁ బ్రియాంగన లయ్యభిమన్యు జేరి సు
స్వాంతములం గుతూహలము జాల్కొన పుష్పసుగంధమాల్యము

---

1 లౌకికవైదికంబుల – (తా)

ల్వింత నలంకరించి యతివేగమె తన్మహనీయదివ్యశు
ద్ధాంతమునందు కేళిభవనాంగణముం దగ జేర్చి యంతటన్ ౧౮౩

వ. ఇత్తెఱంగున నందు గొంద ఱిందుపదన లమందానందకందళితహృద యారవిందలై యమ్మందగమన లందందుం గవిసి బొదివి తోడుకొనిరా నయ్యిందువదన మందస్మితసుందరవదనారవిందంబుతో ధారాధరవినిర్గ మితతటిల్లతాప్రతిభ నతిశయిల్లుచు సుధాకిరణుం గికురించి వరించు హరిణీడింభంబు తెఱంగున సురాసురవిసరమథితపాథోనిధిం జనయించు మంగళదేవతయుం బోలి సుందరతరారవిందబృందంబులం బొంది యం దందమందగతిం గమించు మరాళబాలికానుకారంబున గుబ్బలుల నెబ్బు గబ్బిసిబ్బెంపు గుబ్బలనుబ్బు నిబ్బరంపుభరమ్మున నగడగడ వడంకు నె న్నడుముతో కింకణికింకిణీవలయభద్రముద్రికాపుంజరంజితమంజుమణిగ ణకిరణస్ఫురణసుషమాప్రశస్తంబగు హస్తంబున నొక్కవేదండయాన కైదండ నొసంగ నిద్దంపునెలఱాలం దిద్దిన గద్దియం డిగ్గి చంచత్కాంచన సమంచితకాంచీగుణఘంటికాఘణఘణనినాదం బనుమోదసంపాదకంబుగా మండితమణిఖచితకుండలంబుల దండ విడంబింపుచు చొక్కాటంపు గండద్వయంబులం దాండవింప శుంభదంభోజసౌరభసంరంభంబుచే విజృంభించు బంభరడింభంబుల చెలువున ముఖమండలంబున మాటిమాటికి న్నెఱుంగుటుంగరంపు ముంగురులుం జెలంగ దిశల బసలెసఁగ ముసి ముసినగవుల నసదృశలజ్జాభరం బాచ్ఛాదింప శోణాధరమణిఘృణి గణంబులు దంతకుందకుట్మలంబుల కనురాగం బొనర్ప చేతోజాతాతత నూతనకేతనంబు భాతి జంటనంటిన పయంటగెంటెంబు వ్రేల గ్రొత్తము త్తియంబుల నొరబెఱికి ధళధళ న్మెఱిపించుచు చిత్తజుం డెత్తిన పువుగుత్తి కత్తులమొత్తంబుగతి నభంగురశృంగారతరంగితాపాంగ విలోకనంబు చూపరులమనంబులు మిఱుమిట్లుగొలుప నయ్యిక్షుధనుస్సాక్షాత్కృతవీర మోహినితెఱంగునం బరంగు నబ్బాలికామణిం గాంచి ౧౮౪

కం. చేరువనుఁ బ్రౌఢాంగన
వారమణి న్వీక్షించి శయ్యఁ గంపఁగ మదిలో

కోరిక చేకూరఁగ శృం
గార రసోక్తులను హర్షగరిమానసలై ౧౮౫

సీ. చెలువుండు బట్టిన బెదరుకుండఁగ జుట్టు
మమ్మ ధమ్మిల్లమ్మునందు విరులు
ఘర్మాంబుకణముల గరగకుండఁగను క
స్తురిబొట్టు దిద్దుచేర్చుక్క నడుమ
నేరీతి బెనఁగిన నిట్టట్టుఁ జెడకుండ
గందంపుఁ గుంకుమ గలయ నలఁదు
ప్రియుఁడు సయ్యాటలఁ బెనఁగిన విడకుండ
నీవిపై మొలకట్టు నెఱి బిగింపు

గీ. నెలఁత మీకిచ్చు కానుక ల్నిజ మటంచు
ప్రౌఢలైనట్టి వారలతోడ దెల్పి
సతికి నూతనసంగమోచితములైన
బొలుపు దీర్చిరి రేవతీపుత్రి కపుడు ౧౮౬

కం. కొమ్మా ప్రియునకు నేఁడు వి
డెమ్మియ్యఁగవలయు నిప్పుడే కోపమున
న్మమ్ము బెనంగెద వేమిటి
పిమ్మట నీవల్లభునితొ పెనఁగుమి తరుణీ ౧౮౭

సీ. వల్లభుం డనుకూలవచుఁ డౌచు పిలువఁగా
మఱివానితో మారు మసలకమ్మ
వెసపండుటాకుల విడె మిచ్చెనా ప్రీతిఁ
జేచాచకను కక్కసించకమ్మ
హితవుగా తొడలపై నిడ బాలఁ జూచితే
పొలయల్క నిట్టట్టుఁ జూపకమ్మ

వేడుక నీమాట వినఁగోరి పిలిచితే
మాఱుబల్కక మోము మలపకమ్మ

గీ చెలువుఁ డొకవేళ కొంత సిగ్గులకునైన
మందలించనివాని నెమ్మన మెఱింగి
కట్టెదు టొకింత నిలక నిట్టట్టు కదల
తలగిపోకమ్మ తొలకరితళుకుబొమ్మ 148

తే.గీ చెప్పవలసి మేము చెప్పితి మింతయే
గాని మీరు మీరు గలసినపుడె
మనసు నిలుపగలరె మామా హితోక్తులు
గట్టిపెట్టలేరె గుట్టు విడవి 149

సీ నివుగాక నితరులు నేర్పితే పలుకు దా
చిలుకతో ప్రొద్దుబుచ్చెద విదేమి
పసిగట్టుఁగతి గలీషా తీసి యింతలో
మేళవింపుచు వీణె మీటవలెనె
చిత్రశాలలఁ దీర్చు శృంగారములనెల్ల
నింతలో నీక్షింప నేగె దేమె
యసదృశాంకారమౌ కవిత్వము నేఁడె
తోఁచె నంచును మిన్ను జూచె దేమి!

గీ తడవులేదు ముహూర్తంబు తారసిలె న
టంచు వచియించు పలుకు లాలింపవేమి?
టమ్మ లెమ్మన తత్తల మనెదదేమి
బాల యీాలీల జపమేలఁ బలుకవేల?

చం. మును తనుగోరి యుండిన విభు న్గనయం దఱిగల్గునప్పు డీ
యనువున సిగ్గుజెందు చెలి యంగన నెక్కడనైన నేదయో

వినఁగ విచిత్ర మిప్పగిది వింతలు పల్కెడివారె రేపె పో
పెనిమిటి బైపెనం గొనఁగ బిగ్గన లగ్గలకెక్కువారలున్ ౧౯౧

కం. తగు నొకమాట రహస్య
మ్ముగ చెప్పుదుమో సదస్యముగ జెప్పుదుమో
మగువా నీమది కోపం
బగునేమో యనుచు సందియం బౌను మదిన్ ౧౯౨

శా. నీపుట్టింట బ్రియుండు పెంపుఁ గనఁగా నిత్యోత్సవం బేర్పడ
న్నీపై బ్రేమ నతండు నాతనిపయి న్నీప్రేమ సంధిల్లఁగా
నేపట్ల మ్మన సేగతిం జెదఱనో యేకాంతమం దెట్లు మీ
చూపు ల్మేపులు మీనంబు లెఱుగు న్మోదింపలేముం గదా ౧౯౩

మ. మరునిం జూచిన తీవ్రచిత్తుఁ డిక మోమోటంబు చూడండు నీ
వరునింజూడఁగ నంతకన్న నతితీవ్రప్రాజ్ఞుఁడౌ వారలి
ద్దఱ నేలంగల తీవ్రపాకి వికమీద న్నీకు నీసిగ్గుదొం
తర లెచ్చోటఁ జణంగుచో గన నహో తన్వీ కురంగేక్షణా. ౧౯౪

చం. ఇక మము కోపగించి కను లెఱ్ఱన జేయుచు చేవిదిల్చి నె
మ్మొక మటు మల్పి కన్బొమలు మోడ్చిన కాదననేల నీకు వా
నికి మన సౌఖ్యమైనగతి నెమ్మగి మాకెఱుగంగనయ్యె నీ
విక పదివేలబాసలు పయింబయి జేసిన నమ్మ మమ్మరో ౧౯౫

ఉ మంచిదిగాని దచ్చనలమాటల నవ్వితి మింతెగాని చా
లించెద మిట్టి హాస్యరసలీలల కే మికనైన జాగుగా
వించక లెమ్ము సమ్మతిన వేమఱు నీమదిగోరినట్లు నే
కం చటువంటి కాపురము గల్గెగగా కొందువేమి నీమదిన్ ౧౯౬

చం అని యిటు లూరడించి యొక యంగనయుం గయిదండ నీయ నా
క్కనలిననేత్రయు న్సఖముఖంబుల పెన్నెఱు ఒంటదువ్వ శో

ధనమనియొక్క చంద్రముఖి పాటలుఁ బాడఁగ వచ్చె మున్నవే
ఱొక్కను తన మందయానమునకు న్నెఱిముప్పిరి తోడ్తొసంగఁగన్. ౧౯౭

చం. మనమున ధైర్యముం దొలఁగి మాటికి కంపభయప్రమోదము
ల్పెనఁగొన మోమునం జెమటబిందువు లల్లుకొనంగ మెల్లమె
ల్లన నడగొంక పద్మముకుళస్తని వచ్చె ధనాధ్యుపాలికి
న్ననవి యొనర్పు వచ్చు ఘనమానుషశాలివలె న్నతాస్యయై ౧౯౮

ఉ. అండజయానకేళిభవనాంగణ మీగతి జేరవచ్చుచో
నిండె సువాసన ల్మణివినిర్మితగేహములందు దట్టమై,
నిండె తదంగకాంతులు ఘనీభవమై దశదిక్తటంబుల
న్నిండె నృపాలమౌళికి మనీషను మోహపుఁగోర్కె లెక్కువై. ౧౯౯

సీ. లలన లివ్వల నవ్వలనుగ్రమ్మి నడిపింప
రిక్కలనడి చంద్రరేఖఁ బోల్చు
పటుహాటకస్తంభపంక్తి మర్వున నిల్వ
మరునికీల్బొమ్మ వైఖరి జెలంగు
సిగ్గున తెరచాటు జేరుచో జలధర
తతి సమావృతతటిద్గతి దనర్చు
చెలులు కట్టెదుట జేర్చిన పద్మినీబృంద
గత హంసడింభకాకృతిని మెలఁగు

గీ. కేలు ఒందించి పాన్పు నెక్కింప నిగుడ
గిరిసమారోహబర్హిణీక్రియ నొసంగు
సరసునకు దన్ను సమకూర్చు సమయమునను
గొంత లజ్జను తలవంచి సంతసించి ౨౦౦

కం. చనుచో ననుమానించెటి
వనజేక్షణ నరసి చూడవలెనని కోర్కె
ల్గన మాటు నృపుని నరసియు
వనితామణు లనిరి ప్రౌఢవచనరచనలన్. ౨౦౧

మ. చెలియా యెవ్వరికోసమీ వగల నాక్షేపించె దేమమ్మ త
త్తలు మంచున్వెసనంటి యప్పిఘునిచేత స్నల్పఁగా మారుఁడ
వ్వలఁ బోనీయక నాఁటబెట్టుగతి క్రేవ గ్నిల్చి నమ్రాస్యయై
తలపై కెక్కిన సిగ్గుభారమగుటం దా మోయలేనట్టుగన్ ౨౦౨

కం. తీరిచిన మరునిత త్తడి
తీరున చెలువొందు యీసతి న్నెఱవిద్దెం
దీరుచుకొని లేఁగేదఁగి
తీరుదొరఋణం బికెట్లు దీరుచుకొనెదో! ౨౦౩

చం ఇదివరదాక నిట్టిగొడ వేమియెఱుంగనిగోలసుమ్మి ని
న్గదిసెడికోర్కె దక్క పలుగంటుల కోర్వదటం చెఱింగి నె
మ్మది నెనరంటఁగా నడుపుమా రసికాగ్రణి పువ్వుగుచ్ఛసం
పద గలయింతి గబ్బిచనుబంతులు నీయఱచేతిసొమ్మగున్ ౨౦౪

తే గీ. వనితయెడ నవ్యశృంగారవై భవములఁ
దెలిసి భోగింపఁదగు నహో ధీవరేణ్య
రసికుఁ డిదె మెచ్చి తాంబూల మొసఁగినపుడె
నవ్వుమొగమెత్తి గని గై కొనంగ రాదె ౨౦౫

చం మదనసమానమూర్తి యభిమన్యుఁడు నీప్రియుఁడయ్యె నింకనీ
కొమవ లికేలనమ్మ! మదిఁ గోర్కెలుఁ దీరుగదమ్మ!గుట్టుమై
నొదగకుమమ్మ!వాని రసికోక్తుల మర్మ మెఱుంగుమమ్మ! జె
ప్పఁదగిన మర్మము ల్మనుపె పల్కఁ గలేదటవమ్మ కొమ్మరో. ౨౦౬

కం అని వనితామణి కరమా
తనికరమున నిడెడు చతురతం గని పరసం
దనుఁడు మదిమెచ్చు సమయ
మ్మున నెనయు సుహూర్తకాలమ్ముం దాకొనఁగన్. ౨౦౭

సీ. గడెలెన్ని యాయెనో గనివచ్చెద నటంచుఁ
దలుపు గిట్టునదీసి దాటి నొకతె
పోయిన చెలిరాకపోయెఁ బిల్చెదనంచు
సతుల నిట్టుఁద్రోసి జారె నొకతె
కుంకుమబరణి గైకొన నేమరిచితి నిదె
తెచ్చెదనంచు నేతెంచె నొకతె
నెలఁత యెచ్చటికేఁగె నే బోయెద నటంచు
దాని వెన్కకు నెట్టి దాచె నొకతె

గీ. సకియ లొక్కొకపేరు బెట్టుకొని పోవు
నంతవారలతోడనే కొంత సిగ్గు
జనుట సన్న లెఱింగి యాసరసమౌళి
చెంతరాదీసి పెడె మిచ్చె నంతలోన ౨౦౮

కం. దంతఁపుఁ దలుపు తటాలున
నింతులు గికురించి మూసి యిట్టటు కెళవు
లొక్కింతవడి బొంచి కని యే
కాంతసమయమగుట తూర్ణగతి జనిరంతన్ ౨౦౯

గీ. కాంతుఁ డంతంత తాల్మి యొక్కింతలేక
నించు విల్వంచి యిరువురఁ గాంచి పొంచి
నారి నెక్కించి కుప్పించి బీరమెంచి
సూటి బాటించి తొమ్మున నాట నేసె ౨౧౦

గీ. కాంతుఁ డపుడు కుచాగ్రదుర్గముల నంటి
మధ్యదేశంబునం గల మర్మముగన
కాఁగల దిదేమొ వలరాజు కయ్యె మనుచు
ఘరజఘనభూమి గడగడ వణక దొణఁగె. ౨౧౧

సీ పెదవి నానునటంచు పెదమోము మల్పఁగా
నిద్దంపుఁజెక్కిలి ముద్దులందు
బిగిగుబ్బలంటున స్ఫీతి నొత్తిగిలంగ
చక్కిలిగింతల జకుకుదీర్చు
చేఁజాప చెక్కిలిఁ జెనఁకునో యని తొడ
ల్గదియింప కళలంటి గరుగజేయు
దగ్గఱించె నటంచు సిగ్గున కనుమూయఁ
బాటించి నయనచుంబన మొనర్చు

తే గీ నతను పరవశుఁ డభిమన్యుఁ డనుటగాదు
బడుగుజడతరి వడయుల కడిమిజెడఁగ
నడుచు వెడవిల్తుపుపుటంపుఁ జడికి నుడికి
నుడిని తడఁబడ నితరులఁ దడవనేల ౨౧౨

సీ. సరసతరప్రభాకరమనోహరములౌ
జక్కవలను మాట నిక్కమయ్యె
కనుఁగొన మకరలాంఛనమనోహరములౌ
దర్పకశ్రీ లన తథ్యమయ్యె
సంతతశృంగారసరసోన్నతంబులౌ
లకుచంబు లనుటయే లక్ష్యమయ్యెఁ
బ్రీతి పయోధరాఖ్యంబులౌ పూర్ణకుం
భద్వయం బన గుఱుతులయ్యె

గీ. ననుచు వర్ణించి చూపెడునట్లు చనుల
నంట గమకించు తీర్చి పయంట నుంచు
మణిసరు ల్చిక్కు సడలించు మదిఁ గలంచుఁ
దాల్మి మది నుంచు నంతంత దగ్గఱించు. ౨౧౩

తే గీ. ఒడయఁ డయ్యింతి చెయిబట్టి విడువకున్న
ఛిఛిముడిన కొంత షెడమొగం బిడెడు నంతఁ

బెనఁగి డాతొడఁ గూర్చుండబెట్టె నపుడు
సిగ్గు కడదేఱ చెలువుండు చెలువమిఱ ౨౧౪

కం. చనుబంతు లంటఁబో సి
గ్గున కరముల భుజము లబ్బుకొని గప్పుకొన
న్ననవిల్తు కయ్యమునకు
న్వనిత భుజాస్ఫాలనంబు వాటించుగతిన్ ౨౧౫

సీ తేనెలొల్కఁగ బల్కితే చాలదే ఘన
సారంపుబాగా లొసంగవలెనె
గోటనీచెక్కులు మీటితే చాలదే
తెలియాకు మడుపు లందీయవలెనె,
కిసలయాధరము నీ వానఁగితే చాలదే
మెత్తనిచే నంగ్రము లొత్తవలెనె
వలపుటూర్పులు మేన నొలసితే జాలదే
విరుల దీవెనలచే విసరవలెనె

తే గీ సౌఖ్యరతి నన్ను నేలితే జాలదే స
మస్తసేవావిధుల వెతమాన్పవలెనె
తడవు జేసెదవేల నే తాళజాల
కరుణ నీవేళఁ గౌఁగిలీగదవె బాల ౨౧౬

చం. అని తమి నిల్పలేక చరణాబ్జము లొత్తెడి బాలికామణిం
దనయురమందుఁ జేర్చుకొని తద్దయు నిద్దఁపుప్రక్కనుంచు నం
తనె సతికంచుకంబు తనుదానె ముడి న్సడలంగ దంపతీ
తనువులు పుల్కరించె సుమధన్వుఁడు నించిన ముల్కులో యనన్ ౨౧౭

సీ నెనఱున మెఱుఁగొప్పు నెఱిగొప్పు నమరఁగా
కమ్మచెమ్మట చెక్కగవ జనించె
చెక్కలు మునిపంట నొక్కఁగా గమకింపఁ
బులకాంకురములు గుబ్బల బొసంగె

గుబ్బ లక్కు(న జేర్చి గుస్తరించెదునంత
నెటివొక్కి(లినయంటు నీవి సడలె
నీవిచేనంట కన్నియమేన తనుదానె
జలదరింపుచు వివశతను జెందె

తే గీ నంత కాంతుఁడు కెమ్మోవి యానినపుడె
కేళినీలిలఁ దేలెనో లోలనయన
కెరుకలేని మహామోహాభరము గప్పి
కనుల నలమోడ్చి సౌఖ్యసాగరము దేలె ౨౧౮

కం తెలిపెటిదేమిక నవ్వల
నల పార్థతనూభవుని సుఖాలింగనమ
క్కలకంఠకంఠి కలయిక
లెలమి మహానందవిభవ మిడె నిర్వ్వరకున్ ౨౧౯

చం తనుమృదుభావ మెన్నక నెదం గఠినంబుగ జేర్చి పల్లవం
బున కెనయైన మోవి జిగి బొక్కఁగ నొక్కి యలంవి చన్గవ
ల్గనలు నటంచు నెన్నక నఖంబుల గ్రుచ్చి దయావిహీనుఁడై
వనితను గోరె-ధాత్రి మగవారు స్వకార్యధురంధరుల్ గదా! ౨౨౦

సీ. నవఘర్మకణగణస్రవణకాశ్మీరాంగ
రాగం బరుణమ్మృత్ప్రరాగ మనఁగ
-మహితగాఢాలింగనహితసమ్మేళన
లమితబాహాబాహి ననుకరింప
నధరసమాకర్షణాన్యోన్య రదపంక్తు
లిక నౌదు గఱచుట లెరుకఁజేయ
లసదురోఘటనగల్లరిచ పేటాదుల
నినదము ల్ముష్టితాడనము దెలుప

గీ కోపుచూపుల బింకము ల్వ్యాజితములు
దీర్ఘనిశ్వాసములు మనస్త్రీప్రగతులు
సమములౌచును మల్లయుద్ధమును బోలె
రతుల దేలిరి సతిపతు లతులగతుల ౨౨౧

సీ వేనలిజాఱి క్రొవ్విరి దండ వెనఁగొన
గస్తూరితిలకింబు కడలజెదఱ
తావి దక్కఁగ సుగంధము మేన విడిబోవ
కవగుబ్బ లిట్టట్టుగా చలింప
వగ గుల్కు ముంగురు ల్వదనాంబుజము గప్ప
నఱమోడ్పుగందోయి యురపు నెఱప
చిఱుచెమ్మటలు తళుక్కుచెక్కుల బదనెత్త
తావి నిట్టూర్పుల మోవి గదల

గీ మనసు గుదిరించి ప్రేమ నిమ్మడిగ బెంచి
కళలఁ గదలించి నేర్పున గారవించి
సొక్కి సొక్కించి కౌఁగిట నుక్కళించి
కలయికన వోధ నిటు ప్రౌఢగా నొనర్చె ౨౨౨

సీ. ముహు రప్రయత్ననిర్ముక్త నీవిబంధ
మవిభక్త సంశ్లేషితాంగయుగళ
మాసాంతపరిగృహీతాధరపల్లవ
మనురాగసంవర్ధితాంతరంగ
మతికుతూహలబాష్పగతలోచనద్వంద్వ
మనువేలదంతక్షతాంతగండ
మధికసీత్కృతమణితాదిసుఖానంద
మాలింగితభుజాలతాకూల

తే గీ. మభినవోద్దామకామ కలాభిరామ
మసమసుఖపారవశ్య యూనిపాత

మంచితభ్రూలతాసమాకుంచితాస్య
మై దనర్చెను నూత్నసమాగమంబు ౨౨౩

గీ కులుకు వలిగబ్బిగుబ్బలు గ్లోట నదిమి
తొడలనంటుల నిట్టట్టుఁ దొలగ నడచి
సుడికొలంకు గలంచి యర్జునతనూభ
వాఖ్య కందర్పగంధేభ మపుడు జెలఁగె ౨౨౪

కం. ఇరువుర లీగతి సరిసరి
పరిరంభవిజృంభమాణభావంబులచే
నెఱి గుఱిగ నురువడించిరి
పరికింపం గుసుమసౌరభన్యాయమునన్. ౨౨౫

ఉ ఆలనామణిన్ నృపకులాగ్రణి యీగతి సౌఖ్యసంపదన్
దేలిచె కండచక్కెరల తియ్యని కెంజిగురాకు మోవియున్
గ్రోలి మెఱుంగుఁ బూమొగడ గుబ్బల నొక్కట నొక్కి పొక్కిలిం
గేల నమర్చి చెక్కులను గీటి నవోఢరతి న్విలోలుఁడై

చం నరసుతుఁ డీగతి న్మితదినత్రితయం బతిప్రీతిఁ గేళికా
భిరతిని దీక్షమై గడపి పిమ్మటఁ దచ్ఛుభరేఖభోగసం
భరణకుతూహలాప్తి బిగిబాయక జంభవిభేదిసౌఖ్యవి
స్ఫురణ నఖండసంపదలఁ జొక్కుచు వర్తిలుచుండి అంతటన్. ౨౨౭

సీ పాకారికుంభికుంభములు చేగొనినట్లు
పడతివక్షోజకుంభములు గొనుట
సరుష గోపాలిచందనం బలఁదినయట్లు
నాతి గాఢాలింగనంబు గొనుట

గంధర్వవీణాసుగానము ల్వినినట్లు
సుదఁతి సన్మణితాదిసూక్తి వినుట
బహుళసుధారసపాన మబ్బినయట్లు
సతితావికెమ్మోవి చవులుగొనుట

గీ సంతసంబున సంతతం బింతితోడఁ
గవయుట(ను) స్వర్గభోగసంకాశ మగుచుఁ
బ్రీతి నీరీతిఁ బ్రతిబలారాతి భాతి
ధన్యుఁడై యొప్పె నయ్యభిమన్యువిభుఁడు ౨౨౭

మ. నరనాథుండు క్రమక్రమంబుననుఁ దన్నారీశిరోరత్నము
న్సరసక్రీడలఁ గేళికావనుల భాస్వచ్చంద్రశాలాపరం
పరల న్సారసరోవరంబులను శుంభద్రత్నగేహంబులం
బరిరంభింపుచు గారవింపుచు మనోభావంబు లీడేర్చుచున్ ౨౨౮

సీ. చెనక నంటఁగనీక చికిముడి కొన్నాళ్లు
కోరెకదాఁ బొసఁగుట కొన్నినాళ్లు
బిలిచిన సిగ్గుచే బెనఁగుట కొన్నాళ్లు
గుఱిని దాపున నిల్చి కొన్ని నాళ్లు
ప్రౌఢోక్తులకు మాఱుబల్కమి కొన్నాళ్లు
కోడిగంబు లొనర్చి కొన్నినాళ్లు
బలవదాలింగనాకలితము ల్గొన్నాళ్లు
గురుస్వయంగ్రహణము ల్గొన్నినాళ్లు

గీ సంతకంతకు కాంతు విభ్రాంతితోడ
రసముల నెఱింగి గాఢానురక్తితోడ
నతిగుణోపేత తాలధ్వజాత్మజాత
ప్రీడఁ బోనాడె నానాఁడు ప్రౌఢ యయ్యె ౨౨౯

శా ఈలీల న్నృపహువాసరంబు లఖిలోగవ్యాప్తివిహారింబుల
తాహాంకాత్మజతో మెలంగు సుఖీఁదం బాండుసూను ప్రియ

శ్రీలం జెంది త్రయోదశాబ్దముల బాటిం దేరి సౌభద్రును
త్రాలప్రక్రియ తల్లితో మగుడ నింద్రప్రస్థముం జేర్చియున్ ౨౩౦

చం. కొడుకును కోడలిం గని యకుంఠకుతూహలు లౌచు నక్కులం
దిడుకొని ధర్మజప్రముఖు లెంతయుఁ దాము వివాహకాలమం
దెడపడయుంటచే మది నొకింతఁ గొఱంతపు నుత్తరాసతిం
దడయక పెండ్లిసేయఁగను దానికిఁ గల్గె పరీక్షితీశుఁడున్ ౨౩౧

కం అతఁడె భవజ్జనకుండై
యతులితభరతాన్వయంబు నలటించెను ద
త్ప్రతినిధివి నీవు నిఖిల
క్షితిపాలనజేయు సుప్రసిద్ధుఁడవు గదా! ౨౩౨

ఆయావృత్తాంతము వాక్
శ్రీయుక్తి సవిస్తరముగఁ జెప్పితి మునుపే
వేయువిధంబుల నీమది
నేయెడ మఱుపొందునే మహీతలనాథా! ౨౩౩

కం. ఈపగిదిం జనమేజయ
భూపతికిం బైలుఁ డమ్మతపస్వజకోష్ఠున్
జూపట్టఁ దెలిపి తత్ప్రతి
చే పూజితుఁడై నిజేచ్ఛచే జనుదెంచెన్. ౨౩౪

—: ఫలశ్రుతి :—

కం శేషాద్రినాథభక్తిమ
నీషం దాలాంకనందనీపరిణయముం
భాషించిన విని వ్రాసిన
దోషములఁ దొలంగి ముక్తి తుది లభియించున్. ౨౩౫

సీ. భానుఁ డెందాక నభ్రగతుఁడై జరియించు
చంద్రుఁ డెందాక తేజస్వియౌను
ధరణి యెందాక సుస్థిరరూపమున నెందు
గగన మెందాక నూర్ధ్వగత మొందు
నుడుగణం బెందాక నడుచు హోమాద్రిపై
జ్వాలనుఁ డెందాకఁ బాజ్వాల్యుఁ డౌను
మహిని నెందాక రామాయణంబు బఱంగు
ధర విభీషణుఁడు నెందాక నేలు

తే.గీ. నిగమసారంబు లెందాక నెగడుచుండు
భూమిభారంబు నెందాక బూనునయ్య
నంత నామఫణీశ్వరుం డంతదాక
బఱగు తాలాంకనందినీపరిణయంబు 236

## —: ఆశ్వాసాంతము :—

కం. తుంగపతంగతురంగా
రంగత్కరుణాయతాంతరంగా! మదసా
రంగావనమంగాహృద
యాంగణవినివేశ వేంకటాద్రిరమేశా. 237

ఉ. వైరివిఫాలఫాలదృశవందితనిర్మలభావభావజా
కారవికారదూరదరకంధరకంధరదేహదేవదే
వారవినేత్ర-నేత్రహితభర్మవృషాచలవాసవాసవా
ధారహరాజరాజబలిదానవదానవహానుమోదనా. 238

భుజంగ మదారాతికుంభీంద్రమాన్యన్మృగేంద్రా!
ప్రయా పదాబ్జానతాజేశజర్హ్మిర్మఖేశా!
తము ముదాలోకనాదత్తముక్తిప్రకాశా!
సదాసంచరచ్ఛేషశైలప్రదేశా 239

